# రాజ్యాంగవివేకము

[[illegible]]

చ[illegible]దీపిక





రబ్బాప్రగడ మందేశ్వరశర్మ

ప్రణీతము

1935

ఓం.

# రాజ్యాంగవివేకము

[మొదటి భాగము]

## చరిత్రదీపిక

**(An attempt to trace the evolution of Political thought from Vedic times up to date on this, our Globe from Indian stand point)**



మొదటి కూర్పు ౧౦౦౦ ప్రతులు

రెబ్బాప్రగడ మందేశ్వరశర్మ

ప్రణీతము.

ప్రచురణకర్త

ఆంధ్రగీర్వాణ విద్యాపీఠపక్షమున

వల్లూరి సూర్యనారాయణరావు.

వెల రు ౧-౦-౦.

# సంపాదకుని తొలిపలుకు

ఏయే దేశములలో, యేయే కాలములలో, అప్పటప్పటి పరిస్థితులను బట్టి, మానవసంఘములు, తమ రాజకీయవిషయములలో, యెట్లు మార్పులు చేసికొనుచుండెనో, యీ గ్రంథము దిఙ్మాత్రముగ సూచించుచున్నది. ఒకానొకప్పుడు, మన పూర్వులకు శ్రేయోదాయకమైనది యిప్పుడు ఆచరణయోగ్యము కాకపోవచ్చును. మన పూర్వులు కని విని యెఱుగని అనేక క్లిష్టపరిస్థితులు, మనల నెదుర్కొనుచున్నవి. కాబట్టి, సాంఘికార్థిక రాజకీయవిధానములు మారుచునే యుండును. ఏ రాజకీయవిధానముగాని, శాశ్వతముగ నుండుట ఒట్టి కల్ల. ఈ ప్రపంచ మున్నంతవరకు, ప్రకృతంతటిలోవలెనే, రాజకీయార్థిక సాంఘికవ్యవస్థలు కూడ పరిణామమును పొందుచు, నిరంతర పోరాటము మానవసంఘములలో జరుగుచునే యుండును. నూతన సమస్యలు బయలుదేరుచునే యుండును. వానిని పరిష్కరించుకొను విధానములు కూడ మారుచునే యుండును. అట్లు కానిచో సంఘము స్తంభించిపోయి శిలారూపముదాల్చి, కాలమాన స్థితులను బట్టి మార్పులు చేసికొనుచుండు బలీయములైన యితర మానవసంఘముల వశమైపోవును.

పై ప్రకృతినూత్రమును సనాతనధర్మవాదులమని చెప్పు కొనేవారు గమనించి, సాంఘికసంస్థలలో కూడ తీవ్రమైన మార్పుల కంగీకరించవలసి యుందురు. అట్లు చేయనిచో, రాజకీయార్థిక స్వరాజ్యము కూడ గగనకుసుమమే. సంపూర్ణ స్వాతంత్ర్యమును సంఘములో స్త్రీ పురుషులకు సమానముగ నొసంగకపోయినచో మన దేశమునకు రాజకీయస్వాతంత్ర్య మెన్నటికిని రాదు.

ఈ గ్రంథాంతమున, మన మందేశ్వరశర్మగారు సూచించిన భవిష్యద్రాజకీయవిధానములు, ఆచరణలో మనము పెట్టగలిగినను కూడ, అనేక లోపములు, నూతన సమస్యలు బయలు దేరుచునే యుండును. రాజకీయార్థిక సాంఘికవిషయములలో సమత్వముకొరకు చేయు ప్రయత్నములు సాధ్యపడవలెనన్న, ఊహాప్రపంచములోనివి, రుజువుపరచజాలనివి, హేతుపూర్వకముగానిదియగు, మతసిద్ధాంతములను, రాజకీయ సాంఘికార్థిక విద్యావిషయములలో చొరనీయకూడదు. వర్ణాశ్రమ ధర్మములు, హిందువులును, స్వమతదురభిమానము ముస్లిములును విడనాడి, భారతజాతీయ స్వాతంత్ర్యమునకు పోరాడునపుడే, మన దేశప్రత్యేకతను ప్రపంచములో నిలువుకొనెదము. అట్లు మనము చేయజాలనిచో, ఆంగ్లేయులుకాకపోయిన, రషియా

లేక జపానుదేశీయులకు లోబడిపోయి, వారి సౌఖ్యముననే మన మూడిగము చేయవలసి యుండుము. ఇతరదేశములవారి సహాయమును మనము కోరినను, నిష్ప్రయోజనము. ఏదేశములో ప్రజలైనను, వా రెంతవరకు త్యాగము, రాజనీతి రాజకీయసాంఘిక స్వాతంత్ర్యకాంక్షలను కనువరచగలరో, దానికి తగిన రాజ్యాంగవిధానముననే వా రర్హు లగుచుందురు.

5—9—35 }
వ్యా ఱు } వల్లూరి సూర్యనారాయణరావు.

---

## కొందరు విఖ్యాతపండిత ప్రముఖుల అభిప్రాయాలు.

(డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్యపంతులుగారు)



"రాజ్యాంగవివేకచరిత్రదీపిక" యను మీ నూతన గ్రంథము......చదివినంతనే, గ్రంథరచనయందు మీరుపడిన శ్రమయు, అందుల మీరు చూపిన శాస్త్రపరిచయమును స్పష్టమగుచున్నది. ఒక యుగముయొక్క చరిత్ర వ్రాయుట సులభము. అభిప్రాయభేదము లుండవచ్చును. కాని ఆయుగ మునందలి సంభవములు (Events) కారణకార్యసంబంధము గలవై-సోపానక్రమాగతముగ జరుగుచున్నట్లు గాన్పించును. కాని శకపరంపర-యుగపరంపరలందు రాచకీయభావములు ఏవిధమున పరిణామము నొందుచుండెనో, వాని యనుక్రమణికయొక్క రహస్యములెట్టివో చూపుటకు మీరు గావించిన యత్నము-ప్రప్రథమమైనదే కాక-జయప్రదమైనది కూడా నని నేను జెప్ప సాహసించుచున్నాను. ఇందులకు మీకు సహాయభూతములైనవి—మీ సంస్కృతభాషా పరిచయము, శాస్త్రశోధన, చారిత్రికపఠనము అనుటలో నతిశయోక్తి లేదు. ఆంధ్రదేశము మీ ఈ యత్నమును ఆదరణభావముతో జూతురుగాక యని కోరుచున్నాను.

మచిలీపట్టణము
5—10—1934

చిత్తగించవలెను
(Sd) భో. పట్టాభిసీతారామయ్య

Andhra University,
Waltair
1st January 1935.

Dear Mr. Sarma,

I was able to look through a few pages of your manuscripts, and I feel that it is an ingenious attempt to bring together the traditional conception of this country with some modernist notions of the West. I have no doubt that the book will prove eminently instructive and interesting to the cultured readers in Telugu.

Yours Sincerely,
(Sd.) S. Radhakrishnan.

ఆంధ్రవిశ్వవిద్యాలయ వైసుచాన్సలరుగారగు
శ్రీ రాధాకృష్ణపండితులు

ప్రియమైన శర్మగారికి,

మీయొక్క గ్రంథములో కొన్నిపుటలు చదివితిని. అది ఈదేశముయొక్క సాంప్రదాయిక భావములను (రాజ్యాంగ) పాశ్చాత్యనవ్యభావములతో కలిపి ఏకస్థలమందు ప్రదర్శించుటకు చేయబడిన ప్రతిభావంతమైన ఉద్యమము. మీగ్రంథము ఆంధ్రపండితలోకముచే బహుమానింపబడు ననుటలో సందేహమెంతమాత్రమును లేదు.

ఆంధ్రవిశ్వకళాపరిషత్తు,
వాల్తేరు.
1—1—1935

(Sd.) ఎస్. రాధాకృష్ణన్.

M. VENKATA RANGAIYA, M. A.
*Reader & Head*
*Department of History, Economics and Politics.*

ANDHRA UNIVERSITY
Vizagapatam
Dated 1—1—1935

It gives me much pleasure to state that the "History of the Evolution of Political Thought" by M.R.Ry. R. Mandeswara Sarma Garu is a book which has on it every mark of wide and deep study, of careful and penetrating analysis of the subject and a considerable degree of original thinking. I am particularly impressed with his survey of Chinese political thought, his interpretation of the Divine Right Theory and the Social Contract Theory in the light of Indian Literature and his attempt at the reconciliation of individualism and socialism. His comparison of Sankara with Marx is scholarly and original. His survey of recent political thought and his discussion of Socialism, Syndicalism and Fascism are all interesting. There is no work of this type in Telugu so far. He has succeeded to an eminent degree in making his ideas intelligible, in coining appropriate terms in Telugu, and in writing in a dignified style.

(Sd.) M. VENKATARANGAIYA.

ప్రొఫెసరు వెంకటరంగయ్యా పంతులుగారు
చరిత్ర, ఆర్థిక రాజకీయశాస్త్రశాఖాధిపతులు, ఆంధ్రవిశ్వవిద్యాలయము.

మ. రా. శ్రీ రె. మందేశ్వరశర్మగారిచే విరచితమైన "రాజ్యాంగభావపరిణామచరిత్ర"కు సంబంధించిన గ్రంథము, వైశాల్యమున్ను లోతున్ను గల గ్రంథపరిశీలనము, శ్రద్ధాయుక్తమున్ను, సూక్ష్మమున్ను అయిన విమర్శనాదృష్టితో కూడుకున్న చేకాళ గమనించదగిన స్వతంత్రజిజ్ఞాసకూడ కలిగినదై యున్నదని తెలుపుటకు మిక్కిలి సంతసించుచున్నాను. ముఖ్యముగా చైనారాజ్యాంగభావపరిణామము, రాజులకుఅధికారము దైవదత్తమనుసిద్ధాంతము, సామాజికుల ఒడంబడిక సిద్ధాంతము, వ్యష్టిసమిష్టి వాదసమన్వయములనుగూర్చి భారతీయ వాఙ్మయదృష్ట్యావారు గావించిన చర్చలు నాకు నచ్చినవి. మార్క్సు శంకరులను గూర్చిన వారి పోలికలు పాండిత్య ప్రకర్షను, స్వతంత్రభావసంపదను తెలుపుచున్నవి. రాజ్యాంగభావములలోని ఇటీవలి పరిణామములు, సామ్యవాదము, కార్మికసంఘపరిపాలనావద్ధతి, ఫాసిజమ్, వీనిని గురించి వీరియొక్క పోకడలు మనోహరముగా నున్నవి. తెలుగులో నింతవరకిట్టి గ్రంథములేదు. వారిభావములు సువ్యక్తము చేయుటలోను, ఉచితమైన పారిభాషికపదములను తెలుగులో రచించుటలోను, ఓజోవంతమైన శైలిలో వ్రాయుటలోను కూడ వీరు చాలవరకు జయమందిరి.

ఆంధ్రవిశ్వవిద్యాలయము
విశాఖపట్టణము
1—1—1935

(Sd) ఎస్. వెంకటరంగయ్యా

## శ్రీయుత బెజవాడ రామచంద్రా రెడ్డిగారు.

### మదరాసు శాసనసభాధ్యక్షులు

శ్రీయుత రెబ్బాప్రెగ్గడ మందేశ్వరశర్మగారి 'రాజ్యాంగ వివేకము'న మొదటిభాగమును చాలవరకు జూచి మిగుల సంతోషపడితిని. ఈ శాస్త్రపఠనము ఆంధ్రలోకమున చక్కగ నలవాటు పడియుండని దినములలో ప్రపంచరాజ్యాంగపరిణామములను, వాని పూర్వచరిత్రములను, భావిపరివర్తనములను అవసరముగ దెలిసికొనవలసిన కాలమునందు, వీరిట్టి గ్రంథ రచనకుఁగడంగి కృతకృత్యులగుట ప్రశంసనీయము. ప్రపంచమున నాగరకత నెఱింగిన నానాజాతుల రాజ్యాంగవివేకాభివృద్ధిని, నానాటిమార్పులను, వర్తమానపరిస్థితులను క్లుప్తముగను, విశదముగను, ప్రమాణపూర్వకముగను, గ్రాహ్యముగను ఆంగ్లము నెఱుంగని యాంధ్రులకును, ఆంగ్లము నే యెఱింగి నాంధ్రశాస్త్రగ్రంథముల నర్థముగావించు కొనలేని ఆంధ్రులకును ఉపయుక్తమగునటులు రచించి భాషకేగాక రాజకీయ విజ్ఞానసంపాదనాతురులకు వీరు యెక్కువ సాయపడిరి.

ప్రస్తుతమున నిట్టి గ్రంథముల యావశ్యకత కొంచెము గాదు. రాజకీయశాస్త్రవిజ్ఞానమును చక్కగ జీర్ణించుకొను ప్రయత్నము లోఁసర్చక చిలుకపలుకులు బలికెడు కొన్ని వార్తాపత్రికల యభిప్రాయానుసారముగ సామాన్యజనులు తమ రాజకీయాభిప్రాయములను కుదుర్చుకొనుచుండు నీ కాలమున, నిజ

మైన రాజకీయవిజ్ఞానావబోధమునకు స్వతంత్రవిచక్షణత నల వాటు పరచుకొనుటకు యీ గ్రంథమెంతయును తోడ్పడగల దని నా తలంపు. కేవలపాశ్చాత్యగ్రంథములను జాతులను గురించియేగాక, ప్రాచ్యరాజ్యాంగనిర్మాణములను వానిపూ ర్వాపరచరిత్రములను గుర్తించి నాగరకతావనియందు యీజా తులకు తావేర్పరచిరి. గ్రంథాంత్యమున ఆర్థికమును అనుసరిం చిన సంఘపునర్నిర్మాణమును గురించి యెక్కువగా చర్చిం చిరి. ఇందు అభిప్రాయభేదములున్నను గ్రంథకర్త మిక్కిలి చమ త్కారముగా సమర్థించుకొనిరని నా నమ్మకము. ఆంధ్రమున నిట్టి గ్రంథరచన ప్రథమమైనను స్వతంత్రముగ నుండుట మరి యు సమంజసము. మొదటిభాగము రెండవభాగమునకు యెదురు జూచునట్లొనర్చినది.

బుచ్చిరెడ్డిపాలెం
22—8—35

బె. రామచంద్రారెడ్డి.

# విన్నపము

వర్తమాన మానవసంఘముయొక్క కేంద్రము ఆర్థికముపైన నిలిచిన రాజకీయ జీవితము. దృష్టి స్థానికమును. జాతీయతనుకూడ మించిన ప్రపంచదృష్టి. పరమార్థమనగా, వాస్తవజీవితములో—మానవులయొక్క నిత్యసంబంధాలలో, చూపవలసిన సామరస్యము. వర్తమాన యుగమర్యాద యిటుల కనిపించుచున్నది. ప్రపంచమొత్తముపైన ప్రతిదేశములోను యీనవ్యసూత్రములనుబట్టి సంఘపునర్నిర్మాణము చేయించుటకై ప్రకృతి ఒక ఉద్యమమును ప్రపంచపరముగా విజృంభింపజేయుచున్నట్లు గోచరించుచున్నది అందుచే ఇది యుగసంధి, లేక స్రుతిసమయము. ప్రతిదేశములోను నేడు మనము చూచుచున్న మార్పులు, సంఘర్షణలు,—ముఖ్యముగా రాజ్యాంగాలలో—ప్రకృతియొక్క ఇట్టి "తహతహ" వలన కలుగుచున్నవే.

భారతజాతి ఇట్టి వీక్షణతో తన స్వీయవిజ్ఞానములో యీ సూత్రములను భుక్తము చేసికొని జీవకళావంతమైన సంఘవ్యవస్థను నిర్మించుకోవలెనంటే, ఇట్టి జిజ్ఞాసలుచేసి సారాంశములు తేల్చేస్వతంత్రగ్రంథాలు—కేవలము అనుకరణగ్రంథాలు కాదు—దేశభాషలలోనే పుట్టించాలి. కాని ఏమాత్రం స్వతంత్రభావప్రతిభ ఉన్నను అట్టి గ్రంథాలు ఆంగ్లంలో

వ్రాస్తేనే వన్నెకెక్కే వాతావరణములో మనమింకను ఉన్నా మన్నమాట వాస్తవము. కాని ఎవరో ఒకరు ఎప్పుడో ఒక ప్పుడు ఇట్టి సమస్యలు ఆంధ్ర భావాల్లో భావనచేయుడం, ఆంధ్ర భాషలో వ్రాయడం, అనేదారి తీయకతప్పదు. అందులకై కొంత—భాషామాత్రమైన—త్యాగం తొలుతలో తప్పదు. అగు గాక! సహజధర్మము ననుసరించి ఇందులకు పూనుకొన్నాము. శ్రీ ప్రొఫెసరు రాధాకృష్ణగారు యీగ్రంథము చూచిన ప్పుడు, కర్తయొక్క యీ అంతర్గత భావాన్ని కనిపెట్టకలిగి నారు.

ఈప్రపంచ గోళమును మాఅరచేతిలో పెట్టుకొని, అనా దివాఙ్మయములని పాశ్చాత్య పండితులుకూడ నేడంగీకరించు చున్న వేదాలు మొదలు నేటివరకును యీగోళముపైన దేశ కాలపాత్రముల మార్పులనుబట్టి రాజ్యాంగాలు, వానికి సంబం ధించిన భావాలు, ఏవిధంగా పరిణామము పొందుతూవ చ్చాయో, భారతీయదృష్టిలో వీక్షణచేసి భారతీయులకు ఒక కథగా తెలుపుట కుద్యమించినాము. ఆయాఘట్టములలో భిన్నమతములను—అనగా ముఖ్యమైన ప్రాచ్యపాశ్చాత్య మతములనహా—భిన్నవాదములనుగూర్చి పూర్వపక్ష సిద్ధాం తముల ననువదించినాము. మేమున్ను సవినయంగా కొన్ని ప్రతిపాదించినాము. ఇది చరిత్రదీపిక. మాఉద్యమములో మొద టిభాగము. రాబోవు రెండవభాగము సిద్ధాంతదీపిక. అందు ముఖ్యముగా రాజ్యాంగములు, రాజ్యాంగ సిద్ధాంతములను

గూర్చి చర్చచేయబడును. సిద్ధాంత దీపికకు పాఠకునిబుద్ధి నిలయింపచేయుటకై ఏర్పడినదీ చరిత్రదీపిక. ఆదృష్టితోడనే యిది వ్రాసినాము. మూడవభాగమునందు, అనగా అనుభవ దీపికయందు సుమారు పదహారు ప్రపంచ రాజ్యాంగ విధాన ముల నడవడికనుగూర్చి తెలుపబడును. కాని ఏభాగమున కాభాగము స్వతంత్రమైనదే !

ఆంధ్రులలో రాజ్యాంగశాస్త్ర ప్రచారము, ప్రపంచ పరిణామములను దృష్టిలోనుంచుకొని జాతీయవిజ్ఞానమును పున రుక్తముచేసే భావచైతన్యము, జాతీయసమస్యలను వీక్షించే శక్తి తక్కువగానున్నవి. కాని ఆంధ్రభాషలో ఇట్టి సమస్య లనుగూర్చి స్వతంత్రజిజ్ఞాసలు చేసికొనుటకు ఉత్సహించే నూతన జనగణము బయలుదేరుచున్నది. ఆంధ్రభాషలో రాజ్యాంగ శాస్త్రమునుగూర్చి ౧౯౧౨ సం. రం నుండి సక్ర తుగా గ్రంథములు వ్రాయబడుచున్నవి. కాని మాయొక్క ప్రత్యేకదృక్పథమునుబట్టి వ్రాయబడిన యీ గ్రంథానికి పున రుక్తిదోషము పట్టలేదని తలచెదము.

ఈగ్రంథములోని ముఖ్యవిషయములు ౧౯౩౨ సం.రం నుంచి తరగతులనుబెట్టి పాఠములుచెప్పుచు, ఆంధ్రదేశములో అక్కడక్కడను, ఆయానంస్థల పక్షమునను ఉపన్యాసాలు— ఆఉపన్యాసావకాశములు కూడ ఒకప్పుడుమేమే కల్పించుకో వలసి వచ్చేది—ఇచ్చుచు, తద్ద్వారా ఇందలిభావాలు ప్రాజ్ఞులు ఏలా స్వీకరిస్తూంటారో చూచుకుంటూ, అందుపైన తిరిగి

జిజ్ఞాసచేసుకుంటూ, సాధ్యమైనంత వదిలంగా వ్రాసినాము. కాని సప్రమాణమైన అనువాదాలు, ప్రాచ్యపాశ్చాత్య సిద్ధాంతముల సమన్వయములు, పూర్వపక్ష సిద్ధాంతములు, కథాక్రమము, వీనినిగూర్చిన వివేకములోనే ఈ "రాజ్యాంగ వివేకము" ఎక్కువ మెలకువగా వర్తించవలసి వచ్చినది. అందుచే భాషకు ఇవ్వగలిగినంత శ్రద్ధను ఇవ్వలేక పోయినామేమో!

గుప్తార్థ ప్రకాశిక చేతుల్లో నిరంతరము ఉండే రోజులో కవ్వుడున్నను యిప్పుడు ఆఫక్కీ వదలుకొన్నాము. సంధులు పాటించలేదు. అవసరమునుబట్టియే సమాసాలు కూడ సృజించినాము. కాని శబ్దసంస్కారమును సాధ్యమైనంతవరకు విడువలేదు. ఆంగ్లపారిభాషికములకు వీలైన ఆంధ్రపదములు వాడుకలో నున్నంతవరకు ఉపయోగించినాము. వాడుకలోనున్నవి. సరియైన అర్థమును ఇవ్వజాలవని తోచినప్పుడును, క్రొత్తవి అవసరము వచ్చినప్పుడున్ను అట్టి కల్పనలుకూడ చేసితిమి. మాటలు మున్నగు పొరబాట్లకు శుద్ధపట్టికను గ్రంథాంతమున జేర్చినాము. కాని యింకను కొన్ని అచ్చుపొరపాట్లు వ్రాయసకాని పొరపాట్లుమున్నగునవి ఉండవచ్చును. మహాజనులు వానిని ప్రస్తుతము మన్నించినముందు కూర్పులో సవరించుకొంటాము. ఉపోద్ఘాతమును కూడ పొడిగించి ప్రచురణకర్తల వ్యయము నధికము చేయజాలము. ఈ గ్రంథమును పరిశీలన చేయుటకు సంపూర్ణదక్షతకలిగినట్టి నలుగురు ఆంధ్రప్రముఖులు గ్రంథమునుగూర్చి యిచ్చిన అభిప్రాయములను యిం

దుతో జతపర్చినాము. గ్రంథ పరిశీలనమువల్ల వారు చూపిన అభినివేశమున కున్ను, స్వయముగా ఇంటికివచ్చి ఆదరభావంతో గ్రంథమును పుచ్చుకొని ప్రచురింపించిన ఆంధ్రగీర్వాణ విద్యాపీఠ కార్యదర్శులు, శ్రీ సూర్యనారాయణరావుపంతులు గారికిన్నీ కృతజ్ఞత తెలుపకుండా మాత్రము దీనిని ముగింపజాలము.

గ్రంథముయొక్క మంచి చెడ్డల నిర్ణయము విబుధుల పని. దీనిని ఉపయోగించుకొనేపని మహాజనులది. నిష్కామంగా ఆంధ్రలోకానికి దీనిని నివేదించుటతో ప్రస్తుతం మా పని తీరినది.

| | |
|---|---|
| గౌతమీతీరం<br>కొవ్వూరు<br>యువ సం. అశ్వయుజ శు ౧. స్థిరవారం | ఇట్లు విన్నవించు<br>గ్రంథప్రణేత |

---

# రాజ్యాంగవివేకము

## మొదటిభాగము—చరిత్రదీపిక



(వేదములనాటినుండి నేటివరకును ప్రపంచమందలి రాజకీయ భావాల పరిణామము)

## విషయసూచిక



### అధ్యాయము—౧. (౧—౬౫ పుటలు)



#### ౧. (౧—౯ పుటలు)

విషయప్రవేశము—మానవోత్పత్తి అయిన తొలిరోజులలో సాంఘిక జీవితమును గూర్చి నేడూహించుట కష్టము—ప్రాచీనవిజ్ఞానము—భారతవిజ్ఞానముయొక్క ప్రాచీనత—యూరపియను పండితుల పరిశోధనలింకను సత్యోన్ముఖములు గావు—మర్కటమునాటికే మానవునిలో సాంఘికజీవనము కలదు—మానవోత్పత్తి క్రీస్తుపూర్వము ౨౫౦౦౦—౪౫౦౦౦ సం॥మధ్య జరిగినదనే పక్షములో అప్పటిసంఘము యెట్లుండెను ? మానవసంఘములు—చరావస్థనుండి (Nomadic State) భౌతికవిపర్యయములు మున్నగు పరిస్థితులవలన స్థిరావస్థకు వచ్చుట—చరావస్థలోనే "రాష్ట్ర" లక్షణములు గలవు—కులమునుండి—గణము—జాతిగా మానవసంఘపరిణామము—తొలుత రాష్ట్రములు (States) భారతదేశమున కాదా ఉత్పత్తియయినవి ?

## ౨. (౧౦–౧౯ పుటలు)

### ప్రాచీనభారత రాజ్యాంగపద్ధతి

పాశ్చాత్యపక్కీని యీవిభాగము వ్రాయవలసి వచ్చినందులకు క్షంతవ్యులము—వేదకాలము—ఎన్నుకొనబడిన రాజస్వామికములు—గణస్వామికములు—సభాయుక్తుడైనరాజు (King in Council) లేక అధ్యక్షుడు అను పద్ధతిని పరిపాలనజరుగుట వేదకాలములో తరుచుగా కనబడుచున్నది. సభ—సమితి—పరిషత్తు—వీని నిర్మాణమును గూర్చి తెలిసినంతవరకు వివరములు—కాని యీ సభాయుతపరిపాలనావిధానము ౧౭ వ శతాబ్దమువరకును భారతదేశములో కనబడుచునే యున్నది—సభావిధానము బౌద్ధమతరంగములోను ప్రాచీనభారతస్థానిక పరిపాలనలోను చక్కగా వికసించినది.

## 3. (౨౦–౩౧ పుటలు)

వేదములనుండి క్రీ. పూ. ౪౦౦ శతాబ్దమువరకును ప్రస్తుత పరికరములను బట్టి భారతరాజ్యాంగచరిత్రకు చీకటి సమయము. కాని మెగస్తనీసు వ్రాత కొంచెము వెలుతురునిచ్చునేమో—భారతగణ ప్రజాస్వామ్యములు—మొదటికాలము క్రీ. పూ. ౬౦౦–౪౫౦. శాక్యగణస్వామ్యము—దాని ప్రాముఖ్యత—వజ్జీయుల సంయుక్తరాష్ట్రములు—వీరి న్యాయస్థానములు—తదితర గణస్వామ్యముల పేరులు—భారతగణ ప్రజాస్వామ్యములు—రెండవకాలము క్రీ. పూ. ౩౫౦—౩౦౦. పాలులు—అరాట్టులు—మాలవులు, క్షుద్రకులు—మూడవకాలము. క్రీ. పూ. ౧౫౦ to క్రీ. పి. ౩౫౦. యౌధేయులు—మాలవులు—ఔదుంబురులు—ఆంధ్రరాజునకు ఉత్తరదేశవర్తులు గణస్వామ్యమును గూర్చి. తెలుపుట—గ్రీకుప్రజాస్వామ్యమునకు వలెనే యీ గణస్వామ్యములు మౌర్యసామ్రాజ్యమునకు లొంగిపోవుట—ప్రజాస్వామ్యభావములు భారతప్రజాసాంప్రదాయములోని వనుట సిద్ధము.

## ౪. ప్రాచీనచైనావిజ్ఞానము (౩౨—౫౧ పుటలు)

భారతవిజ్ఞానమునకు పిమ్మట చైనా అరేబియా విజ్ఞానాలే ప్రాచ్యవిజ్ఞానాలలో పేర్కొనదగినవి—చైనాయొక్క చరిత్ర క్లుప్తముగా—ప్రపంచ రాచకీయ భావపరిణామములలో ప్రాచీన చైనాయొక్క స్థానం యెచ్చట?—సిద్ధాంతజగత్తులో—ఇప్పుడు రాచకీయ ఆర్థికములను గూర్చి ప్రపంచపండితులు చేయుచున్న జిజ్ఞాసలవంటివి ౨౫౦౦ సంవత్సరములకు పూర్వము చైనాతత్త్వవేత్తల భావాలలో కనపడుట గొప్ప విషయము—కనఫ్యూసియస్ సిద్ధాంతములు—ఈయన చైనాకు వ్యాసపీఠము—మెనిషియస్ హన్ జిల సిద్ధాంతములు—తోయిస్టుమతము—మోట్జుయొక్క సిద్ధాంతము—న్యాయనిబంధనలవలననే సంఘక్షేమము నిలచునను పక్షమువారు—ఈమతముల సమన్వయము—ప్రభుత్వము లేక రాజు—అనునవి యెటుల పుట్టినవి?—సాంఘికుల ఒడంబడిక సిద్ధాంతము—ప్రభుత్వమునకును ప్రజలకును గల సంబంధమును గూర్చి యీ సిద్ధాంతము లేమి చెప్పుచున్నవి?—అక్కడక్కడ భారతదేశముతో పోల్చవచ్చును.

## ౫. (౫౨—౬౫ పుటలు)

మహమ్మదీయవిజ్ఞానము—ప్రపంచరాచకీయ పరిణామములలో దాని స్థానము—మహమ్మదీయ విజ్ఞానము ప్రాచ్యవిజ్ఞానముగా తెలుపుటకు హేతువులు—మహమ్మదీయవిజ్ఞానము పాశ్చాత్యవిజ్ఞానాభివృద్ధికి తోడ్పడిన మాట వాస్తవము—మహమ్మదునకు పూర్వపు అరేబియా—అరేబియా సంఘవ్యవస్థ—గణాభిమానప్రేరితులైన అరబ్బీలను మతమనే విశాలపీఠముపైన యేకసంఘముగా కూర్చిన మహమ్మదీయ మతము యూరపుఖండములోని క్రైస్తవసంఘ మంతయు వర్గములక్రింద నలుగుచున్న ఆరోజులలో ప్రశంసింపదగినదియే!—కలీఫాసంస్థ—రాచకీయముగా దీని యర్థము—కలీఫాపదవిని మతసంఘీయుల యెన్నిక ఆమోదమును

బడసియే వ్యక్తి ఆక్రమించవలెను—కాని, ఆదర్శనీయమైన కలీఫాలు అలీ, అబూబేకర్లే—పిమ్మట యీ సంస్థయందు ప్రవేశించిన దుర్నీతి—అరబ్బుల ఆధిక్యగర్వము—అరబ్బేతరులైన పరిషియా మున్నగు జాతులలో యిందువలన అసూయ గలుగుట—కిలాఫత్ బాగ్దాదునకు మారుట—పిమ్మట దాని పతనము—ఇస్లాం—రాజ్యాంగసంస్థ, దాని భావపరిణామమునకు యిచ్చిన కానుక స్వల్పమే!—కాని యూరపు ఖండములోని పూర్వోద్ధరణకాలము (Renaissance period) ను తన శాస్త్రకళావిజ్ఞాన సంపదతో పోషించిన మాట వాస్తవము.

---

## అధ్యాయము—రెండు (౬౬—౧౦౨ పుటలు)



### ౧. (౬౬-౮౨ పుటలు)

### గ్రీకు ప్రజాస్వామ్యములు

పూర్వ మక్కడనూ రాజప్రభుత్వ ముండెను—సోలోనురాజుయొక్క నిబంధన—అది క్రమముగా సర్వప్రజాధికారపరముగా మారినది—కాని యేథెన్సు ప్రజాస్వామ్యమును నేటి ప్రజాస్వామ్యభావాలకు లక్ష్యముగా గైకొనరాదు—యేథెన్సు ప్రజాస్వామ్యము నేటి ప్రజాస్వామ్యములవంటిది కాదు—అక్కడ వ్యక్తికిగాక గణమునకే మొదటి ప్రాధాన్యము—వ్యక్తి స్వేచ్ఛరాష్ట్రమునకు లక్ష్యముగాదు. రాష్ట్రము యొక్క ఆధిపత్యమే ప్రధానము.

### యేథెన్సు రాజ్యాంగము

అక్లీజియా అనే పౌరసభ—నిర్మాణము—అధికారబాధ్యతలు—ప్రిటెనీ (కార్యవర్గమువంటిది) నిర్మాణము—అధికారబాధ్యతలు—అంగనిర్మాణశాసనముల (Constitutional laws) కును రోజువారీ పరిపాలనకు

సంబంధించిన శాసనములకును (Statutory law) యిప్పటివలెనే రచనావిధానములో తేడా గలదు. ఉపసంఘముల పద్ధతి అప్పుడును గలదు—ఉపన్యాసములవలన మనస్సులను శాస్త్రవ్యతిరిక్తమార్గముల త్రిప్పరాదు—కానిసలు, యీ పౌరులకు అన్నియు అమర్చిపెట్టుట వలననే వీరు నిరంతరము సభాయుతులై యుండుటకు వీలయ్యెను—గ్రీకుప్రజాస్వామ్యముల పతనము—ప్రాతినిధ్యవిధానము వీరికి తెలియదు. సమాఖ్యవిధానము సమరసముగానడుపజాలకపోవుట—ప్రజాసభలద్వారా పరిపాలన జరుపు పద్ధతి ప్రాచీన ఆర్యజాతికి సాంప్రదాయసిద్ధమే—చైనా, ఇండియాలలో కంటె గ్రీకులో అది బాగుగా వికసించుటకు భౌతికపరిస్థితులు ముఖ్యకారణము—గ్రీకురాజకీయ విజ్ఞానులు—సోక్రటీసు—ప్లేటో—అరిష్టాటిల్—వారిసిద్ధాంతములు.

## ౨. (౨౩–౫౧ పుటలు)

## రోమనులు

రోము, గ్రీకు—సభ్యతలకు గల భేదము—వ్యక్తిస్వాతంత్ర్యము—విశాలపద్ధతుల న్యాయశాస్త్రము—రోమనుల కానుక—ప్రపంచఐక్యము అనే ఆదర్శము రోమనుల తొలిప్రసాదమా? ప్రాచీన భారతచరిత్ర యిందును గూర్చి యేమి తెల్పుచున్నది? రోమకరాజ్యాంగము—కౌన్సలులు—వారి నిర్మాణము — అధికారబాధ్యతలు — సెనేటుసభ—ప్రజాసభ—పెట్రీషియన్, ప్లబియన్ వివాదములు—కౌన్సలులు శత్రురక్తపిపాసగలవారు—ఈ కౌన్సలులకు—ప్రజలకు — ఒకరిపైపు ఒకరికి గల వైఖరి—రోమకప్రజాస్వామ్యపతనము—హేతువులు—కౌన్సలులు చక్రవర్తులైరి—రోమక సామ్రాజ్యము—బ్రిటీషు సామ్రాజ్యము—ప్రాచీన ప్రజాస్వామ్యములు—నవీనములయొక్క "క్రూరమైన ప్రాకృతరూపములు" అను వెల్సుపండితుని మాట.

## క్రైస్తవమతము—ట్యూటనులు

### 3. (౯౨–౯౭ పుటలు)

క్రైస్తవమతము—కర్మజడులై బహుదేవతారాధకులైన యూరపుఖండీయులకు యేకేశ్వరారాధన, భక్తియోగము, అహింసాబోధ అవసరము అయ్యెను. ఇది రాజకీయముగా మానవసమానత్వమును ప్రవేశపెట్టినది—కాని ఒక రాష్ట్రములో రెండు అధిపత్యములు—మతపీఠము—రాజ్యపీఠము—వచ్చినవి. ఉభయులకును ప్రజలపైన అధిపత్యము దైవనిర్మాణమని (Divine right of Kings) ప్రజలు నమ్మట—ఇక్కడ భారత యూరపుఖండ సిద్ధాంతములపై విమర్శ—వెంటనే పూర్వ ప్రజాస్వామ్యభావాలు అడుగున పడినవి—ఇక్కడ Foot Note లో రాజసంస్థయొక్క మూలమును గూర్చియు దానికిని ప్రజలకును గల సంబంధమునుగూర్చియు అప్పటి పాశ్చాత్య సిద్ధాంతముతో భారత, బౌద్ధ, చైనా సిద్ధాంతములు పోల్చియు తెలుపబడినవి.

### ౪. (౯౮–౧౦౨ పుటలు)

ట్యూటనుసభ్యత. వ్యక్తిస్వాతంత్ర్యమును రోమనులకంటె అధికముగా ప్రేమించెదరు. ట్యూటను, రోమను నాగరికతల కలయిక—దాని ఫలితము—రోమను నాగరికతను ట్యూటనులు గౌరవించక తప్పలేదు. కాని స్థానికపరిపాలనాంతరములు తొలుత యూరపులో నాటినది ట్యూటనులే.

---

## అధ్యాయము 3. (౧౦౩–౧౦౭ పుటలు)



### ఫ్యూడల్ విధానలక్షణములు—దాని వ్యాప్తి

ఫ్యూడల్ విధానము, ప్రముఖస్వామ్యము (Aristocracy) తో కూడినది—రాజు—ప్రముఖులు—అను యీ యిద్దరిమధ్యనే సర్వవ్యవహార

ములు నడచుచుండెను. గాని ప్రజాళికి అందు ప్రసక్తిలేదు. ఫ్యూడల్ విధానము క్రిందనున్న రాష్ట్రములయొక్క— రాజకీయస్వరూపము— ౧౦౮౬ సం॥రం లో విల్లియంరాజు శాలీస్‌బరీయొద్ద చేసిన గ్రామ పెద్దల సమావేశముయొక్క— రాజకీయప్రాముఖ్యము—కాని స్థానిక పరిపాలన ఫ్యూడల్ విధానములో కూడ సన్నగిలలేదు.

---

## అధ్యాయము ౪. (౧౦౮—౧౧౯ పుటలు)



## పునరుద్ధకాలము (Renaissance Period).

### ౧. (౧౦౮—౧౧౯ పుటలు)

ఫ్యూడల్ దాస్యము సడలుటకు సహాయపడిన పరిస్థితులు—నల్లప్లేగు— వ్యవసాయకుల తిరుగుబాటు—పారిశ్రామికోద్యమ ప్రారంభము— క్రైస్తవయాత్రాస్థలముల రక్షణోద్యమము (Crusades) మైకెవిల్లి యొక్క "రాజు" అను గ్రంథముకూడ రాజప్రభుత్వమును (Monarchy) పోషించుటచే ఫ్యూడల్ దాస్యమునకు సిద్ధాంతబలము తగ్గినది— సంఘము తిరిగి రాజస్వామ్యపరముగా మారుట ప్రారంభమయ్యెను.

### ౨. (౧౧౪—౧౧౫ పుటలు)

విజ్ఞానాభివృద్ధి—స్పెయినులోని మహమ్మదీయపండితులు ప్రాచీనగ్రీసు, భారత మొదలైన విజ్ఞానమును యూరపుఖండములో ప్రవేశపెట్టుటకు కారకులు—ఇటలీ— వర్తకనగరములు—ప్రాచ్య— పాశ్చాత్యవిజ్ఞానపు కలయికలకు తోడ్పడినవి—స్పెయిన్—ఇటలీ—లలోని విద్యాపీఠములలో జిజ్ఞాస—సింహావలోకనము—క్రైస్తవమతమును యిప్పటికి బాగుగ జీర్ణము చేసికొనిన ప్రజలలో బయలుదేరిన జిజ్ఞాస—స్పెయిన్— ఫ్రాన్సు—లలోను, ముఖ్యముగా గ్రేటుబ్రిటనులోను—క్రైస్తవమత

పీఠదాస్యము తక్కువ—జాతీయత యిక్కడ తొలకరించుటకు ప్రసక్తి గలుగుట—అప్పటి రాజకీయ స్వాతంత్ర్యములు బహిర్ముఖమయినవి—(External Sovereignty) అంతర్ముఖదృష్టికికాలము యింకను రాలేదు—ఇంక మకీవిల్లీయొక్క గ్రంథములే ప్రజలచే సన్మానింపబడుచుండెను–ఈకాలములో రాజ్యాంగపరిణామ దృష్ట్యాప్రాముఖ్యము గల అంశములలో నొకటి—పోపుపీఠపరిపాలకసంఘము (Concilior moment) అందు జాతులను బట్టి ప్రాతినిధ్యము తొలుత సూచింపబడుట—ఈ ఉద్యమము పిమ్మట నశించినను మతములోవలెనే రాజకీయముగా కూడ రాజులు ప్రతినిధిసంఘబద్ధులై పాలించవలెనను భావమును ఉద్దీపన చేసిన జిజ్ఞాసువులను బయలుదేర దీసినది.

---

అధ్యాయము ౫. ౧౬-౧౭ శతాబ్దములు (౧౨౨-౧౪౯ పుటలు)

౧. (౧౨౦-౧౨౩ పుటలు)

లూథరు—కాల్వినుల మతసంస్కారోద్యమములు—అవి రాజ్యాంగభావముల మార్పుదలకు ఎట్లు తోడ్పడినవి—౧౬ వ శతాబ్దములో యూరపుఖండములో పుట్టిన రాజకీయపుపార్టీలు యీ మతకక్షలలో నుండి వచ్చినవే.

౨. (౧౨౪-౧౨౫ పుటలు)

అప్పటి రాజకీయపరిస్థితులు

యోగ్యులైన రాజులు అరుదగుటవలన అసలే ప్రాతబడుచున్న రాజస్వామ్యమంటే అనిష్టత హెచ్చుగుచుండెను—ఫ్రాన్సులో స్టేట్సు జనరల్ అనే ప్రజాప్రతినిధుల సభ అణచివేయబడినది—డచ్చిప్రజల విప్లవము:—కాని యిది రాజును మంచి దొరతనము చేయుమని కోరుటకే—ఈ

మాత్రము కూడ ప్రజలు అడుగుట అప్పటి రాజులకు బహుకష్టముగా నుండెను—ఇంగ్లండులో మొదటి చార్లెసు పార్లమెంటును అణచుట—విప్లవము—కాని అప్పటికాలపు ప్రజలు రాజవిరహమును యెంతమాత్రమును సహింపజాలనివారు.

### ౩. (౧౨౬—౧౨౯ పుటలు)

ప్రజాస్వామ్యపరమైన రాజ్యాంగమును గూర్చి జిజ్ఞాసలు ప్రారంభమగుట—హాబ్సు—లాక్—రూసో—ఈ ముగ్గురు యెక్కడ కలయుదురు? ఎక్కడ విడిబడుదురు?

### ౪. (౧౩౦ పుట)

ఇటలీనగర స్వామ్యములు—శ్రేణులు—జర్మనీ హెన్సియాటిక్ వర్తక సమితి—ఫ్రాన్సులోని నగరస్వామికములు.

### ౫. (౧౩౧—౧౩౯ పుటలు)

## పూర్వోద్ధరణకాలము ముగించుటకు ముందు తేల్చవలసిన సారాంశములు

అప్పటి ఆందోళనకు లక్ష్యము—ఉన్న రాజ్యమతసంస్థల సంస్కారముగాని నాశనము గాదు—ఈ సారాంశమునే అప్పటి యూరపుఖండపు మతరాజకీయ సారస్వత ఉద్యమములు తేల్చుచున్నవి. అతులతో ప్రాతసంస్థలను నిలుపుట ఇక అసాధ్యమని రుజువుచేయగల ౧౯ వ శతాబ్దము ఇంకను ముందు గలదు—ఈకాలములోని కవులు—తత్వవేత్తల భావములు—యూరపుఖండ సరిహద్దులను దాటిన వైశాల్యము గలవి—అచ్చుయంత్రము—మందుగుండు—ప్రపంచపరిశోధనములు—ప్రపంచపరమైన వర్తకవ్యాపారమునకు దోహదము నొసగినవి—వ్యవసాయకులు కార్మికులుగ మారుట—పరిశ్రమలు—పెట్టుబడి విధానయుతములగుట (capitalistic) నగరములు వృద్ధియగుట—అధినివేశ

ములకు యూరపుఖండరాష్ట్రములు పెనగులాడుట — తమ పరిశ్రమలకు మార్కెట్టులను చూచుకొనుట ప్రారంభమయ్యెను — ఈవిధముగా యూరపుఖండదేశములు చిన్న జాతీయతలక్రింద విడబడి — యెక్కడి కక్కడ యీ జాతీయతా నిబంధనకు లోబడి వికసించుచు — ప్రపంచమును కబళింపజూచెడు కాలములో భారతవర్షము స్థానికకలహాములతో ప్రొద్దుపుచ్చుట — బహిఃప్రపంచము విషయమై ధర్మరాజునాటి నమ్మికలనే భారతప్రజలు కలిగి యుండుట.

---

## అధ్యాయము ౬. (౧౮౦—౨౮౭ పుటలు)

### ౧. (౧౮౦—౧౮౬ పుటలు)

### రాజులేకుండ ప్రజలే రాజ్యచక్రమును నడిపెడి విధానము, ప్రధమతః, ఉత్తర అమెరికాలో మూర్తీభవించినది

అమెరికా రాష్ట్రములు — వారి తిరుగుబాటునకు కారణములు — ప్రజలే ప్రభుత్వముగా పరిణమించే దశ ఈ శతాబ్దమునుండి ప్రారంభము. పైనీ రూసోలు అమెరికనులకు భావసంపద చేకూర్చిన జిజ్ఞాసువులు — అమెరికన్ విప్లవముయొక్క ముఖ్యలక్షణములు — వారు జయించిన పిమ్మట రాజ్యాంగనిర్మాణము చేయుటలో పడిన కష్టములు — సమాఖ్య రాజ్యాంగవిధానము అమెరికా ప్రజల కవసరమయ్యెను. దీని ఫలితము — పూర్వముండిన రాష్ట్రాభిమానముస్థానే విశాలమైన అమెరికన్ జాతీయతను యిది ప్రజలలో ప్రవేశపెట్టెను — నీగ్రోదాస్యవిముక్తి — యీ సమస్యపై అమెరికన్ ప్రజాస్వామ్యములో అంతఃకలహాము — చివరకు యీ దాస్యవిముక్తి నేడుకూడా పూర్ణముగా జరుగలేదు.

## ౨. (౧౪౭—౧౯౧ పుటలు)

## ఫ్రెంచి ప్రజావిప్లవము

ఫ్రెంచి విప్లవమునకును అమెరికన్ విప్లవమునకును తారతమ్యములు—లాక్—మాంటెస్క్యూ—సంస్కరణ వాదులు—రూసోవేత్త యొక్క "సాంఘికుల" ఒడంబడిక (Social Contract) అది ఫ్రెంచివిప్లవమును ఉద్దీపనచేసిన విధము—సాంఘికముగా అది మానవులమధ్య బుద్ధిపూర్వకముగా ఒడంబడిక జరిగెనా? రూసోయొక్క సాంఘికుల ఒడంబడికకు అనువాదము—రాజ్యాధికారము త్రికాలాబాధితముగా ప్రజానిష్ఠము — సంపూర్ణము— (absolute) అవిభాజ్యము—(Indivisible) రూసో—లాక్—హబ్సుల కలయికలు, విడిపోవుటలు—ప్రత్యక్షముగా ప్రజలు—గ్రీకుప్రజాస్వామ్యములలో వలె—రాజ్యాధికారము చలాయించు సంస్థలే రూసో మతమునకు దగ్గఱగా నున్నవి—రూసో సిద్ధాంతములు ఆనాటి ప్రజలలో యెట్టినమ్మకమును కల్గించినవి తెలిసికొనుటకు జేమ్సురాజును ఆంగ్లేయులు పదభ్రష్టునిగా ప్రకటించిన పార్లమెంటు సభవారు చేసిన ప్రకటనములోని భాష—౧౭౭౬ సం॥ రము లోని అమెరికా ప్రజల ప్రకటనము—ఫ్రెంచి విప్లవములోని ప్రజాపక్షమువారి ప్రకటనము—ఇవి నిదర్శనములు—రూసోసిద్ధాంతముపై నవీన పూర్వపక్షము కలదు—మహాభారత శాంతిపర్వము రూసో వాదమును సాంఘికుల ఒడంబడిక సిద్ధాంతమును బలపరచుట—ఫ్రెంచివిప్లవము మానవుని సర్వతోముఖ జిజ్ఞాసను రగుల్కొల్పినది—అందుచే అమెరికన్ విప్లవముకంటె భావసంపదలో యిది ఘనమైనదే—రాజప్రభుత్వపతనము—అందువల్ల లభించినను ప్రజలమధ్య సమత్వస్థితి యేర్పడు విధానము అందు లేదు—అందుచే నేటివారు దానిని నిజమైన ప్రజావిప్లవ మనుటకు సంశయించెదరు—అమెరికా విప్లవమునకు నిర్మూలన ప్రతిభతోపాటు నిర్మాణప్రతిభ కలదు—అది ఫ్రెంచివిప్లవమునకు లేదు—ఎందుచేత? ఫ్రెంచివిప్లవానంతరపు

ఫ్రాన్సులోని రాజ్యాంగపరిణామము—విప్లవము లెంత ఉన్నతభావ ప్రేరితములైనను దేశీయుల సంకుచిత మానసికప్రవృత్తికి వానిని అదపులో నొక్కిపెట్టగల శక్తి గలదు.

3. (౧౬౨-౧౬౮ పుటలు)

ఫ్రెంచివిప్లవఫలితముగా యూరపుఖండములో కలిగిన మార్పులు—నిరంకుశ రాజస్వామ్యముపై ప్రజల తిరుగుబాటు—జాతీయతామంత్రము తీవ్రముగా ఉపాసింపబడుట—జాతీయతావికాసమునకు కారణములు, అనవసు పరిస్థితులు—ప్రజాస్వామ్యసిద్ధాంతము పూర్వము ఊరుపేరులేని సామాన్యవ్యక్తికి జవసత్త్వముల నిచ్చినది—కాని యీ సిద్ధాంతము జాతీయత యను కంచెలమధ్యను విహరించవలసి యుండెను—ఆర్థిక పారిశ్రామికయుగము కూడ "జాతీయత" అను నిషాకు అవసరము కల్పించినది—ఆరోజులలో కార్మికులు, షావుకార్లు కూడ జాతీయాభిమానులే—జాతీయత జర్మనీవలె వ్యక్తికృతమున కూడ—భారతదేశమున వలె పరాధీనత్వముకూడ జాతీయతను పోషించును—కాని భారతదేశపు జాతీయత అతి ప్రాచీనమైనదని తేటతెల్లము.

౪. (౧౬౮-౧౭౪ పుటలు)

జాతీయతాప్రేరకములైన నాటి ప్రజాస్వామ్యోద్యమములు—ఇటలీ—మ్యాజినీ— గారిబాల్డి—కేవరు—హంగేరి—ఫ్రాన్సిస్‌డీమ్—ఈజిప్టు ప్రజల జాతీయోద్యమము—కొరియాప్రజలు—ఐరిషుప్రజలు—ఇటలీ జాతీయరాష్ట్రము—డెన్మార్కు పార్లమెంటరీ విధానము—జర్మను సమాఖ్యవిధానము—బిస్మార్కుమంత్రి—ఫ్రాన్సులో 3 వ ప్రజాసాజ్యము—సర్వియా—మాంటెనీగ్రో—రొమేనియాలలో జాతీయప్రభుత్వస్థాపనము—గ్రీస్ యింతకుపూర్వమే విడబడినది—యథేచ్ఛానిరంకుశత్వముతో రాజ్యము చేయుచుండిన టర్కీసుల్తానుకూడ రాజ్యాంగనిబంధనను ప్రకటించవలసి వచ్చెను—పిమ్మట బవేరియా, జపాను ర్వా

ప్రభుత్వములు కూడ యీ దారినే త్రొక్కెను—బ్రిటిషు అధినివేశముల లోనికి కూడ యీజాతీయప్రజాస్వామ్యవిధానపు ఉద్యమము ప్రాకినది—కెనడా—ఆస్ట్రేలియా—న్యూజీలెండు—దక్షిణఆఫ్రికా—ఫిలిపైన్—మెక్సికో—అర్గంటైనెల్—బ్రెజిల్—మున్నగు దక్షిణఅమెరికారాష్ట్రములు—౧౮౭౫ సం॥రములో నవీనభారతజాతీయోద్యమము ప్రారంభము—పై చరిత్రాంశములపై తేలిన రాజకీయసారాంశములు—రాజనిరంకుశత్వము కొన్నిచోట్ల తగ్గించబడెను—కొన్నిచోట్ల అసలేరద్దు చేయబడెను. సిద్ధాంతములో ప్రజలు రాజ్యాధికారమునకు మూలకందమని (People are the fountain source of sovereignty) స్థాపించబడినది—కాని పూర్వము—రాజు, మతగురువు ఫ్యూడల్ ప్రభువుయొక్క నిరంకుశత్వములోనుండి బయటపడిన యీప్రజాగణము—జాతీయత, వ్యక్తిపెట్టుబడి విధానము (Individualistic Capitalism) అనే నూతన నిర్బంధములలోనికి పోవుట ప్రారంభమైనది,

౫. (౧౭౬—౨౮౭ పుటలు)

## కార్మిక జిజ్ఞాస

వ్యక్తి పెట్టుబడిపై పదార్థోత్పత్తిని గూర్చి యిదివరలోనే తెలుపబడినది—దాని పూర్ణవికాసమునకు యిప్పుడే సమయము—జిజ్ఞాసువుల దృష్టిలో పెట్టుబడి విధానవిమర్శ—యంత్రజీవితమనగా నేమో యథార్థానుభవముపై వర్ణించబడినది—ఫ్యూడల్ దాస్యమునకును పెట్టుబడివిధానములోని కార్మికుని జీవితమునకును తారతమ్యము—మారిపోయిన నేటి పరిస్థితులలో వ్యక్తికి (ముఖ్యముగా పారిశ్రామిక దేశములలో) కార్మిక జీవనము తప్పనిసరి—దానికి కొంతవరకు పెట్టుబడిదారు కూడ బాధ్యుడు—మరియొక దృష్టిలో పెట్టుబడివిధానము అనునది కార్మిక సమాజముయొక్క భావిఅభివృద్ధిదృష్ట్యా అనుభవించదగిన పరిణా

మావస్థ—కార్మికుని స్థితి యజమానులకు లోకువ చిక్కించినది—
దీనిపై జిజ్ఞాస — బెంథము — మిల్లుపండితుడు కన్నులారగాంచిన
కార్మిక పరిస్థితులవలన తన గురువుగారి సిద్ధాంతమును సవరణ చేయవలసి
వచ్చినది—కార్మికాందోళన ప్రారంభము — రాబర్టుఓవన్—ఆంగ్ల
దేశములో కార్మికుల క్షేమమునకై శాసనము కావలెనను ఆందోళన—
లాభాలు అభివృద్ధి కావలెనను షాహుకారు కాంక్షతోపాటు వాని
దగ్గర నిరంతరము జీవనముగడిపే కార్మికునికి కూడ ఉన్నతజీవితము
కావలెనను కాంక్ష సహజమే—ప్రపంచమున షాహుకారు, కార్మిక
జీవితము అమితవ్యాప్తి గాంచినది—వెంటనే మతము, రాజకీయ
మునున్ను వదలి ప్రజాదృష్టి యిక్కడ ప్రసరించుట అవసరమయ్యెను—
ఇందునుగూర్చి సిద్ధాంతజిజ్ఞాస—మార్క్సు—అయన పుట్టుక—క్లుప్త
ముగా చరిత్ర—మార్క్సునకు స్థానమిచ్చిన ఆంగ్లదేశము ధన్యమైనది—
సంఘస్వామ్య. సమాజవాదములు. కేవలము మార్క్సు ముఖమునుం
డియే నిర్గమించలేదు—విశ్వమయసృష్టి—శుకయోగీంద్రుడు—ఋష్యాశ్ర
మములోని వ్యక్తి, సత్వరహితమైన జీవితము—భారతసంఘవ్యవస్థలో
సంఘపు ఆర్థికసంపత్తు—సద్వినియోగము (సమభుక్తము) కావలెనను
సూత్రము కాన్పించుచున్నది—అయితే అది నాటిపరిస్థితులకు లోబడి
ఏర్పడినట్టివి—సప్తసంతానములు — తులాభారములు — ఉంఛవృత్తి,
శిలావృత్తులతో బ్రహ్మజ్ఞాననిరతుడై జీవించవలసిన బ్రాహ్మ్యము—
హింసను సంఘములో ఒకమూలకు గెంటివేసి ధర్మప్రేరణమే దాని
ప్రయోగమునకు శరణ్యముగా పెట్టిన శాస్త్రపద్ధతియు నేటిరోజులలో
కూడ ఆదరపాత్రములు—కాని అప్పటివ్యక్తి సాధన నేడు "సంఘేశక్తిః
కలౌయుగే" అను న్యాయానుసారము ప్రస్తుతదశలో సాంఘికసాధ
నగా మారవలెననుట తథ్యమే—. సామ్యవాదము, మహమ్మదీయ,

క్రైస్తవమతములు—బౌద్ధమతము—ఆంగ్లజిజ్ఞాస—బెంథం—ఆధిభౌతిక సుఖవాదము (Utilitarianism) రైకార్డో—వ్యక్తి అర్థవాదులు (Individualistic Economists) స్వేచ్ఛావ్యాపారము—వ్యక్తులమధ్య జరుగు ఒడంబడికలలో రాష్ట్రము జోక్యము పుచ్చుకొనరాదు (Freedom of Contract)—ఆనాటి పరిస్థితులలో యిట్టి ప్రతిపాదనలకు సబబు లేకపోలేదు—స్పెన్సరుపండితుని మతముకూడ వ్యష్టిపరమైనదే. డార్విన్ జీవపరిణామసిద్ధాంతము వీరి మనస్సులను వశపరచుకొనినది—మాల్దస్ — మిల్లు పండితుల చేతులలో, వ్యష్టివాదుల నైష్కర్మ్యవాదము (Inaction) కొంచెము పురుషకారపరముగా మారినది. రైకార్డీయులు లాక్ పండితునిచే ప్రతిపాదించబడిన పదార్థముయొక్క కర్మ మూల్య సిద్ధాంతమును (Labour theory of value) వ్యష్టివాదపరముగా సమర్థించుట—జర్మను జిజ్ఞాస—హేగేలు—రాష్ట్రస్వామ్యము—హేగేలు మతానువాదము —ఫ్రెంచి జిజ్ఞాస—సెయింటుసైమన్, ఫొరియర్, ప్రొధన్, లూయీబ్లాంక్ల జిజ్ఞాస.

## మార్క్సీయ సిద్ధాంతములు

మార్క్సు కర్మక్షేత్రములో ప్రవేశించునప్పటికి యూరపుఖండపరిస్థితులు—అప్పటి సిద్ధాంతములు—యూరపుఖండమునకు నూతనశ్రుతి సమయము—మార్క్సు—హేగేలు—ఒకరు భౌతిక పరిస్థితులకును—మరియొకరు భావమునకును ప్రాధాన్యమిచ్చిరి (ఇక్కడ Foot Note లో యీ వాదము విపులపరచబడినది.) రాష్ట్ర, సాంఘికవాదులు—సమాజవాదులుగా మార్క్సుమతము శాఖలగుట—మార్క్సు వ్యక్తి అర్థవాదులు — రైకార్డీలయు కర్మమూల్యసిద్ధాంతమును మార్క్సు పూర్వపక్షముచేయుట—సామ్యవాద ఆదర్శోన్మాదులు (Utopian

Socialists)-మార్క్సు యొక్క మందలింపు—మార్క్సు—అద్వైతము-శంకరుడు-జీవుడు మాయావశుడైనట్లే వ్యక్తికి భౌతికపరిస్థితుల దాస్యము సహజము (Economic determinism) జీవుడు జ్ఞానము ద్వారా ముక్తుడగునట్లే యీ భౌతికపరిస్థితులను యావత్తు సంఘము వశమందుంచుకొనునపుడు ముక్తావస్థ ప్రారంభమగును. (State of Freedom). ముక్తావస్థ—దాని సాధనము—మార్క్సులో నిష్కామకర్మ సిద్ధాంతము ప్రస్ఫుటమగుచున్నది—అర్థికాద్వైతము—పురుషోత్తమప్రాప్తియను పరమార్థమునకు సాధనముగా జేసినాడు మార్క్సు. శంకరుడు కర్మను తీవ్రముగా నిరసించుటకు కారణమేమి? మార్క్సు భౌతికేతరవ్యవస్థలను నిరసించుటకు కారణమేమి? మార్క్సునీతి పనికిరాదను వాడనువాదము పొరపాటు — రూసో — శంకరుడు— మార్క్సు లోకములో అద్వైతస్థాపకులు—మార్క్సీయ సిద్ధాంతముపై పూర్వపక్షములు. మార్క్సీయవాదముయొక్క ప్రచారము (౧౮౭౪—౧౯౧౧) మార్క్సు యొక్క సామ్యవాద ప్రకాశికమున్నగు గ్రంథములు. ౧౯ వ శతాబ్దాంతపు సమష్టివాద చరిత్రలో మార్క్సుకు ప్రధానస్థానము—సామ్యవాదమును వేదాంతదశనుండి సిద్ధాంతముగాను ఒక కార్యక్రమముగాను మార్చినది మార్క్సు అని పండితుల మతము. కాని యుద్ధానంతరమే ఇది ప్రబలుట—ప్రకృతి ప్రాణశాస్త్రములు — సమిష్టివాదము — మానసిక శాస్త్రము — ప్రభుత్వము—మార్క్సీయమతమునకు దగ్గఱగానున్న యీకాలపుమరికొన్ని వాదములు-అరాడ్ వాదము (Anarchism) కేవల కార్మికసంఘ పరిపాలనాపద్ధతి (Syndicalism) శ్రేణీస్వామ్యవిధానము (Guild Socialism)

---

## అధ్యాయము:—౭. (౨౦ వ శతాబ్దము ౨౪౮—౨౫౭ పుటలు)



### ౧. (౨౪౮—౨౫౦ పుటలు)

ఇప్పటికి ప్రపంచభూభాగములు,—పరిశోధనలు, రేడియో, ఆవిరి, విద్యుచ్ఛక్తులవలన అతిదగ్గరపడినవి. మానసికముగా కూడ భావాలు, విజ్ఞానాలు ప్రపంచదేశములవారు అపరిమితముగా యిచ్చి పుచ్చుకొనుచున్నారు—వెంటనే పూర్వశతాబ్దములో బయలుదేరిన జాతీయత యొక్క సరిహద్దులు విశాలము కాకతప్పటలేదు—పూర్వమువలెగాక ప్రజాదృష్టియొక్క కేంద్రము యూరపునుండి యేషియాకు కూడ మార్చినపరిస్థితులు—ప్రతిజాతియు తన నిర్మాణములో ప్రపంచపరిస్థితులకు ప్రాధాన్యము నివ్వవలసిన కాలమువచ్చినది—ఈ శతాబ్దప్రథమపాదములో ఏష్యాఖండీయులు యిరోపియను గురుపీఠముయొక్క గౌరవమును తగ్గించగల్గిన పరిస్థితులు.

### ౨. (౨౫౦—౨౫౭ పుటలు)

గత శతాబ్దములోని అయిరోపియను జాతుల రాజ్యవిస్తీర్ణవిధానము; ఈ శతాబ్దములో పణ్యస్థలవిస్తీర్ణవిధానము (Expansion of market) గా మారుట—ఇందులకు నేడు యూరపుఖండము యొక్క జీవిక, పూర్ణపారిశ్రామికముగా మారుటయే కారణము.—తాము తయారుచేసిన పరిశ్రమల విడుదలకును, పరిశ్రమలకు వలయు ముడిసరకులకును, ఆఫ్రికా, ఏష్యాఖండములను, తమ తమ దాస్యములో నుంచుకొనుట వారికి నేడత్యవసరము—ఈ పెనుగులాటయే ఆర్థికసామ్రాజ్యస్థాపనకై యూరోపియను జాతులమధ్య 1914 సం॥లో మహాసంగ్రామము ప్రారంభమగుట కసలుకారణము. సంగ్రామరోజులలోని ఐరిష్ దేశీయ ఉద్యమములు.—"భారతదేశపు స్వాతంత్ర్యయుద్ధము, ఫ్లాండర్సునగరమున పోరవలెన" ని భారతీయులను బ్రిటిషుసహాకారమునకై గాంధిజీ

ఉన్మోచ్ఛేదించుట—అమెరికా మిత్రమండలితో చేరుట—ప్రసిడెంటు విల్సనుగారి స్వయం నిర్ణయాది ఉదారసూత్రములు—యుద్ధవిరామము—ఇకముందు యుద్ధములు జరుగకుండా ప్రపంచశాంతి ఏర్పడుటకు ఉద్యమము—నానాజాతిసమితి—దశలక్షల రుధిరప్రవాహముల మధ్యనుండి బెగడొందిన మానవజాతిని విల్సనుగారి సూత్రములు కొంత ఆకర్షించిన మాట వాస్తవమే. వర్సైల్స్ సంధి—విల్సనుయొక్క ప్రకటనప్రకారము జర్మనీలో ప్రజాస్వామ్య మేర్పడుట.—ఇంతకుపూర్వమే రష్యా సోవియట్ విధానము నవలంబించి విప్లవము లేవదీసి దేశమును స్వాధీనపరచుకొని మహాసంగ్రామమునుండి బయటపడుట—వర్సైల్స్ సంధి—ఆస్ట్రియా, టర్కీ, జర్మనీ సామ్రాజ్యములు అస్తమించుట—నూతనరాజ్యాలు బయలుదేరుట—ఇవి నిజముగా స్వయం నిర్ణయసూత్రములబట్టి బయలుదేరినవా?—లేక పై సామ్రాజ్యములు మందు తలలెత్తకుండ చీల్చివేయుటకా?—మ్యాండేట్లు—ప్రొటక్టరేట్లు.—

---

## అధ్యాయము—౧. (౨౫౮—౩౩౪ పుటలు)



### ౧. (౨౫౮—౨౭౭ పుటలు)

### యుద్ధానంతరపు రాజ్యాంగపరిణామము.

ఇటలీ—యుద్ధములో ఇటలీకి కలిగిన పరాభవము—వెర్సైలీస్ సంధినాటి ఇటలీ దేశములోని రాజకీయపరిస్థితులు—ఇటలీప్రజలు జాతీయతాధ్వాంసకరమైన సామ్యవాదములు స్వీకరింపరని ముస్సోలినీ కనిపెట్టుట—రోమునగరముపై దండెత్తి కోటతాళపుచెవులు రాజుగారివలన పుచ్చుకొనుట—నూతన ఇటలీవిధానము—కార్పొరేట్సు రాష్ట్రము, ఫాసిజమ్ అనగా నేమి?

## టర్కీ

యుద్ధానంతరపు టర్కీ జాతీయోద్యమము—ముస్తఫా కమల్ పాషా, నాయకత్వమున టర్కీ, వర్సెలీస్ సంధి నిరాకరించుట—పిమ్మట లాసానీసంధి—టర్కీ జాతీయనిర్మాణము కమల్ పాషా నాయకత్వమున ప్రశంసనీయముగా జరుగుట—యుద్ధానంతరపు ఐర్లెండు, చైనా, భారతదేశముల రాజకీయ పరిస్థితులు క్లుప్తముగా—జాతీయ ప్రజాస్వామ్యోద్యమము యెడారులలోనికి కూడ ప్రాకినది—మహామ్మదీయప్రజలు—ఆఫ్ఘనిస్థానము, నవీనఆఫ్ఘను రాజ్యాంగము, స్పెయిన్—యుద్ధానంతరము బ్రిటీషు అధినివేశనములు వాస్తవములో బ్రిటిషు రాజ్యాధిపత్యమునుండి తొలగిన సంపూర్ణ బహిరంగరాజ్యాధికారము (External Sovereignty) గలవిగా మారుట—యుద్ధానంతరమున ప్రజాస్వామ్యోద్యమములేని దేశమే ప్రపంచములో లేదు—ఇదివరకే ప్రజారాజ్యము అనుభవించుచుండిన దేశములలో ఎన్నికవాక్కులు అధిక వైశాల్యము చేయబడెను. ఈదశలో స్త్రీలకు కూడ వాక్కుల నిచ్చుట పురుషులకు తప్పినది కాదు—ఇందువలన కార్మికులకు వోటింగు బలము హెచ్చుట—ఇదివరలోనే కొలదిగనో గొప్పగనో బలముకలిగి పనిచేయుచుండిన మార్క్సుమతమునకు సంబంధించిన సాంఘికస్వామ్యవాదులు, సమాజవాదులు, వీరిలో ఏదో యొక పక్షము యూరపుఖండములో ప్రతిదేశములోను ప్రబలమగుట—రష్యాయొక్క పునర్నిర్మాణ విధానము ప్రతిదేశమునను ప్రజాదృష్టి నాకర్షించుట—కార్మికపక్షము యొక్క భవిష్యత్తు.

## నానాజాతిసమితి

మొదటిలో దీనిని గూర్చి ప్రజలలో గల ఉత్సాహము క్రమేణ సన్నగిలుట—నేటి యీ సమితియొక్క స్థితి—కాని యీ సమితి మానవుని రాజకీయ పరిణామములో అత్యున్నతదశను సూచించుచున్నదనుట

వాస్తవమే—అయితే వ్యక్తిని సంఘాలక్రింద బాధించుటలోనే ప్రపంచ శాంతికి భంగముకలదేమో అని కైకొడ్డోనాటినుండి. జిడ్డుకృష్ణమూర్తి వరకును గల పూర్వపక్షము కూడ విచారణీయమే—

## అంతర్జాతీయ కార్మికసమితి

ఇది వర్సెలీస్ సంధిలో పుట్టిన బిడ్డ—వీని ముఖ్యతీర్మానములు—ఇంచుమించు ఏదేశమున్ను అమలుజరుపకపోయినను కార్మికోద్యమప్రచారమునకు ఇది కొంత సహాయపడుచున్నది.

## ఆర్థికదుస్థితి

యుద్ధానంతరము యూరపుఖండములోని దేశములు చాల దెబ్బతినినవి—జాతీయఋణము పెరిగిపోవుట—పరిశ్రమలు నశించుట—పరాజితదేశములపై విధింపబడిన అపరాధములవలన (Reparations) యూరపుఖండముయొక్క ఆర్థికజీవితము దుస్థితిలోనికి యెటుల వచ్చినది—సోవియట్ పంచవర్ష విధానముయొక్క దెబ్బ—అధికోత్పత్తిదోషము—ఇది షాహుకార్ల లాభాలదృష్టిలోనే—160 పుటక్రింది (Foot note) లో యీ పరిస్థితులకు ఆర్థికశాస్త్రదృష్ట్యా అంతరార్థము వివరించబడినది. రాష్ట్రస్వామ్యము ఆర్థికజీవితమును ప్రధానముగా నిడికొని జాతీయ పునర్నిర్మాణము అను ప్రతిదేశములో తప్పనిసరిగా కలుగుటకు హేతువులు—ఈపుటలోనే 2 వ (Foot note) లో పైసూత్రములపై బ్రిటిష్‌పార్లమెంటు సంస్కారము జరుగవలెనని, ఆస్వాల్డుమూస్లే, స్టాఫర్డు, క్రిప్సుగార్ల సూచనలు—తమలాభములు తగ్గినవనుకారణములు—గత్యంతరములేని కార్మికులను పెట్టుబడిదార్లు తగ్గించుట—జీతములు తగ్గించుట—నిరుద్యోగసమస్య—ఈవిధముగా ధర్మక్షేత్రము రాజకీయమునుండి ఆర్థికమునకు మారినది. వెంటనే ప్రాతరాజ్యాంగములు క్రొత్తపరిస్థితులకు కుదరక మథనము ప్రారంభమైనది.

## ౨. (౨౫౮—౨౯౯ పుటలు)

సింహావలోకనము—ప్రపంచమే అస్థిరము—కాని అస్థిరములోనే అభివృద్ధి కలదు. మార్పు అనగా నేమి?—జిజ్ఞాసువుల మూలముననే ప్రాత క్రొత్తలయొక్క పోకడరాకడలను గూర్చి మనము తెలిసికొనగలము—క్రీస్తుమొదలు కారల్, మార్క్సువరకునుగల పాశ్చాత్యజిజ్ఞాసువులలో చాలమంది మూర్తులను జీవితకాలములో ప్రజలు గౌరవించలేకపోయిరి. పిమ్మటనే వీరి అస్తికలకై తపించుకొనుచున్నారు—భారతదేశములోని అనుభవము మరియొకరీతి నున్నది—ఐకోపాసం గ్రామానంతరపు రాజకీయజిజ్ఞాస—ఆదిని కుటుంబాధిపతిక్రింద జీవితమును ప్రారంభించిన వ్యక్తి నేడు యెక్కడ నున్నాడు?—ఆదిభారత, చైనా నాగరికతలు పతనమగుట—౧౮వ శతాబ్దమువరకును గల రాజ్యాంగపరిణామమునకు మూలరంగము; యూరపుఖండముగానే ప్రస్తుత మంగీకరించెదము—కుటుంబాధిపత్యమునుండి గణయాజమాన్యమునకు వ్యక్తి వచ్చుట—గ్రీకు ప్రజాస్వామ్యమునుండి పారిశ్రామిక యుగమువరకును గల రాచకీయభావపరిణామము నవలోకించుట—ఘనమైన యీ ఆధునికయుగమున వ్యక్తి యెచ్చట నున్నాడు?—దినదినము పెరిగిపోవుచున్న జాతీయతావరణములోని పెట్టుబడిదారుల యాజమాన్యమున బంధింపబడియున్నాడు అనుజవాబు వచ్చుచున్నట్లు కాన్పించుచున్నది—సమత్వము, స్వేచ్ఛ, సోదరత్వము అను త్రిమూర్త్యాత్మకమైన ప్రజాస్వామ్యమంత్రసిద్ధి ఇంకసుదూరముననే యున్నది—ఇందులకై నేటి ప్రజాస్వామ్యరాజ్యాంగముల విమర్శనాజ్యోతిక్రింద పరిశీలించవలసి యున్నది.

## 3. (౨౯౬—౬౩౮ పుటలు)

“ప్రజలచే—ప్రజలకొరకు నిర్మించబడిన ప్రజలయొక్క ప్రభుత్వము” అను సూత్రములోని పదార్థముల ఆయా దేశముల అనుభవములో విమర్శ— “ప్రజలచే” అమెరికాలో నీగ్రోలు, రెడ్ యిండియనులు మినహా ఒక దేశములో సర్వప్రజలకు ఓటింగుహక్కు లేకపోవుటవలన ప్రజలందరు ప్రభుత్వమును ఏర్పరుచుకొన్న ప్రతిష్ట దక్కుటలేదు—ఇక వోటింగు హక్కు గలిగిన ప్రజలయినను అచ్చట ప్రజాస్వామ్యము ఏర్పరుచుటను నిజముగాను బుద్ధిపూర్వకముగాను కర్తలా?—తాను ప్రతినిధిగా యెన్నకొనేవానిని ఓటరు బాగుగా తెలిసికొనగల్గుచున్నాడా?—అమెరికాలోని దుస్థితి—ఇంగ్లండు ఫ్రాన్సుదేశములోని అనుభవము—ఇక యీ ప్రజాస్వామ్య శాసనసభలలోని సభ్యులు ఎట్లు ప్రవర్తించుచున్నారు? పార్టీపద్ధతి—దేశమంతటను రెండు పక్షముల క్రింద—అనగా అనుకూలవ్యతిరేకపక్షములు—అను రెండు పక్షముల క్రింద విభజింపబడుటవలన కలుగు నష్టములు—Chance majorities—పక్షదాస్యము—మంత్రివర్గము—ప్రస్తుత ఇంగ్లండు, ఫ్రాన్సు మున్నగు దేశములలోని మంత్రివర్గములయొక్క అనుభవమువలన బ్రైస్ పండితుడు ప్రజాస్వామ్య మంత్రివర్గమునకును పూర్వనిరంకుశ ప్రభుత్వములోని మంత్రివర్గమునకును తేడా కొంచెమేనని అంగీకరించుట—ప్రజాస్వామ్యములలో గూడ దేశములోపల సంఘర్షనలు అశాంతియు హెచ్చుట — ప్రజాస్వామ్య మంత్రివర్గములు షావుకార్ల లాభమునకై అవసరమగు చర్యలతో పూర్వము మునిగియుండుట—జనసామాన్యస్థితినిగూర్చి వీరు యోచించుటకు పూనుకొనుటయి టీకల పరిస్థితులవలననే—ప్రస్తుత శాసనసభలలో గ్రంథము జరు

విధానము కాలయాపన వ్యయప్రయాసలు అనుభవజ్ఞులను ప్రభుత్వముతో సంబంధము లేకపోవుట జర్మనీ, ఐర్లండులోని ఆర్థికసంఘములు ఇటలీలోని శ్రేణీసంఘములు అమెరికాలోని National Recovery act—ఆస్ట్రేలియాలోని నూతన రక్షణ విధానము (New Protection) పోనీ రాజుల పాలనములోకంటె పన్నులు తగ్గినవా ?— అధికార భేషజములు, కార్యాలయ ఆడంబరములు తగ్గినవా ? బెంథం, మిల్లుపండితులు బోధించిన వ్యక్తిస్వాతంత్ర్యము యీ ప్రజాస్వామ్యములో ఎట్లు పరిణమించినది ?—అస్థి—స్వార్జితము—అను వాని నిర్వచనములు—పూర్వమే యిప్పటికంటె ఇవి ధర్మసమ్మతముగా నున్నవేమో ?—నవీన పారిశ్రామిక యుగములో వ్యక్తి స్వాతంత్ర్య సిద్ధాంతము మరింత దుర్వినియోగమగుట—ఇది యెటుల భ్రష్టమైనది—కాని ప్రస్తుత ప్రజాస్వామ్య విధానములలోని దోషములను తెలిసికొనుట గౌరవహానికాదు. ప్రస్తుత ప్రజాస్వామ్యాశ్యమము క్రిందకూడ జనసామాన్యము కొంత అభివృద్ధి పొందిన మాట వాస్తవమే—కాని జిజ్ఞాస ఆగిపోయినచో వృద్ధికూడ ఆగిపోవును—"రాజుగారి మంత్రులు" "మన మంత్రులు"—పైవిధముగా ప్రజాక్షేమము ప్రమాదించకుండునట్లు రాజ్యాంగవేత్తలు Checks and balances అను కొన్ని ఏర్పాట్లను చేసిరి—ఈఏర్పాట్లు సిద్ధాంతములో ప్రజాస్వామ్య సూత్రమునకు అవరోధకరములే—ఇవిశిష్టసభ (Upper house) వీటో అధికారము (Vetoing power)—సమాఖ్యావిధానములోని న్యాయస్థానములు—స్విజరులెండులోవలె శాసన సభ్యులను ఓటరులే ఆజ్ఞలిచ్చుట మొదలైనవి—ఇక్కడ Foot note లో స్థానిక స్వపరిపాలన విభాగములు ఎంత చిన్నవిగాయున్న అంత

ప్రజాస్వామ్య విజయమునకు తోడ్పడునను నవీన పాశ్చాత్య సిద్ధాంతముతో పూర్వ భారతదేశపు స్థానిక పరిపాలన విధానము పోల్చబడినది—కాని యీ Checks and balancesవలన సాధ్యములు (Ends) మరుగునబడి సాధనము (Means) లకే ప్రాధాన్యము కలిగెను—అందువలన గలిగిన దోషములు—ముఖ్యముగా ఆర్థిక జీవితపునర్నిర్మాణమునకు ప్రస్తుత శాసనసభలలోగల కార్యవిధానము—అంతరాయము గలుగజేయుచున్నవి. ఇందువలనే 1920 నుంచి ముఖ్యముగా యూరపుఖండ నాగరిక రాష్ట్రములలో రాజ్యాంగములగూర్చి అపరిమిత జిజ్ఞాస బయలుదేరినది—ఈజిజ్ఞాస సాధనములకు సంబంధించినది కాదు. సంఘము యొక్క మూలసూత్రములలోనికి ఇది దిగినది—19 వ శతాబ్దపు జిజ్ఞాసకును, నేటి జిజ్ఞాసకును గల ముఖ్యభేదమిదియె—బెర్నార్డుషా, వుస్సోలిని, రస్సెలు, లాస్కీ మొదలుగాగల జిజ్ఞాసువులు, పండితులు, రాజకీయనాయకులు నూతనశృతి—నమయమును సూచించుట — అందుచే ప్రస్తుతమున్న యీ ప్రజాస్వామ్య విధానమునే బట్టను అతుకులతోను కుట్లతోను వాడుటగాక నూతన సభ్యతను బట్టి పునర్నిర్మాణము చేయవలెనని ఆయాదేశములలో ఉద్యమాలు బయలుదేరుట—ఇటలీలో దీని పరిణామము—ఫాసిజమ్,—జర్మనీలో దీని పరిణామము—నాజీజమ్—సర్వాధికారులను విజ్ఞానవంతులైన యూరోపియను ఓటరులు ఏల అంగీకరించుచున్నారు?—ప్రజాస్వామ్య సూత్రములపై యెంత తిరుగుబాటు?—రామరాజ్యపు రోజులు యింకను పోలేదు—ప్రజలకు—రాజ్యధికారము కంటె ప్రజాశక్తిని కార్యోన్ముఖమున మేళగించి వారికి కూడు, గుడ్డను పెట్టగల ప్రజానాయకుడే నేటిదశలో అవసరమయ్యెను—ఆర్థికముగా

నిర్మాణకార్యక్రమమును రచించి (Planned Economy) అందు జాతిని ప్రవర్తింపజేయు ఉత్తమపురుషుని సర్వాధికారిత్వమే శ్రేష్ఠమను భావములోనికి నేడు కొన్ని దేశములలోని ప్రజలువచ్చుట—కాని యీ సర్వాధికారరాజ్యమున్ను సామ్యసాంఘిక స్వాస్థ్యముయొక్క భావి పరిణామమునుగూర్చి ఇప్పుడు ఎవ్వరును చెప్పజాలరు. పార్లమెంటరీ ప్రజాస్వామ్యప్రణిధానము, ప్రజాసృష్టిలో వెనుకబడుచున్నదనుట తథ్యము. మనభారత సాంప్రదాయభాగములో యీ పరిస్థితులు తెలుపబడినిచ్చుచో "వైశ్యశూద్రధర్మములు, వ్యక్తుల సంఘపరము చేయవలెనని సంఘర్షించుమన్నది" అని చెప్పవలసివచ్చును నేటి ఆర్థికజీవితము పురుషసర్మమునకు అవకాశముగా నుండుటయే ధర్మస్థాపనకు ఇప్పుట క్షేత్రముగల్గుటకు కారణము—పార్లమెంటరీ పద్ధతిని గూర్చి మితవాదులు మరియుటకు కాంగ్రెసువారు తీవ్రయోచన చేయక పోవుటయు విచారకరము—ప్రస్తుత భారతదేశపరిస్థితులలో కొంతవరకు స్థిరకార్యవర్గము పనికివచ్చునేమో. వ్యష్టివాదులును, సమిష్టివాదులును లక్ష్యములో ఐక్యము గలవారే.—కాని వద్ధ్యనముల వారిమధ్యగల భేదము సాధ్యములకు సంబంధించినదిగాని ముఖ్యముగా సాధనమునకు సంబంధించినది కాదు వ్యష్టిసమిష్టిసాధనలు కూడ సంఘపరిణామములోని వివిధదశలలో అవసరమగును. నేటిపరిస్థితులు సమిష్టిసాధనావశ్యకతను సూచించుచున్నవి. లక్ష్యఐక్యముల వ్యష్టి సమిష్టివాదుల మధ్యగల తీవ్రత్వము గూడ ఇంతటితో శమించు గాక.

---

## అధ్యాయము—౯. (౩౩౬—౩౮౨ పుటలు)



ప్రపంచమును ఏకోన్ముఖముగ మార్చే ఉద్యమాలు పరిస్థితులు—నానా జాతిసమితి—గుణదోషములు అంతర్జాతీయ కార్మిక సంఘము—సమాజవాదుల అంతర్జాతీయ సంఘము—విశ్వభారతి—అంతర్జాతీయ. సహకారసమ్మేళనము, తదితరఆర్థిక, రాచకీయ సాంఘిక, శిల్ప, సాగస్వత ఉద్యమాలు (బంతిఆటల జట్లుసహా)—ప్రపంచ ఐక్యతకై తపస్సుచేసే నేటి జిజ్ఞాసువులు, పండితులు. కవులు శిల్పకోవిదులు తపస్సు ఊరక పోవునా?—(విశ్వసమాజమనే చిత్తరువును. రచించాలనే పిపాసకీ రుట యేలాగు?—"కో మోహః—కశ్శోకః ఏకత్వమనుపశ్యతః" అనే శ్రుతితో శాంతి.



ఓం

# రాజ్యాంగవివేకము



## మొదటిభాగము—చరిత్రదీపిక

---

### అధ్యాయము—ఒకటి

౧

సృష్టియొక్క మూలమును గూర్చిగాని, మానవపరిణామమును గూర్చిగాని యిట మనకు పనిలేదు. మనకు కావలసినది మానవుల సామాజికజీవనమునకు సంబంధించిన ప్రభుత్వము—దానిఉత్పత్తి—దానిపరిణామము — వీటియొక్క కథ. భారతజాతి నీ మధ్యకాలములో నావరించియుండిన మానసిక దాస్యత నేఁడు తొలఁగుచున్నది. అందుచేతనే భావిభారత రాజ్యాంగమనే చిత్తరువును, సర్వతోముఖ సౌందర్యముతో రచించుకొనవలెనని యువకులన్వేషించుచున్నారు. ఇట్టితరుణములో యీ విమర్శయెంతయును ఉపపత్తివంతమైనది. మఱియు క్రమముగా తెలువబడు ఆయాదేశములలోని ప్రభుత్వవిధానములు, అవి ఆయాదేశములయొక్క పరిస్థితులను బట్టి యెట్లు ప్రవర్తిల్లుచున్నవియు తెలిసికొనుటకుముందు, ఈ ప్రపంచరాజకీయ భావపరిణామము (Evolution of Political ideas), తదనుశ్రుతమైన రాజ్యాంగపరిణామము

(Evolution of Constitutions) వీనియొక్క చరిత్రను దిఙ్మాత్రముగా నైనను తెలిసికొనుట యవసరము. అప్పుడే నేఁడు రాజకీయజగత్తులో జరుగుచున్న అపూర్వవిప్లవము యొక్క అంతరార్థము మనకు విశదముకాగలదు.

మానవోత్పత్తియైన తొలిరోజులలో సామాజికజీవన ముండెనా? అది యెట్లుండెను? అను విషయమునుగూర్చి మనకు నేఁడు—సంఘములు, సభలు, మంత్రివర్గములు, మత పీఠములు, కంపెనీలు మున్నగు—యెక్కడికక్కడ యల్లుకొని పోయిన సామాజిక జీవితలతాబంధన జన్యసంస్కారబద్ధమైన నేటి బుద్ధితో ఊహించుటగాని, విమర్శించుటగాని మిక్కిలి కష్టమే!

భారతవిజ్ఞానము, నాగరికతయు అతిప్రాచీనమైన వని—అనగా బాబిలోనియా, అస్సీరియా, ఈజిప్టు, ఛాల్డియాల యొక్క నాగరికతల కంటెను ప్రాచీనమైనవని నేఁడు కొన్ని దృష్టాంతములు కనబడుచున్నవి.[1]

కాని యింతవరకు జరిగిన పరిశోధనలన్నియు యీజిప్టు మున్నగుదేశములకున్నూ, యూరపుఖండమునకున్నూ ప్రథా

---

1. చూ. జయస్వాలుపండితుఁడు 1933 సంవత్సరమున ప్రాచ్య విజ్ఞానమహాసభలో యిచ్చిన అధ్యక్షోపన్యాసము. అందులో సింధుప్రవాహమునకు పూర్వముగల పాంచాల నాగరికతను పైదేశములవారు అనుకరించినట్లు దృష్టాంతపూర్వకముగా తెలుపబడినది. ప్రజాస్వామ్య, స్త్రీస్వాతంత్ర్యఉద్యమములు, వ్యక్తిపెట్టుబడి విధానములతో కూడిన నేటి నాగరికత

నముగా సంబంధించినవి. నేఁడు పరిశోధనవిద్యలో ముందంజ వైచుచున్న పాశ్చాత్యపండితులకు (కొందరికైన) మనస్సులో అజ్ఞాతముగా నైనను భారతదేశమువట్ల నిరసనభావముండుట మరియొకచిక్కు. ప్రాచీనచరిత్రను గూర్చి మనముచేయవలసిన చర్చలు ముఖ్యముగా ఈ యూరోపియన్ పండితులు యూరవు ఖండము, మధ్యయేషియాలలో శోధించి వ్రాసిన యంశముల పైననే ఆధారపడవలసి వచ్చుచున్నవి. కాని భారతీయవిజ్ఞానము ప్రపంచములో యింకను వ్యాప్తిపొందిన కొలఁదియు ఏకదేశముగా నుండిన పాశ్చాత్యపండితుల యొక్కయు, తదనుయాయులయొక్కయు దృష్టి నేటికంటె నధికముగా సత్యోన్ముఖము కాగలదని మా తలంపు.

"మర్కటములో నుండి మనుష్యుఁడు వచ్చినాఁడు" అను వాదము నిజమైనచో, మర్కటము నాటికే యీ మనుష్యునకు కుటుంబభావము (Family Consciousness) గలదు. ఈ మందలోని పెద్దకు (యీపెద్ద సామాన్యముగా మందను తనబాహుబలమువలన వశపఱచుకొనిన పెద్దకోతి) తక్కినవారందఱు లొంగియుండునట్లు భయప్రేరితమైన కట్టు

---

లవంటి అయిదునాగరికతలు బాబిలోనియాకు పూర్వమే వర్ధిల్లి, వాటి భావివికాసమునకు అవకాశము తగ్గినందున పతనమయ్యెనని ఫ్లిండర్సుపెట్రీ (Flinders Petrie) పండితుని సారాంశమును బెర్నార్డుషా అనువదించుచున్నాఁడు. (చూ. Political Mad house in America and nearer homes by G. Bernard Shaw P. P. 27.)

పాటు ఉండినది. ఇది క్రీ. శ. నకు కొన్నిలక్షల సంవత్సరముల పూర్వపుమాట.

మానవోత్పత్తి క్రీ. శ. నకు 25000 సంవత్సరములకు (అనగా 40—95 వేలకు మధ్య) పూర్వము జరిగినదని ప్రస్తుత పరిశోధకులమతము.[1] ఈ "పూర్వము" పూర్వమునకెంతయైన పొడిగించవచ్చును! ప్రభుత్వము అనునది ప్రథమతః కుటుంబ యజమానియొక్క పాలనలో బయలుదేరెను. అతఁడు సామాన్యముగా తండ్రి అయి యుండెను. కుటుంబము యొక్క యావత్తువ్యవహారములకును అతఁడే యధిపతి. అతఁడనిన కుటుంబమునకు భయము, భక్తి. అతఁడు కూర్చుండిన స్థలములో కూడ కూర్చుండుటకు కుటుంబములోని యితర సభ్యులు జంకుచుండిరి. చివరకు యీయన చనిపోయిన తర్వాతకూడ, జీవించియుండగా కుటుంబములో యీయన జరిగించిన హయాముయొక్క మహాత్మ్యమే యీయనను పితృ దేవతగా భావించి పూజించుటకు కారణమని యూహింప బడుచున్నది.[2] ఏకపితృజననమే యీకుటుంబసభ్యుల అన్యోన్య

1. చూ. వెల్సుపండితుని ప్రపంచచరిత్రము. పే. 36.
2. చూ. రామాయణకాలమునాటికి పితృవాక్పరిపాలన, మహాధర్మములలో నొకటిగా నుండెను. పైన తెలుపబడిన భయముతోకూడిన (పాశ్చాత్యపండితుల) పితృభక్తి సిద్ధాంతము వేదములకంత సమ్మతము కాదేమొ; "మాతృదేవోభవ, పితృదేవోభవ" అన్నది శిక్ష. పైగా 'పితృ' శబ్దమునకు సంస్కృతములో మాతాపితల కుభయులకు అన్వయమగును.

సంబంధము (Family tie) నకు కారణము. క్రమముగా కుటుంబములు పెద్దవియగుటకు, అన్యకుటుంబములోనుంచి వివాహములు జరుగుటకు కారణము. ఇందు మూలమున సాంప్రదాయములును, ఆచారములును, యిచ్చిపుచ్చుకొనుట కూడ జరిగినది.

పిమ్మట కొంతకాలమునకు కుటుంబయజమాని పాలనము, (Patriarchal system) కుల, లేక, వంశయాజమాన్యముక్రిందకు మారినది. ఇదియే "గణ" (Gens) లేక జాతియొక్క యజమాని పాలనముగా పరిణమించినది. ఇంతవరకును మానవసంఘములు స్థావరత్వమును (Static Condition) పొందలేదు. ఇవి చరావస్థలోనే యుండినవి. నిర్దిష్టమైన భూభాగములలో నివసించుచు, న్యాయశాస్త్రనిబంధనలతో జీవించుసంఘము "రాష్ట్రము"[1] అను నిర్వచనములోనికి అప్పటి సంఘములు యింకను రాలేదని పాశ్చాత్య పండితుల మతము. ఇది వారి మతప్రకారము క్రి. పూ. 10,000 సంవత్సరములకు పూర్వపుమాట. (భారతీయనిదర్శనములు యీయంశమును యింకను చాల ప్రాచీనమునకు నెట్టుచున్నవి.) అప్పటి సంఘమునందలి సంఘీభావమునకు మూలము కుటుంబ, కులములయొక్క విశాలపరిణామము వలనగాని, సమ్మేళనమువలనగాని యేర్పడిన (బహుళః ఏక

1. చూ. విల్సనుపండితుని "రాష్ట్రము" బ్లంచ్లీపండితుని రాష్ట్రసిద్ధాంతము.

గోత్రజమైన) గణ, జాత్యభిమానము, వారికిగల యేకవిధమైన ఆచారములు, అనుసరించుచున్న యేకరీతిగల నిబంధనలు, అనుభవించుచున్న యేకరీతిగల శీతోష్ణములు; వీనితోపాటు స్వతస్సిద్ధమైన—అన్యమునుండి కాపాడుకొనుటకు వ్యక్తికి ప్రకృతిదత్తమైన—"ఆత్మరక్షణ" భావమే (Instinct of self protection) యై యుండెను. కాని మధ్యయుగములో వలె కేవలమతాభిమానముకాని, ఆధునికయుగములోవలె నిర్దిష్టమైన దేశాభిమానముగాని సంఘీయులను ఏకకార్యోన్ముఖులనుగా చలింపజేయు (Incentive to common action) ఉద్దీపనముకాదు. కాని అప్పటికే వీరిలో రాజులు, అధ్యక్షులు, సంఘీయులు వీరందఱునుకూడి సంఘమునకై శాసనములుచేయుట మున్నగు రాష్ట్రలక్షణములు లేకపోలేదు. కాని అది రాష్ట్రము మాత్రముకాదు. దానిని రాచకీయార్థములో రాష్ట్రమనవలసివచ్చినచో అది చరావస్థలోనుండిన ప్రభుత్వము లేక "రాష్ట్రము" (Dynamic state) అనవచ్చును.

పిమ్మట వ్యవసాయమునందు మానవునికి అభిరుచి గలిగినది. ఇటునటుతిరుగుచు వేటమృగములను, కాయకసరులను, పోడు వ్యవసాయఫలితమును తినుచు; నిరంతరము "మజిలీలు" చేయుటయందు కొంత విసుగుకలిగినది. బుద్ధివికాసమునకును, వ్యవసాయాభిరుచికిని అన్యోన్య సంబంధముకలదు. వెంటనే యీ భూగోళముపై అనుకూల శీతోష్ణపరిస్థితులుగల్గి

ఫలవంతములైన భూభాగములను మానవసంఘములు ఆశ్ర యించవలసిన దశవచ్చినది. పైగా భౌతిక పరిశోధనలనుబట్టి పండితులచే నేఁడు అనుమానింపబడిన యీకాలపు భౌతిక విప ర్యయములు—ఉత్తరధ్రువహిమ ప్రళయములు, మరికొన్ని చోట్ల భూభాగములు జలమయములగుట, జలమునుండి కొన్ని భూభాగములు—అరేబియా యెడారివలె—బయటపడుట— మున్నగు పరిస్థితులవలన మానవసంఘములు యీ భూగోళ ములో ఒక స్థలమునుండి వేరొక స్థలమునకు వలసబోవుట జరిగెను. అందువలన వలసపోయిన భాగములోని సంఘము లకును, పైనుండి క్రొత్తగావచ్చిన వారికిని సంఘర్షణలు, భావ సంఘర్షనలును గల్గుట; అనంతరమందుండి నూతన సభ్యతలు, నాగరికతలు, విజ్ఞానములు బయలు దేరుట జరిగియుండును.

ఇప్పటినుంచియే మానవ సంఘములు రాష్ట్రములుగా (గంగానదీతీర ప్రాంతముల రాష్ట్రములు, మధ్యయేషియా రాష్ట్రము లిట్టివే యనవచ్చును) యేర్పడుట ప్రారంభించి నటులను, యిట్టి రాష్ట్రముల యుత్పత్తి తొలిదొల్త యీజిప్టు, మధ్యయేషియాలలోని బాబిలోనియా, అస్సీరియా, చాల్డియాలలో బయలుదేరెననియు పాశ్చాత్య శాస్త్రజ్ఞులలో కొందరి మతము. కాని "రాజు" "రాష్ట్రము" "ఎన్నికపద్ధతి" ("వరణము" చూ:—జెయస్వాల్ పండితుని ప్రాచీన హిందూ రాజ్యాంగము) అనునది ఋగ్వేదకాలమునాటికే భారతదేశ ములో రూఢమైనట్లు కన్పించుచున్నది. ఈవేదముల యుత్పత్తి

అధమము క్రీ. పూ. 10,000 సంవత్సరములకు పూర్వము జరిగియుండవలెనని పాశ్చాత్యపండితు లంగీకరించుచునే యున్నారు. మరియు పాశ్చాత్యుల మతప్రకారమే భారత దేశము యూరప్ ఖండము, యీజిప్టులకంటె ముందుగా సముద్రమునుండి పైకి తేలియున్నది.[1] అందుచే వేదకాలము నెంత వెనుకకు నిర్ణయింపబడిన భారతదేశపు రాజ్యాంగ చరిత్రకు అంతప్రాచీనత్వము సిద్ధించును. సిద్ధాంతములు దిన దినము తారుమారగుచున్న నేటిరోజులలో పాఠకులు కేవల బడి పుస్తకముల దాస్యమున బడియుండవలదని తెలుపుటకు మాత్రమే యీ యంశములను కేవల ప్రస్తుతములు కాక పోయినను యిక్కడ కొలదిగ తెలుపుటలోని యాశయమై యున్నది.[2]

---

1. చూ: బ్లాంఫర్డు పండితుఁడు మానవోత్పత్తి ప్రపంచ మంత టికంటెను భారతదేశములోనే ముందుగా జరిగినదని తెలుపు చున్నాఁడు. చూ:—Journal of-Royal Asiatic Society of Bengal (P. P. 144—145). చూ:—వెల్సు పండితుని "ప్రపంచ చరిత్రము" కూడ.

2. "దేవ" అసురనాగరికతలే ప్రపంచముయొక్క ఆది సభ్యతలు, నాగరికతలు అనియు, వీనినుండిగాని యీ ఉభయుల సంఘర్షణ ఫలితముగాగాని, హిందూ, యీజిప్టు, అస్సీరియా మున్నగు నాగరికతలు బయలుదేరినవనియు ఈపక్షమువారి మతములో మానవ నాగరికతయొక్క చరిత్ర యీజిప్టుకంటెను చాల పురాతనమైనదనియును నవీన వాదమొకటి గలదు.

మొదట మానవసంఘములన్నియు ఆచార నిబంధితములే! ప్రభుత్వాధికారము వంశపరంపరమైన హక్కుగా నుండెను. కొన్ని సంఘములు అన్యసంఘములతో గల్గిన యుద్ధములవలన తమ సంఘములో యున్న శ్రేష్ఠవ్యక్తిని నాయకునిగా యేర్పరచు కొనవలసిన అవసరము పిమ్మట గల్గినటుల కనిపించుచున్నది. ఇదియే యెన్నిక పద్ధతికి మూలమని తలపబడుచున్నది. వేదప్రామాణ్యముగూడ కొంతవరకు దీనిని బలపరచుచున్నది.

---

"ఆంధ్ర" శబ్దమునకును "ఇంద్ర" శబ్దమునకును "ఆన్త్రొఫాలజి" (Anthropology) లకును సంబంధము కనుపించుచున్నది. మరియు ఆంధ్రశబ్దము ఇట్టి చరిత్రలేని ప్రాచీనకాలమున (Pre-historic times) ఆది మానవజాతి పరమైనట్టిదిగా గాని, భారతదేశములోని ఆది నాగరికతగల యావత్తు జాతిపరమైనదిగాగాని యుండవలెననియు, నాఁడు దేశవ్యాప్తి గాంచిన యీ నామముక్రమేణా దేశములోని ఒక అంతర్భాగమునకును, ఒకజాతికిని చెందిన నామముగా తగ్గిపోయెననియు, క్రీ. శ. ప్రారంభములో ఆంధ్రులు గణప్రజాస్వామ్య పరిపాలనయే జాతిధర్మముగా గలవారై యుండిరనియు నామిత్రులు సుప్రసిద్ధచరిత్రకారులు, శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారితో నేజరిపిన సంప్రతింపు ఫలితముగా తేలిన యంశములనిట నుదహరించితిని. చైనాదేశములో కూడ యిటులనే ప్రాచీనకాలముననే సక్రమ రాజ్యపద్ధతు లుండినటుల చరిత్రశోధనలు తెల్పుచున్నవి.

---

౨

# ప్రజానిర్ణీత ప్రభుత్వములనుగూర్చి వేద, పురాణముల లోని నిదర్శనములు

ఇప్పటికి 2,400 సంవత్సరములకు పూర్వము వర్ధిల్లిన గ్రీసు దేశములోని నగరపౌరస్వామిక రాష్ట్రములతోడనే రాజ్యాంగచరిత్ర ప్రపంచములో ప్రారంభించెనని నిన్నటివరకును చాలమంది పండితుల మతము.[1] కాని వేదకాలమునాటికే పైన తెలిపినటుల రాష్ట్రములు భారతదేశములో వర్ధిల్లుచుండినవనుటకు నిదర్శనములు కలవు. అందునుగూర్చి విస్తృతమైన చరిత్రలింకను కాలగర్భమునుంచి బయట పడకపోయినను నవీన పరిశోధకుల ఫలితములు, ప్రభుత్వవిధానమునకేగాక ఎన్నిక ప్రభుత్వ (Elected Monarchical and Presidential systems) విధానమునకును, ఆదిమస్థానము భారతవర్షమేయనుటకు యవకాశము లిచ్చుచున్నవి. కాని కాలక్రమముగా రాజ్యాంగ పరిణామమునుగూర్చి తెలుపుటకై యుద్దేశింపబడిన యీదీపికలో భారత విధానములనుగూర్చి (చరిత్రలు యింకను తక్కువగానున్నందున) క్లుప్తముగా తెలిపి

---

1. చూ:—ఇంతకు పూర్వమే చాల్డియన్ ప్రజాస్వామ్యములు ఉండినట్లు కనుపించుచున్నను అవి నామమాత్రములని తలంపబడినవి. కాని Flinders Petrie పండితుని పరిశోధనలు, వేదాదిప్రమాణములు దీనిని విచ్ఛేదము చేసినవి.

పిమ్మట చైనా, అరేబియా గ్రీసువిధానములకు వచ్చెదము. ప్రాచ్యవిధానములను గూర్చి పాశ్చాత్య విధానములపట్ల జరిగినంత పరిశోధనయును, లభించినన్ని వివరములును యింకను లభ్యముకానందునను, సిద్ధాంతములింకను స్థిరపడనందునను చరిత్రశోధనకంటె ఉన్నచరిత్రనుబట్టి—ముఖ్యముగా పాశ్చాత్యవిధానచరిత్రలు, సిద్ధాంతములనుగూర్చి—ఆంధ్ర ప్రజాళికెఱుకపఱచుట యీగ్రంథముయొక్క ముఖ్యోద్దేశము గావునను, మేమునుకొంతవఱకు పాశ్చాత్యగ్రంథములు, వాని ఫక్కీనిబట్టియే యివి వ్రాయవలసివచ్చుచున్నది.

"ఈశానం," "సభ," "సమితి," "పరిషత్తు" మున్నగు శబ్దములు అతిప్రాచీనమైన ఋగ్వేదములోని వేదకాలపు ప్రజాస్వామ్యపరములు. ప్రజాస్వామ్యమనగా "ఎన్నుకొనబడిన రాజు లేక "అధిపతి" అనుఉద్యోగి సభాయుతుడై పరిపాలించుట అని ఇచ్చటి వివక్షు.

ఆకాలములో రాజశబ్దము ఉద్యోగపరము; అప్పటి రాజుయొక్క యెన్నికను గూర్చి వాడబడు పదము "వరణము[1]"

---

1. చూ:—"విశస్త్వా సర్వావాంచంతు"........."వర్మన్ రాష్ట్రియ, కకుదిశ్రయస్య. తతోన ఉగ్రోవిభజావసూని" ఋగ్వేదము (X 173–1 ౧౦–౧౭౩–౧) (సర్వప్రజలు నిన్నుఁ రాజును వాంఛించెదరుగాక) ఇట్టి ఉన్నతస్థానము ఆశ్రయింపుము అక్కడనుంచి ప్రకృతియొక్క ఐశ్వర్యమును మాకు ఉగ్రముగాపంచుము.) "దేవాసురావా ఏషు లోకేషు సమయతంత తాం స్తతో అసురా అజయన్......దేవా అబ్రువన్......

అనబడును. ఈశబ్దములు అప్పటి శాసనసభలు, వాని హోదా

అరాజతయా వైనో జయంతి. రాజానం వరవామహై తథేతి."
ఐతిరేయ బ్రాహ్మణము ౧–౧–౧౪ దేవతలును, అసురులును యీలోకమునందుయుద్ధము చేసిరి. దేవతలను అసురులు జయించిరి. అప్పుడు దేవతలిట్లనిరి. "రాజు లేకపోవుటవలన (అరాజతయా) వారుమనలను జయించుచున్నారు. మనము రాజును వరించెదము." అంతుల కందఱును "అలాగే" నని యంగీకరించిరి. "తే అయం విశాన రాజానం వృణేన" (ప్రజలు రాజును యేర్పరచుకొనునట్లు.)

ఇంతేకాక సమితిశబ్దము (సమావేశమగుట) రాజశబ్దము (ప్రజలను రంజింపచేయుట చేత వచ్చిన బిరుదము) వేదకాలపు ప్రభుత్వములు తత్వములో ప్రజాస్వామ్యములని సూచించుచున్నవి.

పిమ్మట ధర్మసూత్ర కాలములోని "తద్రక్షణ ధర్మిత్వాత్" ప్రజలను రక్షించుట యను ధర్మమును నిర్వర్తించుచున్నందువల్ల రాజునకు పన్ను లీయవలయును, అను వేదములకు పిమ్మట వచ్చిన గౌతమధర్మసూత్రములగల్లను "రాజు జీతగాడు, నూర్గురు ప్రజలు అతనికి అసమ్మతి తెలిపినచో ఉద్యోగమును వదలుకొనవలెను." అను శుక్రనీతివాక్యములవలనను—యితరపురాణానిదర్శనముల మాట యటుంచి కూడ—రాజు అనునది ప్రజాసమ్మతిని బట్టి చేసే ఉద్యోగమని శాస్త్రకారులు యెప్పటికప్పుడు స్పష్టపరచుచునే ఉన్నారు. అధర్వణవేదములోని పట్టాభిషేక భాగము కూడ యిందులకు నిదర్శనము. రామాయణములో రామునకు పట్టాభిషేకమునకు దశరథుడు పౌరజానపదుల అంగీకారమును కోరుట, లేక "సమావేశమైన నానానగరవాస్తవ్యులకును "పౌరజానపదుల"కును మతియొక అభిప్రాయమున్న

లను గూర్చి రుజువుపడుటయేగాక యవి అప్పటికీ దేశములో

---

యెడల దానిని తెలుపవలసినదనుట ; సగరుడు కాలధర్మము చేసిన వెనుక ప్రకృతిజనులు అంశుమంతుని రాజుగా నంగీకరించుట. [ప్రకృతిజనాః రాజానం రోచ యామాసుః అంశుమంతుం సుధార్మికమ్.) దేవాపికై సన్నద్ధముచేయబడిన పట్టాభిషేకము అతడు చర్మవ్యాధిగలవాడను కారణమున, బ్రాహ్మణులు, వృద్ధులు, పౌరజానపదులు సహా వానిని నివారించి (తమ్ బ్రాహ్మణాశ్చ, వృద్ధాశ్చ పౌరజానపదైసహా, సర్వేనివారయామసుః, దేవాపేరభిషేచనమ్ (ఉద్యోగపర్వం) దేవాపి సోదరుని రాజుగా నంగీకరించుట ; ఈసందర్భములో దేవాపి తండ్రి "అశ్రుకంఠు" డగుట తప్ప మరేమియు చేయజాలకపోవుట; యయాతి తన జ్యేష్ఠకుమారునకు మారుగా కనిష్ఠకుమారుడైన పురువునకు అభిషేచనము చేయబోగా పౌరజానపదులు జ్యేష్ఠుడు రాజు కావలెనని తిరస్కరించగా యయాతి వారలకు సమాధానము చెప్పి "తుష్టుల"ను చేసి, పిమ్మట పురువును ప్రతిష్టించుట ; (పౌరజానపదైః తుష్టైః ఇత్యుక్తోనహుషస్తదా, అభ్యషించత్ తతః పురుమ్ రాజ్యేస్వేసుతమాత్మనః (ఆదిపర్వము) మొదలయిన పౌరాణిక నిదర్శనములు కూడ యీ సాంప్రదాయముయొక్క చిరకాలానుసరణమును ఋజువు చేయుచున్నవి. మఱియు రుద్రదామనుడను రాజును గూర్చి "సర్వవర్ణైః అభిగమ్యరక్షణార్థమ్ పతిత్వేకృతేన" అని చెప్పబడిన క్రీ. పి. ౧౫౦ సంవత్సరపు గిర్నార్ శాసనమున్నూ, పాలరాజ్యస్థాపకుడయిన గోపాలుని "మాత్స్యన్యాయమ్ అపోహితమ్ ప్రకృతిభిః లక్ష్మ్యాః కరమ్ గ్రాహితః" (మత్స్యన్యాయరూపమయిన అరాజకమును పోగొట్టుకొనుటకై ; ప్రజలు రాజ్యలక్ష్మి యొక్క చేయిని

నాటుకొని యుండినట్లు తెలుపుచున్నవి[2]. మరియు "గణము," "గణాధిపతి," (President) అను వేదములోని శబ్దములు ఋగ్వేదమునాటికే భారతప్రజలకు రాజులేని ప్రజాస్వామ్య విధానముల (Republics) తో కూడ పరిచయము గలదని రుజువుచేయుచున్నవి. ఐతిరేయబ్రాహ్మణములోని "వైరాజ్య" పట్టాభిషేకము కూడ యిందులకు నిదర్శనమని పండితుల అభిప్రాయము[3]. ఈ వేదములు ఏథెన్సు ప్రజాస్వామ్యముకంటెను అథమము రెండురెట్లు వయస్సునందు పెద్దవను వాదమును యెవ్వరును కాదనజాలరు. వేదవిజ్ఞానమునుండి గ్రీకులు ప్రభుత్వపుపాఠములు నేర్చుకొనిరనుటకు నేడు ప్రబలసాక్ష్యము

---

పట్టించిరి,) అను ఖారింపూర్ శాసనమున్నూ కూడ యిందులకు మరింత ప్రత్యక్షనిదర్శనము. ప్రజానామేవ భూత్యర్థం సతాభ్యో బలిమగ్రహీత్" "ప్రవర్తతాం ప్రకృతిహితాయపార్థివః" అనే కాళిదాసవాక్యాలు కూడ అప్పటి భావగతిని తెలుపుచున్నవి. పై అంశములలో కొన్ని ఆర్. సి మాజుమ్‌దారుగారి "ప్రాచీన భారత సాంఘిక జీవనము" నుండి గైకొనబడినవి. మఱియు డాక్టరు "అనీబిసెంటు" గారి "రాజ్యాంగశాస్త్రము" అను గ్రంథములో ౧౮౭వ పేజీ కూడ ఈ సిద్ధాంతమును గూర్చి చూడనగును.

2. చూ:— "రాజానసత్యః సమితోరియానః" (యదార్థమైన రాజు సమితికి పోవునట్లు.)

3. "ఏకేచపరేణ హిమవంతం, జనపదా ఉత్తరకురవ, ఉత్తరమద్రా ఇతి, వైరాజ్యాయైవతే అభిషిచ్యంతే" ఐతిరేయ బ్రాహ్మణము 8—3—౧౪ హిమవంతమునకు పరమందున్న ఉత్తరకురు ఉత్తర

లేకపోవచ్చును. కాని ప్రాచీన భారత దేశము ప్రభుత్వవిధానము నకును, ఆకాలపరిస్థితులకు అనురూపమైన ప్రజాస్వామ్య విధానమునకును స్వతంత్రపీఠమని పైయంశములు, ముందు తెలుపబడు మరికొన్నియంశములును స్పష్టీకరించగలవు.

"సమితి" అనునది వేదములలో తఱచుగా వాడబడు చున్నది. రాజుసమితిచే నెన్నుకొనబడుట, సమితిచే తొలిగింపబడుట, తిరిగి మరియొక రాజు యెన్నుకొనబడుటయు కూడ వేదకాలములో జఱుగుచుండెను. రాజు సభకు పోవుచుండెను. "సమితి ప్రజాపతియొక్క పుత్రిక" యని వేదములలో చెప్పబడుటవలన దాని ప్రాచీనత్వమును, ప్రాముఖ్యతయును వెల్లడియగుచున్నది.

అట్టిదే "సభ" యని యొకటియుండెను. ఈ సమితికి సభలకుగల అప్పటి రాచకీయ సంబంధము తెలియుటలేదు. వేదకాలములో రాచకీయజీవనములకు గ్రామమే ప్రాతిపదిక "(Unit)." "గ్రామణి" అను గ్రామప్రతినిధి యీసభకు పోవుచుండెను. దీనినిబట్టి గ్రీకుప్రజాస్వామ్యమునాటికి గ్రీకులకు స్పష్టముగా తెలియని ప్రాతినిధ్యవిధానము (Representative Government) వేదకాలపు భారతదేశమునకు తెలిసియుండినటు లగపడుచున్నది. ఈ సమితి, సభలే "రత్నినులు" పరిషత్తులుగాను, పిమ్మట అనగా క్రీస్తుశకమునాటికి మారి

---

మద్రఆను జనపదములందు రాజులేని పద్ధతినే అభిషించనము చేయబడుచున్నవి.

నట్లు కనుపించుచున్నది. వేదకాలమునాటికి యీపరిషత్తు సభవారిపై "రాజునకు తిరస్కార అధికారములేదని" (Vetoing power) పండితులమతము. ఈ పరిషత్తు సభల వంటివే పురాణకాలములలోను, బుద్ధయుగములోను గలవు. రామాయణములోని "పౌర", "జానపదములు" అనునవి రాజ్యపరిపాలనకు సంబంధించిన సంఘములని జయస్వాల్ పండితునిమతము. కాని దీనిపై పూర్వపక్షము గలదు[1]! "పరిషత్తు సహాయములేనిది రాజు రాజ్యముచేయరాదు." అని శుక్రనీతి విధించుచున్నది. చాణక్యుని అర్థశాస్త్రము పరిషత్తునకు ప్రాముఖ్యమిచ్చుచున్నది. రుద్రదామనుని కాలమున పరిషత్తు సభవారు సుదర్శన సరస్సును ప్రభుత్వధనమునుండి మరమ్మతు చేయించరాదని తీర్మానించినందున, రాజు (రుద్రదామనుఁడు) స్వంతడబ్బుతో దానిని చేయించవలసివచ్చెనని శాసనము వలన తెలియుచున్నది. అశోకునివంటి చక్రవర్తికూడ ప్రజాధనమును బౌద్ధమతములకు విరివిగాఖర్చుపెట్టు చున్నందున, రాధాగుప్తుడను కోశాధ్యక్షునిచే నిరోధింపబడెను.

ఇట్టిసభమూలమున రాజుగాని, అధ్యక్షుడుగాని పాలన చేయు విధానము క్రీ. శ. 7 వ శతాబ్దములోని చాళుక్య చక్రవర్తుల పరిపాలనములోను క్రీ. శ. 16 వ శతాబ్దములోని శివాజీ ఛత్రపతి "అష్టప్రధాన్" విధానములోనుకూడ

1. చూ:—వినయకుమారసర్కారుగారి Political theories E. T. C of ancient Hindus.

బలముగా నాటుకొనినది. ఈసభ ధర్మపరిపాలనలో రాజునకు సహాయముచేయుటకు యేర్పడినది అనుటస్పష్టమే. ఎంత వరకు దీనికి ప్రజాప్రాతినిధ్యవు హోదాగలదు, అను అంశ మునకు సమాధానము అంత సులభముకాకపోయినను, వేదకాలమునాటి గ్రామణి మొదలు శుక్రనీతి నాటి "గ్రామ ప్రతినిధులకు యిందు కొన్నిస్థానములుండవలెనను నిబంధన," పిమ్మట క్రీ. పి. ౭ వ శతాబ్దములోని చాళుక్య రాజ్యముల లోని "నాడు" సభలవరకును, జనసామాన్యముతో యీసభ లకు యేకొద్దిపాటిగానైన సంబంధము కన్పించుచునే యున్నది. అయితే గణస్వామ్యసభలవంటి "వైశాల్యత" రాజస్వామ్యము లో, ముఖ్యముగా చంద్రగుప్తుడు వెలసిన — అతనికి పిమ్మట రాజస్వామ్యములలో కనపడకపోవుట సహజమే. క్రీ.శ. మొదటి శతాబ్దమునకు పిమ్మట బయలుదేరిన ఆంధ్రగుప్తసామ్రాజ్యము లతోబాటు గణప్రజాస్వామ్య విధానములు క్రమముగా నంత మొందినను, ఏదోవిధమైన ప్రజాభిప్రాయమును తెల్పుచు ప్రజా క్షేమమునకై పాటుపడే సభమూలముననే యీసామ్రాట్టు లైనను రాజ్యము చేయవలయునను సూత్రము మాత్రము క్రమముగా బలపడెను.[1] అందుచే "సభాయుతుడైన రాజు"

1. ప్రాచీనభారత పరిపాలనమునుగూర్చి పరిశోధించువారికి ఒక్క విషయము స్పష్టముగా గోచరించును. గ్రామము మొదలు కేంద్ర ప్రభుత్వము వఱకును సభాయుత పరిపాలనా పద్ధములే. ఇందును గూర్చి పాఠకులకు కొంత అభిప్రాయము యేర్పడుటకు

(King in Council), "సలహాతో ప్రభుత్వముచేయుట" (Government by advice) అను 12 వ శతాబ్దముకంటె ప్రాచీనముకాని యింగ్లీషు పార్లమెంటరీ సాంప్రదాయములు భారతదేశమున అతి ప్రాచీనకాలములో నుండిన నిబంధనలే.

---

కొన్ని యంశములను క్లుప్తముగా తెలుపుచున్నాము. ఉత్తరదేశములలో కులసంఘము, దానిపైన వృత్తులనుబట్టి లేక యావత్తు సంఘముపైనను యేర్పడిన శ్రేణీసంఘము, దీనిపైన నిర్దిష్ట భూభాగములోని పౌరస్వత్వము పైన యేర్పడిన "పూగా" అను సంఘము; వీటి అన్నిటికంటెను ఉన్నతమైనది, బహుశః ముందు తెలుపబోవు గణసభ అని పండితుల యభిప్రాయము. ఇఁక దక్షిణదేశములో చాళుక్యాది శాసనములబట్టి గ్రామములో బ్రాహ్మణ అగ్రహారసభ, దానిపైన "ఊరార్" (Urer) అను అందఱు వర్ణస్థులసభ, దానిపైన "నత్తార్" అను జిల్లాసభ, దానిపైన "నాడు" సభ అనునదియు యుండెను. ఒకప్పుడు "నగర", "నాడు" సభలు కలని జాయంటు సభలుగా వర్తకాది వ్యవహారముల నిమిత్తము యేర్పడుచుండెను. ఇవి కాక ఆయావృత్తులవారు తమ వృత్తులయొక్క పాలనరక్షణలకొఱకు వృత్తి సంఘములను (Guilds) గలిగి యుండిరి. అత్యవసర పరిస్థితులలో అగ్రహారములలోని బ్రాహ్మణుల సభవారు, మొదలు వృత్తిసభవారైన చాకలి, మంగళ్ల సభలవారుసహా సమిష్టి సమావేశములను జరిపి, విషయములను నిర్ణయించుటకూడ జరుగుచుండెను. కేంద్రప్రభువు యెవరైనను గ్రామమునుండి రాజధానివరకును గల యీస్థానిక పరిపాలనా సంఘముల యొక్కయు, వృత్తిసంఘముల యొక్కయు నిర్ణయములనుబట్టి పోవుటయే సాంప్రదాయము. ఇక దేవాలయ

ఈ సభావిధానము బౌద్ధమతీరంగములో మఱింత బాగుగ వికసించెను. బౌద్ధమత భిక్షుల మహాసభలలో తీర్మానములు (న త్తి) ఉపపాదించుట, అధికసంఖ్యాకుల అభిప్రాయములను బట్టి తీర్మానించుట, "శలాక" అనేటికెట్లపై "శలాక గ్రాహి" వోట్లనుపుచ్చుకొనుట (Voting by ballot) తీర్మానముల ఉపసంఘములకు (ఉబ్బాహిక) రిఫరుచేయుట, సమావేశములకు కనిష్టసంఖ్యానిర్ణయము (Quorum) మున్నగు నేటి ప్రజాపాలక సంఘములయొక్క లక్షణములు కాన్పించుచున్నవి.

---

ములు, మఠములు, ప్రత్యేక స్వపరిపాలనా సంఘములు. ఇవి పైగా విద్యావ్యాప్తి, శాస్త్రకళలకు నిలయములు. కొన్నిచోట్ల దేవాలయములు, తమనిధులనుండి గ్రామ సంఘములకు అప్పిచ్చు బ్యాంకులుగా కూడ నుండెను. ఈవిధముగా ప్రాచీన భారత వర్షమున గ్రామము మొదలు కేంద్రము వరకును సభాయుత పరిపాలనము కనుపించుచున్నది. పౌరులకు రాచకీయములలోనే కాక, పారిశ్రామిక, మత, విజ్ఞాన, అర్థిక జీవితములతోపాటు సాంఘిక జీవితములోకూడ ప్రాముఖ్యతయుండెను. దీనినిబట్టి చూచినచో ప్రాచీనభారత జీవితమునకును, "సంఘభావము" (Associated life) నకును అవి నాభావ సంబంధమున్నదని తేలుచున్నది. "మహాజనైసహ" "అశేషేపరిషత్ మదీయాం విజ్ఞాపనాం అవధార్య" "పరిషద్దక్షిణాం గృహీత్వా" అనే నిత్యస్మార్తకర్మలలోని మాటలుకూడ ఇందులకు నిదర్శనములు. ఇందునుగూర్చి విపులముగా తెలుసుకొనగోరు పాఠకులు రా. కు. ముఖర్జీగారి "ప్రాచీనభారతస్థానిక స్వపరిపాలనము" అను గ్రంథమును ముఖ్యముగా చదువవలెను.

కాని వేదకాలమునుండి క్రీ. పూ. ౭ వ శతాబ్దము వఱకును గల భారత రాజ్యాంగ చరిత్ర కేవలము పరోక్ష సాక్ష్యముపై ఆధారపడియుండుటచే దానిని యింకను నేటి యర్థములో చరిత్రయనుటకు వీలులేదని కొందఱి మతము.[1]

ఇక యిందునుగూర్చి ప్రత్యక్షసాక్ష్యముగల క్రీ. పూ. ౭ వ శతాబ్దమునుండియు గల చరిత్రను తగుమాత్రముగా తెలి

---

1. చూ :—వేదకాల నిర్ణయమే లక్షలకొలది సంవత్సరముల పూర్వమునుండి క్రీ. పూ. ౧౦౦౦౦ సంవత్సరముల వఱకును, భిన్న భిన్న మతములవారిచే చేయబడుచున్నది. వేదములలో రూఢమైన ప్రభుత్వపద్ధతులు. విస్పష్టచరిత్రగల క్రీ. పూ. ౬౦౦ వరకును, ఎట్టిమార్పులను పొందినదో అప్పటి ప్రభుత్వముల వివరములు రెటులుండినవో క్రీస్తు శకసన్నిహిత పూర్వమున మనము భారతదేశములో గాంచగల్గిన గణరాజ్యపద్ధతి ఈఅగాధ (అనగా వేదములుమొదలు క్రీ. పూ. ౬౦౦ ల మధ్యకాలము) కాలగర్భములో రెప్పుడు యేయే మార్పులనుపొంది ప్రవర్తిల్లుచుండెనో తెలుపుటకుగాని, ఊహించుటకుగాని చరిత్రకారు లింకను తగుస్థితిలో లేరు. కాని పరిశోధనలు చేసినకొలదియు, భారతదేశ చరిత్రయొక్క ప్రాచీనత్వము మరింత రుజువగుచున్న దనుటకు సందేహములేదు. "Dromusos" (బహుశః ధర్మరాజు) మొదలు శాంద్రకోటస్ (చంద్రగుప్తుని) వఱకునుగల ౬౦౪౨ సంవత్సరముల కాలములో భారతదేశములో గణప్రజారాజ్యములు మూడుపర్యాయములు స్థాపింపబడినవని క్రీ. పూ. 30౨ వ సంవత్సరములో మెగస్తనీస్ అను గ్రీకుయాత్రికుఁడు వ్రాసినది పై యంశములను బలపరచుచున్నది.

పెదము. క్రీ. పూ. ౭ వ శతాబ్దము మొదలు క్రీ. పి. ౧ వ శతాబ్దమువఱకును గల భారతదేశములోని గణప్రజాస్వామ్యములను గూర్చిన చరిత్రను వినయకుమార సర్కార్‌గారు మూడుభాగములుగా విడదీసియున్నారు.

---

మొదటికాలము క్రీ. పూ. ౬౦౦-౪౫౦

అంతకు పూర్వముండినవి పోగా యీ కాలములో చరిత్రలోనికి వచ్చిన గణప్రజాస్వామ్యములు గంగాతీరప్రాంత మందలివి. ఇవి ౧౧ రాజ్యములు. ఈ కాలములో చరిత్రాత్మకములైన మరికొన్ని గణరాజ్యములు భారతదేశపు ఉత్తర—తూర్పుభాగమున, అనగా ప్రస్తుత బీహారు రాజధానిలో విస్తరించియుండెను. పై ౧౧ గణములలో ౮ గణములను గూర్చి ముఖ్యమైన వివరము లింకను లభ్యము కాలేదు. వీరుసింసుమారపర్వతము కేంద్రముగాగల అలకప్ప రాష్ట్రీయులైన భగ్గులును, (Bhaggas) కాసపుట్ట నివాసులైన బలీయులును. (Bulis), (Kalamas), కాలములును, (Pippahalivala) పిప్పహలివల రాష్ట్రీయులైన మోరీయులును, (Moriyas) రామగామ రాష్ట్రీయులైన కోలీయులును, (Koliyas) మొదలైనవారు. కాని శాక్య, వాజీయ, లచ్ఛవి గణస్వామ్యములే యీ కాలమున ప్రాముఖ్యతగన్నవి.

---

శాక్యగణస్వామ్యము :—గౌతమబుద్ధుని తండ్రియైన శుద్ధోదనుని రాజ్యమిదియే! ఎన్నికవలననే శుద్ధోదనునకు ఈ "రాజత్వము" గలిగెను. శాక్యులు (౧౦) లక్షలసంఖ్యగల గణము. రాష్ట్రముయొక్క పరిపాలన, న్యాయనిర్వహణము మొదలగు ధర్మములన్నియు, యావత్తుపౌరులతో కూడిన మహాసభద్వారానే నిర్వర్తింపబడుచుండెను.

"రాజు" అని పిలువబడు రాష్ట్రపు ముఖ్యోద్యోగి ప్రజలందరిచే నెన్నుకొనబడుచుండెను.

"రాజ్యవ్యవహారమంతయు పెద్దపిన్నలతో కూడిన ప్రజాసభలో జరుగును. అది సాముదాయక ఉపయోగములలోనున్న మందిరములలో (Santhagara or Mote Hall) జరుగును. రాజైన 'పసేనది' (Pasenadis) యొక్క సూచనలను (Proposition) గూర్చి చర్చజరుగును. అంబాష్ట అను శాక్యుడు కపిలవస్తునకు పనిమీద పోవునపుడు శాక్యులందఱును సభచేసియుండిన యీ భవనమునకు పోవును." [1]

వాజీయుల సంయుక్తరాష్ట్రములు :—అంతకుపూర్వము ప్రత్యేకముగాను, స్వతంత్రముగాను నుండిన (౮) గణములు

1. చూ :—"సర్వాన్ శాక్యగణాన్ సన్నిపత్యేవ మీమాంసతే రాజాశుద్ధోదనః"
"శాక్యగణేనసార్థం శాఖ్యాగారేనిషణ్ణోఽభూత్" (రైస్‌దేవీస్ గారి బౌద్ధగ్రంథమునుండి జయస్వాల్‌గారి గ్రంథమున అనువాదితము బా. 1 పుట 60 లో అనువాదించబడినది).

కలసి సమాఖ్యరాష్ట్రముగా నేర్పడిరి. "విదేహ", "లచ్ఛవి", గణములవారు యిందు ప్రధానులు. విదేహులు పూర్వము "రాజస్వామ్యము క్రిందనుండిరి. అప్పుడు వారిరాజ్యము ౨౩౦౦ మైళ్లు విస్తరించెను. ఒకప్పుడు "లచ్ఛవి" గణములవారు ముగ్గురుప్రధానుల నెన్నుకొని (గ్రీకు ప్రజాస్వామ్యములోని అర్కానులవంటి ఉద్యోగీయులేమో వీరు), వారి ద్వారా ప్రభుత్వమును నడిపించుచుండిరి.

జయస్వాల్ గారి మతప్రకారము యీ సమాఖ్యవిధానము "లచ్ఛవి" "మొల్లకి" గణములమధ్య క్రీ. పూ. ౫౭౫ లేక ౫౭౭ లోగా నేర్పడెను. సమాఖ్యకార్యవర్గమునకు రాష్ట్రము ౧ కి ౯ గురు చొప్పున ౧౮ గురు ప్రతినిధులుండిరి. లచ్ఛవి పెద్దదియు, మొల్లకి చిన్నదియునైనను సభ్యరాష్ట్రముల ఆధిక్య, న్యూనత్వములనుబట్టికాక, రాష్ట్రములకు అన్నిటికిని, సమాఖ్య సెనేటుసభలో సమానప్రాతినిధ్యము యివ్వబడుచున్న నేటి న్యాయము, ౨౫౦౦ సంవత్సరముల క్రితము భారతవిధానములో కనపడుట ఆశ్చర్యకరమే. ఇందులోనుంచి ౯ గురు గణరాజులు [2] పాలకవర్గముగా నెన్నుకొనబడుదురు. లచ్ఛవి గణ

2. చూ :--ఈ సందర్భములో రాజశబ్దము ఉద్యోగపరమని మరింత స్పష్టమైనది. బౌద్ధవాఙ్మయము "రాజు" అను శబ్దములోను ఆఉద్యోగములోను గల ప్రజాసేవకధర్మము, ఉద్యోగ బాధ్యతను మఱింత విశదీకరించినవి. రాజశబ్దము ఉద్యోగపరమనుటలోను, భారతము శుక్రనీతియుకూడ సంశయించుటలేదు.

రాష్ట్రములో రాజులని పిలువబడు ప్రజాప్రముఖులు ౭౭౦౭ మంది శాసనసభ్యులుగా నుండిరి. వీరు కేవలము శాసనకర్తలే గాక రాజప్రతినిధులు, సేనాధిపతులు మున్నగు ఉద్యోగములలో నుండిరి. వీరు ఆచారములను, ధర్మశాస్త్రమునే గాక పరిపాలనా వ్యవహారములను—జాతిరక్షణ, యుద్ధము, సంధి, ధనము, మున్నగు నంశములను–గూడ చర్చించి నిర్ణయించుచుండిరి. ఈ మహాసభయొక్క కార్యవర్గము ౯ గురు (నవరత్నములను పేరున) మాత్రమే. వీరికి "గణరాయనులని" పేరు. రోమను గ్రీకు ప్రజాసభలలోవలె యిక్కడను యజ్ఞములు మున్నగునవి రాష్ట్రపక్షమున చేయబడుచుండెను. వైశాలినగర సరోవరముయొక్క ఉదకము శాసనసభ్యులపై పవిత్రతకొఱకు చల్లబడుచుండెను. సభాప్రారంభము మృగబలితో చేయబడు రోమన్ ఆచారము యిక్కడ కనబడుటలేదు.

---

బుద్ధప్రమాణములను యించుక యిట తెలిపెదము. ఆర్యదేవుడు చాటు శతకమున (క్రీ. పి. మూడవశతాబ్దము) రాజును "గణదాసు" అని వ్యవహరించెను.

"ధర్మేన పరిరంజతీతిరాజా" ధర్మముచేత సంతసింపచేయువాడు రాజు అనబడును). దీఘనికాయ (Vol. iii—౨౪-౯౩). మహావస్తుగ్రంథములో (Vol. I P. P. ౩౪౭—౪౮) మానవసంఘము ఆదిని తమ అధిపతిగా అంగీకరించిన వ్యక్తి "మహాజన సమ్మతుడు" అను నామముతో హోదాలోనికి వచ్చెను. "రాజు", "రాయను" ప్రాచీన ఆంగ్లసైరు సభాధిపతియైన "రీవు" గ్రీకు "అర్కను"లు, రోమన్ కౌన్సలులు"—యివి యన్నియు ఆనాటి ఉద్యోగపరమైన శబ్దములే.

వీరి న్యాయస్థానములు :—ఈవిధానములో ఒకదాని పై నొకటి యేడు న్యాయస్థానములుండెను. క్రిందివారు వ్యక్తిని నిర్దోషిగా వదలిన పై వారికి అప్పీలులేదు. క్రిందివారు దోషిగా నెన్నిన, పైస్థానములకు నిందితుఁడు అప్పీలునకుపోయి తన నిర్దోషిత్వమును స్థాపించుకొనవచ్చును. ఇది వ్యక్తిహక్కులను గాపాడుటకై రచింపబడిన అతివిశాలపద్ధతిగా గాన్పించుచున్నది. వీరిపైన తుదివరిష్కారము యెన్నికవలన యేర్పడిన రాజునది. ఈరాష్ట్రములు విశాల భూభాగమునకు సంబంధించినవి. స్థానిక ప్రభుత్వమును గూర్చి గణరాయనులును శ్రద్ధ తీసికొనుచుండిరి. స్థానిక వ్యవహారములలో అనగా విశ్రాంతి మందిరములు, తటాకములు, బాటలు మున్నగు నిర్మాణములలో ఉపసంఘములక్రింద స్త్రీ పురుషు లుభయులు పాల్గొనుచుండిరి.

రెండవకాలము—క్రీ. పూ. ౩౫౦—౩౦౦

ఈకాలపు గణప్రజా స్వామ్యములు [1] ఏథెన్సు, స్పార్టా,

1. చూ:—ఈగణ స్వామ్యములకు పేరు గణమునుబట్టి వచ్చినదా? లేక వారున్న దేశమునుబట్టి వచ్చినదా? లేక మొదట గణమునుబట్టి వచ్చి, క్రమముగా స్థావరత్వముగల్గిన పిమ్మట రాష్ట్రమునుబట్టి గణవ్యవస్థ (అనగా రాష్ట్రములో నివసించువారందరు ఒక గణమని) నిర్ణయింపబడినదా? అను ప్రశ్నలకు సంతృప్తికరమైన సమాధానము మాకింకను దొరకలేదు. భూభాగమునుబట్టి గాక గణమునుబట్టియే స్వామ్యమునకు నామము గల్గినదని

థీబ్సుతో సమకాలీనములైనవి. మాసిడన్ రాజైన ఫిలిప్, పైవాని స్వాతంత్ర్యమును నాశనము చేసినట్లే యివియు క్రీ. పూ. ౩౨౩ సంవత్సరములో మౌర్యసామ్రాజ్యమునకు తలయొగ్గినవి. కాని మౌర్యసామ్రాజ్య పతనానంతరము తిరిగి యివి తలలెత్తినట్లు కాన్పించుచున్నవి. మఱియు భారతరాజ్యాంగ పద్ధతిలో యివికూడ ఒకతరగతి విధానముగా రాజస్వామ్యవాదిఅయిన భారతములోను చాణక్యాదులచేతను అంగీకరింపబడుచున్నవి. ఈరాష్ట్రములు అలగ్జాండరుయొక్క భారతదేశపు దండయాత్రలను అతిశౌర్యముతో పోరాడి, నిరోధించి గ్రీకుచరిత్రకారుల ప్రశస్తిని పొందినవి. ఇందులో కొన్నిటిని గూర్చి యిట దెల్పెదము.

<u>పాలులగణస్వామ్యము</u>:—రెండు సుప్రసిద్ధవంశములకు చెందిన యిద్దరు ప్రధానులు ఒక ప్రముఖసభ (Senate) ద్వారా

---

వినయకుమార సర్కారుగారి మతము. జయస్వాలుగారు గణమునుబట్టి యేర్పడిన నామములు గావనియు, ఇవిదేశమే ప్రధానముగాగల్గి యేర్పడిన స్వామ్యములనియు ఈగణరాష్ట్రములలో బ్రహ్మక్షత్రాది వర్ణములుకూడ నుంట యిందులకు నిదర్శనమనియు తెలుపుచున్నారు. దేశనామములు, వ్యక్తులు ధరించు ఆచారము భారతదేశములో కలదు.

జయస్వాలుగారి, వాదమే సిద్ధాంతమగుచో "గణస్వామ్యమను" నది (ఒకరాష్ట్రములోని అఖిలప్రజా గణముయొక్క స్వామ్యము) నేటి "రిపబ్లిక్కు" అను శబ్దమునకు పర్యాయపదముగా వాడవచ్చును.

రాష్ట్రపాలనము జరుగుచుండెను. ప్రాచీన గ్రీసుదేశమంతటి లోను స్పార్టానగరము యెట్లు వీరనిలయముగా నుండెనో భారతదేశమునకు యీరాష్ట్రము అట్టిదని గ్రీకు చరిత్రకారులు వ్రాసిరి.

అరాట్టులు: —వీరికి అధిపతియే లేడు.

మాలవులు, సూద్రకులు:—[1] వీరు స్వతంత్రులైన జాతులవారు అని గ్రీకు చరిత్రకారులు వ్రాసియుండిరి. వీరుభయులమధ్యను నిరంతరయుద్ధములు జరుగుచుండినను గ్రీకులదండయాత్ర వచ్చినపుడు ఉభయులును సఖ్యపడిరి. ఒక గణములో నుండి మరియొక గణములోనికి వెయ్యిమంది కన్యలు పరిణయ

1. ఈ కాలము నాటి తదితరగణస్వామ్యములు.

Brachamanoi , Patala , Masicani

Ossadioi , Ambastha , Agra Sunis

Kshudraka , Malavas , Sibis

బీయాసునదీతీరమున ఘనమైన ప్రజాస్వామ్యము యోధీయ రాష్ట్రము : యీ ప్రభుత్వవిధానము ప్రశంసనీయముగా పని చేయుచున్నట్లు అరయాన్ అను చరిత్రకారుడు వ్రాసి యున్నాడు. వీరి మహాసభ ౫౦౦౦ మంది ప్రతినిధులతో కూడి యుండెను. ఈ రాష్ట్రములన్నియు శాంతిసౌఖ్యముతో వర్ధిల్లు చుండెననియు పరిపాలన ధర్మసమ్మతముగా నుండెననియు గ్రీకు చరిత్రకారులు వ్రాసిరి.

మున కియ్యబడిరి. ఇది రోమకచరిత్రలోని ప్లిబియన్, పట్రీషి యన్ కలయికతో కొంతవఱకు పోలియున్నది.

ఇంకను సరభసియులు (Sarabacai) అగతాసియ నులు (Agatasians) న్యాసియనులు. (Nyasians) మున్నగు గణములవారు ఈకాలమునకలరు. "యాదవ" గణమువారి స్వామ్యములు "స్వరాజ్య" లేక "స్వరాట్టు" అని పిలువబడు చుండెను ("చూ. జయస్వాల్.)

మూడవకాలము క్రీ. పూ. ౧౫౦—క్రీ. పి. ౩౫౦

యౌధీయులు, మాలవులు, అవుదుంబరులు మున్నగు వారు తమ "గణనామములతో" నాణెములనుగూడ రచించు చుండిరి. ("యౌధీయగణ", "మాలవగణ" అను పేరులతో). యౌధీయులు బియానునదీ తీరమునందలి ఘనమైన ప్రజా స్వామ్య రాష్ట్రమువారు. వీరి మహాసభ ౫౦౦౦ మంది ప్రతిని ధులతో కూడియున్నటులను ఈ ప్రభుత్వవిధానము ప్రశంస నీయముగా పనిచేయుచుండినటులను అరయాన్ అను గ్రీకు చరిత్రకారుఁడు వ్రాసియున్నాడు.

ఆంధ్ర సామ్రాజ్యము విస్తీర్ణతలో నుండిన ప్రథమ శతాబ్దములో మధ్యదేశీయులైన వర్తకులు, దక్షిణాపథము లోని ఆంధ్రరాజ్యములకు పోయినప్పుడు అచ్చటి రాజు ఉత్తర దేశరాజ్యములు యేవిధములైన పాలనము గలవని అడుగగా యావర్తకులు "గణములచే పాలింపబడునవియు, రాజుచే

పాలింపబడునవియు రాష్ట్రములు రెండు తెఱగులుగా నుండెనని తెలిపిరి.[1]

ఈ గణస్వామ్యములనగా వీరు అనాది సాంప్రదాయసిద్ధముగా ప్రజాసభల మూలముగానే పరిపాలనమునకలవాటుపడినవారు. ఇది వారి ప్రకృతిలోనేగల లక్షణము అనవలెగాని సిద్ధాంతబలమువలన తెచ్చుకొన్నదికాదు; పైగా యీ గణములు గ్రీకులవలెనే సైనికధర్మప్రధానములైనవి. క్రీ. పూ. 330–౫౦ లో మధ్య సముద్రగుప్తుని దండయాత్రలకు పిమ్మట వీరు తమ రాజ్యాంగ వ్యక్తిత్వమును నిలువబెట్టుకొనగలిగినను సామ్రాజ్యమునకు సామంతులుగా నుండి కప్పముల గట్టుచుండిరి.

దీనినిబట్టి చూచిన, భారతజాతిలో వేదకాలమునుండియు ప్రజానిర్ణీతప్రభుత్వములు కలవనియు, ఇవి ప్రాచీనగ్రీసు, రోములలోవలెనే గణముగాని, వానిలోని అంతశ్శాఖలుగాని, మూలముగా గల్గి Tribe as the unit వ్యాప్తిలో నుండెననియు, ఉభయదేశములలోను యీ గణస్వామ్యములు మతవిశ్వాసము, వీరధర్మప్రాధాన్యత, సమానధర్మములుగాగలవనియు, చివరకు విజేతలైన చక్రవర్తులదాడికి ఉభయదేశగణ ప్రజారాజ్యములు కొంతవరకు లొంగిపోయెననియు తెలియగలదు. యూరపుఖండము (౧౬) వ శతాబ్దమువరకును నిరంకుశరాజ

1. చూ:—“కేచిద్దేశాః గణాధీనాః కేచిద్రాజాధీనాయితి” (అవధానశతకమునుండి జయస్వాల్ పండితునిచే ఉదాహృతము)

స్వామ్యములో మునిగియుండెను. కాని భారతదేశపు రాజ స్వామ్యములో కూడ—క్రీ. పి. ౨౦౦ ల శతాబ్దములోని చాళు క్యరాజ్యములో వలె—స్థానికపరిపాలన ప్రజాయత్తముగ నుం డిన స్థలములు గలవు. ఇట్లే యూరపుఖండము సంపూర్ణ రాజ నిరంకుశత్వములో నుండిన కాలములో కూడ భారతదేశరాజ స్వామ్యములలో అనేకస్థలములందు ప్రజలకు పరిపాలనలో సంబంధము గల్గిన లక్షణములుండెను. కాని (౧౯)వ శతాబ్ద మునకు పిమ్మట యూరప్ఖండములో జాతీయతయు ప్రజా స్వామ్యభావములును ఆవిర్భవించెను. యూరపుఖండదేశములు స్వదేశీరాజుల పాలనములో నుండెనుగాన ఆ భావములు అచ్చట వృద్ధిచెందినవి. యూరప్ఖండమునకు అంతఃపూర్వ ము తెలియని విజ్ఞానమేగాక—రాచకీయములో— జాతీయత కును, [1] ప్రజాస్వామ్యములకును అనువైన పరిస్థితులు భారత దేశమునకు, క్రీస్తుశకపూర్వమే యుండినను, విజాతీయదాస్య ము వృద్ధియగుటచే అవి క్రమేణ వృద్ధియగుటకు మారుగా

1. చూ :...పూర్వ భారతీయుల హృదయములలో ఆశేతు సీతన గరపర్యంతము యేకజాతీయభావము ప్రవహించుచుండెననుటకు గల మత, సారస్వత, సాంఘిక సాక్ష్యములును, ఒక మూల వారితో మరియొక మూలవారికి సంబంధము బలపడునట్లు నిర్మిం పబడిన దేశపుయాత్రాస్థల నిర్మాణము మున్నగు ప్రమాణములు కలవు. ఇందునుగూర్చి యీ రోజునకూడ సంశయమానసులు ఉన్నచో రా. కు. ముఖర్జీగారి "భారతఐక్యత" అను గ్రం థము చదువనగును.

సన్నగిల్లినవి. కాలపరిస్థితులను బట్టి భారతదేశము తిరిగి తన స్వావ్యక్తిత్వమును అవలోకించుకొని, తాను "యిదివఱలో" ప్రపంచరాజ్యాంగ చరిత్రకేమైనను కానుకలనర్పించి యుంటినా? అని సింహావలోకనము చేసికొనుటకే భారతదేశమునకు యీారప్ కంటె మరి (300) సంవత్సరములు హెచ్చుకాలము పట్టినది.

పైన తెలిపినటుల యీ గణస్వామ్యములన్నియు, సర్వప్రజాయుతమైన పౌరసభలతో గాని లేక పౌరప్రముఖులసభతో గాని కూడియుండెను. వారి వారి ప్రత్యేకపరిస్థితులనుబట్టి యెన్నుకొనబడిన ఒకరు, లేక యిద్దరు "గణరాయనులు, యీా స్వామ్యములకు అధిపతులు. కొన్నిస్థలములలో శిష్టులతో కూడిన మరియొక సభకూడ (పైన తెలిపిన పౌరసభకాక) యుండెనని జయస్వాలుగారి మతము.

ప్రాచీనభారతీయ రాజ్యాంగచరిత్రను గూర్చి ఇంతటితో మనము ప్రస్తుతము సంతృప్తి నొందవలసియున్నది.

---

## ౪

## ప్రాచీన చైనావిజ్ఞానము—ప్రపంచభావపరిణామములో దాని స్థానము.

---

భారతవిజ్ఞానమునకు పిమ్మట పేరెన్నికగన్న ప్రాచ్య విజ్ఞానములు మరిరెండు—చైనా, అరేబియాలవి. ప్రపంచపరముగా రాచకీయభావపరంపరలగతిని తెలుపబూనిన యీ గ్రంథమునపై విజ్ఞానములుకూడ రాచకీయముగా నేటి ప్రపంచమున కిచ్చిన కానుకలను గూర్చి తెలుపకుండజాలము. ఇచ్చట చైనాను గూర్చి తెలుసుకొందము.

చైనా దేశమునకు క్రీ. పూ. ౨౪౦౦ సంవత్సరములనుండి చరిత్ర కనబడుచున్నది. [1] క్రీ. పూ. ౨౩౫౭–౧౧౩౫ వఱకును చైనాభిన్న తెగలవారి సంచారస్థలముగా నుండి యింకను స్థిరావస్థకు రాలేదు. క్రీ. పూ. ౧౧౩౫–౭౭౧ వరకు చైనా ఫ్యూడల్ స్వామ్యముక్రింద యుండెను. గ్రీకు, రోమను ప్రజాస్వామ్యమునకు అనంతరము చాలకాలమునకు పిమ్మట మధ్యయుగములో యూరపుఖండమునకు కలిగిన ఫ్యూడల్ దాస్యత చైనాకు అంత ప్రాచీనములోనే గల్గినది. కాని యీ ఫ్యూడల్ విధానములో చైనాయొక్క నాగరికత అభివృద్ధిలోనే యుండెను. క్రమముగా యీ ఫ్యూడల్ దాస్యత నన్న

---

1. చూ :—లియాం-చీ-భో పండితుని "చైనా రాచకీయభావాల చరిత్ర"

గిల్లినకొద్దియు, చైనా సరిహద్దులలోనున్న సిన్ (Tsin), చ్యూ (Cheu) మొదలైన తెగలవారు దేశమునంతను తమ సర్వాధికారములో నుంచుకొనుటకు కృషి సల్పుచువచ్చిరి. దీనినే సరిహద్దుల తెగలవారు చైనాలో దొరబడుటకు ఉద్యమించిన కాల మందురు (Period of Aggressor) క్రీ. పూ. ౭౭౧–౨౨౭). అటు పిమ్మట దేశము ఉదారవంతులైన చక్రవర్తుల పాలనలోనికి వచ్చెను. (౭౦౮–౨ ౨౨ క్రీ. పూ). ఈ కాలములోనే "చీ" (Chi) రాష్ట్రములో క్వాన్ చెంగున్నూ, చెంగు రాష్ట్రములో జ్యూచెన్ (Tzuchan) న్నూ అను యిద్దరు యీ కాలపు రాజ్యాంగవేత్తలు ప్రవేశపెట్టిన విధానములు బాగుగ నాటుకొనినవి. దేశమంతయు ఉన్నతవంశీయులైన గవర్నరులస్థానికాధిపత్యములో యుండెను. అన్ని రాష్ట్రములు యేకరీతి విధానము కలవికావు. ఒకవిధమైన నిరంకుశ విధానమే అప్పటిపద్ధతి.

దేశము క్రీ. పి. ౧౨౦౦ శతాబ్దమువఱకును ఉదారవంతులైన దేశీయచక్రవర్తుల పాలనలో నుండెను. విశే (Sung) సంగువంశీయులు క్రీ. పి. ౧౨౧౪ లో ఝంగీస్ ఖాన్ యనే (మంగోలియా అధిపతి) దండయాత్రల వలనను, అటు పిమ్మట ౧౨౭౮ వ సంవత్సరములో అతని మనుమడయిన కుబ్లయిఖాన్ (Kublai Khan) దండయాత్రలకును బలియై, పెకింగు, క్యాంటన్ రాజధానులుసహా చైనా, మంగోలీయుల ఆధిపత్యములోనికి వచ్చెను. ఈ మంగోలియా దండయాత్రల

నాటికే చైనాప్రజలలో మాతృదేశాభిమానము లెస్సగా కనుపించుచున్నది.

౧౪వ శతాబ్దముయొక్క ఉత్తరపాదములో మంగోలులను తొలగించి మింగ్ వంశీయులు దేశయాధిపత్యమును స్థాపించిరి. వీరి కాలములో చైనాదేశము విజ్ఞానములో పొందిన ఉచ్ఛస్థితి తెలుపుటకు ఒక్క నిదర్శనము (౧౫౦౦ మైళ్లు పొడవుగల అప్పటి దేశముచుట్టు కట్టబడిన పెద్దకోట; సుమారు ౯౦౦ మైళ్లు పొడవుగా త్రవ్వబడిన రహదారీ కాల్వగాక) తెలిపిన చాలును. చైనా యొక్క సారస్వతసర్వస్వము అనుపేరిట కన్ఫ్యూసియస్ సిద్ధాంతములు, చరిత్ర, వేదాంతము, వాఙ్మయము, ఖగోళశాస్త్రము, భూగోళము (Cosmogony)— వైద్యము, కేరళము, బుద్ధమతము, తోమతము, చేతిపనులు, కళలు వీటినిగూర్చిన యావదంశములును ఒక మహాగ్రంథముగా కూర్చబడినవి. ఇందు రెండువేలమందికి పైగా పండితులు నియమింపబడిరి. ఈగ్రంథము ౨౨౯౭౭ భాగములుగలదియు, దీని యిన్డెక్సు అరువదిఖండములు కలదిగాను ఉండెను. ౧౧౦౦౦ సంపుటములుగల యీగ్రంథము అరంగుళము దళసరిలో, అడుగు మెనిమిది అంగుళముల పొడవున, ఒక అడుగు వెడల్పు మాత్రము కలదిగా నుండునట్లు రచింపబడెను. ఇందలి పత్రములు ఒకదానిపై నొకటి మామూలుగా పెట్టినయెడల ఇంగ్లండులోని సెంటుపాల్ శిఖరముకంటె యెత్తుగా నుండును.

చైనా దేశము క్రీ. పి. ౧౭౦౦ శతాబ్దపు రెండవపాదములో మంచూసామ్రాట్టునకు వశమై, అటుపిమ్మట క్రీ. పి. ౧౯ వ శతాబ్దాంతమునుండియు పాశ్చాత్యదేశములవారి వర్తకసంబంధమైన ఆధిపత్యములకు కూడ లోనయ్యెను. ఇట్టి రాచకీయ, ఆర్థికదాస్యతలో నుండిన చైనా దేశములో జాతీయోద్యమము విజృంభించి ౧౯౧౧ సంవత్సరములో సన్యత్ సేను నాయకత్వమున మంచూసామ్రాజ్యమును అస్తమింపచేసినను చైనా స్థాపించిన ప్రజాస్వామ్యము యింకను స్థిరపడలేదు.

ప్రపంచరాచకీయపరిణామములలో చైనాయొక్క స్థానమెచ్చట? ఏథెన్సు, రోములవంటి ప్రజాస్వామ్య విధానాలుగాని, ప్రాచీనభారతదేశములోని సభాయుత రాజపాలనములుగాని, గణప్రజారాజ్యములుగాని, విశాలమైన బౌద్ధయుగములోని పాలనవిధానాలుగాని, అచ్చట ప్రాచీనమున యుండినట్లు చరిత్రనిదర్శనములు కనుపించనిమాట వాస్తవమే. చైనాపౌరుని జీవితమునకు మూలము కుటుంబము. అచ్చట భూమికూడ కుటుంబములవారీగా పంపకముచేసికొని పాటువడుట ఆచారము. అచ్చటి గ్రామమనగా వ్యక్తుల సమూహముగాక కుటుంబముల సమూహము. ఈకుటుంబప్రేమయే చైనాపౌరుని మానసికవికాసములో విశ్వప్రేమగా పరిణమించినది. పరసహనము, పరప్రేమ చైనా జిజ్ఞాసువులు జాతికి జీర్ణము చేసిన ఔషధములు. అందుచేతనే ౪౯ కోట్ల జనసంఖ్య గలిగి ౨౮ లక్షల ౪౬ వేల చతురపుమైళ్లు వైశాల్యముగలిగి, భిన్న

నాగరికతలు, భిన్న తెగలవారి దండయాత్రలకు లోనైన చైనాదేశము తనవాటిని వదల లేదు, పైనుంచి వచ్చిన వానిని త్రోసివేయ లేదు. కావుననే ఇది మధ్యకాలపు యూరపుఖండమువలె భిన్న, భిన్న రాష్ట్రములుగా చీలిపో లేదు! లేక భిన్నసభ్యతలను, ఆచారములను ఏకరూపముగా భుక్తముచేసికొని, పూర్ణజాతీయతగా బయలుపడనూ లేదు. ఇదియే వర్తమానచైనాయొక్క, ప్రాచీనచరిత్రపై ఆధార పడిన రూపము.

కాని ప్రాచీనచైనాది సిద్ధాంతజగత్తు. ముఖ్యముగా నైతిక దృష్టి, నైతికముపై ఆధారపడిన రాజ్యాంగ జీవితము చైనా దేశముయొక్క ప్రత్యేక కానుక. నేడు ప్రపంచమును కలవర పఱచుచున్న రాచకీయసమస్యలలో ముఖ్యమైన వాటిని గూర్చి క్రీస్తుశతాబ్దమునకు పూర్వమే చైనాలో శ్లాఘ్యముగా జిజ్ఞాస చేసిన—ఇప్పటివలె భౌతిక హేతువాదదృష్టితో కాకపోయి నను—తత్త్వవేత్తలు కలరనుట చైనాకే కాక ప్రాచ్యఖండీ యుల బుద్ధివైభవమునకు కూడ గొప్ప నిదర్శనము. అట్టి జిజ్ఞా సలను కొన్నిటిని సంగ్రహపఱచెదము.

చైనా యొక్క ఉత్తమ జిజ్ఞాసువులు క్రీ. పూ. ౫౩౦—౨౩౦ లోవుగా బయలుదేరిరి. వీరిలో ముఖ్యసిద్ధాంత ములవారిని నలుగురను పేర్కొనెదము.

<u>కన్ఫ్యూసియస్ (Confucius) క్రీ. పూ. ౫౫౨—౪౭౯</u>

ఈయన చైనాకు వ్యాసపీఠము. చైనా ప్రజామానసిక తత్త్వ

ములో అపరిమిత సంస్కారముగావించి నేటికిని చైనాప్రజల హృదయములో రాజ్యముచేయుచున్న వ్యక్తి. సంఘమంతయు సౌభ్రాతృత్వముపైన ఆధారపడినదని యీయనబోధ. కుటుంబములోని వ్యక్తులకు మధ్యగల ప్రేమకు చరమ వికాసరంగము, అఖిలలోకప్రేమ; ఇట్టి ఉన్నతాదర్శమును అట్టి ప్రాచీనకాలములో చైనా ప్రజలయెదుట పెట్టకలిగెను యీయన. రాచకీయ జీవితమునకు నైతికము ఆధారము. సుగుణవంతుని రాజ్యమే ఆదర్శనీయము. అట్టివాడు తన అనుష్ఠానబలమువలననే ప్రజాహృదయములలో మార్పుగలిగించగలుగును. శరీరపీడన పూర్వకమైన శిక్షకంటె (Sanction) పరస్పరప్రేమయు, నైతిక ప్రవర్తనను వికసింపజేయు విద్యయే పౌరునకు అవసరము. అందుచే ప్రభుత్వమనునది శిక్షణపైన గాక పాలకుని సుగుణములపైనను ప్రజలలో నీతి, ప్రేమలను వృద్ధిపొందించే విద్యపైననే ఆధారపడవలెనని యీయన సిద్ధాంతము. "ఒకసుగుణరాసి ౧౦౦ సంవత్సరములు రాజ్యము చేసినచో రాజ్యమునుండి, హింస, క్రూరత్వములు తొలగి పోగలవు" అని యీయన చెప్పినది యీ గాంధీయుగమునకు మేళగించుచున్నది. "నీతిఅనునది, నేరమునకు సంబంధించిన ఆలోచన మనుష్యునిలో కలిగినతోడనే, దానిని అరికట్టుచున్నది. శాసనము అనునది నేరముజరిగిన పిమ్మటగాని అట్టి దానిని అరికట్టజాలదు." మొదటిది శ్రేష్ఠముకాదా? అనును యీయన. ఈయన పరిభాషలో ఈప్రేమ, (అనుతాపము) అను

దానిని "జన్" (Jen) అని పిలచును. ప్రతీకారమును ఈయన ఒప్పడు. ఈయన ప్రజలకు ఆర్థిక, రాచకీయ సమత్వమును ప్రతిపాదించును. కాని నైతిక దృక్పథమునుబట్టియే. యీయన దర్శనములలో గొప్పదైన విశ్వమానవ అయిక్యతను గూర్చిన దర్శనము యీ క్రింద చూడనగును. "ఈ మహాత్సిద్ధాంతము (Jen) అమలునకు వచ్చినపుడు ప్రపంచములోని యెల్లరును సంఘలాభముకొరకే పనిచేయుదురు. సత్పురుషులు అధికారులుగా నెన్నుకొనబడెదరు. సమర్థులకే ఉద్యోగబాధ్యత యివ్వబడును. కృతజ్ఞత అనునది సాధారణ ధర్మముగానుండును. సామరస్యత రాజ్యముచేయును. ఇందువలన యావత్తు మానవజాతియు తమ తల్లిదండ్రులను ప్రేమించెదరు. వృద్ధులు పోషింపబడుదురు. యువకులు పాటుబడుదురు. పసికూనలు, వితంతువులు, అనాధలు, అవివాహితలు, అసమర్థులు వ్యాధి పీడితులను గూర్చి జాగ్రత్త తీసికొనబడును. పురుషులకు హక్కులుండును. స్త్రీలు గృహాధిపత్యమును గలిగియుందురు. పదార్థములు వృథాగాపోవు. వ్యక్తి వాటిని స్వంతముకొఱకు నిలువ చేసికొను నవసరముండదు. ఒడలుదాచుకొనుటగాని, శక్తిని వ్యక్తిలాభముకొఱకు ఉపయోగించుకొనుటగాని ఉండదు. స్వార్థముపోవును. దొంగతనము, అల్లరి అననేమో యెఱుగని స్థితిలో సంఘముండును. అందుచే యిండ్లతలుపులు వేసికొనుటయే అవసరముండదు. ఇట్టి స్థితియే మహాసంఘవ్యవస్థ

(Great commonwealth) అనెదరు." [1] ఈరచనయే చైనాజాతియొక్క రాచకీయ, ఆర్థిక భావములయొక్క వైశాల్యతకు నిదర్శనము.

పదార్థముఃయొక్క తత్వము దానియొక్క రూపము వలన స్ఫుటముకావలెనని యీయన సిద్ధాంతములలోనొకటి. దీనినే "నామసంస్కారము" (Rectifying of names) అనెదరు. అందులకే చైనాభాషలో ఒకశబ్దము చూచుసరికి దాని అర్థముకూడ శబ్దమునఃబట్టియే గోచరించును.

"ఆత్మవత్సర్వభూతాని" (నైతికవీక్షణతో) అనే యీ కన్ ఫ్యూసియఃస్ తత్వముఃఈయన శిష్యుల చేతులలో రెండు శాఖలుగా వీడినది. వీరు మెనిపియఃస్ (Mencious 372-289 B. C.), హసన్ జి (Hsuntze 335-288 B. C.) అనువారలు ; కన్ ఫ్యూసియస్ మానవస్వభావము అభ్యాసము వలన చెడిపోయెనను నమ్మికపై సదభ్యాససిద్ధాంతమును బలపఱచెను. వీరిలో మెనిపియఃస్ మానవస్వభావము పుట్టుకలోనే మంచిదనియు, హసన్ జి చెడ్డదనియు నమ్మిరి. ఈనమ్మికలకులోబడి వీరుభయులు జీర్ణముచేసుకొనిన కన్ ఫ్యూసియస్ సిద్ధాంతములు భిన్నమతములకు తావిచ్చెను. మెనిపియస్ ప్రజాస్వామ్యసిద్ధాంతములను బాగుగా బలపఱచెను. "ప్రజలు మొదటివారుగను, రాష్ట్రము రెండవదిగాను, చక్రవర్తి ఆఖరు

1. లీయున్ గ్రంథమునుండి Ch. P. T—88 వ పుటలో అనువాదితము.

వాడుగను" ప్రాముఖ్యతలు గణింపబడవలెను. ప్రభుత్వము యొక్క ధర్మము "ప్రజలకు కావలసినవి యిచ్చుట, వృద్ధిచేయుట, వారికష్టమయినది తగ్గించుట" "రాజుతో ఒక వ్యక్తి మంచివాడు, సమర్థుడు అని తనసభలో ఉద్యోగి చెప్పినపుడు అది అబద్ధము కావచ్చును. కాని ఆమాటనే ప్రజలందఱును చెప్పినపుడు నీవు, (రాజు), అందునుగూర్చి యోచించి, అట్టి వానిని ఉద్యోగములోనికి తీసికొనవలసియుండును." "అయోగ్యుడయిన రాజు, రాజు కాడు. సామాన్యమానవునివలె అతను పదచ్యుతుడుగా చేయబడవలెను", ఇట్టివాక్యములు ప్రాచ్యఖండీయులు ప్రజాస్వామ్యభావాలకు క్రొత్తవారు కారని వెల్లడి చేయుచున్నది. కన్ఫ్యూసియస్‌న్ను, మెన్షియస్‌న్ను కూడ ప్రయోజనము అపేక్షించి కర్మచేయరాదనుటలో ఆదిభౌతిక సుఖవాదము (Utilitarianism) నకు వ్యతిరేకులైరి. నైతిక ప్రోద్బలము కర్మకు ప్రేరకము కావలెనని కన్ఫూసియస్ అనిన, ధర్మప్రోద్బలమున (Righteousness) కర్మచేయవలెనని మెన్షియస్ అనును. అందులకే ధర్మముకొఱకయి అధర్మప్రభుత్వముపై తిరుగుబాటునుకూడ మెన్షియస్ అంగీకరించవలసి వచ్చినది. మెన్షియస్ ప్రయోజనవాది కాకపోయినను కేవలము నీతివలన లాభములేదనియు, సంఘములో ధర్మము ప్రవర్తిల్లవలెననిన, ప్రతిమనుష్యునియొక్కయు జీవితావసరములను ప్రభుత్వము సంతృప్తిపరచ గలిగినపుడే కన్ఫ్యూసియస్ తెల్పిన వ్యక్తివికాసమే (Development of perso-

nality) ప్రభుత్వాలక్ష్యమనే సిద్ధాంతము అమలు జరుగునని తెలిపెను.

ఇక హాసన్ జియొక్క సిద్ధాంతము. మానవస్వభావము సహజముగనే మంచిదికాదనియు, వాంఛలతో కూడుకొని యున్నదనియు, అందుచే సంఘమునకు నిబంధనలు కావలె నని నమ్మెను. వాంఛలు తగునిబంధనలతో సడుపుకొని నపుడు అవిమంగళకరములే యగును. "వ్యక్తియొక్క స్థాయీ భావములకు (Emotions) గతిని చూపించు మానవప్రవృత్తికి హద్దుపద్దులు నిర్ణయించునదే నీతి" అని యీవతను వారినిర్వచనము. అందుచే వాంఛలను అణచివేయుట యెంత తప్పిదమో వాటిని మితిమీరనిచ్చుట కూడ యంతతప్పిదమే. దీనినే నవీనకన్ ఫ్యూసియస్ సిద్ధాంతము (New Confucia-nism) అనెదరు. నిబంధనలు కావలెననుటలో ముందుచెప్ప బోవునిబంధనావాదులకు (Legalists) వారికిదగ్గరగుచున్నాడు యీయన. అందులకే యీయన ఆర్థిక సమత్వపరముగా ఈవాంఛలన్నియు మానవసంఘమునకు లోబడి సమానముగ సమత్వదృష్టితో పరిపాలింపబడవలెననును. "పదార్థము సమముగా విభాగింపబడినపుడు భేదముపోవునది. ప్రజలందరు అధికారములో సమానులయినపుడు ఒకరినెత్తిపై నొకరు యెక్కజాలరు." వారి వారి స్థానములకు తగినట్లు పదార్థము సమభుక్తము కావలెనని యీయన అనును. తన పిల్లలను ప్రేమించువ్యక్తి ఇతరుల ననహ్యించుకొనజాలడు, అనే నైతిక

సిద్ధాంతముపైన కన్ఫ్యూసియస్ ఆర్థిక, రాచకీయసమత్వ మును కోరితే ధర్మము లక్ష్యముగా గలిగి, అట్టి ధర్మరూప మైన నీతికి, వ్యక్తియొక్క ఆర్థికసౌష్టవము అవసరమని సమత్వ మును మెనిషియస్ కోరితే—మానవునికి వాంఛలు తప్పవు; సరిగా నడిపించిన అవి తప్పుకూడ కావు, సాంఘిక నిబంధన లకు లోబడిన, రాచకీయార్థిక సమత్వములోనే వాంఛా తృప్తి లభించగలదని హాసన్‌జి ప్రతిపాదన.

రెండవమతము—తోయిస్టు (Taoist)లు. వీరు ప్రకృ తిజీవన సిద్ధాంతులు. మనుష్యజాతికి గలిగిన యిక్కట్టులు మానవుడు ప్రకృతిమార్గమును వదలిపెట్టుటవలననే గలిగినవి. పురుషప్రయత్నరూపకమయిన సంఘవ్యవస్థ, కట్టుబాట్లు పనికి రావనెదరు వీరు. అన్నియు ప్రకృతికి వదలినచో సవ్యగమ నము ప్రకృతిలోనే గలదని నమ్మెదరు. వీరు కన్ఫ్యూసియన్ సిద్ధాంతము వారి, రాచకీయములో నైతికవిద్యావిధానము, ఉత్తమవ్యక్తిపాలనమును వాంఛించరు సరిగదా సంఘనిబం ధనే వీరికి పనికిరాదు. క్రొపాట్కిన్ నాయకత్వమున బయలు దేరిన అరాజ్వాదము (Anarchy) వంటి అనగా ప్రభుత్వవిర హితమైన ప్రాకృతజీవితమును కాంక్షించెదరు వీరు. ఇది వీరి ఆదర్శము.

"తో" (Toe) అనగా మనసాంఖ్యుల "తత్" వంటిది. మనుష్యుడు భూమినుండియు, భూమి ఆకాశమునుండియు, వచ్చి నవి. ఆకాశము "తో" నుండివచ్చినది. అది ప్రకృతినుండి

వచ్చినది. కాబట్టి యీ "తత్" కు మూలమయిన ప్రకృతితో పోల్చిన మనుష్యుడు బహుదుర్బలుడు. ప్రాకృతావస్థ అనగా నేమి ? ప్రాకృతావస్థలో మనుష్యునికి స్వార్థము, బుద్ధిప్రతిభ లేకుండెనా ? అని ప్రశ్నించునపుడు "లోడ్జి (Loatze క్రీ పూ. ౪౮౨, ౪౩౨ మధ్యకాలమును) ఇటులనును. "ప్రకృతియొక్క భౌతికద్రవ్యసంబంధము వలన గలిగిన ఉద్రేకము మనుష్యునికి స్వార్థత్వాది దురవస్థను తెచ్చిపెట్టినది." మిక్కిలి ముదరరంగు చూచునపుడు కన్నులు మిఱుమిట్లు గొలుపును. పెద్దచప్పుళ్లు చెవులలోని పొరకు ప్రమాదము కలిగించును. అత్యధిక మసాలాసరుకులు నాలుకను మొద్దుబారచేయును." "అందుచే వస్తు వాంఛాదృష్టిపోయినపుడు మనుష్యుడు సమరసభావమునందును. అవరోధములు, నిర్బంధములు హెచ్చిన కొలదియు ప్రజలలో దరిద్రత హెచ్చును. ఆయుధములు హెచ్చినకొలదియు భద్రతకు అస్థిరత్వముకూడ హెచ్చును. ప్రజలలో పాండిత్యము, కుశలత హెచ్చిన కొలదియు అసత్కార్యములు హెచ్చును. ఉత్తరువులు లేక శాసనములు హెచ్చిన కొలదియు దొంగలు కూడ పెఱుగుచునే యుందురు. "భక్తిని నిష్టను భగ్నపఱుపుము. విజ్ఞానమును వదలివేయుము. అప్పుడే యిప్పటికంటె ప్రజలు వేయిరెట్లు బాగుపడెదరు." "వీరిసాంప్రదాయములో ప్రభుత్వము యీ క్రింది తరగతులుగా విభజింపబడినది. "ప్రజలకు ప్రభుత్వమనేది ఉన్నదను జ్ఞానము (The Consciousness that there is Government)

లేకుండునది ఉత్తమసంఘము. ప్రేమమన్ననలకు పాత్రమైనది రెండవరకము. భయప్రేరితమైనది మూడవరకము. శాసనము పేరులో ధర్మమును దుర్వినియోగముచేయునది నాలుగవరకమును, అధమాధమమును". "ప్రజలు తమజీవితములో యితరులు జోక్యము పుచ్చుకొనుట అనునది యెరుగక ప్రభుత్వమనునది తమనెత్తిపై కలదనే దాస్యభావశూన్యావస్థయే వీరి ఆదర్శము.

వీరుకర్మ సన్యాసవాదులు. "తౌ" (తాను తగ్గిపోవు వరకును) ను నైష్కర్మ్యస్థితికి వచ్చువఱకును అనుష్ఠించవలెనను, నైష్కర్మ్యముకంటె చేయదగిన దేదియు లేదు." దీనికి ఫలముకోరక కర్మలు చేయుటకూడ అర్థము. కర్మసన్యాసముకూడ అర్థముగానే కాన్పించుచున్నది. ఇది బుద్ధుని "నిర్వాణ" స్థితి యేమో ?

ఈ వాదమునుండి వ్యక్తివాదమును, సన్యాసమార్గము, అరాజ్యవాదము, ప్రాకృతవాదము అను నాలుగు బయలుదేరినవి.

మూడవసిద్ధాంతము—మోట్జు (Motze క్రీ. పూ. 320) ఆ ప్రాంతమువాడు. కన్‌ఫ్యూసియస్, వ్యక్తి తన స్వాభిమానాన్ని గృహాభిమానముగాను, దానిని దేశాభిమానముగాను, దేశాభిమానమును విశ్వాభిమానముగాను విశాలపఱచవలెనంటే మోట్జు యిది తప్పుఅనును. ఏలననగా ? ఇందులో కూడ "స్వం" పోలేదు. "నాస్వాభిమానమను ప్రేమను యిత

రులవరముగా విశాలపడుచున్నాననే జ్ఞానము నశించవలె నని మోట్జుమతము." "ప్రపంచమునకు గలిగిన విపత్తు "స్వ" "పర" భేదములవలన గలిగినదే. "పరుని గృహము తనదిగానే చూచునప్పుడు దొంగతనము ఏది?" ఇది ఈయన తాత్పర్యము. "పర" అనగా "స్వ" యొక్క దీర్ఘీకృతరూపముగాగాక "పర", "రే" స్వ" గా చూచుకొనమన్నాడు. ఇది మరీ గొప్పఊహ. మంచికార్యమనగా ప్రయోజనకరమయినదని యీయన తెల్పెను. అందుచే వీరు ప్రయోజనవాదులుకూడ (Utilitarians). మానవుని ఆర్థికజీవితమునకు వీరు ప్రాముఖ్యత హెచ్చుగా నిచ్చిరి. "పాటుపడేవారు జీవించెదరు. అలసులు నశించెదరు. అధికారములో నున్నవారు కృషిసలుపనిచో ప్రభుత్వ మల్లకల్లోలమగును". "ప్రతివ్యక్తియు తాను చేయదగిన కృషి చేయవలెను. తనయోపికకొలదియు పాటుపడవలెను. దీనికి నిదర్శనముగా పూర్వము "యూ" (Yu) అనురాజు నదులనుండి స్వయముగా చేదతో, చేతులు కాళ్లనుండి రోమము లూడిపోవువఱకును నీరును తోడివేసి రాజ్యములోని ననభాగములకును నడిపించెననియు, ఆ విధముననే సంఘముకొఱకు మనకండను కఱిగించవలెనని మోట్జుయొక్క బోధనయని చ్వాంగిజీ (Chwangtz) యొక్కముఖ్యాశయము. వ్యయము అధికమై, శక్తి అధికముగా ఖర్చుపడియు లాభకారిగాని కృషిచేయరాదను యీమోట్జు సిద్ధాంతము నవీన ఆర్థికసిద్ధాంతమునకు దగ్గరగానున్నది. మోట్జువలెనే హానన్‌జి

కూడ ఆర్థికములకు ప్రాధాన్యత యిచ్చి యుండినట్లు యిది వరలో తెలుపబడినది.

<u>నాలుగవ మతము—సంఘము న్యాయనిబంధనలపై నిలచియున్నదనువారు (Legalist School).</u> కన్‌ఫ్యూసియస్ చెప్పినటుల, యెంతి ఉత్తమవ్యక్తిపాలన మున్నను అది వ్యక్తి ఉన్నంతవఱకే గాని పిమ్మట లయమగుననియు, ఉత్తమగుణములు వ్యక్తిరూపముగా గాక, శాసనములు, నిబంధనలరూపముగా సంఘములో అభివ్యక్తము కావలెననియు, నిబంధనాయుతసంఘమే పరమప్రాప్యమనియు వీరి ఆదర్శము. వీరు తోయిస్టుమతమునకు పూర్ణవ్యతిరేకులు. కన్‌ఫ్యూసియస్ యొక్క సౌభ్రాతృత్వము టోయిస్టుల సమరసావస్థ, మోట్జు యొక్క కృషివలన జీవించే సౌభాగ్యము, ఇవియన్నియు న్యాయనిబంధనాబద్ధసంఘములోనే సాధ్యముకాని అన్యత్ర కాదనెదరు. వీరు నిరంకుశాధిపత్య (Despotism) వాదులు. వీరు మోట్జువక్షము వారివలె ఆదిమానవులమధ్య జరిగిన ఒడంబడికలవలన (Social Contract) సంఘవ్యవస్థ యేర్పడినదను వాదమును ఒప్పరు. మానవస్వభావము, ఈర్ష్య, స్వార్థముతో సంకులమయినదను ఊహపై వీరు ఆధారపడెదరు. అట్టి "మృగజీవితములో మనుష్యులుండగా వివేకవంతులు వారిని తమ సమిష్టి కృషివలన క్రూరత్వము, దౌష్ట్యములనుండి తొలగించి" రని వీరియభిప్రాయము. "ఆకాశము, భూమి నిర్మింపబడినపుడు మనుష్యులు పుట్టిరి. అట్టిస్థితిలో వారు తమ తల్లినే

గాని తండ్రి నెఱుగరు (ఇది వివాహసంస్థపుట్టక పూర్వపుసంఘ వ్యవస్థ). అప్పుడు వారి నైతిక సూత్రము లేమనగా, స్వజనుల యందు ప్రేమస్వార్థపరత్వము. ఒకదానివలన పక్షపాతబుద్ధియు, మఱియొకదానివలన క్రోధము కలిగినవి. అందువలన లోకములో కలతలు ప్రారంభమయినవి. ప్రజలు తమస్వలాభముకొఱకు యత్నించుటలో యితరులహక్కులను భంగపుచ్చచొచ్చిరి. అట్టిస్థితి వచ్చినపుడు న్యాయపాలనము తప్ప వేరు శరణ్యములేదు. అందుచే సమర్థులు బయలుదేరి న్యాయమును, పక్షపాతరహితత్వమును స్థాపించిరి; అప్పటినుంచియు ప్రజలు న్యాయవిధేయులు (Law abiding) గా చేయబడుచుండిరి." "వర్తమానజీవితము సంఘర్షణమయము. పూర్వము యింత జనసంఖ్యలేదు. ప్రకృతిఫల సమృద్ధి హెచ్చుగా నుండెను. అందుచే కష్టపడకుండగనే ప్రతివానికిని ఆహార సమృద్ధియుండెను. నేడు మనుష్యుడు 5 గురు పిల్లలతోడనే తృప్తిపడడు; 10 మంది కావలె ననుచున్నాడు. 25 మందిగల పితామహులు అనేకమంది కలరు. ఎంతదీర్ఘమైన పాటువడినను అల్పప్రతిఫలము నిచ్చుచున్నది. ఈ "స్థితిలో సంఘర్షణ తప్పదు." ఇట్టి ఆధునికసాంఘికవాద మానసికదృష్టి యీ పక్షము వారిలో కలదు. "ప్రాచీనప్రజలు స్వామ్యావస్థలో గడిపిన జీవితము ద్రవ్యసమృద్ధివలన సాధ్యమైనది. నేడుప్రజలు ద్రవ్యముకొఱకు పోరాడుచున్నారు. ప్రజలలో సుగుణసంపద నేడుకొఱత. అట్టిసుగుణసంపదకు కారణమయినద్రవ్యము

యొక్క విహీనతయే యిందులకు కారణము." లియాం-చీ-చో పండితుని మూలగ్రంథానువాదములు సరియైనవై సందర్భశుద్ధిగలవైనచో మార్క్సీయభౌతికవాద సిద్ధాంతములు యిట కనపడుట ఆశ్చర్యకరమే! పై ఊహపై (కేవలనైతిక బలమువలన లభించెడు) కొలదిమంది సుగుణవంతులుగల స్థితి కంటే జనసామాన్యము యింకను దుర్నీతిలోనికి దిగకుండ ప్రభుత్వమనే నిబంధన, మంచిదనియు అది సంఘానికి కావలెననెదరు.

చ్యాంకో రాజ్యకాలములో యీన్యాయసిద్ధాంతములు తలలెత్తినవి. అవి క్రమేణా భౌతికవాదమును అనుసరించుటలో టోయిస్టు సిద్ధాంతమును కొంతవఱకు పునాదిగా చేసికొని మోట్జు, కన్ఫ్యూసియస్ సిద్ధాంతములను తమలో నిముడ్చుకొనుచు వికసించినవి. ఈ వాదమునకు క్రమగౌరవము గల్గుటకు క్రమముగా నిబంధనలయొక్క అవసరమును కలుగచేసిన సంఘపరిస్థితులే. అంతేకాని కన్ఫూసియన్ సిద్ధాంతములయందున్న లోటువలనకాదు. అప్పటి సంఘపరిస్థితులే వేరు. శాసనమంటే గౌరవమును యెంతవఱకు యీ పక్షము వారు ప్రజాదృష్టిలో ఉన్నతపథానికి యెత్తించినారనగా ఏకరాట్టు (Monarchy) విధానపు చక్రవర్తినే శాసనకర్తగా నిర్మించిరి. చర్చ (ప్రజావిమర్శ) లేని శాసనాధికారము వీరికి ప్రియము. ఉత్తరువులు పైనుంచి వచ్చినవి. అవి క్రిందివారిచే చర్చింపబడుచో అధికారముక్రిందకి దిగి ప్రజలలో నివసిం

చును. అని వీరి భీతి. వీరు చాణక్యాదిభారతఅర్థశాస్త్రవాదులలో కొంతవఱకు పోలియున్నారు. కాని వారివలె సభాయుతరాజస్వామ్యము వీరికి నచ్చదేమొ.

కన్‌ఫ్యూసియస్ తెలిపిన "ప్రజలు యేది యిష్టపడరో నీవును దానిని యిష్టపడుము" అను ప్రజాంగీకారసూత్రము యీ వాదము వారికి యిష్టములేదు. హానన్‌జి యీ న్యాయవాదపక్షమువాడైనను "సంపూర్ణముగా విమర్శింపబడి, శాసనముచేయబడిన యెడల అన్నివ్యవహారములును దోషరహితములగును. శాసనమువలన పరిష్కరించుటకు ఉద్దేశింపబడిన విషయములపట్ల శాసనమే పరిష్కరించును. శాసనములో పరిష్కారమును తెలుపబడని విషయములు సబబును (Law of Equity) బట్టి పరిష్కరింపబడును"... "ప్రజలు శాసనచర్చలో వానిని శోధించుట కవకాశమున్న యెడల వారికి అనుమానములుండవు," అని ప్రజాబాధ్యతాపరమైన ప్రతిపాదనలు చేసినాడు.

కన్‌ఫ్యూసియస్ మతము నైతికప్రధానమైనది. బంధము మానవప్రేమ. ఆదర్శము రామరాజ్యము అనగా గృహయజమానిపాలనము వంటి శ్రేష్ఠవ్యక్తిపాలనము (Patriarchal System). సుగుణములను మానవుడు వికసింపచేయగలడు. సుగుణాలు (అవి జడములనే అర్థములో) మానవుని విశాలపఱచలేవు. "మనుష్యుడు శాసనాలుచేయగలడు. శాసనాలు మానవప్రకృతిని నిర్మింపజాలవు" వ్యక్తివికాస

(Development of Personality) ప్రధానమైనది యీ మతము. ఈ తల్లిమతములో నుండియే మెనిషియస్ ధర్మ (దీనిని చైనాభాషలో "యై" యందురు) వాదిగాను, హానన్ జి సంఘనిబంధనలకు లోబడిన సమత్వ (కొంతవఱకు) వాదిగాను నిర్గమించిరి. ఇక తోయిస్టుమతము, అరాజ్యవాదము, ప్రకృతిజీవనము, నైష్కర్మ్యమును బోధించుచున్నను ఆదర్శసంపదలో తీసిపోవుటలేదు. మోట్జుమతము ఆర్థికసమత్వప్రధానమైనది.

పై మూడుమతములవారును ప్రభుత్వముప్రజాంగీకారముపై నడువవలెనని స్పష్టముగా ప్రతిపాదించెదరు. కన్‌ఫ్యూసియన్ పాలకుడు దైవనిర్మితుడని ప్రతిపాదించినను అతనికిగల ప్రజాబాధ్యతను విశదీకరించెను. మోట్జుపక్షము వారు సాంఘికుల ఒడంబడికను సిద్ధాంతమును (Social Contract) స్పష్టముగా ప్రతిపాదించెదరు. ఈ అంశములు రూసోయొక్క సాంఘికుల ఒడంబడిక సిద్ధాంతమును చర్చించుపట్ల మఱికొంచెము విపులముగా తెలిపెదము. ఇట్టిస్థితిలో యీన్యాయనిబంధనపక్షమువారు శాసనకర్తృత్వము గల్గిన సమర్థుడైన వ్యక్తి నిరంకుశత్వపాలనమునే ఆపేక్షించెదరు. వీరిలక్ష్యముకూడ ప్రజాశ్రేయస్సే. ఇందువలన పై మూడుమతములవారును తమప్రజాస్వామ్యానుకూలమైన సూత్రాలనుపెట్టి నూతనవిధానములు సూచించిరని మనము పొరపడరాదు. రాజులేక చక్రవర్తిపాలనకంటె వేరు విధానము అప్పటి మెట్టిడదార జిజ్ఞాసువునకును

కూడ దృష్టిలోలేదు. అందుచే భిన్నమతములవారికి గల భేదము సిద్ధాంతములలోనే గాని విధానములో అందఱును రాజస్వామ్యవాదులే : ఒక పక్షమువారు రాజనిరంకుశత్వమే ప్రజాశ్రేయమంటే మరిమూడుపక్షములవారు ప్రజలకు బాధ్యత వహించుచు, ప్రజాంగీకారముపై రాజ్యముచేసే రాజప్రభుత్వము మంచిదిగా భావించిరి. ఈ పక్షములో రాజస్వామ్య, సభాయుతరాజస్వామ్య, గణప్రజాస్వామ్యమను మూడువిధానాలు అమలు జరిపిన ప్రాచీనభారతదేశము విధానజగత్తులో ముందడుగు వైచినది. ఇక చైనావారికి గల ప్రజాస్వామ్యపరమైన సిద్ధాంతబలము స్వతస్సిద్ధమై, రాజుఅనగా ప్రజలయొక్క అంగీకారముపై పాలనచేయువాడు, అని వెంటనే తట్టుట వారి సాంప్రదాయముగా నుండును. ఇచ్చటవీరు భారతరాజస్వామ్యవాదులతో పోలియున్నారు. క్రీస్తుశకము యిప్పటికి సుమారు మూడు వేల సంవత్సరములకు పూర్వమే చైనాలో, నవీనకాలములోని పండితులు, జిజ్ఞాసువులు తర్కించుచున్న ఆర్థిక, రాచకీయసమస్యలను గూర్చి జిజ్ఞాసచేసిన—దృక్పథము వేఱుగావచ్చును—తత్త్వవేత్తలు వసించియుండుటయే గొప్పవిషయము.

## ౫

## మహమ్మదీయవిజ్ఞానము—ప్రపంచరాచకీయ పరిణామములో దానిస్థానము.

---

సంవత్సరములు వారీగా వ్రాయవలసినచో మహమ్మదీయ, గ్రీసు, రోముల చరిత్రకు పిమ్మటనే మహమ్మదీయ విజ్ఞానమునుగూర్చి వ్రాయవలసియుండును. ప్రాచ్యఖండ విజ్ఞానములలో యిది మూడవది కావున కొంచెము ప్రక్రమభంగము జరిగించి ముందుగానే దీనినిగూర్చి తెలుపవలసి వచ్చినది. ఇంతేకాక ప్రాచ్యఖండీయులకు వ్యక్తిత్వముకలదా లేదా యను అంశముపై ప్రపంచములోని సహృదయులు అభిప్రాయమిచ్చుటకుకూడ వీటిని యోకగుత్తిగా ప్రదర్శించుట అవసరము.

మహమ్మదీయ విజ్ఞానము అరేబియా యెడారిలో పుట్టినది. ఈవిజ్ఞానము జ్యోతిషశాస్త్రము, ఖగోళశాస్త్రము, రేఖాగణితము, బీజగణితము మొదలైన శాస్త్రములు, కళల వికసింపజేయుటబో గొప్ప ప్రసిద్ధినిపొందినది. ఇందులో వీరికి భారతవిజ్ఞానముయొక్క ఉపదేశము చాలకలదు. [1] అరేబియా యొక్క శాస్త్ర కళావిజ్ఞానము ప్రపంచమునకు ముఖ్యముగా మధ్యకాలపుయూరపుఖండ సారస్వతోద్యమమునకు యెంతయు

---

1. చూ:—లెగసీ ఆఫ్ యిస్లాము (Legacy of Islam), Astronomy and Mathematics by Carradevaun.

పోషణనొసగినమాట వాస్తవమే. కాని భారతదేశములోని ప్రాచీన సభాయుత రాజస్వామ్యాలుగాని, చైనాలోని భిన్న రీతుల రాచకీయ సిద్ధాంత జిజ్ఞాసలుగాని, ముందు తెలుప బోవు గ్రీకు, రోములవంటి సంస్థలుగాని, రాచకీయ జిజ్ఞాసలు గాని ఈసభ్యతలో బయలుదేరనే లేదు. దీనికి కారణమఱి యుచు ప్రపంచ రాచకీయ పరిణామములో యిస్లాముయొక్క స్థానమునుగూర్చి తెలుసుకొనుటకు కొంత యత్నించెదము. మహమ్మదు ప్రవక్తకు పూర్వపు అరేబియా సంఘవ్యవస్థ యెట్లుండెను? అరేబియా యెడారి మయము. అందుచే అరేబియనుల జీవితము చరమైనది. స్థిరముగా పుర, గ్రామ జీవితములకు పరిస్థితులక్కడలేవు. అందుచే సాంఘికపరిపాలనము, నిబంధనలకుగాని అట్టి జిజ్ఞాసలకుగాని ప్రోత్సాహము తక్కువ. వీరు యెట్టి యాధిపత్యమును సహించని స్వేచ్ఛాప్రియులు. అరేబియా అంతయు గుంపులమయము. గుంపులు గుంపులుగా ఒంటెలనెక్కి ఒక స్థలమునుండి, మరియొక స్థలమునకు, పచ్చమేతకు,నీటికి, ఆహారమునకు (oasis) స్థలముల నన్వేషించుచు, తిరుగుటయే వారి జీవితపురీతి. ఈగుంపులేక గణమే ఒకసంస్థ. ఇది రక్తసంబంధముపై యేర్పడినది. ఇందులో ఒక పెద్దయే వీరికి నాయకుడు. నిఱంతరము గుంపులమధ్య పోరాటముండెను. ఈగుంపుల జీవితములో నిట్టి నిరంకుశాధిపత్యము గుంపుయొక్క రక్షణకు కవసరమయ్యెనేమో. వీరు బహుదేవతారాధకులుగా నుండిరి.

ఇంతకంటె మహమ్మదు పూర్వపు అరేబియాయొక్క రాచకీయ రూపము మనకు తెలియదు. క్రీ. పి. ౫౭౧ ఏప్రిల్‌లో మహమ్మదు జన్మించెను. ఈయన జీవితచరిత్ర మనకు అప్రస్తుతము. మహమ్మదునకు పూర్వమే హానిపులు (Hanifs) అను జిజ్ఞాసకులు కొందఱు అరేబియాలో బయలుదేఱిరి. వీరు అరబ్బీ సంఘసంస్కారమును, మానవసమత్వమును గూర్చి ప్రబోధన చేయుచుండిరి. వీరును క్రైస్తవ యూధపండితులును కూడ మహమ్మదుయొక్క మార్గమును కొంతవఱకు తెఱపిచేసిరి. మహమ్మదీయ మతము పూర్వపు రక్తసంబంధముస్థానే మత సంబంధమును సంఘవ్యవస్థకు ప్రాతిపదికగా స్థిరపఱచెను. "ఏకసమ్మతముగల సోదరులు శత్రువు ఆస్తి పంచుకొనుటలో సమాన హక్కుదారులు. శత్రువుపైన కత్తి కట్టే మిత్రులు." అప్పటి అరేబియనుల బహు దేవతారాధనలు ఖండించి ఏకేశ్వరోపాసనముకూడ స్థిరపఱచెను. ఎవరైతే అల్లా యనబడు ఏకేశ్వరుని ఉపాసకులలో, ఎవరైతే మహమ్మదుయొక్క ఉద్యమమును నమ్మెదరో, ఆయన బోధించిన సూత్రముల ననుష్ఠించెదరో వారు మహమ్మదుయొక్క "జనగణము" (Nummah) సమ్మాలో నుండుటకు హక్కుదారులు. ఇది మహమ్మదీయ సంఘముయొక్క లక్షణము. గుంపులు, తెగలు అనే భేదములుకలిగి, కొట్లాడుకొనుచు, బహు దేవతారాధకులై, మూఢాచారములకు లోనైన అరేబియన్ సంఘము, మహమ్మదీయ మతమునకు

లోబడి, ఒక్క దేవుని నమ్మవలెననియు, అట్టి నమ్మకముగల వారందరును సర్వవిధముల సమానులనియు సంఘమునకు యింత విశాలార్థము చెప్పిన ఘనత—అందులో వర్గముల క్రింద క్రైస్తవజనసామాన్యము యూరపుఖండములో నలుగుచుండిన ఆరోజులలో—మహమ్మదీయ మతమునదే. ఇందు అధికుడనగా, మతము నందరికంటెను యోగ్యముగా అనుష్ఠించువాడు, లేక మతమును మున్ముందు స్వీకరించినవాడు. ఇంతకు తప్ప వ్యావహారికములో కూడ వ్యక్తులమధ్య యెక్కువ తక్కువలు లేవని యీమతము సిద్ధాంతీకరించినది. కాని యీ సంఘవ్యవస్థ రాచకీయ సిద్ధాంతములపై యేర్పడినది కాదు. చైనావలె నైతిక సిద్ధాంతములపైననూ నిలిచినది కాదు. ఇది కేవలము ఒకవ్యక్తియొక్క మతవిశ్వాసముపై నిర్మించబడిన సంఘము. ఇట్టి మతవిశ్వాసము, ఉద్రేకము, నందుండి వచ్చిన సంఘసమత్వము శత్రుజయమునకును, రాజ్యవిస్తీర్ణమునకును పనికివచ్చును. కాని పిమ్మట సంఘ నిర్మాణము చేసికొనుటకు సిద్ధాంతబలమును శాస్త్ర కట్టుబాట్లును కావలెను. ఇవి వారికిలేవు.

మహమ్మదీయమతప్రకారము రాజ్యమంతయు భగవంతునిది. శాసనకర్త యీశ్వరుడైన అల్లాయే. మహమ్మదు ఆయన ప్రవక్త. అందుచే మతగురువునకును, ప్రజల భౌతిక జీవితనాయకునకును తేడా లేదు. ఈయిద్దఱును ఒకటే. అందుచే "కలీఫా" (Calipha) లేక "ఇమాం" అను శబ్ద

ములో రాచకీయ, మతాధిపత్యములు, రెండును యిమిడి యున్నవి. మహమ్మదునకు పిమ్మట సంఘాధిపత్యము వహించిన యీకలీఫాలు భగవంతుని ఆస్తికి ధర్మకర్తలు మాత్రమే.

ఈమహమ్మదీయ ప్రభుత్వముయొక్క లక్ష్యమేమి? "మనుష్యులు ఒకరికొకరు శత్రువులు." వారంతట వారిని వదలిన మృగములవలె అన్యోన్యనాశనము చేసికొనెదరు. శాసనము మానవుని యీ క్రూరస్వభావమునుండి కాపాడుట కేర్పనది. అందుచే "భగవంతుడు రాజులను యేర్పఱచెను" ఆయనే పదచ్యుతులను చేయుచుండును" అనును ఖురాన్. "ఇంతకంటె స్పష్టముగా పాలనయొక్క లక్ష్యమేమనగా? ఇహలోకములో ప్రజలను మంచిస్థితిలోనికి కొనిపోవుట; పరలోకమున ముక్తికి కొనిపోవుట" యని విశదీకరించినది. ప్రజల ఐహికాముష్మిక జీవితములు రెండును ప్రభుత్వమువారి ఆదరణలో పడినవి.

పై లక్ష్యమునకు "కలీఫా" అవసరము. ఈకలీఫాను యెవరు, యెటుల యేర్పాటు చేయవలెను? ఎన్నికపద్ధతివలననే, కాని యిప్పటివలె జనసామాన్యమందఱును యెన్నికదారులు కారు. "మునద్దీలు, శస్త్రములు ధరించువారు యిందు కర్హులు" ఈపదవికి అభ్యర్థి అరబ్బీజాతీయుడుగా నుండవలెను. మహమ్మదు ప్రవక్తవంశమునకు సంబధించినవాడుగా నుండవలెను. ఇక్కడ తిరిగి పూర్వ అరబ్బీసాంప్రదాయమైన రక్తసంబంధమునకు స్థానము వచ్చినది. ఈనూత్న

మునుబట్టి రానురాను వచ్చిన అరబ్బేతరకలీఫా యెన్నిక లన్నియు అశాస్త్రీయము లగుచున్నవి. ఈఅభ్యర్థి పురుషుడై యుండవలెను. "స్త్రీల యాధిపత్యముక్రింద ప్రజలు వృద్ధి పొందజాలరు" అన్నది ఖురాను. ఈఅభ్యర్థి యిస్లామునున్న, దైవశాసనములును తెలుసుకొనినవాడుగా నుండవలెను. నీతి, జ్ఞాన, బలసంపన్నుడు, అవికలాంగుడుగా నుండవలెను. ఇట్టి వాడు సైనికబలముకువలనగాని, చాటు, మాటుపద్ధతులవలన గాని, గాక యిస్లాముసంఘము, లేక సంఘపుపెద్దల యెన్నిక వలన "కాలిఫ్‌గా" యేర్పడవలెను. ఈకాలిఫ్‌తనము న్యాయ శాస్త్రదృష్టిలో ఒడంబడికవలన (Iquad) యేర్పడుచున్నది. ఈఒడంబడికను స్థిరపఱచు విధానముపేరు "బాయహ్" (Bayah) అనెదరు. ప్రజలు యిచ్చిన యీవాహోదాను అంగీక రించుటతోడనే "కాలిఫ్" దైవశాసనానుసారము తనయధి కారమును చలాయించుటకు నిబంధితుడు. ఏలననగా మానవలక్ష్యము యీ అస్థిరమయిన భౌతికజీవితము కాదు. శాశ్వతమైన ఆముష్మికజీవితము. ఇస్లాము మతముయొక్క యిహలోకాభివృద్ధికై కృషిసల్పుట కీయనబద్ధుడు. ఈపద్ధ క్రింద రాష్ట్రసరిహద్దుల రక్షణ, యితరమతస్తులపై దండ యాత్ర, దేశములలోపల భద్రత, సంఘపు టాస్థిని పాలించుట న్యాయశాఖాపరిపాలన ఉపాంగములుగా నిమిడియున్నవి.

దీనినిబట్టి యిస్లాము, రాచకీయసంస్థ అని పిలువవలసి వచ్చినచో అది భౌతికేతరప్రయోజనములు ప్రధానముగా

గలది అని చెప్పవలసివచ్చుచున్నది. "సంఘము", "నాయకుడు"—రాష్ట్రము, అధిపతి, కాదు– ఈ రెండుశబ్దములలో యిస్లాముసకు గల రాచకీయపు పెళుసుతనము గోచరించుచున్నది. కలీఫా తాను రాజుననిపిలుచుకొనుటకు భయమే. "మతవిశ్వాసవంతుల నాయకుడు" (Commander of the faithful) అనియే పిలువబడుచున్నాడు.

కొంత కాలమునకు అనగా "హిజిరా" ప్రథమశతాబ్దములో యీ కలీఫా ఉద్యోగనిర్మాణములో ఒకమార్పు జరిగినది. ఉద్యోగములోనున్న కలీఫా తనవారసుని నియమించుకొనునాచారము గౌరవింపబడినది. కాని అట్టి నియామకమును సంఘమువారు ఆమోదించుచో (Homage) అది ఖాయమగును. ఈ పై రెండుపద్ధతులపైనను యిస్లాం రాజ్యాధిపతి యేర్పడుట, అతడు రాష్ట్రముయొక్క ప్రతినిధి—శాసనకర్త గాడు — ఖురానే శాసనమగుటవలన — కార్యనిర్వాహకుడు (Executive head) గా నుండుట జరిగెను. ఖురానులో ఒక విషయమై శాసించబడినపుడు, దానిని అమలుజరుపుట తప్ప వేరు స్వాతంత్రతలేదు. అట్టి నియామకములోని అంశములలో ముఖ్యముగా యుద్ధము, యుద్ధపుదోపిడీల పంపకము, భూమిపన్ను నిర్ణయము, ప్రజాధనమును వ్యయపఱచుట, ఉద్యోగుల నియామకములోను యితనికి స్వాతంత్రతకలదు. ఇక్కడ సభాయుతపాలనము గానరాదు. పిమ్మట క్రమేణ శాసన

నిర్మాణములో భాష్యకారులు ఆచారబలమును ఒప్పినట్లు తోచుచున్నది.

ఇస్లాంయొక్క రాచకీయసిద్ధాంతాలు - సిద్ధాంతులు.

ఇక్కడ "రాజకీయము" అని ప్రయోగించుటవలన నవీనార్థములో దీనిని పాఠకులు గ్రహించరాదు.

తదితరసాంప్రదాయములలో వలెనే అనగా అంతకు పూర్వము అరేబియాపరిసరములలో ప్రవర్తిల్లియున్న హెబ్రూ క్రైస్తవ సాంప్రదాయములలోవలెనే వీరును కృతయుగమున మదమాత్సర్యరహితులై మానవులు యేకకుటుంబముగా నుండిరనియు, అప్పుడు అధిపతిలేకయే సంఘము శాంతముగా నడచెననియు నమ్మెదరు. "కైన్" యొక్క నేరముతో క్రైస్తవసాంప్రదాయములోని—ఈవుతినరాని పండుతిన్నటుల— కృతయుగము గతించెననియు, మనుష్యులు అరిషడ్వర్గములకు లోనైరనియు, సంఘములో సామరస్యము పోయెననియు, జనులకు నిజముగుభక్తి శాసనము లవసరమయ్యెననియు నమ్మెదరు. కాని సాంఘికుల ఒడంబడిక సిద్ధాంతముగాని, ప్రభుత్వమనే సంస్థ ప్రజానిర్ణీతముగనే ఆదిని యేర్పడెననిగాని వాదములు యిచ్చుట గానరావు.

కలీఫాసంస్థను గూర్చి మహమ్మదీయులలో మూడు సాంప్రదాయములవారు కలరు. పెద్దలవలన ఎన్నుకొనబడిన వ్యక్తియే, కాలిఫ్‌గా నుండదగునని యొకరు. వీరు (Sunnah) సున్నాలని పిలువబడుదురు. ఆలీయొక్క వంశస్తులే స్థిరముగా

కలీఫా పదవికి అర్హులను, పూర్వసాంప్రదాయువు (Legitamists) పియ్యాయులు మరియొకరు. ప్రతిమహమ్మదీయుడును, కూలివాడైననుకూడ, యోగ్యుడయిన భగవద్భక్తుడైనచో కలీఫాపదవికి అర్హుడేయను అతివాదులుకూడ గలరు. ఈఅతివాదులలోని తీవ్రవాదులు, కలీఫాగాని, రాజుగాని సంఘమునకు అవసరమే లేదనియు "మానవులు తమలో తామే న్యాయయుక్తముగా ప్రవర్తనలు జరుపుకొనవలెనని" అనెదరు. వీరిని ఖరీజీయులు (Kharijites) అందురు. కాని యిట్టిసంశయస్థలములలో యావత్తు సంఘాభిప్రాయమును కనుగొనవలెనను ఆ దేశముః కితాబుల్ లామా (Kitabul Lama) అను గ్రంథములో కలదు.

<u>మహమ్మదీయ న్యాయశాస్త్రవేత్తలు.</u> ఇస్లాముమతాభివృద్ధి, రాజ్యాభివృద్ధి కలిగినకాలదియు, వీరిలో న్యాయశాస్త్ర పండితులు బయలుదేరిరి. వీరందఱును అరబ్బులేకారు. పారసీకులు మున్నగువారుకూడకలరు. కాని యిస్లాముయొక్క న్యాయశాస్త్రజిజ్ఞాసలలో, గ్రీకు,రోముయొక్క జాడలుగలవని పండితులమతము. ఇచ్చట పేర్కొనదగిన న్యాయశాస్త్ర, రాచకీయజిజ్ఞాసువులు ముగ్గురు నల్గురు కలరు. మావార్డీ (క్రీ. పి. ౧౦౫౮ Mavardi) ఇబ్బను, హాజమ్ (Ibn Hazam), ఇబన్ జామా. (Ibn Jama ౬౩౯, ౭౭౨) వీరిలో ముఖ్యుడు మావాడీ. ఈయన గ్రంథము. ఆహాకమ్—అస్—సుల్తా

నియూ (Ahkam-us-sultania). ఈయన బాగ్దాదు, బస్రాలలో న్యాయశాస్త్రోపన్యాసముల నిచ్చెను. ఈయన జాతి నంతను రెండువర్గములుగా విడదీసెను; రాజ్యాధికారమునకు వారసులు,ఎన్నికవర్గము. ఈయన సిద్ధాంతదృష్ట్యా యథార్థస్థితినివదలి—చర్చించెను. "కిలాఫత్" ఎన్నికపై యేర్పడిన రాజ్యాధికార మని నిర్ణయించెను. ఎన్నికదారుల కుండవలసిన అర్హతలలో పురుషజాతికి చెందుట, మెజారిటీ వచ్చుటకూడ చేర్చెను. రాజునకును, సంఘమునకును గల సంబంధము (Bilateral compact)అని అనెను;అనగా ప్రజలు రాజును గౌరవించి విధేయులగుటకు ప్రతిఫలముగా, రాజుపైన కొన్నిధర్మములును, విధులును గలవని యీయన నిరూపించెను. కాని హారోన్, ఆల్ రషీడ్ అను కలీఫా తనను గౌరవించుటకు "సుఫియన్ థౌరీ" అను పండితుని బాగ్దాదునకు ఆహ్వానించినపుడు సదరు కలీఫా ప్రజాగౌరవమును, పాత్రతను గోల్పోయెనని నిదర్శనములు తెలుపుచు "నీతో నేను సంబంధమును వదలుకొనెదను...ముస్లిముల ధనాగారముపై వారియిష్టము లేకనే నీవు ఆక్రమణచేసితివి," అని కొన్నినేరములు మోపిన ఘట్టమునందును మూడవయాజిడ్ తనసోదరుడైన (వరుసను) రెండవవాహిడ్ దుర్మార్గుడని అతనిపై తిరుగుబాటును లేవదీసి, అతనిని చంపి తాను కలీఫా పీఠమును అధిష్ఠించు సందర్భమున చేసిన "ప్రతిజ్ఞ" లో "నేను యిప్పుడుచేసిన ఖరారులను తప్పిపోయినచో నన్ను మీరు తొలగించుటకు స్వతంత్రులు"

అను ఘట్టమును, కిలాఫత్ సంస్థ ప్రజాంగీకారముతో పనిచేయ వలెననుటకు నిదర్శనముల నిచ్చుచున్నవి.[1]

శాసనము (Law) కేవలము అధికారబలముపైన యేర్పడినదని ఒకవాదమును, ప్రజాంగీకారముపై యేర్పడినదను మరియొకవాదమును యిస్లాములో ప్రాచీనమునుండియు యున్నవని బక్సుగారి అభిప్రాయము. కాని యీ వాదములు గ్రీకు సాంప్రదాయమునుండి యిస్లాములోనికి దిగినవని వారును అంగీకరించున్నారు.

<u>కిలాఫత్ యొక్క అభివృద్ధి—పతనము.</u> మహమ్మదు బోధించిన మతసామాజికుల సమత్వమనేదిన్నీ, రాజకీయముగా కిలాఫత్ యెన్నిక సిద్ధాంతమున్నూ, నిజముగా అమలుజరిగి యుండినచో అది, "యెబూబేకర్, ఓమర్" అను మొదట యిద్దరు కలీఫాల కాలముననే. వీరు స్వార్థరహితులై ఖురాన్, మహమ్మదుయొక్క ఆజ్ఞలను పరమావధిగా నిడుకొని అదర్శనీయమయిన జీవితమును గడిపిరి. ప్రవర్తనలో వీరు మహమ్మదుకంటెను మిన్నలేమో మహమ్మదీయ సామ్రాజ్యము కూడ పెరిషియా, యీజిప్టు, టర్కీలపై వఱకుకూడ వ్యాపింప చేయబడెను. జనసామాన్యముతో సమముగా వీరు నమాజులుజేసిరి. ధర్మధనమును అందఱికిని సమానముగా పంచిరి.

1. ఇందును గురించి యింకను లోతుగా పరిశీలన చేయతలంచిన వారుకూడాబక్సుపండితుని Essays Islamic and Indian చూడనగును.

వీరిలో ఓమర్ ఖర్జూరపుకాయలు, మంచినీరు, ఒకచాప, చలికొకటి, ఎండకొకటి రెండుచొక్కాలతో జీవనము గడపిన త్యాగి. కాని పిమ్మట కలీఫాగా వచ్చిన ఓథ్మన్‌నుంచి యీకలీఫాసంస్థ, కుట్రలు, హత్యలతో కూడినదై యుండెను. మహమ్మదుయొక్క పేరును, ఖురానును వీరు స్వకాంతునిమిత్తము ఉపయోగించుకొన జొచ్చిరి. వెంటనే హేతువాదబలమున గాక ఖడ్గబలమువలన మహమ్మదీయమతములోనికి దింపబడిన, మహమ్మదీయ సామ్రాజ్యములోని యితరరాష్ట్రముల వారు స్వీయస్వాతంత్ర్యమునకై ఆయారాష్ట్ర గవర్నర్ల మద్దతుతో తలలెత్తజొచ్చిరి. ఇంతేకాక అరబ్బీజాతివారు కూడ మహమ్మదు గతించిన వెంటనే, తమలో అడుగున యుండిన తమ జాతీయతాధిక్యభావములను పైకితెచ్చుకొనిరి. ఇస్లాము మతస్థులందరును సమానులను సూత్రము త్రోసిపుచ్చిరి. తాము "ఖురైషీ" (గౌరవపాత్రులు) ల మనియు, యిస్లాము మతస్థలయినను తదితరరాష్ట్రీయు లయిన పరిషియన్లు మొదలయిన వారు, "మావలులు" (కనిష్టులు) అనియు, తలచుచుండిరి. ఇస్లాము పేరుతో అరబ్బీ ఆధిపత్యమును స్థాపింపజూచిరి. ఖురైషీకి ముందుగా ఊరేగింపులలో మావలి నడువరాదు. భోజనములలో "మావలి" ఖురైషీతో సహపంక్తికి పనికిరాదు. జన్మచేతనే అరబ్బుఅధికుడు. రాచకీయముగా కలీఫాపదవికి అరబ్బేతరుడు పనికిరాకపోవుటయే గాక యే ఉన్నతోద్యోగమునకు కూడ పనికిరాదు. ఇటుల దిగినది.

కిలాఫత్ సంస్థకై కుట్రలు ప్రవేశించుట కలీఫాలు దుర్నీతిపరులగుట, బలహీనులగుట పరిశ్రమీకమూల అరబ్బీ ఆధిపత్యభావములు, సామ్రాజ్యములోని ప్రజలు మహమ్మదీయ మతమును బలవంతముగా స్వీకరించిన వారగుటవలన స్వరాష్ట్ర దేశాభిమానమును, ఆచారములను వదలలేకపోవుట ; కేంద్ర ప్రభుత్వ బలహీనతను లోకువగా తీసికొని రాష్ట్రపు గవర్నర్లు స్వతంత్రులగుటకు యత్నించుట. అరబ్బీయుల ఆధిపత్యగర్వ మువలన పరిషియా, సిరియా, ఈరాన్ ప్రజలకును, పండితు లకును గలిగిన పౌరుషము.[1] ఈ పరిస్థితులవలన క్రీ. పి. ౭౫౦ సంవత్సరములో ఆఖరు ఒమయద్ కలీఫా హత్యగావింపబడిన పిమ్మట కలీఫా ఆధిపత్యము అరబ్బీలనుండి విడబడినది దీని ముఖ్యస్థానము మదీనానుండి డొమాస్కస్సుకును, పిమ్మట బాగ్దాదునకును మాఱినది. ఇక్కడ "అబ్బాసీయ (ఇరాన్ జాతీయుల) వంశస్తులు కలీఫా లగుచుండిరి. వీరు సర్వమహ మ్మదీయులలోను సమత్వము స్థాపించెదరను ఆశయముపైననే ఆయాజాతులవారి సహాయముతో పైకివచ్చినను, పరిషియా ప్రాబల్యమునకు లొంగిపోయిరి. పిమ్మట కిలాఫత్ చరిత్ర మనకు అంత ప్రస్తుతము కాదు. ఆఖరున యిది టర్కీవారికి నామమాత్రాధికారముతో వశమై, అచ్చట అయిరోపా మహాసంగ్రామానంతర జాతీయ ప్రజాప్రభుత్వమువారిచే రద్దు

1. చూ :—బక్సుపండితుని Shu-ubiyyah అను వ్యాసమును చదువదగినది.

చేయబడెను. కాని యీ కలీఫాలకాలములో బాగ్దాదు వంటి నగరములలో విశ్వవిద్యాలయములు శాస్త్రకళాభివృద్ధి అధికముగా జరిగినదనుట వాస్తవము. విశ్వవిద్యాలయపద్ధతి మహమ్మదీయులనుండి యే యూరోపియనులు అనుసరించిరని అందురు. ప్రపంచరాజకీయ భావపరిణామములో యిస్లాము నకుగల స్థానము మతమునకులోబడి జనులలో సమత్వము, అధిపతి కొంతవఱకు ప్రజాంగీకారముతో నడువవలెనను భావాలుతప్ప, ఆచరణలో చూపగల ఒకవిధానముగాని, సిద్ధాంతసంపదనుగాని చేకూర్చలేక పోయినది. కాని ప్రపంచ విజ్ఞానపరిణామములో యిస్లామునకు స్థానముకలదు. ఒకమూల తన శాస్త్రకళా విజ్ఞానమును, మఱియొకమూల ప్రాచ్యభారత విజ్ఞానమును, మధ్యకాలపు యూరపుఖండమున కందించి, అచ్చటి విజ్ఞాన కళాభ్యుదయమునకు కానుకల నర్పించిన దనుటలో సందియములేదు.

ఇంతటితో ప్రాచ్యఖండములోని అతి ప్రాచీన చైనా, భారతరాచకీయాలను గురించిన క్లుప్తచరిత్రయును, ప్రాక్ పశ్చిమాలకు మధ్యగానుండి క్రీ. పి. 7 వ శతాబ్దమునుండి బయలుదేరిన యిస్లాముయొక్క, రాచకీయ స్వరూప చరిత్ర యును ముగిసినవి. ఇంతటినుండి యీరాజ్యాంగ భావచరిత్రకు యూరపుఖండమే ప్రధానరంగముగా నుండును. ఈ చరిత్రకు వారి మతప్రకారము ప్రారంభము ప్రాచీనగ్రీకు స్వామ్యాల చరిత్ర. ఈగ్రీకు స్వామ్యాల చరిత్రలో ప్రాముఖ్యతగన్న యేథెన్సు ప్రజాస్వామ్యముతో మనమునన్నా, ద్వితీయా ధ్యాయ పన్నమును ప్రారంభము చేయుదుము.

---

# అధ్యాయము—రెండు.

౧

<u>ఏథెన్సు ప్రజాస్వామ్యము.</u> ముప్పదివేల పౌరులతో కూడిన ఏథెన్సు పట్టణమంతయు ఒకటే రాష్ట్రము, ఒకటే శాసనసభగా నుండెను. యుద్ధములో ఖైదీలుగా గొనిరాబడిన అన్యరాష్ట్రీయులకుగాని, క్రయమునకు పొందిన బానిసలకుగాని "పౌరస్వత్వము" (Citizenship) అప్పుడులేదు. స్త్రీలకుగూడ పౌరస్వత్వము అప్పుడులేదు. ఈవిషయములో యేథెన్సు రాష్ట్రము పూర్ణప్రజాస్వామ్యము కాకపోయినను, ప్రజలలో పౌరస్వత్వముగల వారందరు శాసనాధికారమును చెలాయించుటకు, అవకాశముండుటవలన ప్రశంసనీయముగ నెన్నబడుచు ౧౯వ శతాబ్దములో ప్రబోధమైన ప్రజాస్వామ్య వాదములకు ఎంతయు పోషణను ప్రసాదించినది. పెర్కిలీసు (క్రీ.పూ. ౪౬౬—౩౨౯) కాలములో "పౌర" హక్కుగల జననీ జనకులకు పుట్టనిచో పౌరస్వత్వములేదు. ఏథెన్సునగరముదాటి ౮ మైళ్ళ అవతలనుండి వచ్చినచో పౌరస్వత్వములేదు. ఈపౌరులకంటె అధికసంఖ్యాకులైన బానిసలకు మొట్టి శాస్త్రసిద్ధమైన హోదాయున్నులేదు. వారి "మనవులు" అధికారులకు చేరవలెనన్న యేపౌరునైనను వీరు ఆశ్రయించి వారిద్వారా నివేదించవలెనుగాని వీరికి నివేదనాధికారమే లేదు.

ఇక్కడకూడ ఆదిని కొంతకాలము రాజుల ప్రభుత్వ ముండెను. ఈ రాజుల నిరంకుశత్వము క్రమముగా హెచ్చుట వలన అది త్రోసివేయబడినది. పిమ్మట ప్రజలచే నెన్నుకొన బడిన "న్యాయాధిపతులు" (Magistracies) వంటిదాగల యుద్యోగీయుల మూలముగా ప్రభుత్వము నడుపబడుచుండెను. ఈస్థితిలో రాష్ట్రీయుయొక్క (అనగా ఏథెన్సుపట్టణమే) ఆచారములు, న్యాయశాస్త్రములను నిర్వచించుట, వ్యక్తుల సౌమ్మయ్యెను. అందువలన పౌరులందఱకును యిట్టి అంశ ములపై అభిప్రాయమిచ్చుటకు అవకాశము కల్పింపబడినది. ఈ యవకాశమే క్రమముగ ఏథెన్సు పౌరులందఱును శాసన సభగా సమావేశమగు పరిణామమునకు దారిచూపినది.[1]

---

1. గ్రీసు ప్రజాస్వామ్య విధానముయొక్క నిర్మాత సోలోను రాజు ( Solon ). ఈయన గ్రీకులకు మనువువంటివాడు. ఈయన ఉద్యోగుల (Magistrates) నెన్నుకొనుట, తాము నియమించిన అయిదువందల సభవారిని, ప్రభుత్వమును అదుపులో నుంచుట, శాసనములగూర్చి సలహాలను మాత్రము నిచ్చుట— ఈ కార్యములకే పౌరసభవారి కధికారమునిచ్చెను. ఈ పాల నాధికారము ధనవంతులు పండితులలో నుండునట్లు ఈయన ఉద్దేశించి రచించిన నిర్మాణము, పైపరిస్థితులవలన సర్వరాజ్యా ధికారమును క్రమముగా ప్రజాసభవారే వశపఱచుకొనునట్టిదిగా మారెను. (Blunchili's. Th. S. ౪౬౦) ఈ పౌరసభలోని (ప్రసిద్ధవక్తల) గంభీరోపన్యాసముల ప్రజాహృదయముల సంచ లింపజేసి ప్రజల హక్కులపైపు వారిదృష్టిని త్రిప్పుటయే ఈగ్రీకురాష్ట్రములు ప్రజాస్వామ్య పరముగా పరిణమించుటకు ముఖ్యకారణమని కూడ బ్లంట్లీపండితుని మతము.

ఈగ్రీకు ప్రజాస్వామ్యము (సిద్ధాంతములో నయినను) ప్రస్తుత బ్రిటిషు లేక అమెరికా ప్రజాస్వామ్యమువంటిదని మనము భ్రమపడరాదు. మఱియు 17 వ శతాబ్దమునకు పిమ్మట యూరపులో స్థాపింపబడిన ప్రజాస్వామ్యములకు మూలమంత్రములైన "స్వేచ్ఛ", "సర్వజనసమత్వము", "సోదరత్వము" గాని, "రాజ్యాధికారమునకు ప్రజలే మూలకందము" (People are the fountain source of sovereignty) అనే మూలసూత్రమునుగాని అప్పటి యీ గ్రీకు ప్రజలరాజ్యము మూలాధారముగ చేసుకొని బయలుదేరినదికాదు.[1] వాస్తవములో అప్పటి ఏథెన్సులో ఏపౌరుడును యీసూత్రము ఎఱుగడు. ప్రజాస్వామ్యసిద్ధాంతములపై యీ విధానము బయలుదేరకపోయినను అంత ప్రాచీనకాలమున మానవజాతి శైశవావస్థలో నుండెనని తలువబడిననాడు, పౌరులందరు తమపురపాలనను చేసుకొనుటకు ప్రవర్తించుటయే ఘనమైన విషయముగా నెన్నబడి దీనిచరిత్ర నవీనులకు ఎంతయుద్దీపకముగా నున్నది.

---

1. వర్తమానమున రాజ్యాధికారము వ్యక్తినుండి సాధ్యమైనంత తక్కువగా సమాజజీవనావసరం నిమిత్తము, రాష్ట్రమునకు దత్తమయ్యెననియు, గ్రీకులనాడు రాష్ట్రమునుండియె రాజ్యాధికారము క్రిందికిదిగి వ్యక్తుల పరమయ్యెనని సిద్ధాంతమనియు బ్లంట్లీమతము.

అందుచే పైదృష్టిలో గ్రీసురాష్ట్రములోని ఏథెన్సు ప్రజాస్వామ్యము యొక్క విలువను మనము గుర్తించవలెను గాని నవీనప్రజాస్వామ్యములనుబట్టియు, ఏతచ్ఛిద్ధాంతములను బట్టియు, రెండువేలఅయిదువందల సంవత్సరముల పూర్వము నాటి యీచిన్ని ప్రజాస్వామ్యమును అవలోకించుటకు వీలు లేదు.

ఎథీనియన్ పౌరసభలోని అధికసంఖ్యాకులు పూర్వ సాంప్రదాయములకు, శాసనములకు నిర్వచనము చెప్పగలరు గాని, యిప్పటి ప్రజాస్వామ్యములలోని శాసనసభలలోవలె వానిని రద్దుపఱచజాలరు. ఇప్పటివలె పౌరులు ప్రతినిధుల నెన్నుకొని (Representative Government) తద్వారా శాసనాధికారము చెలాయించుట వారికి తెలియదందురు. పైగా అప్పటి పౌరుని బాహ్య, అంతరంగికజీవితములు (Public and Prviate life) ప్రభుత్వవిధి నిషేధములకు లోబడవలెను. ప్రభుత్వదృష్టిలో తెగ (Tribe) యొక్క వ్యక్తిత్వమునకు ప్రాధాన్యమిచ్చెడు సంఘము ప్రధానము గాని వ్యక్తికి ప్రత్యేకతలేదు. శాసనములుచేయుట, వానిని అమలుజరుపుట, వాని ననుసరించి తీర్పుచెప్పుట అను నేటి ప్రజాస్వామ్యములోని ప్రభుత్వములు వేఱువేఱుగా, వేఱు, వేఱు అధికారులద్వారా నిర్వర్తించుకొను ధర్మములు అర్కను (Archon) అను యేకవ్యక్తిగాని లేక ప్రజాసభగాని నిర్వ ర్తించుచుండెను. నవీనప్రజాస్వామ్యసిద్ధాంతములను యేథెన్సు

పౌరుడు ఎంతమాత్రము ఎఱుగడుఅనుట సిద్ధమే. ఇదియేగాక అప్పటి ప్రపంచపరిస్థితులు—అనగా రాష్ట్రభావము తమ పురసరిహద్దును దాటి అధికవైశాల్యతను పొందజాలకపోవుట, వ్యక్తినిబట్టి గాక, గణ, జాతి ప్రాధాన్యమునుబట్టి పౌరస్వత్వము యేర్పడుట, ఈగణములలోను, జాతులలోను పూర్వమునుండి ప్రబలియున్న ఆచారములు, విశ్వాసములయందు మూఢనమ్మకము; గణమునకును మఱియొక గణమునకును లేక పురరాష్ట్రముల మధ్యను నిరంతరము పోరుజరుగుచుండుట, గణక్షేమముకొఱకు, గణదృష్టినే అధికారులు ప్రధానముగా పెట్టుకొనవలసి వచ్చుటవలన ఆరోజులలో వ్యక్తిస్వాతంత్ర్యవికాసమున కవకాశము లేకపోవుట; ఇప్పటివలె ప్రభుత్వము భిన్నభిన్నశాఖలుగా చీలిపోవుటకు తగినంత వ్యవహారబాహుళ్యక్లిష్టత్వములు లేకపోవుట ; పైలక్షణములు ముఖ్యకారణములు. అయితే "సాంఘికవాద"మని బయలుదేరిన యీ ఆధునికప్రజాస్వామ్యముయొక్క నూతనపరిణామములో కూడ, శాసన, కార్యవర్గ, న్యాయశాఖల, ఏకత్వము వ్యక్తిస్వాతంత్ర్యము సంఘక్షేమదృష్ట్యా సంకుచిత పరచుట తిరిగి అంగీకరింపబడుచున్నది. కాని వీనికి వెనుకనున్న ఆశయములకున్ను, పై గ్రీకువిధానమునాటి ఆశయములకును హస్తిమశకాంతరభేదము కలదు.

పై అంశముల స్పష్టార్థముకొఱకు అప్పటి గ్రీకునగరప్రజాస్వామ్యములలో మిన్నయై యుండిన ఏథెన్సునగరము

లోని ప్రభుత్వము నిట సంగ్రహముగా దెలిపెదము. సదరు పౌరులు (బానిసలు, స్త్రీలుగాక వీరు సుమారు ౩ లక్షలు ఉందురు) సుమారు ముప్పదివేలమంది యేకశాసనసభగా సమావేశమగుటకు దండోరామూలముగా నాహ్వానింపబడు దురు. ఇందు సభ్యుడుగా నుండువ్యక్తికి ౨౦ సంవత్సరములు పై బడవలెను. ఈసభ సమావేశమునకు కనిష్ఠసంఖ్య (quoram) ఆరువేలుండవలెను, ఈ సాధారణ (Acclesia) సభవారు [1] (దీనినే ఎక్లీజియా అనెదరు) సాలున కొకసారి పదిమంది సైన్యా ధిపతుల నెన్నుకొనెదరు. వీరిలో నొకరు ప్రధానులుగా నుం దురు. సివిలు ఉద్యోగీయులను చీట్లు మూలముగా (lot) యీ సభవారు నియమించెదరు. [2] ఇందువలన రాష్ట్రపాలన కంటె రాష్ట్రరక్షణకు ఆరోజులలో ప్రజలు యెక్కువ ప్రాము ఖ్యతను యివ్వవలసినట్లు విశదము కాగలదు. ఈక్రిందవిధ ముగా యీ సర్వపౌరులతో కూడిన శాసనసభవారు తిరిగి

---

1. ఇట్టిపద్ధతి యొక్క చిహ్నాలు నేటికిని భారతదేశములోని ప్రతి గ్రామములోను మనము చూచుచునే యున్నాము. మఱియు వేదములలో కూడ వీరప్రజే, యజ్ఞపురుషుని వలన యజమాను నిచే కాంక్షితము అగుచుండెను. జాతులు తమస్థితిని బలపఱచు కొనుటయే ప్రధానధర్మముగా నిడుకొనిన రోజులవి.

2. ఈ సభ గానురాను ప్రతివారము కూడ సమావేశమగుచు సర్వ రాజ్యాధికారము అనగా, విదేశ రాయబారుల నివేదికల వినుట, వారిని నియమించుట. సంధి. యుద్ధముల గూర్చి నిర్ణ యించుట, పౌరహక్కుల ప్రసాదించుట ; జయింపబడిన నగర

తాము సమావేశమగువఱకును కార్యనిర్వహణము చేయుటకు వ్యవహారవర్గము (Executive) ను ఏర్పరచుచుండిరి. తమ రాష్ట్రములోని ప్రతిగణమునుండియు ఏబది సంఖ్య చొప్పున అయిదువందల సంఖ్యగల ఒక ఉపసంఘము నెన్నుకొనెదరు.[1] ముప్పదిసంవత్సరములలోపు వయస్సుగల వ్యక్తి యిందలి సభ్యత్వమున కర్హుడు కాడు. ఏవ్యక్తియు తన జీవితములో రెండు పర్యాయములకంటె అధికముగా యీవర్గములో సభ్యత్వమున కర్హుడు కాడు. ఒక్కొక్క గణమునకు సంబంధించిన యీ బదిమంది ప్రతినిధులు సంవత్సరములో పదవవంతు కాలమునకు అనగా ముప్పదిఅయిదు దినములకు ప్రభుత్వాధికారము వహించెదరు.[2] ఈ ఉపసంఘమువారే తమ కాల

ముల యోగమును నిర్ణయించుట, 35 రోజుల కొకసారి రాష్ట్రపు జమాఖర్చుల నివేదికను స్వీకరించుట; పన్నులు, కప్పములు మున్నగు సర్వహక్కులను చెలాయించుచు, తాము యేర్పఱచిన 500 సంఘములవారిని కేవలము తమ సభకు కార్యక్రమం తయారుచేయు గుమాస్తాలుగా మార్చిన రోజులు కూడ కలవు.
(Theory of State by Blenchili P. P. 460.)

1. సోలోను ధనవంతులు వివేకవంతులతోను గూడ రాజ్యాధికారము వహించవలెనని యేర్పరచిన సేనేటు సభయే క్రమముగా యీ "ప్రిటనీ" వర్గముగా తగ్గిపోయినది.

2. అనగా అప్పుడు సభ్యతకు మూలము తెగ (Tribe) గాని వ్యక్తి గాదు. ఏథెన్సు నగరములో నున్న భిన్నగుణముల మధ్యకూడ ఏకత్వము కుదురలేదనియు నవీన రాచకీయ పరిభాష ప్రకా

ములో సమావేశమగు పౌరసాధారణ సభకు కార్యక్రమమును నిర్ణయించవలసి యుండురు. ఈ సంఘము వారు రోజున కొకరు చొప్పున అధ్యక్షుని చీటీవేసి యేర్పరచెదరు. పై అయిదు వందల సంఖ్యగల సాధారణ కార్యసభకు, లోబడిన, యేబది సంఖ్యగల కార్యవర్గము వారి అధికారము, వారినియమిత కాలములో సంపూర్ణము. కాని వీరి యధికారమును నామమాత్రముచేసి యావత్తు అధికారము యెక్లీజియాసభ వారే చెలాయించిన కాలమున్ను కలదు. నేటివలె యీ సంఘములకు రాజుగాని అధ్యక్షుకుగాని లేరు.

ప్రస్తుత ఆధునిక ప్రభుత్వములలో శాసనములు రెండు విధములుగా నున్నవి. రాజ్యాంగమునకు సంబంధించినవి అనియు (Constitutional Law) నిత్యపరిపాలనకు సంబంధించిన వనియు (Statutory Law) ఇట్టి విభేదములు అప్పుడుకూడ యుండెను. ఇట్టి సవరణలకు సంబంధించిన అంశములు ఉపసంఘములకు రిఫరు చేయుబడుచుండెను. వాని

రము ఈ తెగలలోని ప్రజలు (People) జాతీయ ప్రజలుగా (nation) పరిణామమును పొందలేదని పై అంశము ఋజువు చేయుచున్నది. ఏథెన్సు ప్రజాస్వామ్య మనగా కేవల ఏథెన్సు నగరాభిమానులైన పౌరుల రాజ్యముగాక ఏథెన్సు నగరస్తులైన గణముల సమ్మేళనమని మనము గుర్తించవలెను. ఈగణము లన్నియు దేశాభిమానము మూలపీఠముగాగల జాతిగా పరిణామమునొందు అవస్థయొక్క అంకురములు, పదహారవ శతాబ్దాంతము వఱకును యూరపులో గోచరించలేదు.

నిర్మాణములకు భిన్నవిధానము లుండెను. ప్రతి ముప్పది యైదు దినములకును యావత్పౌరసభ జరుగును. ఈవ్యవధినే "ప్రిటనీ"(Pritany)యందురు. యావత్పౌరులున్న అధికారమును వహించు "యెక్లీజియా" మహాసభకు ౫ రోజులుముందుగా సభను గూర్చి పైన తెలిపిన రీతిగా ప్రచురణ కావలెను. ఈ మహాసభలో ప్రతిపేరునకును పాల్గొనుటకు హక్కుండినను గంభీరోపన్యాసకులు తప్ప యితరులు పాలు పుచ్చుకొనుట అరుదుగా నుండెను. డీమోస్తనీసు, సిసీరోవంటి మహోపన్యాసకులు, ఈ సభలలో విహరించినవారే. వాగ్వశీకరణశక్తి పైననే అప్పటి తీర్మానముల గతి చాలవరకు ఆధారపడియుండెను. కాని గంభీరోపన్యాసముల ప్రజామానసములను శాస్త్ర వ్యతిరిక్తమార్గముల త్రిప్పినవారు శిక్షింపబడుదురు. తీర్మానము నుపసంఘములకు పంపుపద్ధతి కూడ అప్పు డుండెను.

వార్షికసమావేశములో పౌరసభవారిచే నియమింపబడిన ఉపసంఘము సాలునరి సాధారణ సభకు కార్యక్రమము నిర్ణయించుటయేగాక యావత్తు పరిపాలనపైనను, ధనవ్యవహారములపైనను తనిఖీ వగయిరా యధికారములు గలది. ప్రతిపౌరుడును యీ కమిటీవారియొద్ద తన కష్టసుఖములను చెప్పుకొనుటకు పోవచ్చును. సాధారణ సభవారికి లోబడి ముప్పదియైదు రోజులు అధికారములో యుండు యేబదిమంది సంఘమువారు వారి నియమితకాలములో పనిచేయుదురు. ఈ విధానము రూపములోను, నడవడిలోను, ప్రస్తుత రష్యా

లోని సోవియట్ ప్రజాస్వామ్యమును పోలియుండుట వింతగా నున్నది! కాని అప్పుడు, కృషి, వాణిజ్యము, మున్నగు వృత్తులు చేయుట ఈ "పౌరులు" గౌరవప్రదముగా భావింపలేదు. ఈ పను లన్నియు బానిసలచే చేయించుచుండిరి. వృత్తిగౌరవా భావము, "పాటు"నకై తమకంటె యెనిమిదిరెట్లకు మించిన బానిస లుండుటవలననే యీ పౌరు లందరు స్వయముగా పరిపాలనలో పాల్గొనుటకు వీలగుటకు ముఖ్యకారణము. ఆధునిక ప్రజాస్వామ్యములలో ప్రతిపౌరుడును తాను పంపిన ప్రతినిధిని, ఒకప్పుడైనను కనిపెట్టి చూడలేకపోవుచున్నాడు. ఎందుచేత? బైౖసుపండితుడు తెలిపినట్లు ప్రతిపౌరుడు ముందుగా కుటుంబపోషణమునకై చూచుకొనవలసివచ్చుటచేతనే.

ఈనగర ప్రజాస్వామ్యములలోని పౌరులకు తమ నగరముల కవతలనుండిన విశాల రాష్ట్రభావములేదు. పైగా రాజ్యవిస్తీర్ణము హెచ్చినకొలదియు, ఎన్నికపద్ధతివలన ప్రతినిధుల నేర్పఱచి వారివలన శాసనసభను యేర్పఱచి ప్రభుత్వము నడుపుట వారికి తెలియదు. ఆధునిక పరిస్థితులనుబట్టి వచ్చిన జాతీయత వారికప్పుడులేదు. ప్రస్తుతకాలములోవలె రాష్ట్రముల కూడికవలన యేర్పడు సమాఖ్య విధానతత్వము కూడ (Federal state) నేటివలె వారప్పుడు గ్రహించుటకు వీలులేదు. అందుచే అప్పటి యీనగర ప్రజాస్వామ్యములు, తదితర స్వామ్యములను యుద్ధములో గెలిచి తమకు బానిసలుగా చేసికొనుటగాని, లేక తాము స్వాతంత్ర్యములను

గోలుపోయి యితరరాష్ట్రములకు లొనిసలగుటగాని తప్ప వేఱుమార్గము లేదు. కాని అప్పటి యేథెన్సు, స్పార్టా మొదలైన ప్రజాస్వామ్యములు సమాఖ్యావిధానముపై పరిషియా దేశముయొక్క భయమువలన [1] ఒక విధమైన సమ్మేళనము (Confederacy) లోనికి వచ్చెను. కాని సమాఖ్యా విధానమునకు మూలమైన "సమత్వ" భావము వీరిలో కుదరలేదు. అందులకే యీ యేథెన్సు ప్రజాస్వామ్యము తదితర నగరములతో కలసి "డోల్సు" దగ్గర (Confederacy of Doles) సమ్మేళనముగా యేర్పడినను, వారిపై తన ఆధిక్యతను (Hegemory) స్థాపించుకొనుటకు పిమ్మట కృషిచేయుటవలన తదితర నగర ప్రభుత్వములకును, ఏథెన్సుకునూ క్రీ. పూ. ౪౩౧–౪౦౪ లో జరిగిన పిలపోనీషియన్ యుద్ధపు దెబ్బనుండి కోలుకొనలేక పోయినది.

పై యంశములనుబట్టి రాజ్యాంగ పరిణామములో యేథెన్సు ప్రజాస్వామ్యమునకు ముందు స్థానము లేదని తెలియగలదు. తన నెదుర్కొనిన నూతన పరిస్థితులను, సమస్యలను దాటగలశక్తి యీబస్త్రీరాజ్య విధానమునకు లేకపోయినది. అందుచే అంతటితో తాను ప్రళయమును పొందినప్పటికిని క్రీ. పి. సుమారు ౧౫౦౦ సంవత్సరముల పిమ్మటతిరిగి యూరపు

1. చూ. ఈసమ్మేళన ఫలితముగా అంతర్జాతీయ ధర్మశాస్త్రము కొంత యేర్పడుట (International Law) దీనినిబట్టి యీసమ్మేళనలోని రాష్ట్ర పౌరులమధ్య తీర్పులుకూడ జరుగుచుండెను.

ఖండములో బయలుదేరిన "రినైసాన్స" కాలములో ప్రాచీనమువైపు దృష్టిమరల్చిన యూరపుఖండ ప్రజలకు, ప్రజాస్వామ్య భావముల నుద్దీపనజేసిన దీపశిఖగా శోభిల్లినది.

ఈజిప్టు, సుమేరు, చైనా, ఉత్తరహిందుస్థానము—యీ ప్రాచీనదేశములో గూడ, గ్రీకు ఆర్యులవలెనే (గ్రీకులకు పూర్వమే)—నగరరాజ్యవిధానము రాష్ట్రప్రజాస్వామ్యవిధానముతో ప్రభుత్వములు బయలుదేరెను. ఇవి పరిణామములో రాజస్వామ్యములైనవి. కాని, గ్రీసురాష్ట్రములు తుదివరకును ప్రజారాష్ట్రములుగానే యుండి నిర్గమించినవి. యిందులకు కారణము యీనగరరాష్ట్రములు "ద్వీపము"లుగా నుండుట, పర్వతములు మొదలైన స్వాభావికపు సరిహద్దులు రాష్ట్రముల మధ్యనుండుట, అని వెల్సుపండితుని అభిప్రాయము. రాష్ట్రమునకును, రాష్ట్రమునకును మధ్యగల సముద్రములు—దేశమంతయు నేకప్రభుత్వముక్రిందకు వచ్చుట కవరోధములు.

ఈ గ్రీకులబుద్ధి వైభవమును రాచకీయరంగములో ప్రదర్శించిన తత్వవేత్తలలో ప్లేటో, అరిస్టాటల్ అనువారలు ముఖ్యులు. ప్లేటోకు పూర్వమే యీయన గురువైన సోక్రెటీసు జిజ్ఞాసువు అప్పటి ప్రజలలో తనబోధవలన, నూతనభావోదయమునకు కారకుడాయెను. జీవితమస్థిరమనియు, ప్రతియంశమును తర్కించిన పిమ్మటనే దానిని యంగీకరింపవలెననియు, ఆచారములనుగాని, సంస్థలనుగాని మూఢముగా ననుసరించరాదనియు, యీయన వాదములలోని సారాంశము. అప్పటి

మూఢనమ్మకములు, ఆచారమును చలింపజేయుటకైనను, సుతరాం అంగీకరించని ఏథెన్సు ప్రజలకు యీయన రాష్ట్ర ద్రోహిగ కనబడెను. "ఎనేటస్" (Anatys) అను పౌరుని పుత్రుడు సోక్రెటీసునకు శిష్యుడై యీయన బోధనల వలననే, త్రాగుబోతుగా పరిణమించెనను నెపమున యీసోక్రెటీసును, యీభావస్వాతంత్ర్యజ్యోతిని, అప్పటి ప్రజాప్రభుత్వమువారే ద్రోహిగా నిర్ణయించి విషపానము నిచ్చి ప్రాణములదీసిరి. (క్రీ. పూ. ౩౯౯).

ప్లేటో—ఈయన శిష్యుడు ప్లేటో (B. C. 427) లో జన్మించెను. ఈయన గొప్ప జిజ్ఞాసువు. మానవుని సర్వతో ముఖజీవితమును గూర్చి యీయన తర్కించెను. స్వామ్యవాద ముకూడ ఈయన జిజ్ఞాసాసారాంశములలో లేకపోలేదు. అప్ప టికే ఏథెన్సు ప్రజాస్వామ్యపతనము, గ్రీకుదేశములోని అంతః కలహములు, చూచినవాడగుటవలన ప్రజాసామాన్యమే రాజ్య ముచేయు విధానము, అధమతరగతిలోని దని తెలిపినాడు. మానవాత్మ, విజ్ఞానము, పౌరుషము (పురుషకారకమును గూర్చి ప్రేరేపించుశక్తి) ఇంద్రియచాపల్యత—వీనిలో కూడు కొనియుండుననియు, యీవిజ్ఞానము పౌరుషముపైనను, ఇంద్రి యములపైనను యాజమాన్యము వహించినప్పుడు, యెటుల మానవునకు శాంతి సౌఖ్యములు చేకూరుచున్నవో, అటులే విజ్ఞానులు పాలకులుగాను, పౌరుషవంతులు రక్షకులుగా నుండు నట్టియు, ధనోత్పత్తి కారకులును, కాయకష్టము చేయువా

షను పైరెండుతరగతులవారికి లోబడి అనుకూలురుగ నుండు నప్పుడే, రాష్ట్రము సామ్యావస్థలో నుండునవనియు; ప్రభుత్వ మనునది వ్యక్తియొక్క ఆత్మ్యత్మనుష్యభావముయొక్క వికాస స్థలముగా నుండవలెననియు, సంఘీయుల మానసికతత్త్వముచు సుగుణదుర్గుణములు, వారిప్రభుత్వములో ప్రతిఫలించుననియు, యీయన ఆదర్శములు, సిద్ధాంతములు. యూరపుఖండవాసుల ఆదర్శముల చరిత్ర యీయనకంటె వెనుకకు పోనందున, ఈయనే ఆదర్శజగత్తులో వారికి బ్రహ్మగా భాసించుచున్నాడు.[1] ఈయన తన "రిపబ్లిక్" అను గ్రంథములో తన ఆదర్శనీయమానవసంఘము యెట్లుండవలెనో చర్చించెను.

అరిస్టాటిల్ ౩౮౪–౩౨౩. ప్లేటో యెంతఆదర్శవాదియో ఆకాలవుపరిస్థితులనుబట్టి యీయన, అంతయథార్థానుభవవాది. వాస్తవజగత్తుయొక్క స్థితినిబట్టి సంఘము నడువవలెనని యీ

---

1. కాని యింతకంటెను అనాదియైన పురుషసూక్తములోని "బ్రాహ్మణోస్యముఖమాసీత్ । బాహూరాజన్యః కృతః । ఊరూతదస్యయద్వైశ్యః । పద్భ్యాగుం శూద్రోజాయత." ఇత్యాదిభాగములు పైయర్థమునే యిచ్చుచున్నది. కాని ప్లేటో సూచనలో ధ్వనించుచున్న, వీరిమధ్యగల ఎక్కువతక్కువ భావాలను పురుషసూక్తములోని ఉపమానము సమన్వయించినది. కేవలము యీ విరాట్టు పురుషుననుసు, వర్ణధర్మములకును, అవయువా అవయవి సంబంధము తెలుపుటవలన సమానప్రయోజనములు వర్ణధర్మములమధ్య నూహించుట కవకాశము గల్గించినది.

యన యాశయము. మనుష్యునకు రాచకీయజీవనమనునది (అనగా రాచకీయపరమైన సంఘముగా మేళనమగుట) స్వతస్సిద్ధమైన ధర్మము. ఈయనదృష్టిలో ప్లేటోయొక్క ఆదర్శనీయమైన ప్రభుత్వము అసంభవము. ఇక ప్రజలందఱును రాజ్యముచేయుట ప్రమాదకరము. సామాజికజీవనమనునది మానవునకు స్వతస్సిద్ధధర్మమే కాక ప్రభుత్వమనునది లేనిచో మానవునకు భద్రతలేదు ; ప్రభుత్వప్రజలకు అవినాభావసంబంధము. దానివలన ఫలితము ప్రజలకు భద్రత. అందుచే ప్రజాక్షేమమునకు ఏవిధానము యెప్పుడు తోడ్పడునో అదియే శ్రేష్ఠము. రాజస్వామ్యము (Monarchy), ప్రముఖస్వామ్యము (Aristocracy) ప్రజాస్వామ్యము (Democracy) అను మూడు పద్ధతులు, ఒకదాని వెంబడి ఒకటి (ఒకటిపడిపోయిన వెనుక మఱియొకటి వచ్చుట, అది కొంతకాలము సత్యముగా నడచి పిమ్మట అపభ్రంశరూపముగా మారుట) చక్రమువలె అమలులోనికి వచ్చుచు, పోవుచుండుట రాచకీయ జగత్తులో స్వాభావికమని యీయన తలంపు. రాజుల ప్రభుత్వము క్రమేణ నిరంకుశత్వము (Tyranny) లోనికి దిగును. వెంటనే కొందఱు ప్రముఖులు బయలుదేరి రాజప్రభుత్వము నణచివేచి తమరేరాజ్యాధిపతులగుదురు. పిమ్మటఅధికారమత్తత వీరిలో ప్రవేశించి, ఈ ప్రముఖప్రభుత్వము (Aristocracy) అధర్మ, దౌష్ట్యయుతమగును, (Oligarchy). వెంటనే ప్రజలందరు యీ విధానముపై తిరుగుబాటుచేసి ప్రజాస్వామ్య

మును స్థాపించెదరు.[1] ఈ ప్రజలరాజ్యము కొంతకాలమునకు తగుకట్టుబొట్లు లేనిదగుటవలన అవిద్యావంతులైన గుంపుల రాజ్యముగా (Mobocracy) మారును. అప్పుడు ప్రజలు తిరిగి శ్రేష్ఠవ్యక్తిని తమలోనుండి ప్రభువుగా నియమించుకొనుట వలన రాజస్వామ్యమువైపు దృష్టిని మరల్చెదరు. ఈ రాజస్వామ్యము క్రమముగా వంశపారంపర్యపు హక్కుగాను, నిరంకుశత్వముగాను భ్రష్టమగుచుండును. అరిస్టోటిల్ తలచినటుల యీవిధానముల క్రమము త్రికాలాబాధితమని నవీన రాజ్యాంగతత్వవేత్తలు ఒప్పరు. ఇంగ్లండులో రాజస్వామ్యములో నుండియే, ప్రజాస్వామ్యము వచ్చినది. ఇంగ్లండులో రాజస్వామ్యముండగనే ప్రముఖస్వామ్యమును, పిమ్మట తత్ స్థానే ప్రజాస్వామ్యమును వచ్చినవి. అందుచే ఒకవిధానముయొక్క అంతము, రెండవవిధానముయొక్క ఆదియను సిద్ధాంతమునకు ప్రవృత్తిలేదు. ఫ్రాన్సులో మొదటిపద్ధతియైన రాజస్వామ్య

1. ప్రజాస్వామ్యము అనుశబ్దము యీ భాగములో ప్రయోగించినపుడు ప్రస్తుతప్రజాస్వామ్య సిద్ధాంతముల అనుభవమునుబట్టి మనమూహించరాదు. మూఢవిశ్వాసములలోగాని, వ్యక్తిస్వాతంత్ర్యముల నణచుటలోగాని, పరసహనాభావములోగాని, క్రూరత్వములోగాని, అప్పటి ఏథెన్సు, స్పార్టాలున్ను పిమ్మటి కార్తేజ్, రోమక ప్రజాస్వామ్యములని చెప్పబడిన రాజ్యములును అప్పటిరాజ, ప్రముఖ, స్వామ్యములకు ఎంతమాత్రము తీసిపోవు.

మునుండి రెండవపద్ధతిరాక మూడవపద్ధతియైన ప్రజాస్వామ్యమువచ్చినది. వర్తమానములో ప్రజాస్వామ్యవిధానమునిన విసిగిపోయి దానిపై తిరుగుబాటు చేయుచున్న సాంఘికవాదులుకూడ రాజస్వామ్యమును కోరుటలేదు—అని తెలిపి అరిస్టాటిల్ సిద్ధాంతమును, విల్సన్[1] మున్నగు పూర్వపక్షీయులు ఖండించుచున్నారు. కాని అరిస్టాటిల్ సిద్ధాంతముయొక్క శబ్దములనుబట్టిగాక, తత్వమునుబట్టి యోచించిన నవీనులకు కూడ యీక్రమము ఆదరపాత్రమగునేమో. ప్రజాస్వామ్యములలో కూడ సర్వాధికారులు బయలుదేరుచున్న నేడు, విల్సనుపండితుడు జీవించియుండినచో తన పూర్వపక్షమును గూర్చి మరియొకసారి తర్కించుకొనునేమో.

ఈ అరిస్టాటిల్, అలెగ్జాండరు చక్రవర్తియొక్క అధ్యాపకుడై యుండెను. అలెగ్జాండరు చక్రవర్తియొక్క అభ్యుదయమే గ్రీకుదేశముయొక్క స్వాతంత్ర్యమని యీ యన చాటుచుండెను.

---

1. చూ:—ప్రెసిడెంటు విల్సన్‌గారి "రాష్ట్రము" (State)

౨

## రోమనులు

---

పిమ్మట యీ గ్రీకునాగరికత రోమనులదాడికి బలి యైనది. గ్రీకు సభ్యతలో పౌరునకు స్థానములేదు. రాష్ట్రమే వ్యక్తిత్వముగలది. రోమను సభ్యత, తాను సామ్రాజ్యముగా విస్తరించవలెనను కాంక్ష కలదైనను ప్రజాస్వామ్యమని పిలువబడిన ఏథెన్సు పౌరునకు లేని, వ్యక్తి స్వాతంత్ర్యము కొంత రోమను పౌరునకు ఇచ్చినది. పెర్క్లిస్ రాజును తాను ప్రేమించిన కన్యను పరిణయము కానిచ్చినదికాదు, యీగ్రీసు ప్రజాస్వామ్యము. రాచకీయమునుండి ఆదిలో నీతిని, మతమును విడదీసినది మొదట రోమను న్యాయశాస్త్రమే: రాచకయములను, న్యాయశాస్త్రమును, ప్రాచీన యూరపుఖండములో ప్రథమతః, క్రమపద్ధతిని నిబంధనా బద్ధము చేసినట్టి (Codification) ఖ్యాతి రోమనులదే. వ్యక్తికి ఆస్తిపైగల హక్కును నిర్వచించి భద్రత చేకూర్చినది రోమను పద్ధతియే. ఈరోమనులు క్రమేణ సామ్రాజ్య కాంక్షితులైనను (౧) ప్రభుత్వము వ్యక్తిహక్కులను అణగద్రొక్కరాదు. (౨) ప్రభుత్వమునకు రాజ్యముచేయు అధికారము నిచ్చినది పౌరులు (౩) ప్రపంచమంతయు ఏకసామ్రాజ్యము క్రిందకు రావలెనను ఉత్కృష్ట సూత్రములవంటి భావములను రోమను రాజ్యాంగము లోక

మునకు తొలుత ప్రకటించినదని పాశ్చాత్యమతము. నవీనులు ప్రజాస్వామ్యముల సమ్మేళనము మూలముగా ప్రపంచ అయిక్యతను వాంఛించుచున్నారు. యిట్టి ప్రపంచ అయిక్య భావము యొక్క ప్రసాదము రోమనులదేనని పాశ్చాత్య పండితుల మతము.[1] మధ్యకాల (Medieval period) రాజకీయ జిజ్ఞాసకుల మహద్గ్రంథములకు రోము నాగరకతాపతనమే

---

1. కాని ప్రపంచఐక్యభావమును "అహం, విశ్వం భువనమభ్యభవాం" "ఆత్మవత్సర్వభూతాని" అను సర్వవిశ్వమును ఏకాత్మలో చూపించుశృతులు ఉపనిషత్తులు భారతదేశమున యూరపుఖండ నాగరికతకు పూర్వము అతిప్రాచీన కాలములోనే ఉద్ఘోషించుచుండెనని పాశ్చాత్యపండితులు అంగీకరించవలసియున్నది. ఇక రాజకీయముగా విశ్వమునంతను జయించి దానిని ఏకఛత్రము క్రిందకుతెచ్చి విశ్వప్రజలెల్లరకు శాంతిసౌఖ్యములు చేకూర్చి మహద్యశమును పొందవలెనని రే "విశ్వజిత్" అను యాగము రాజులకు వేదములలో విధింపబడియున్నది. రఘుమహారాజు ఇట్లే చేసెను. సముద్రగుప్తుడు, అశోకుడు మున్నగు చక్రవర్తులు ఈ భావముతోడనే లోకవిజయమునకు గడంగిరి. అయితే వారివిజయములు భారతదేశపు సరిహద్దులనుదాటి, లేవనియు, రోమనుచక్రవర్తుల విజయములు పెర్షియా, ఈజిప్టు, పశ్చిమమున ఇంగ్లండు మున్నగు దేశములవఱకును వ్యాపించెను గాన ప్రపంచ ఐక్యభావము వీరి విధానములోనే గోచరించుచున్నదని పూర్వపక్షము. ఈపూర్వపక్షము న్యాయమైనది కాదనియు, ఆశయములు, యెంత పెద్దవియైనను, వ్యక్తియొక్క జీవితము పరిమితమైనది గావున సీజరు

రోమకరాజ్యాంగము. క్రీస్తుశకమునకు పూర్వము ౫౧౦సం॥లో రోములో పూర్వపు రాజస్వామ్యవిధానమంతమొందినది. నాటి రాజ్యాంగవిధానమునకు మూడుప్రధానాంగములు (౧) ఎన్నికలవలన సాలీనా నియమింపబడుచు ఒకరియుత్తరువుల నొకరు తిరస్కరించుట కధికారముగల యిద్దరు రాజ్యాధిపతులైన కాన్సల్సు అనే ఉద్యోగీయులు ("భారతగణస్వామ్యములో ద్వైరాజ్యసులను వంటివారు) (౨) ధనవంతులు, విద్యావంతులయొక్క ప్రాతినిధ్యముగల సెనేటుసభ (౩) జాతినిబట్టియు, భూవసతినిబట్టియు ఏర్పడిన ప్రజాసామాన్యముయొక్క సభ. ఈ మూడురకముల అధికారవర్గములో కూడిన ప్రభుత్వవిధానమూలముగా రాజస్వామ్య, ధనవిద్యాధికస్వామ్య, ప్రజాస్వామ్యవిధానతత్వముల మూటిని సమన్వయముచేయుటకై యత్నింపబడినది. ఈ పద్ధతిలో కూడ రాజ్యాధికారము క్రియలో "కాన్సల్సు" "సెనేటు" సభ చేతులలోనే యుండెను.

---

చక్రవర్తి విజయములు అప్పటియూరోపుఖండము ఏషియా, ఆఫ్రికాలలో కొలదిభాగము మాత్రము దాటిపోజాలక పోయెననియు, అటులనే పెద్దవైశాల్యముగల భారతదేశములోని రాష్ట్రములను సరిహద్దురాష్ట్రములను జయించుసరికే సముద్రగుప్తునిశక్తి సరిపోయెననియు, కాని భూపరిమితి కొలిచినప్పుడు రోమనుచక్రవర్తుల సామ్రాజ్యవిస్తీర్ణమునకు భారతచక్రవర్తుల సామ్రాజ్యవిస్తీర్ణమెంత మాత్రము తీసిపోదనియు వినయకుమారసర్కారుగారు తెలుపుచున్నారు. ఇది పాశ్చాత్యపండిత దృష్టిని విశాలపరచుటకు తోడ్పడునని నమ్మెదము.

పౌరస్వత్వము ఇక్కడకూడ బానిసలకులేదు. ఇంతేకాక యీ రోమనులలో "పెట్రీషియన్" "ప్లెబియను" అను రెండుతెగ లుండెను. పౌరస్వత్వము పెట్రీషియన్ తెగవారికేగాని ప్లెబియనులకు మొదట లేకుండెను. ప్లెబియనులు తమహక్కులకై పోరాడజొచ్చిరి. చివరకు కొంతకాలమునకు తమవైరరాష్ట్రమైన కార్తేజియనులనుండి ఆత్మరక్షణ చేసికొనుటకుగాను పెట్రీషియనులు, ప్లెబియనులకు సమాన ప్రతిపత్తినిచ్చి యీ గృహచ్ఛిద్రమును నివారణచేసికొనవలసి వచ్చినది. పిమ్మట క్రమముగా కొంతకాలమునకు గాని ఉద్యోగములలోను అంతర్వివాహాదులలోను ప్లెబియనులకు సమత్వము అంగీకరింపబడలేదు. ఈ సమస్యాపరిష్కారానంతరమున, రోము ప్రభుత్వములో నూతనదోషము ప్రాకినది. ధనవంతులు, భూస్వాములు, విద్యాధికులు ప్రభుత్వమును వశపఱచుకొనజొచ్చిరి. తమ శత్రురాష్ట్రమును గూర్చిగాని, తజ్జనులగూర్చిగాని క్రూరత్వమును వెల్లడించుటయే యుక్తమువౌరని, ధర్మముగా నెంచబడుచుండెను. ఇంచుమించు రాజ్యాధికారమంతయు సెనేటుసభ్యులైన ధనవిద్యావంతులది. తమ వారికడ్డున్నారని తలచినచో ప్రజాసహస్రములనైనను బలియిచ్చెదరు వీరు. ఈ సెనేటుసభలో తమవ్యతిరేక దేశముల వారిపేరు చెప్పి యెన్నిలక్షలనైనను నిర్హేతుకముగా సైన్యాధిపతులు నఱుకవచ్చును. క్రూరత్వము, హత్యయనిన అప్పటిరోమనులకు యేవగింపేలేదు. అందులకే అప్పటిరోమను రాజ్యవిస్తీర్ణము

 క్షీణ

ఆనాటిప్రజలలో కొన్ని దశలక్షల కళేబరములపై నిర్మింపబడి నదని, వెల్సుగారు వ్రాసియున్నారు. ఈ కాన్సలులు అను వారు మొదటలో సెనేటుసభవారి యాజ్ఞాబద్ధులై యుండెడి వారు. కాని యీ సెనేటుసభకు పరరాష్ట్రములపైగల విజిగీషను, క్రూరత్వమును అవకాశముగా తీసికొని దానిని వారి యందు మరింత ప్రేరేపించి తద్వారా యుద్ధములను కల్పించి దేశమును యుద్ధావస్థలో నుంచుట మూలముగా వీరు నిరంకుశప్రభుత్వమును చెలాయించుచుండెడివారు. చివరకు వీరు పురికొల్పిన సెనేటుసభవారి క్రూరత్వము యీ కాన్సలులమీదకే తిరుగబడి, అనేకమంది యీ కాన్సలులు దేశద్రోహులుగా సెనేటుసభవారి క్రోధమునకు గురియై సిలువ వేయబడుచుండిరి. ఇంకొక చిత్రము. సెనేటుసభ ప్రారంభమునకుముందు మృగబలి యివ్వఁడును. ఏదైన ఒకసమస్యపై చర్చ జరిగి సమ్మతులను పుచ్చుకొను సమయములో పూజారులువచ్చి తత్సమయము శుభకరముగా లేదని చెప్పినచో తత్క్షణము వోటింగు ఆగిపోవలసినదే. ధనవిద్యాధికులు, జనసామాన్యమును పీడించి పైవిధముగా వారికి అక్రమము చేయుట, మూఢవిశ్వాస నమ్మకములకు దాస్యము, తాము జయించిన సామ్రాజ్యములోని ప్రజలకు పౌరహక్కులను నిరాకరించుట, నిరంతర శత్రురక్తపిపాస, అందువలన నిరంతరము సైన్యాధిపతుల అధికారము స్వీకరింపవలసివచ్చుట, ప్రాతినిధ్యపద్ధతి వారికంతగా తెలియకుండుట మున్నగుదోషములవలన యీ

రోమను సామ్రాజ్యము, నూతనరాచకీయ జీవితపరిణామము లో—ముఖ్యముగా ప్రజాస్వామ్యవిధానపరముగా—ఆదిని ఘన స్థానము వహించినను (రాజ్యవిస్తీర్ణము హెచ్చినకొలదియు) దానికి కారకులైన కాన్సులులయొక్క నిరంకుశపు విధానము లోనికి దిగెను. పిమ్మట యీ కాన్సులులే చక్రవర్తులగుటవలన, యిది రాజస్వామ్యముగా పతనమై పోయినది. ౧౨ మైళ్లు వైశాల్యముగల రోము నగర స్వామ్యముతో ప్రారంభించి క్రమేణ తలలెత్తిన యీ ప్రజాస్వామ్యాంకురములు క్రమముగ దేశమును వశపఱచుకొనిన రాజస్వామ్యనిరంకుశత్వముక్రింద నశించినవి. క్రీ. శ. (23) సంవత్సరములోని కాన్సులు అయిన, జ్యూలియస్ సీజరు విజేతతో యీ ప్రజాస్వామ్యపతనము ప్రారంభమయ్యెను. జ్యూలియస్‌సీజరు అఖండముగా రోమను సామ్రాజ్యమును విస్తరింపజేసి, విజయసేనతో రోము నగరమును ప్రవేశించినప్పుడు తనమిత్రుడైన మార్కు ఆంటనీ—తనశిరస్సుపైన పెట్టబోయిన సార్వభౌమచిహ్నమైన కిరీటమును, చక్రవర్తిత్వమునకు పాబడని ప్రజల యేవగింపుచూచి తిరస్కరించెనుగాని లేనియెడల దానిని ఆయన వదిలవఱచుకొనువాడే. తాను దేవుడనని, తానుజీవించియుండగానే తన విగ్రహమునకు పూజాపునస్కారములు చేయించెను యీరాయన!

తాము జయించిన రాష్ట్రములయొక్క స్థానికాధిమానము నాశనముచేయుట, మిశ్రభేదతంత్రము ప్రయోగిం

చుటకూడ యీ సామ్రాజ్యలక్షణములు తాము జయించిన దేశములవారికి ప్రభుత్వములో స్థానమీయవలెనన్న యీ వత్తు యూరప్ ఖండమునకు ప్రాకిపోయిన యీ రోమకసామ్రాజ్యమునందు ప్రాతినిధ్యవిధాన (Representative Government) ము నంగీకరించవలసియుండెను. అందులకీ విధానము ఒప్పుకొనలేదు. అందుచే సిద్ధాంతములో రోమక రాజ్యాధికారమునకు, ప్రజలే మూలకందమని, ప్రజాస్వామ్య పతనాంతరపు విజగీషులైన చక్రవర్తుల పాలనములో కూడ నంగీకరింపబడుచుండినను (Institutes and Digest of Emperor Justinian A. D. ౫౩౭—౫౬౫) ఆచరణలో నిరంకుశవ్యక్తిపాలన క్రిందనే యిది పతనమయ్యెను. ఒక్క రోమునగరముతోను (క్రీ. పూ. ౭౫౩) నగరప్రజాస్వామ్యముతోను ప్రారంభించిన, ఈ ప్రజాస్వామ్యవిధానము క్రమముగా సామ్రాజ్యరూపకముగా, అప్పటి ప్రపంచజ్ఞానమునుబట్టి, బ్రహ్మాండసామ్రాజ్యముగా మారి క్రమశఃపూర్ణ రాజస్వామ్య యుతమైన నిరంకుశప్రభుత్వముగా మారినది. కాని పరిపూర్ణ నిరంకుశపువిధానముతో యింగ్లండులో ప్రారంభించిన చిన్న ఆంగ్లోశాగ్జను రాజస్వామ్యములు క్రమముగా బ్రిటిషురాజ స్వామ్యముగా మారి నేడు ప్రపంచములోని సర్వరాజ్యములను మించిన సామ్రాజ్యముగ విస్తరించుటయు, తుదకు తానును, తనక్రింది దేశములును — భారతదేశము తప్ప — ప్రజాస్వామ్యము

లుగ పరిణమించుటయు, పై రీతికి తలక్రిందులుగ నున్నది. దేశ కాలపరిస్థితులభేదమే యిందులకు కారణము.

జ్యూలియస్‌సీజరుతో తలయెత్తిన యీ రాజస్వామ్య విధానము పిమ్మటవచ్చిన క్రైస్తవమతమునాటికి సంపూర్ణమై పదిహేనువందల సంవత్సరములు క్రైస్తవమతపీఠముయొక్క "మద్దతు" తో యూరపుఖండములో విహరించెను. ఈ రాజ స్వామ్యములో అనేకమంది చక్రవర్తులు ప్రజారంజకముగా ధర్మపాలనజేసిరి. క్రీ. శ. 3 వ శతాబ్దములో రోమనుసామ్రా జ్యము రెండుగా చీలిపోయెను. తూర్పుభాగము బైజెన్టైన్ (Byzintine) సామ్రాజ్యమనుపేరుతో నుండెను. పడమటి భాగము ట్యూటనులదాడికి వశమగుచు క్రీ. శ. ౪౧౦ సం॥ర మున ఆల్‌రిక్కు అను (Alric) గాత్ నాయకుడు రోమునగర మును వశపఱచుకొనెను.

కానిస్టెంటైన్ రాజు దీనిముఖ్యస్థానమును రోమునుండి "కాన్‌స్టాంటినోపిలు"కు మార్చెను. ఈ రాజస్వామ్యములో రోమను సామ్రాజ్యము నామమాత్రముగా నుండెను. కాని "చారల్‌మాగ్నే" (క్రీ. శ. ౮౦౦) కాలములో ఇది "పవి త్రరోమను సామ్రాజ్య"మను (Holy Roman Empire) పేరుతో తిరిగి కొంచెము ఔన్నత్యములోనికి వచ్చెను. పిమ్మట క్రమముగా దక్షిణభాగమంతయు అరబ్బులకు, మహమ్మదీ

యుల దాడికిలోనై కాన్‌స్టాంటినోపిలునవా వారివశమయ్యెను (క్రీ. పి. ౧౪౫౩).

ఈ ప్రాచీన రోమకప్రజాస్వామ్యముకూడ నేడు ప్రజాస్వామ్యములని మనము పిలచే విధానములతోనైనను పోల్ప దగినది కాదని పై యంశములే ఋజువు చేయగలవు. అందులకే యీ ప్రాచీనప్రజాస్వామ్యమును వెల్సుపండితుడు "నవీన ప్రజాస్వామ్యములయొక్క ప్రాకృతరూపము—భయంకరమైన ప్రాకృతరూపము (Neander thalic Variety of Modern Democracies) అని తెలిపినది సత్యముగా నున్నది. కాని నవీనప్రజాస్వామ్యములనునవి యెంతవఱకు అప్రాకృతరూపములోకూడ తెల్పుట—బెర్నార్డుషావంటి వారి జిజ్ఞాసాపథంలో కష్టముగానే యున్నది.

---

## 3

## క్రైస్తవమతము — ట్యూటనులు — తత్ఫలితముగా రాజ్యాంగభావములో గల్గినమార్పులు

---

ఇంతలో క్రీస్తుపుట్టుట ; ఆయన మతప్రచారము ; ఆయనను రోమను న్యాయాధిపతి అప్పటి నిబంధనలప్రకారము సిలువవేసి దేహవిముక్తుని జేయుట జరిగినది. మూఢాచారములు, జీవహింస, బహుదేవతారాధనము మున్నగు అజ్ఞానమునకు లోబడి తపించుచున్న యూరపుఖండవాసులకు ఏకేశ్వరోపాసనయు, సత్యప్రేమలపై ఆధారపడినభక్తి యోగముతో కూడిన క్రైస్తవమతము శరణ్యమయినది. ఈ మతము క్రీ. శ. ౪ వ శతాబ్దమునుండి యూరపులో బాగుగా ప్రచారములోనికి వచ్చుచుండెను. క్రైస్తవమతము మూఢవిశ్వాసముల బోనాడినది. మానవసోదరత్వమును నిరూపించినది. యూరపుఖండమంతు సంసారత్యాగముచేసి క్రైస్తవసిద్ధాంతానుసారము త్యాగజీవనము చేయదలచినవారి ఆశ్రమములుకూడ ఆకాలమున (Monasteries) బైలుదేరెను. వ్యక్తికిని, మతమునకును, రాచకీయజీవనమునకును గల సంబంధముచు రోమకవిధానము కంటెనుకూడ స్పష్టముగా విడదీసినది ఇది. క్రీస్తుశకములో, మతపీఠము వేఱు, రాజపీఠము వేఱు. పీఠాధిపతి ఆజ్ఞలకున్ను, ప్రజలభౌతిక కాయముపైన మాత్రము

అధికారముగల రాజుల ఆజ్ఞలకున్ను సంబంధములేదు. పైగా రాజులుకూడ దీనిని శిరసావహించవలెను. ఇంతటినుండి రోమే మతము పేరుతో ప్రజాళికి వ్యక్తి దాస్య ప్రారంభము. పూర్వము ఏకచ్ఛత్రాధిపతియై యుండిన రోమకచక్రవర్తిక్రింద ఐక్యమైన యావత్తు యూరపుఖండమున్ను రాచకీయముగా చిన్నచిన్న రాజస్వామ్యములక్రింద చీలిపోయినను, యిప్పుడు సర్వక్రైస్తవ జగద్గురుడైన "పోపు" యొక్క మతాధికారము క్రింద అయిక్యమయ్యెను. ఈ పోపులు పూర్వసామ్రాజ్యకేంద్రమైన రోమునగరముయొక్క చరిత్రాత్మకమైన ఆకర్షణశక్తిని కనిపెట్టియే సదరు నగరమును తమ మతమునకు అగ్రపీఠముగా నిడుకొనియుండిరి. ఇంతటినుండి (క్రీ. శ.) ఇంచుమించు ౧౬ వ శతాబ్దమువఱకును ప్రాచీనగ్రీసు, రోమనువిధానములలోని ప్రజాస్వామ్యసిద్ధాంతములుకూడ అట్టడగునకు పోయినవి. ఈకాలములో గల విజ్ఞానము పరిశోధనలు, యేవి యున్నను అవి మతగురువుల యాజమాన్యముక్రింద మతవిశ్వాసములకు లోబడి జరుగవలసినవే. పైగా రాజులకును, మతగురువులకును యీ కాలములో పొందుకుదురుట కలిగినది. ప్రజల ఆముష్మికమునకు మతగురువులున్ను, ఐహికమునకు రాజులున్ను నియంతలనియును, వీరిరువురకును యిట్టి అధికారము పరమేశ్వరదత్తమనియు, సిద్ధాంతములు బయలుదేరినవి. ఇట్టి సమ్మేళలోనే ౧౬ వ శతాబ్దమువఱకును అనగా ౧౨౦౦ సం॥ల దీర్ఘకాలమున యూరపుఖండములోని ప్రజాళి,

రాజస్వామ్యములనియు, ప్రముఖస్వామ్యములనియు నిరంకుశపు విధానముల క్రిందపడియుండుట తటస్థించినది. ఈ దీర్ఘకాలములో గతప్రాచీనగ్రీకు, రోమకప్రజాస్వామ్యసభ్యతలు, ప్రజల స్వప్నావస్థలో కూడ తలపునకు రాలేదు.

ప్రజాస్వామ్యచరిత్రలో యూరపుఖండమునకే గాక ప్రపంచమునకంతకు యించుమించుగా నిది సుషుప్త్యవస్థ, (Darker Age). ఏలననగా భారతగణ, ప్రజాస్వామ్యములు కూడ యీకాలములో హిందూ, మహమ్మదీయసామ్రాజ్యములకు లోనయ్యెను. ఇటులే చైనాకూడ పూర్ణముగా దేశీయ, విదేశీయ (మంచూచక్రవర్తులు) చక్రవర్తుల వశమయ్యెను.

అయితే పైన తెలుపబడిన రాజ్యాధికారము దైవదత్తము (Devine right of Kings) ను విషయములో భారతదృక్పథమునకును యూరపుఖండదృక్పథమునకును భేదముకలదు. "నావిష్ణుః పృధివీపతిః" అనగా రాజు విష్ణువంశసంభూతుడను వాదములోకూడ రాజ్యాధికారము మాత్రము ప్రజలచే నివ్వబడినట్లు రాజునకు ప్రజాభాధ్యత యుండినట్లును, ఋగ్వేదమహాభారత శాంతిపర్వము, బుద్ధసాంప్రదాయము, శుక్రనీతి మున్నగువాటివలన తెలియుచున్నది. మరియు గీతలలోని "యద్యత్ విభూతి మత్సత్వం" అను శ్లోకమును బట్టి కూడ విష్ణువంశాసంభూతత్వము నిర్ణయించవలసియున్నది. అనగా నేపటి భారతప్రజాస్వామ్యపు అధ్యక్షుని

కూడ యోగ్యతగా స్వధర్మము నెఱవేర్చునంతవఱకు విష్ణు వంశాసంభూతుడనుటకు భారతసాంప్రదాయములో స్థానమున్నది. పాలనాధికారము భగవద్దత్తమని పాశ్చాత్య మతము. వ్యక్తి భగవదంశాసంభూతుడైనను పాలనాధికారము ప్రజలనుండియే రాజు పొందవలెనని భారతదృష్టి. ఈ రెండవదృష్టియే విశాలమైనది. "రాజు" అనునది ఆదినుండియు ఒక ఉద్యోగధర్మము; అంతేకాని ఒక వ్యక్తిగతము కాదు. అను అంశము యిదివఱకే విశదీకరింపబడినది.[1]

---

1. భారత సాంప్రదాయములోని "రాజు" "రాజధర్మము" అనునది ఆయాకాలములలో యెట్టి అర్థము గలిగి (హోదాతో) ప్రవర్తిల్లినదియు యిచ్చట తెలుపుట యుక్తము. వేదములలో "రాజు అను పదవి" ప్రజాసమ్మతిపై యేర్పడినట్లు స్పష్టముగనే కన్పించుచున్నది. ఈసంస్థకు దైవనిర్మాణము (Devine origin) కూడ మూలముగా మరికొన్ని స్థలములలో కనుపించుచున్నది. పిమ్మట యీ రాజత్వము నైతికసిద్ధాంతముపై పోషింపబడినట్లు కనుపించుచున్నది. ప్రజలకు రక్షణకావలెననిన రాజు

౪

## ట్యూటను సభ్యత.

క్రైస్తవమతోదయమునకు పిమ్మట నేటి జర్మనీ ఉత్తర భాగమునుండి వచ్చిన ట్యూటను జాతులవారి (వీరిని బార్బేరియనులనికూడ అందురు) దాడికి రోమకసామ్రాజ్యము—యూరపుఖండస్థరోమను సామ్రాజ్యము—బలి

---

అనే ఒక పీఠము అవసరమని యిందలి (ఈ నైతికవాదుల) భావము.

ధర్మసూత్రకాలము నాటికి యీ రాజధర్మము "ప్రజలవద్ద పుచ్చుకొనే పన్ను అను దానికి ప్రతిఫలముగా రక్షణఅనే ధర్మము చేసే ఉద్యోగము" అనే భావములోనికి బాగుగా దిగినది. అనగా ప్రతిఫల యుక్తమయిన— న్యాయశాస్త్ర దృష్ట్యా (Legal contract) (రాజు ప్రజలమధ్య) ఏర్పాటుగా యిది అన్వయించుచున్నది.

బౌద్ధసాంప్రదాయములో దైవనిర్మాణ సిద్ధాంత మంతరించినది. "గణదాసు?" "మహాజనసమ్మతుఁడు" అను విశేషణములతో యీ రాజసంస్థ కేవల ప్రజాసమ్మతిపైన నిలిచినదిగా కనుపించుచున్నది. అనగా నైతిక (Moral) న్యాయశాస్త్ర (Legal) సంబంధమునే బౌద్ధమతము ఒప్పుచున్నది.

మహాభారత మత ప్రకారము దైవనిర్మాణ సిద్ధాంతము అంగీకరింపబడినను అయోగ్యుడయిన రాజు, దైవనిర్మితుఁడను సిద్ధాంతములోనికి రాజాలడనియు, అట్టి వాని పదచ్యుతుని

మైనది. రోమనులకును వీరికిని జఱిగిన యుద్ధములు మున్నగు వివరములు యిక్కడ తెలుపనవసరము లేదు. గ్రీకు సభ్యతలో కంటె రోమనుసభ్యతలో వ్యక్తికి కొంచెము

---

చేయుట ప్రజాధర్మముగా విశదీకరింపబడినది. మఱియు సైధర్మసూత్ర కాలమునాటి "పన్ను పుచ్చుకొనునందులకు రక్షణ చేయవలె" నను సిద్ధాంతమును బలపఱచబడినది.

ఇఁక అర్థశాస్త్ర వాదమని యిందునుగూర్చి మఱియొక కమతము కనుపించుచున్నది. ఈ అర్థశాస్త్రము చాణక్యునితో బయలుదేఱిన దనుకొనుట పొరబాటు. చాణక్యుఁడే తనకు పూర్వము ప్రాచీనకాలమునుండియు యీ శాస్త్రము ప్రవర్తిల్లి యుండెనని తెలిపి దాని సాంప్రదాయ కర్తలను పేర్కొని యున్నాఁడు. ఇంతేకాక వీనికి సంబంధించిన దండనీతి మున్నగునవి సృష్ట్యాదినే పుట్టినట్లును వరుణుఁడు మున్నగువారు అర్థశాస్త్రప్రవక్తలలో నుండినటుల తెలుపుటకూడ దీని ప్రాచీనత్వము గోచరించుచున్నది. అర్థమనగా, ప్రజాజీవన పదార్థము. దానిసంపాదన, దానిరక్షణను తెలుపునది, అర్థశాస్త్రము. ఇది రూఢార్థములో రాజ్యసంపాదన, దానిరక్షణను గూర్చి తెలుపు శాస్త్రముగా వ్యవహరింపబడుచున్నది (చూ. శామశాస్త్రిగారి చాణక్య అర్థశాస్త్రము) వేదములలో రాజధర్మము నైతిక జీవనములో ఒకభాగముగా నుండినందున యీ అర్థశాస్త్రమునకును, దానివిషయమయిన రాజధర్మమునకును ప్రత్యేకత కనుపించదు. క్రమేణ అనగా చారిత్రక పరిస్థితుల ననుసరించి, మతము, నైతికములనువదలి రాజు, రాజధర్మము అను సంస్థలను గూర్చి స్వతంత్రమైన సిద్ధాంతమును చేయవలసిన కాలము వచ్చినది. అట్టి కాలములో ప్రాముఖ్యత గాంచినది అర్థ

ప్రాముఖ్యతవచ్చినది. కాని ట్యూటనుజాతి, వ్యక్తిసభ్యతయే ప్రధానముగా గలదనుటవలన యిక్కడ వ్యక్తి వికాసము హెచ్చినది. రోమనువీరుడు రాష్ట్రముకొఱకే పోరాడగలడు. కాని ఒక వ్యక్తి నాయకత్వమాతనికి ఉద్దీపకము కాదు.

---

శాస్త్రము. రాజ్యసంపాదన, రాజ్యరక్షణ అనే అర్థసిద్ధియే వీరియొక్క లక్ష్యమగుటచే, చరిత్రానుభవము, లోకదృష్టి కేవల రాచకీయసిద్ధాంతములే, వీరికి మార్గదర్శకములు. అందుచే వీరు వేదప్రామాణ్యమునుకూడ పరిగణింపనిస్థితి సంభవించినది. ఈ శాస్త్రవాదుల గుణదోషములను గూర్చి విమర్శించుట మన పనికాదు. కాని మత నైతికములను దాటిన స్వతంత్రబుద్ధితో రాజ్యాంగమునుగూర్చి జిజ్ఞాసచేయవలెనను ప్రతిపాదన ప్రథమతః చేసినదివీరు. వీరిని పాశ్చాత్యపరిభాషలో "భౌతిక వాదు" అనికూడ పిలువవచ్చును. ఈరీతిగనే రాజ్యాంగాలను గూర్చి స్వతంత్ర జిజ్ఞాసచేసిన ప్రాచీనగ్రీకు జిజ్ఞాసువులతో వీరికి కొంత పోలికగలదేమో. చాణక్య, కామందక, శుక్రులే మనకు గ్రంథకర్తృరూపముగా నిలిచియున్న యీ వాదమువారు. వీరు రాజధర్మముయొక్క "మూలము"ను గూర్చిగాక, రూపమునుగూర్చి జిజ్ఞాసచేసి వాస్తవపరిస్థితుల అనుభవముతో వారి కాలమునాటి రాజ్యాంగవిధానముయొక్క రూపమును రచించిరి. వీరి మతప్రకారము రాజు అనునది వ్యక్తిపరముకాదు; ఏడు అంగములతో కూడిన ఒకసంస్థ. ఈ యేడు అంగములు "అవయవ, అవయవి" సంబంధముగలవి. (చూ. శుక్రనీతి). రాజు అనునది యీ అంగసమిష్టిని తెలిపే సమూహశబ్దము (Theory of Co-ordination). యిది వీరిసిద్ధాంతము. సభాయుతపరిపాలనమును, ప్రజాబాధ్యతను వీరు మరువలేదు. వీరు

ట్యూటనుల వ్యక్తి రాష్ట్రమున్నను, లేకపోయినను వ్యక్తి నాయకత్వమును ఆశ్రయించి, అతనికొఱకు సర్వస్వమును అర్పించగలరు. అందుచే ట్యూటనులు ఒక సాంఘికకట్టు బాటునకు గాని, ప్రభుత్వమునకుగాని లొంగియుండజాలరు.

---

రాజ్యాధికారము రాజస్వామ్యమునందు కేంద్రీకరించి (centralised authority) యుండవలెనను వారైనను గణస్వామ్యములను నిర్లక్ష్యము చేయలేదు. ఆవిధానమునుకూడ తమ శాస్త్రములలో గమనించిరి.

౧౨౦౦ శతాబ్దమునాటికి యీ దేశముయొక్క రాచకీయముల ఫలితముగా యీ విశాలభావములు, యీస్వతంత్రజిజ్ఞాసలుపోయి "రాజు దైవాంశసంభూతుఁడ"నే యేక వాదము ప్రబలమైనదని "ఘోషాలు" గారి మతము. ఈ కాలములోకూడ "రాజశబ్దః ప్రజాపాలనాధికారధర్మః" అనే మిత్రమిశ్ర భాష్యవాక్యాలు రాజశబ్దము కేవల క్షత్రియపరము కాదనియు ఉద్యోగపరముగనుక క్షత్రియేతరులైనను ధర్మపరిపాలనము చేయువారందఱికిని వర్తించునను మేధాతిథి విశాల నిర్వచనములు కూడ గలవు. అయితే దీనికి పూర్వపక్షవాదులుకూడ గలరు.

కాని (1) "రాజు" అనునది భగవన్నిర్మితమైన సంస్థ, (2) ఈ రాజులు భగవంతునకే బాధ్యులు (3) రాజును ప్రతిఘటించకుండుట, విధేయత గనపఱచుట, అనునవి దైవాదేశితమైన ధర్మములు, "అను పాశ్చాత్య సిద్ధాంతము (Divine right of Kings) నకును, పైభారత సిద్ధాంతమునకును యెచ్చటను పోలికయే గానరాదు." ఈవిషయమై మేము పైనగావించిన సిద్ధాంతమునకు పిమ్మట దొరికిన "ఘోషాలు" గారి "హిందూ రాచకీయ సిద్ధాంతము" అను గ్రంథములోని

ఈటుయ్యాటనుజాతి తనయొక్క ఆదిమనివాసస్థానమైన "బ్లాకు ఫారెస్టు" న నున్న (ఉత్తరయూరపు ఖండమున నున్నది) నాటి నుండియు వీరిలో స్థానికస్వపరిపాలన పద్ధతి యుండినది. అందుచే స్థానికముగ వ్యక్తిసభ్యతను గౌరవించెడి స్వపరి

---

పైవాక్యములు తెలుపబడినవి. ప్రజాక్షేమ విరోధియయిన రాజు దైవాంశ సంభూతుఁడు కాఁడనియు, ప్రతిఘటించదగిన వాఁడనియు రాజస్వామ్య వాదులైన శుక్ర (అట్టి రాజ్యమును వదలి పెట్టవలెను అని శుక్రనీతి) చాణక్యాదులుకూడ అంగీకరించు చుండగా తక్కినవారిమాట చెప్పనవసరముండదు. ఇందును గూర్చి మొదటి అధ్యాయములోకూడ చర్చింపబడినది. అచ్చట తెలుపబడిన పౌరాణిక నిదర్శనములే గాక "వేనుఁడు" అధర్మ పాలనము గావించినప్పుడు వానికి గలిగిన గతినిగూర్చి మహా భారతము తెలుపుచు, అధర్మరాజ తిరస్కారమును ధృవపఱి చెను. ప్రాచీన దృక్పథమును తెలుపుటకు యింతమాత్రము చాలును.

చైనా సాంప్రదాయములో కన్‌ఫ్యూషియస్ సిద్ధాంతము "రాజు దైవనిర్మితుఁడు" నును. మోట్జుసిద్ధాంతము "చక్రవర్తి, మంత్రులు ప్రజలు ఒడంబడిక నిబంధితులైన సన్నిహితులు" అనును. అందుచే అచ్చట రాజసంస్థయొక్క మూలమును గూర్చి రెండువాదములు కాన్పించుచున్నవి. కాని యీ పక్ష ములవారు గాని, మరియొక పక్షమువారైన న్యాయనిబంధనా పక్షమువారుగాని రాజసంస్థయొక్క మూలమెట్టిదైనను ప్రభుత్వ మునకు ప్రజాక్షేమము లక్ష్యమనియు, ప్రజాబాధ్యత వారి ధర్మమనియు అందఱును అంగీకరించుచున్నారు. "రాజసంస్థ యొటుల దైవనిర్మితమో, రాజు ప్రజాధర్మమును బాధ్యతను

పాలనా పద్ధతియు సమిష్టిగా ఒకనాయకుని అను యాయులై వానికొలకు జీవించుటయు, ఈజాతియొక్క ముఖ్యలక్షణ ములు. అందులకే. "పార్లమెంటరీ రాజ్యాంగముయొక్క తొలి మొలకలు జర్మను అరణ్యములో బయలుదేరినవి." (The germs of Parliamentary Constitution are to be found in the forests of Germany) అని మాంటెస్క్యూ తత్వవేత్త వీనినిగుఱించి యుక్తముగా తెలిపి నాడు.[1] ప్రభుత్వమునకు వ్యక్తిపై సర్వాధికారము గలదను సాంప్రదాయమునకు వీరు వ్యతిరేకులు (అనగా అట్టి సాంప్ర దాయములకు అలవాటుపడని జాతియనుట.) వ్యక్తియొక్క హక్కునుబట్టి ప్రభుత్వము పరిమితమై యుండవలెనను ఆచార ములోనివారు వీరు. ప్రాచీనకాలమునుంచియు ట్యూటను

మఱచినప్పుడు వానిని తొలగించవలెనని ప్రజలకుపుట్టు యిచ్ఛ ద్వారా భగవదేచ్ఛకూడ వ్యక్తనుగును." దీని నే అప్పుడు "భగ వంతుఁడు తన జ్యేష్ఠకుమారుఁడు (రాజు) మారవలెనని. తలచు" నని ఒక సిద్ధాంతిరాసెను(Kuoyu క్రీ.పూ. ౪౮౧–౨౭౩)క్యోయు అను గ్రంథములో "ప్రజల అభిప్రాయముల నణచుటకు యత్నించుట ప్రవాహము నడ్డుటకంటె కష్టము, ప్రజల ఆలోచి తాభిప్రాయము వ్యక్తపఱచబడినప్పుడు దానిని అమలుజరుపుట ఒక్కటే మార్గము. ఎవరును దాని నణచరాదు" అని స్పష్టీక రింపబడినది. మొదటి అధ్యాయములో చైనాను గూర్చిన భాగములోను ప్రస్తుతము తెలుపబడిన అంశములును చైనా సాంప్రదాయమును విశదీకరించును.

1. బ్లంట్లీయొక్క (Theory of State) 43 వ పుట

రాజులు పరిపాలనా విషయములలో తత్ పూర్వపు ఆర్య సాంప్రదాయాను సారము ఒకమూల సంఘములోని ప్రము ఖులతోడను, మరియొకమూల స్వతంత్రులైన ప్రజాసంఘము వారితోడను సంప్రతించుట ఆచారముగా నుండెడిది. విషయ ములను చర్చించుట, అందుపై సమ్మతులనిచ్చుట, ట్యూటను ల విధానములయొక్క లక్షణము. ప్రజాప్రాతినిధ్య పద్ధతి పార్లమెంటరీ రాజ్యాంగపద్ధతికిని మూలబీజములను యూరపు ఖండమునకు తాము చాడివెడలుచున్నపుడు, ట్యూటను జాతివారు తమతో గొనివచ్చిరనియు, వానిని తామాక్ర మించిన ప్రదేశములలో (బ్రిటనునహా) నాటిరనియు, రాచకీ యజ్ఞుల అభిప్రాయము. కాని వీరికి రోమనులకుండిన రాజ్యాంగ తత్త్వజ్ఞానము అఖిలమానవ ఐక్యతాది ఉన్నతాశయములు, సలక్షణమైన న్యాయశాస్త్రములు లేవు. తమ మోటుతనము చేతను, వ్యక్తిస్వాతంత్ర్యతా సభ్యతలచేతను, ట్యూటను జాతి వారు, రోమను సామ్రాజ్య తత్వమును బద్దలుచేసినను వారి నాగరికతను మట్టినను పైయంశములలో రోమను సభ్యతలో ట్యూటను సభ్యత యిమిడిపోయినది. ఇదియే రాజ్యాంగ చరిత్రలో మధ్యకాలమందురు (Mediaval Period—౧౧౦౦ to ౧౫౦౦ A. D.) ఈకాలములో ఏథెన్సునాటి ప్రజాస్వామ్య ములు, రోమనులును సిద్ధాంతములోనైనను అంగీకరించిన— ప్రజలనుండియే ప్రభుత్వమునకు రాజ్యాధికారము దత్తమైన దను—భావములు పూర్తిగా మూలపడిపోయినవి. రాజులు మతగురువులు అన్యోన్యాశ్రయులై తమకు, ప్రజాపాలనకు గల హక్కు దైవదత్తమను కాలమిదియె.

## అధ్యాయము—మూడు.

## ఫ్యూడలువిధానము:— (Fudalism).

రోమనురాజ్యమును జయించిన ట్యూటను జాతిలోని ప్రముఖులు యూవత్తు యూరపు ఖండమును ఆక్రమించుకొనిరి. ఆయాప్రముఖులు ఆయాప్రాంతములకు రాజులైరి. ఈరాజుల క్రింద వారి అనుచరులైన వ్యక్తులు దేశమును జమీందారీ లుగా విభజించుకొని అనుభవించుటయు, ఈ జమీందారులుం (Fudal Lords) తిరిగి తమక్రింది వ్యక్తులకు దానిని పంచి యిచ్చుటయు జరుగుచుండెను. అనగా సంఘముయొక్క అట్ట డుగున వ్యవసాయదారుడైనవ్యక్తి, వీరిపైన ముఠాదారులు, వీరిపైన జమీందారులు, యీ జమీందారులపైన సిద్ధాంత ములో మాత్రము అధికారముగల ఒక రాజు. ఈనిచ్చెనకు కడమెట్టునున్న వ్యవసాయకుడు తనముఠాదారుయొక్క పరి పూర్ణాధికారములో నుండుపద్ధతిని సదరు ముఠాదారునకు సైనికసహాయముచేయు పద్ధతినిన్నీ, సదరు ముఠాదారు యీ రైతుయొక్క ఆస్తి, స్వాతంత్ర్యమును, రక్షించుపద్ధతిని అతనికి దాసుడై (Vassal)అతని భూమినున్నకొని జీవించును. ఈ విధముగానే యితనిపై ముఠాదారులున్ను తమపై జమీన్దారు లకు, బాధ్యులు. ఈ రైతుపై న్యాయనిర్ణయాధికారము, అతను తనవర్దిలోనుంచి పోయిన, తిరిగి అతనిని తెచ్చి నిబం

ధించగల అధికారమున్ను కూడ యితనిపై ప్రభువునకుగలదు. ప్రతివ్యక్తియు యిట్టిప్రభువును ఆశ్రయించుకొనినగాని—వానిని ఒకవిధముగా శరణుజొచ్చినగాని—ఆరోజులలో వ్యక్తికి భద్రత లేకుండెను. భర్తలేనిస్త్రీ, సంఘములోనుండుట యెట్టిన్యాయ తరమో, ఆరోజులలో ప్రతి సామాన్యవ్యక్తియు ఒకప్రభు వునకు దాసుడై, ఆయనభూమిని దున్నుచుండుట సాధారణ మయ్యెను.(ఈవద్ధతిలో భారత దేశములోవలె, భూస్వామ్యము రైతునదిగాక రాజునదై యుండెను. రైతు సదరుభూమిని ప్రభుసేవ దాస్యత్వమునకు ప్రతిఫలముగా దున్నకొని యనుభవించుటకు, అవకాశముగలవాడు మాత్రమే). ఈ విధముగా నీయుగములో యూరపుఖండములోని వ్యక్తికి ఫలము భూవలితము ననుభవించుట. సంబంధము రాచకీయ దాస్యము. మతగురువులు; జమీందారులకు లోబడిన నామ మాత్రపురాజులు—అను నీరెండు యాజమాన్యములక్రిందను వీరి భూములను (మతగురువులుకూడ ఈవిధమైన ఆధిపత్యము నే మతిస్థలభూముల దున్ను రైతుపై గల్గియుండిరి) దున్నుచు, వీరికి దాసానుదాసులైన ప్రజాగణము; బ్రిటిషుద్వీపములు సహా చాలవఱకు యూరపుఖండమంతయు—ఈ మధ్యయుగ ములో—నీ రీతిగా నుండెను. ఈ ప్రజలకు "పరాధీనులు" (Vassals) అని ఆ రోజులలో గల నామకరణమును బట్టియే వీరి దాస్యతవిదితము కాగలదు. ఈ దాస సహస్రములకు రక్షకుండు, న్యాయాధికారి, పాలకుడు సర్వమును అతనిపై

జమీన్దారుడు, అతని సిబ్బందియు అయియుండెను. దీనినే, ఫ్యూడలువిధానమనెదరు.

కాని ట్యూటనుసభ్యతలో స్వతస్సిద్ధముగనుండిన, స్థానిక స్వపరిపాలన కూడ యీ విధానములో పాటు విస్తరించుచునే యుండెను. ఈ స్థానికప్రజాసభకు (Landesgermin-dem) సిద్ధాంతములో, అధ్యక్షుడు, న్యాయస్థానాధ్యక్షుడు మున్నగు అధికారులు, జమీన్దారులును అతనియొక్క నియంతలుగా నుండినను, ప్రజామాన్యమునకు కొంతస్థానిక పాలనా స్వాతంత్ర్యముకలదు.

అప్పటిరాచకీయ సంఘు (Political Society) యిట్లుండెను. స్థానికపాలనములో కొంతవాస్తవములో అధికారముగల్గి, సిద్ధాంతములోను వాస్తవములోను ఆర్థిక, రాచకీయములలో, జమీన్దారుని ప్రత్యక్షదాస్యమున నున్నట్టియు, సాంఘికముగను, ఆముష్మికముగను, మతగురుదాస్యములో నున్నట్టియు, అశేషప్రజాగణము ; ఒకమూల రాజునకు వ్యతిరేకముగా రాచకీయసంఘము (Political Society) యొక్క సర్వహక్కులను దాను వాస్తవములో చెలాయించుచు, ప్రజలపట్ల రాజు నిర్వహించవలసిన అధికారధర్మముల తామే చేయుచున్న జమీన్దారులు ; యీ రెండువర్గములకును పైనను మతగురువులను, తమతో సమదంతాదారులుగా గల్గినట్టియు—జమీన్దారులపైన సిద్ధాంతజగత్తులో మాత్రమే అధికారము

గల్గి, క్రిందిఅంతరములో గల ప్రజాగణమునకు మఱచిపోయిన దేవుడుగా నున్నట్టియు రాజు.

ఇందువలన పైన ఒకటిరెండు యంతరములు దాటి యున్నట్టియు, సిద్ధాంతములో అసలు ప్రభువైనట్టియు రాజును వ్యక్తి మఱచిపోవుటకూడ సహజమే. అందువలన ప్రజలభక్తి యావత్తు యీ జమీన్దారులయందే ఘనీభవించినది. అందులకే మధ్యయుగములో జరిగిన రాజకీయసంఘర్షణ లన్నియు—జాను రాజునకును, ఆంగ్లబేరనులకును మధ్యజరిగినట్టివి—రాజులకును, జమీన్దారులకును మధ్య ఒకరిపై నొకరు అధికారమును స్థాపించుకొనుటకు జఱిగినవి. ౧౮ వ శతాబ్దమువఱకు "ప్రజాసామాన్య"పు ఉద్యమములని వీనిని పిలుచుటకు వీలు లేదు. బ్రిటనులో విలియంరాజు తనకాలములో (క్రీ. శ. ౧౦౮౬) యే జమీన్దారుక్రింది మనుజులైనను, రాష్ట్రములోని యావత్తుప్రజలకున్నూ, సిద్ధాంతములోనేగాక, యదార్థములో కూడ, రాష్ట్రాధిపతి రాజేనని స్థాపనచేయుటకు భూస్వాముల మహాసభను "శాలిస్‌బరీ" యొద్ద సమావేశపఱచి తనయెడ గల రాజభక్తిని వెల్లడింపజేసెను. ఈ యంశము రాజ్యాంగ చరిత్రలో ప్రాముఖ్యమైనది. అంతకుపూర్వము యావత్తు రాష్ట్రముపైనను, రాష్ట్రవ్యవహారముల నిమిత్తము, సామాన్యభూస్వాములతో కూడిన మహాసభ యెప్పుడును సమావేశమే కాలేదు. "దాసుల" యొక్క ప్రసక్తే అప్పుడు అధికారులకు లేదు. కాని స్వాధికారమును గూర్చి ప్రజామోదము వెల్ల

డిచేసుకొను ఉద్దేశముతో విలియంరాజు యీ సభను సమా వేశపఱచినను, పిమ్మట యింగ్లండులో బయలుదేరి, ప్రజా ప్రాతినిధ్యముగలిగి ప్రజలపేరుతో మాట్లాడగల హోదాను సంపాదించి నేడు అమలులోనున్న పార్లమెంటు మహాసభ యొక్క తొలిబీజము ఆనాడు అక్కడ నాటబడినదని సిడ్నీ లో గారి మతము.

---

## అధ్యాయము—నాల్గు



## పూర్వోద్ధరణకాలము.

## (Renaissance Period)

### క్రీ. పి. ౧౫౦౦ శతాబ్దమునుండి

### ౧

<u>సంఘము రాజస్వామ్యముగా మారుట:</u> సాంఘిక పరిస్థితులు రాచకీయ జిజ్ఞాసలు, భావప్రచారములు అనునవి భౌతిక పరివర్తనలబట్టియే చాలవఱకుండును. అందులకే భౌతిక పరిస్థితులను, మనుష్యువు స్వాధీనములో నుంచుకొనవలెనని వేదాంతము తెలుపుచున్నది. ౧౩౪౯ సంవత్సరములో యూరప్ ఖండమంతయు, "నల్లటిప్లేగు" అను ఒకమహామారీవ్యాధి వచ్చి రెండుకోట్లకు పైగా ప్రజలను బలిగొనెను. కాని యీ ఫ్యూడల్ జమీన్దారులు తమ రయితులపై పూర్వరీతిని హాయాము సాగించుచునేయుండిరి. జనక్షయమువలన అశేషమైన భూభాగము వ్యవసాయములేక పాడుపడెను. గృహములలో కాపురముండు వారలులేక అవి శూన్యములయ్యెను. ధరలు హెచ్చిపోయెను. తిండి ప్రియమయ్యెను. జమీన్దార్ల ప్రాబల్యముతో కూడిన ఆంగ్లపార్లమెంటుచే ధరలను, కూలిని, నిబంధించుచు చట్టము చేయబడెనుకాని ఆర్థికపరిస్థితులనుబట్టి అమలుజరుపుటకు వీలులేకపోయెను. తమ కవసరము వచ్చి

నపుడు సేవచేయు పద్ధతిని తమభూముల ఆదాయము తిను చుండు ఇూ దాసగణమును "ఫ్యూడల్" విధానమునుండి జమీందారులు ప్రకృతి దేవతతోపాటు విడుదలచేయుటకై ఒప్పుకొనుటకు యిదియొక కారణము. ఇంగ్లండు, ప్రాన్సు, జర్మనీలలో వ్యవసాయకులు భూస్వాములపై తిరుగుబాటు చేసిరి. ఇంగ్లండువంటి దేశములలో, ఫ్లాండర్సు మున్నగు దేశములతో వర్తకము ప్రారంభమై ఉన్నికి తగుఅవకాశ మఃం డుటవలన గొఱ్ఱెల మేతకవసరమగు బీటిపుల్లరి, వ్యవసాయము కంటె ఆకర్షనీయమయ్యెను. అందోళనాశక్తిని యివ్వగల పారిశ్రామికయుగము దగ్గరలో నుండెను.[1]

మరియొకమూల నైతికముగ క్రైస్తవ మతమును యిప్పటికి బాగుగా జీర్ణము చేసుకొన్న ప్రజలుఅందులోని సమత్వభావమును గ్రహించిరి. ఈ క్రైస్తవ సంఘములో, ఒకవ్యక్తి బానిసగా నుండుట, మరియొక వ్యక్తి అతనిపై నిరంకుశ ప్రభువుగా నుండుటయు తెలిసి కొనిరి. కాని ట్యూటనులు యూరప్ ఖండములో నాటిన

1. ఈకాలముననే "Hansatic leagues" అను పారిశ్రామిక వర్తకసంఘములు యూరప్‌లో బయలుదేరెను. ఇంగ్లండులో యెడ్వర్డురాజు తన దేశీయులలో పరిశ్రామోత్సాహమును జనింపజేయుటకై ఫ్లాండర్సునుండి ఉన్ని పరిశ్రామికులను దేశములోనికి ఆహ్వానించెను వెంటనే ఉన్ని పరిశ్రమ యింగ్లండులో విజృంభించెను. ఇదియే ఇంగ్లండు పరిశ్రామికోద్యమమునకు—పరోక్షముగా, రాచకీయాధిపత్యమునకును—మూలబీజము.

ఫ్యూడల్ దాస్యపద్ధతి, పరిస్థితులవలనను, మానవకృతముగను నడలినకొలఁదియు నిది వ్యక్తి స్వాతంత్ర్యయుతమైన ప్రజాస్వామ్యముగా పరిణమించక ఫ్యూడలుప్రభు దాస్యపటలము తొలఁగినకొలఁదియు దానిపైన ఆవరించియున్న రాజుయొక్క అధికారపు ఆవరణలోనికి ప్రజాగణము పోవలసియుండుట వలన రాజనిరంకుశత్వము యీ కాలములో బలపడుచుండెను. అందుచే ప్రజాస్వామ్యోద్యమ యథేచ్ఛా విహారమునకు యూరప్ ఖండము మరిరెండు శతాబ్దములు ఆగవలసివచ్చెను. ఆగుటయే కాదు ప్రజాశక్తి యేకోన్ముఖ మగుటకును, జాతీయతా వికాసమునకును, యీ రాజస్వామ్య నిరంకుశత్వము అవసరమయ్యెనని పండితుల మతము.

ఈ కాలములోనే బయలుదేరిన క్రైస్తవమతక్షేత్రమును స్వాధీనపరచుకొనుటకైన ఉద్యమములో (Crusades) రాజులకంటె యీ జమీందారులే అధికముగా నాయకత్వము వహించి జెరూసలమునకు సేనల నడిపించుకొని తమజమీలకు దూరముగా నుండిన కాలములో రాష్ట్రములలోని రాజులు, తమస్వామ్యమును మరింత బలపరచుకొనుట, ప్రజలతో గల తమసంబంధమును వృద్ధిపరచుకొనుట జరిగినది. రాష్ట్రమంతకును యేకాధిపతియయిన రాజుయొక్క ఆధిపత్యమే ముందు శతాబ్దములలో స్థాపనకాబోవు ప్రజాస్వామ్యమునకు ఉద్దీపనము చేసినది "జాతీయత (Nationalism) యొక్క ఉత్పత్తికి, కూడ ఇది ప్రధానకారణమయ్యెను. దేశములోని ఫ్యూడలు

జమీందారుల జమీలన్నియు, నేక రాష్ట్రముయొక్క ప్రత్యక్షాధి కారములోనికి వచ్చుటవలన పూర్వము వేర్వేరు ఫ్యూడలు అధిపతులక్రింద యుండిన దేశప్రజలకు "సంసర్గము" హెచ్చు అయ్యెను. ఇది పిమ్మట జాతీయతగా పరిణమించగల యేక దేశీయతాభావజనకమయ్యెను. ఏకాధిపతిక్రింద, యేకభూ భాగములో, ఏకభాషమాట్లాడుచు, ఏకమతస్థులైన ప్రజలు, ఏకనిరంకుశత్వము క్రింద క్రుంగుచుండుటయే జాతీయభావో దయము నకున్నూ, సంచలనమునకును, ప్రజాదృష్టికి యేక కేంద్రముగానున్న నిరంకుశరాజ్యాధికారముపై తిరుగుబాటు చేయుటకు నుఅవసరమగుశక్తి ప్రజ్వరిల్లుటకు కారణమయి నది.[1] మధ్యకాలపు యూరపుఖండమునందు, ముందురాబోవు ప్రజాస్వామ్యవిప్లవసూచనలు కొన్ని కన్పట్టుచుండెను.

---

1. ఇది జాతీయతయొక్క ఉత్పత్తికి చరిత్రలో కనబడు కారణము. బ్లంచిలీపండితుని మతప్రకారము యింతకంటెను జాతీయతలో ఉన్నతపరిణామము కలదు. ఇదివ్యక్తి అహంభావములో జీవిత మున ప్రారంభించిన మానవుడు క్రమముగా కుటుంబము మొ దలు జాతివఱకునుగల క్షేత్రము లందు తన అహమును ఖర్చు పెట్టుకొనుచు చివరకు జాతీయమయమైన సార్వత్రిక ప్రవృత్తిని మిగుల్చుకొను స్థితి. ఇట్టిది నేటి యూరప్ఖండము అవలంబించు చున్నట్టి క్షుద్రజాతీయతవంటిది కానందున విశ్వజాతీయతకు కూడ సోపానమే. ఇట్టిజాతీయతలో తనవికాసముయొక్క చరమావస్థను పొందినట్లు వ్యక్తి సంతృప్తిని పొందును.

మెకియవెల్లియను ఇటాలియను తత్త్వవేత్తయొక్క యీరా కాలములోని గ్రంథములు ("Prince" Publisbed in ౧౫౩౦) కూడ అప్పుడు వృద్ధిలోనున్న రాజస్వామ్యవిధానమునకు ఒకవేద ప్రామాణ్యముగా ఉపచరించెను. ప్రతిరాష్ట్రమునకు రాజు అవసరమనియు, రాజే రాష్ట్రక్షేమకరుడనియు యీయన మతము. [1] అప్పటికే క్రమముగా, ఫ్యూడలువిధానము సన్నగిలుచుండుటవలనను రోమకసామ్రాజ్యము చీలికలుగా విడిపోవుటవలనను అందుండి యూరపుఖండము, భిన్న భిన్న దేశములుగా తిరిగి ఆవిర్భవించి, ప్రతిదేశము ఒక్కొకరాజు పాలనక్రిందకు వచ్చుచుండెను మతాధిపుల, సామ్రాజ్యాధి

---

1, నాటి యిటలీదేశము చిన్నచిన్న నిరంకుశరాజ్యములుగాను, ప్రజాస్వామ్యములుగాను చీలిపోయి ఒకరితో నొకరు, వీరు పోరాడుకొనుట. క్రైస్తవమతాధిపతి యిటలీకి ముఖ్యస్థానమైన రోమునందుండుటవలన, తనస్వప్రయోజనమునకై యిటలీ దేశమును సదా చీలికలుగా నుంచుటకై కృషిసల్పుట—ఇందు వలన సైనికబలాధిక్యముగల యితరరాష్ట్రములు యిటలీలో ప్రవేశించుట—యనునవియే ఆయనదృష్టిని ప్రధానముగా నాకర్షించి పైగ్రంథమును వ్రాయించినవి. ఆపరిస్థితులలో నూతన రాజ్యాంగజిజ్ఞాసను గాని తనబోధవలన ఏర్పడు అవినీతిని గూర్చి తర్కించుకొనుటకు గాని యీయనకు అవకాశము లేక పోయినది. నేడు ముసోలినీని యిటలీలో ఫాసిస్టు రాజ్యాధికారమునకు త్రిప్పినదికూడ పతనమగుచున్న యిటలీజాతీయత నుద్ధరింపవలెనను భావమే!

పతుల, ఫ్యూడల్ ప్రభువుల చేతులనుండి యీరాష్ట్రములు బయటపడినను, తిరిగి యివి రాజులచేతులలో నెట్లు చిక్కుకొనెనో పైన తెలుపబడినది. మెసిపెల్లి వ్రాసిన పై గ్రంథము యొక్క వ్యాప్తియు లోలుతలో యీ రాజులు సహృదయులై ప్రజారంజకులుగా నుండుటయుకూడ రాజస్వామ్య వ్యతిరిక్తమైన ప్రజాప్రబోధములకు తావు లేకుండుటకు కారణములు.

---

ఇప్పటికి అనగా— ౧౬ వ శతాబ్దమునకు—యూరపుఖండీయులలో కొంచెము భావసంచలనము కలిగినదని చెప్పవచ్చును. ఇంతకు రెండుశతాబ్దములకు పూర్వమునుండియు స్పెయిను దేశములో విజ్ఞానాభివృద్ధి జరుగుచుండెను. స్పెయిను దేశము అప్పటికి మహమ్మదీయపాలనములో నుండుటవలన అరబ్బీ పండితులమూలముగా స్పెయిను దేశీయులు అప్పటిప్రపంచములోని ఉత్తమవిజ్ఞానమునందు శిక్షనుపొందిరి. అనగా పెరిషియా భారతవిజ్ఞానములు ప్రథమతః యీ అరేబియను పండితులే స్పెయినుద్వారా యూరపుఖండమున ప్రవేశపెట్టిరి. అప్పుడు స్పెయినులోని "కార్డోవా" (Cardova) విద్యాపీఠము ప్రసిద్ధమైనది. స్పెయినుదేశమున్ను, అరబ్బు పండితులున్ను, యూరపుఖండ రినాసెన్సుయొక్క నిర్మాణమునకు ఘనముగ సేవజేసిరి. తమప్రాచీన విజ్ఞానము తెలిసికొనవలెనని కుతూహలము ప్రజలలో బయలుదేరెను. మతములలోను,[1] ప్రాచ్యపాశ్చాత్యప్రవర్తక విజ్ఞానములకు "లింకు" వలె వర్ధిల్లిన ప్లారెన్సు, వెన్నిసుమున్నగు అప్పటి ప్రసిద్ధవిద్యా

1. భారతవస్త్రముల వంటి సున్నితవస్త్రరచనకు—భారతపరిశ్రమను అనుచూచి—తొలుత ఉద్యమించిన యూరపుఖండదేశము ఇటలీ. అక్కడనుండి ఈ ఉద్యమము ౧౬ వ శతాబ్దము నాటికి ఆంగ్లదేశమునకు ప్రాకినది.

పీఠములలో పూర్వపుగ్రీసు, రోమనురాజ్యాంగములయొక్కయు నాగరికతయొక్కయు, క్రైస్తవ మతగ్రంథముయొక్కయు పఠనములు, జిజ్ఞాసలు జరుగుచుండినవి. కొండొకకాలమున ప్రజాసముదాయము నుండియే, రాజ్యాధికారము, రాజులకు గల్గినదని ప్రవర్తిల్లు సూత్రము ఈ మధ్యకాలములో యెల్ల అధఃపతనమైనదియు యీ జిజ్ఞాసువులు గ్రహించిరి.

ఆ విధముననే క్రైస్తుచేసిన బోధనల పవిత్రత, పలికిన సత్యములు, నాటి మతగురువులు, యెట్లుసొమ్ముచేసి అపవిత్ర జీవితములవారు కాలముగడపుచు దేవునకును, మానవునిభక్తికిని నడుమనిలిచి ప్రజాళిలో మూఢవిశ్వాసముల ప్రోత్సాహపఱచి నిరంకుశత్వము నెట్లు సాగించుచున్నదియు వీరు తెలుసుకొనిరి.

స్పెయిను, ఫ్రాన్సు, యింగ్లండు దేశములు రోమునగరపు ప్రధానక్రైస్తవపీఠమునకు యెన్నడును లొంగియుండకపోవుటవలన కొంత "దాస్యభావము" ఆ ప్రజలకు తక్కువ. మఱియు నీ దేశముల నడుమ నడిచిన "నూఱుసంవత్సరముల యుద్ధము" (క్రీ. పి. ౧౩౩౭–౧౪౫౩) వలన ఆయా దేశములలో, యేర్పడిన, ఆత్మరక్షణోత్సాహము కూడ పై యంశముతోపాటు యీ దేశములలోని జాతీయభావవికాసమునకు తోడ్పడినది. స్పెయినుదేశము అప్పుడే మహమ్మదీయుల అధికారమునుండి బయలుపడినది. పైగా స్పెయినురాజుగారి వివాహమువలన చీలికలుగా నుండిన స్పెయిను దేశమునకు అయిక్యత

కలిగినది. కాని జర్మనీ, ఇటలీదేశములలో యీ రాష్ట్రీయ ఐక్యతావిధానము (Process of stateintigration) నడచు దేశములు భిన్న భిన్న రాష్ట్రములుగా మారునట్లు చేసినది.

ఈ కాలపు యూరపుఖండములోని రాజ్యాంగజిజ్ఞాస పైన తెలిపిన మెకివెల్లీ యొక్క గ్రంథములో ప్రతిబింబించు చున్నది. ఒకే రాజుక్రింద (ఒకబలమైన కేంద్రప్రభుత్వముక్రింద) రాష్ట్రమంతయు పాలింపబడిన గాని సరిహద్దు రాష్ట్రముల దాడినుండి రాష్ట్రములకు భద్రతలేదను మూలసూత్రముల పైననే యీ కాలపుప్రభుత్వము లన్నియు నడచినవి. రాష్ట్రము యొక్క వెలుపలిస్వేచ్ఛనుగూర్చి (External Sovereignity) అప్పటి జిజ్ఞాసువులు యోచించినట్లు కాన్పించుచున్నది. కాని, రాష్ట్రములో పరిపాలనాధికారము (Internal Sovereignity) గూర్చి వారికి యింకను ప్రసక్తిలేకపోయినది. అనగా రాజ్యాంగములో ప్రజలకు గలస్థానమునుగూర్చి యింకను జిజ్ఞాసాకాలము రాలేదు.

క్రైస్తవుల యాత్రాస్థలమైన జెరూసలము మహమ్మదీయసామ్రాజ్యముయొక్క వశమయ్యెను. క్రైస్తవులపవిత్ర యాత్రస్థలము, క్రైస్తవప్రభువుల అధీనములో నుండవలెనని క్రీ. శ. ౧౦౯౬ లో బయలుదేరిన ఉద్యమము (crusade) ౧౨౩౦ సం॥రములోపుగా ఆయుపద్యాయములు అధికోత్సాహముతో సాగెను. యూరపుఖండములోని రాజుల ఆధిపత్యము నప్రజలు ఆవేశముతో (యుద్ధము తెలిసినవారు తెలియని

వారుకూడ) జెరూసలము స్వాధీనమునకై మహమ్మదీయుల పై దాడి వెడలుచుండిరి. ఈ దాడులలో అనేకమంది ప్రజలు మోక్షమువచ్చునని ప్రాణములను యిష్టపూర్వకముగా గో ల్పోవుచుండిరి. మతావేశ ఉద్దీపితమైనను ఏకలక్ష్యమునకై యూరపుఖండములో బయలుదేరిన జనసామాన్యముయొక్క మొదటి యుద్యమము యిదియే.

జాతీయత, ప్రాతినిధ్యావిధానముల (Representative system) దృష్ట్యాముఖ్యమైన యీకాలపునాటి మరి యొక చరిత్రాంశమును యిట పేర్కొనవలెను. రోమక చక్రవర్తిత్వమును గూర్చియు రోమకమత పీఠాధిపత్యమును గూర్చియు క్రీ. శ. ౧౦౭౬—౧౧౨౨ వఱకును జరిగిన రాజకుటుంబ కలహములు, మత పీఠస్థుల వంశీయులలో యేర్పడినకక్షలు పోటీలవలన పీఠిరెంటికిని ప్రజలలోనుండిన సామాన్యగౌరవముకూడ తగ్గిపోయెను. అందుచే యీ సంస్థలు యీ ప్రతిష్ఠాభంగమునుండి తిరిగికోలు కొనలేదు. రోము నగరములోని ఉన్నత మతపీఠాధిపత్యమునకై పెనుగులాడు వ్యక్తులనుండి పీఠమును తప్పించుట, మతాధిపతిగానున్న పోపు ఒకసంఘమువారి నిబంధనలకు లోబడి తమ పరిపాలనము చేయుట ; అను సూచనలు బయలుదేరెను. ఈ ఉద్యమఫలిత ముగా ౧౪౦౯ సం॥రములో "సైనా" నగరములోను ౧౪౪౧—

౧౪౪౮ లో "కాన్స్టెన్సు" నగరమునను అట్టిసంఘములు యే ర్పడెను. ఈ సంఘమునకు ఆయాదేశములోని క్రైస్తవదేవా లయములయొక్కయు మతాధికారులయొక్కయు, ప్రజలయొ క్కయు ప్రతినిధులు సభ్యులుగా పంపబడిరి. ఈ సభలో వోటింగు, ఇటలీ, ఫ్రాన్సు, జర్మనీ, ఇంగ్లండు, స్పెయిను అను అయిదు జాతీయతలను పురస్కరించుకొని కూడ జరుగుచుం డెను. ఏదో ఒకవిధమైన ప్రాతినిధ్యమువలన యేర్పడిన సంఘ ముద్వారా మతాధికారమును హద్దులో నుంచవలెనను యీ ఉద్యమమే రాచకీయముగా ప్రభుత్వమును కూడ ప్రజాప్రతి నిధుల సంఘములు యేర్పడి హద్దులో నుంచవలెనను భావము పుట్టుటకు కారణమైనటుల తోచుచున్నది. అంతకుపూర్వము అంతర్జాతీయవ్యవహారములలో పరిగణింపబడని జాతీయతకు ఈ ఉద్యమమువలననే ప్రథమతః స్థానము కలిగినది. ఈ మత సంఘోద్యమము పిమ్మట క్రమేణనశించినను మతపాలనకై బయలుదేరిన "ప్రతినిధి సంఘోద్యమము (Concilior) movement") తిరిగి వ్యక్తుల రాచకీయపు ఊహలలో గోచ రించెను. కావుననే రాజ్యాంగపరిణామచరిత్రలో ఈ మతసం ఘోద్యమము ప్రాముఖ్యమైనదిగా నెన్నబడుచున్నది. ఈ ఉద్యమముపలననే ౧౪వ శతాబ్దములో పాదువానగరపండితు డైన మార్సిగ్లియో (Marsiglio of Padua) ఓఖామునందు

విల్లియమున్నూ (William of Okham) నికోలాస్, గెర్సన్ అనువారు క్యూస్ (John Gersonan and Nichlos of Ceus) నను, రాజకీయసమస్యలు అనగా రాజ్యాధికారము జాతీయతా ప్రాతినిధ్యము, రాజుయొక్క అధికారమును హద్దులోనుంచుట మున్నగువానిని గూర్చి విమర్శించగల్గిరి. అందుచే వీరు ముందురాబోవు ౧౫ వ శతాబ్దరాజ్యాంగపరివర్తనమునకు వేగుచుక్కలైరి.

---

## అధ్యాయము—అయిదు.



### ౧౬—౧౭ శతాబ్దములు.



౧

ఇది గత పూర్వోద్ధరణ కాలమునకును ముందు రాబోవు పూర్ణ బాహ్య, మానసిక విప్లవకాలమునకును మధ్యగల సంధి యని చెప్పవచ్చును. మతవిషయములో, యీ కాలములోనే లూథరు అను జర్మను జిజ్ఞాసువు రోములోని క్రైస్తవ మతాధిపత్యముపై తిరుగుబాటు చేసెను. దేవునకున్ను, మనుష్యునకున్ను మధ్య పూజారులుండరాదు. బైబిలు, ప్రాచీనలాటిన్, హెబ్రూ భాషలలోనే నుండ నవసరము లేదు, ప్రతిజాతీయ భాషలోను ఉండవచ్చును: ప్రతివ్యక్తియును దానిని చదువుకొని తన అంతఃకరణాదేశానుసారము అర్థముచేసికొనుటకు అధికారముకలదు. మతవిషయములో కూడ పరిపాలనము ప్రభుత్వమునకే యుండవలెను (State church). ఇదియే నిజమైన ప్రాచీన క్రైస్తవ మతమని యీయన నూతనబోధ. ది ౧౩—౧౦—౧౫౧౭ తేదీని వెట్టింబర్గుచర్చి తలుపునకు యీయన తననూతన ఉద్యమపత్రికను సాహసముతో అతికిన సుముహూర్తము చరిత్రాత్మకమైనది.

రాచకీయములను, ప్రజాస్వామ్యపరముగా పరిణమింప జేయుటలో సహాయపడిన మఱియొక మతసంస్కారోద్యమము కూడ యీ కాలములో బయలుదేరెను. ఇది జినీవా క్రైస్తవ మతాధిపతియైన "కాల్విన్" యొక్క ఉద్యమము. లూథరు యొక్కయు, కాల్విన్‌యొక్కయు, లక్ష్యములు మతజగత్తులో "పోపు" మతాధిపతికి క్రైస్తవ ప్రపంచముపైగల సర్వాధికారమును తొలఁగించుటలో ఒకటియే. కాని మతములో అంతఃకరణ ప్రామాణ్యమును, మతగ్రంథములను స్వతంత్రముగా అన్వయించుకొనుటకు వ్యక్తికి హక్కును కోరిన లూథరు, రాచకీయములో సంపూర్ణ రాజస్వామ్య వాది (తన ప్రచారము యొక్క ఆలంబనకొఱకే ననుకొనుఁడు) గానుండెను. అప్పటి జర్మనుకృషీవలులు ప్రభుత్వముపై చేసిన తిరుగుబాటును జూచి యీయన భయవిహ్వలుఁడై దానిని తీవ్రముగా ఖండించి రాజాశ్రయమునకు పాత్రుఁడయ్యెను. "లూథరు మత సంస్కారము ప్రజేచ్ఛనుబట్టిగాక, రాజేచ్ఛనుబట్టి నడచెనని" వెల్సుపండితుఁడు నుడువుచున్నాఁడు.

ఇఁక కాల్విన్ సంస్కర్త ఉద్యమము, మతప్రభుత్వము రాచకీయ ప్రభుత్వముకూడ మతగ్రంథములనుండి గ్రహింపబడిన నవీననైతిక సూత్రములనుబట్టి యేకరీతిగానే సంస్కరింపఁబడవలెనని తెలిపెను. ఈ యర్థములో ఈ ఉద్యమము నైతిక జీవనమునకును, శిక్షణకును ప్రధానముగా సంబంధించినది. కాల్విను సర్వదేశములపైనను నాఁడు గల కాథలిక్

చర్చియొక్క అధికారమును తొలగించవలెననెను. దాని స్థానే ప్రతిదేశమునకును ఒక నిరంకుశవు మతపీఠమునుగాక "మత ప్రభుత్వము" (Church, Government) యేర్పఱచి దానిని రక్షించుటకే శక్తివంతమైన రాష్ట్రముండవలెనని యీయన పద్ధతి. వెంటనే "మతప్రభుత్వము" మతస్థులయొక్క అంగీకారముపై నిర్మింపబడుట తటస్థించెను. అందుచే యీ మతాధిపతియొక్క బలము—పూర్వపద్ధతిలోవలె ప్రజలపై స్వతంత్రహక్కుగా మతాధికారము చెలాయించు పీఠముపైనగాక— దానిని నిల్పిన మతస్థులైన ప్రజలపోషణపై ఆధారపడెను. ఈ "మతస్వపరిపాలనోద్యమము"ను యూరపుఖండములోని ప్రతిదేశములో ప్రచారము చేయుచు దానికై తత్ప్రచారకులు నిర్బంధములు సహించుచున్నపుడు, దాని సరిహద్దుననే దేశములో యున్న అప్పటి నిరంకుశరాజవిధానము పట్లకూడ ప్రజల భావములలో విప్లవమును కలుగచేయకుండునా? ఇదియే కాల్విన్ సంస్కరణోద్యమము, ప్రజారాజ్యపరముగా చేసిన ఘనసేవ. ఈ కాల్విన్ ఉద్యమము అప్పటికి యూరపుఖండములో ఒక గొప్పశక్తిగా నుండెను.

క్రీ. శ. ౧౧-౧౬ శతాబ్దములలో క్రైస్తవమతమును గూర్చియు, దాని ఆచరణనుగూర్చియు బయలుదేరిన శాఖలు దానిని పురస్కరించుకొని బయలుదేరిన రకరకముల కక్షలు, వీరిలో ఒకకక్షకు మరియొకకక్షకు జరిగినసంఘర్షణ, యుద్ధములు, ఒకదేశములో రాజావలంబనము గలకక్షవారు రెం

డవశక్తువారిని పెట్టు “హింసలు” సదరు హింసలను తనపక్ష మతవిశ్వాసములో — ఆక్రీస్తుయొక్క మూర్తి తనలో నావహించెనను సంకల్పబలముతో — రెండవపక్షములోని “లాటీమరు” వంటి వ్యక్తులు భరించి ప్రాణార్పణముచేయుట మొదలగు అంశములను విపులపఱచుట యిచ్చట అప్రస్తుతము. కాని యీ కాలపు మతకోలాహలము, అంతకుపూర్వపు ఫ్యూడలువిధానము, భావదాస్యతలో మునిగియున్న ప్రజలను సంచరింపజేయుటకు సహాయపడుట ; ఈ మతశక్తుల పురస్కరించుకొని లేచిన ఆందోళనమె పిమ్మట ఆర్థిక, రాజకీయశక్తులు ప్రధానముగా గల్గి బయలుదేరిన ఆందోళనకు ఉపచరించుట ; ఈ రెండు అంశములు యిందలి సారాంశములు.

---

౨

ఇఁక రాచకీయరంగములో ఈశతాబ్దము పూర్తియగు నరికి యూరపుఖండములో, ఫ్యూడలువిధానానంతరము బయలుదేరి, మొదటిలో ప్రజారంజకముగా నుండిన రాజస్వామ్యములు సంపూర్ణనిరంకుశప్రభుత్వములుగ మారినవి. ఫ్రాన్సు దేశములో అంతకుపూర్వము, రెండు, మూడుశతాబ్దముల నుండియు గల (States General) అను ప్రతినిధిసభ ౧౬౧౪ వ సం॥రమునకు పిమ్మట రాజుచే ఆహ్వానింపబడనేలేదు (౧౭౮౯ వ సం॥లోని ప్రజావిప్లవము వఱకును). ౧౫౬౭ సం॥ములో డచ్చి ప్రజలు నిరంకుశాధికారవర్గముపై తిరుగుబాటు జేసిరి. జర్మనీరాజైన రెండవఫిలిప్—తానుచేయు యుద్ధముల నిమిత్తమై—తనసామ్రాజ్యమునకున్న నెదరులాండకులను డచ్చి హాలండుప్రజలను ధనమునకై చేయుచున్న పీడనమున కసహ్యతిగా ఆరెంజీయువరాజైన విలియము నాయకత్వమున నీను ౧౫౮౧ సం॥లో తిరుగుబాటుచేసిరి. యూరపుఖండ మధ్యకాలచరిత్రలో స్థిరమైన రాజస్వామ్యాధికారము పైన అక్రమనివారణకై ప్రథమతః తిరుగుబాటుజేసిన ఖ్యాతి యీడచ్చి ప్రజలది. ఈ విప్లవావస్థలో కూడ ఫిలిప్ రాజు యోగ్యముగను, తనఅధికారపు హద్దులకులోబడియు (Limited) ఉండుట కంగీకరించినచో అప్పుడుకూడ ఆయన తమరాజుగా నుండుటకు సమ్మతిమేనని యీ విప్లవకారులు తెలుపుట ఆకాల

పురాచకీయ మానసికతత్వమును వెల్లడించుచున్నది. ఇట్టి అపరిమిత రాజస్వామ్యము మత్తతలో నిరాఘాటముగా నుండిన నాటి రాజులకు, యీ పరిమితరాజ్యాధికారమనిన కంటకమే!

ఇంగ్లండులో ౧౨౯౫ వ సం॥మునుంచి (మొదటి ఎడ్వర్డు రాజుకాలమున) "అందరికి సంబంధించిన వ్యవహారములు, అందరిచేతను ఆమోదింపబడవలెను" అని తెలిపి ఆహ్వానింపబడిన పార్లమెంటుసభ అప్పటినుండియు, ఆయాకాలములందు సమావేశమై ప్రభుత్వములో జోక్యము పుచ్చుకొనుచుండెను. ౧౬౨౯–౧౬౪౦ లో మొదటి ఛార్లెసురాజు (ఈయన దుష్పరిపాలనను గూర్చి కామన్సుసభవారు ఒక నివేదికను (Pitition of Right) రాజునకు అర్పించిరను కారణమువలన, కార్పణ్యమువహించి) నిరంకుశత్వముగ యీ పార్లమెంటుసభను అణచివేసి రాజ్యముచేయుటకు ప్రయత్నించెను. వెంటనే ప్రజలు క్రాంవెల్ అను ప్రముఖుని నాయకత్వమున తిరుగుబాటుచేసి రాజును పదభ్రష్టునిజేసి, అతనిపై దేశద్రోహమును నేరమునుమోపి విచారణచేయించి ఉరిదీయించిరి. కాని తిరిగి స్వల్పకాలములోనే రాజవిరహమును సహింపజాలని బ్రిటిషుదేశము—పూర్ణప్రజాస్వామ్యమును స్థాపించుకొనజాలక—క్రాంవెల్ నిరంకుశత్వములో పడిపోయిన బ్రిటిషు దేశము, తిరిగి రాజును, పూర్వరాజ్యాంగవిధానమును వరించెను.

---

౧౬౭౮ సం॥లో జేమ్సురాజు, యింగ్లండును రోము మతపీఠమునకు బంధించవలెనని చేసిన కృషి మరియొక విప్లవమును తెచ్చిపెట్టెను. పార్లమెంటు సభకు గలహక్కులున్నా దానికి గలశక్తిని గమనించు చాకచక్యము జేమ్సురాజునకు లేకపోయెను. కాని అట్టిస్థితిలో గద్దెమీద నుండుటకు ధైర్యము చాలక జేమ్సు పారిపోయెను. ఈ విప్లవమును మదర నిచ్చినయెడల తిరిగి ప్రథమవిప్లవానంతరము వలెనే, క్రాంవెల్ వంటి నిరంకుశత్వములోనికి ప్రభుత్వము దిగునని, నాయకులు తెలిసికొని అరెంజీయువరాజైన విలియమును రాజుగా తెచ్చుకొని ఒక ఐర్లెండులో తప్ప తొందరలు లేకుండగనే జేమ్సు స్థానే యీయనను స్థాపనజేసికొనిరి.

హాబ్సు-లాక్కుల రాచకీయజిజ్ఞాసలు:—ఈ విప్లవమునాటి ఆంగ్లజిజ్ఞాసువు "లాక్" (Lock) అను నాయన. ఈయనకు పూర్వపుజిజ్ఞాసువు 'హాబ్సు" (Hobbes). "అందరును అందరిపైన నిరంతరము యుద్ధావస్థలోనుండుట, ప్రకృతిధర్మమనియు" (State of nature) లేక భారతసాంప్రదాయము ప్రకారము మత్స్యన్యాయము) అందుచే ఒకరుగాని, కొందఱుగాని, అందరుగాని అధికారవర్గముయొక్క పాలనకు లోబడి

యుండునటుల వ్యక్తులు ఆదిని తమస్వేచ్ఛాప్రవృత్తికి సంబంధించిన హక్కులను, స్థిరముగా నీ యధికార పర్గపరము జేసిరనియు, అందుచే ప్రభుత్వమనునది మానవకృతమైనదే (Rational act) నని "హాబ్స్" సిద్ధాంతీకరించెను. ఈదృష్టిలో సంపూర్ణ రాజ్యాధి కారముగల ప్రభుత్వమెప్పుడును మానవక్షేమమునకు అవసరమగుటయేగాక అట్టి ప్రభుత్వాధికారముపై తిరుగుబాటు చేయుట, ఆది యొడంబడికకు భంగముకలిగించుట (Breach of Contract) కూడయగును. పైగా అట్టి తిరుగుబాటు అనిన, తిరిగి మానవకృతమైన సాంఘికావస్థనుండి (State of Society) ప్రాకృతావస్థలోనికి పడిపోవుటయే.

ఇక "లాక్" మతమున, వ్యక్తికిస్వేచ్ఛ, సత్వాది హక్కులు ప్రాకృతావస్థలోనే యుండెను, నీప్రాకృత మానవవ్యక్తులందు తొలుదొల్త కలిగిన కలయిక (Original compact)—ఒడంబడిక కాదు—వలన తమయొక్క వ్యక్తి స్వాతంత్ర్యరక్షణకై, పిమ్మట ఒక ప్రభుత్వవిధాన మేర్పడినది. అందుచే యీయనమతములో, ఉన్న ప్రభుత్వముపై తిరుగుబాటు అనేది సదరు ప్రభుత్వము, ఆధర్మమును నెరవేర్చుట మానినప్పుడే సమంజసమగును.

"రూసో" మత ప్రకారము మానవులు ప్రాకృతావస్థనుండి వారిలో వారికిగలిగిన ఒడంబడిక (Social con-

tract) మూలముగనే సామాజికావస్థకువచ్చిరి. తమకు వ్యక్తిసిద్ధముగానుండిన స్వాత్వాదిహక్కులను, ఎవరిపైవారు రాజ్యము చేసికొను పాశ్రితవ్యక్తి రాజ్యాధికారమున్నూ సమాజపరము చేయబడినవి. అందుచే రాజ్యాధికారము అన్యాక్రాంతము కానిదై (Inalienable) ఎల్లప్పుడును సమాజనిష్టముగనే యుండును. ఈదృష్టిలో "హాబ్సు" వలె "రూసో" ఒక "ఒడంబడికను" ఒప్పినను అది ప్రభుత్వమునకును, ప్రజలకును మధ్యగాక సమాజికులమధ్య జరిగినదే యగుచున్నది. ఈరాజ్యాధికారముయొక్క విశేషనిర్వచనములో (అన్యాక్రాంతము కాజాలనిదని). "హాబ్సు" తో రూసో అంగీకరించుచు, అందులకే అదియెల్లప్పుడును సమాజనిష్టమై యుండుననియు, ప్రభుత్వమునకును ప్రజలకును (రాజ్యాధికారమును పరిపాలుచుటయును) ఒడంబడికయే జరుగనప్పుడు, ప్రభుత్వము చేతిలోఅది అనన్యాక్రాంతధర్మముతో యెట్లుండుననును.

ఇఁకలాక్ వలె, యేర్పడిన సంబంధము సమాజిక సభ్యులమధ్యనేనని "రూసో" అంగీకరించును. కాని ఆసంబంధము బుద్ధిపూర్వకమైన ఒక ఒడంబడికవలన గల్గినదేగాని కలయిక లేక, సన్నికర్షవలన కాదని యీ యనమతము. మఱియు ప్రభుత్వస్థాపనమునకును, యీ ఒడంబడికకును, యెట్టిసంబంధములేదని "లాక్" కంటెను యీయన విస్పష్టముగాను

నిస్సంశయముగాను తెలిపెను. [1] రూసో దృష్టిలో ప్రభుత్వ మనేది సంఘమువారి అవసరములకొఱకు వచ్చిన గుమాస్తాగిరీ వంటిది. ఈయన "లాక్" వలె ప్రభుత్వముపై "తిరుగుబాటు అను పెద్దప్రయోగమును ఒప్పడు. దానిని సమాజమువారు తమ వ్యవహర్తలపట్ల చేయు మార్పుదల (Ministerial Changes) అని తెలుపును.




1. "లాక్" ప్రజాసమ్మతితో (Acquiescence) నడిచినంత కాలము ప్రభుత్వము సహింపదగినదే అనును. కాని రూసో కేవల "సమ్మతి" యే గాక ప్రజాధిపత్యముక్రిందనే ప్రభుత్వము నడువవలెననును. అందుచే "రాజ్యాధిపతులైన ప్రజలే రాజ్య పాలనకై పూనుకొనుట" అనే అర్థములో (Positive Democracy) రూసో సిద్ధాంతమే నిజమైన ప్రజాస్వామ్య సిద్ధాంతమగుచున్నది. అని కోలు పండితుని మతము. (Political organization P. P. 61) మఱియు హైత్రిమత వ్యాఖ్యానమునుగూర్చి చూ. (Blunchilis Theory of State P. P. 294—295.

## ౪

ఇటలీలో ప్రాచీనగ్రీసు ప్రజాస్వామ్యమువంటి నగర ప్రజాస్వామ్యము స్థాపించుటకు ప్రయత్నములు జరిగెను. ఉత్తరసముద్రతీరమున 'ఫ్లాండర్సున' ఇటలీలోను క్రమాభివృద్ధి గావించుచున్న పరిశ్రమల ఫలితముగా "శ్రేణీసంఘములు" (Guilds) చిన్నపట్టణములలో బయలుదేరెను. ఈశ్రేణీ సంఘములు వర్తకసంబంధమైనవి. ఇందులో సభ్యత్వము అందరికి లభింపదు. కాని సభ్యులైనతర్వాత అందరును సమానులే. పరిశ్రమలను నిర్మించుట, వానిపై ధరలువేయుట, అమ్ముట—అనునవి శ్రేణియొక్క శాసనములకు లోబడి వ్యక్తులు జరుపవలెను. అందుచే యూరపుఖండములో మరి యొక శతాబ్దమునకు, పిమ్మట అంతరించిన ఈశ్రేణీవిధానమునకు పరమండే సాంఘికనిబంధనల త్రోసివుచ్చి, కేవల స్వలాభపరమైన వ్యక్తి పెట్టుబడివిధానము (Capitalism) తలయెత్తగల్గినది. శ్రేణులు, తమతమ నగరములలో పూర్ణ స్వపరిపాలనమును, అనుభవించుచుండెను. లేనిచోట్ల అట్టి స్వాతంత్ర్యములను నగరములు కొనుక్కొనుచుండెను. శ్రేణీనగరములు యింకను కొన్నిచోట్ల, ఫ్యూడలు ప్రభువుల నామమాత్రము వర్దిలో యున్నను "ఫ్లాండర్సు జమీందారుని ప్రజలమని వారు పిలుచుకొనుట మాని "బ్రూజస్," "ఘూవాన్," "నూరంబర్గు" పౌరులనియే ప్రసిద్ధిపొందియుండిరి. పురప్రజాస్వామ్యపరిణామములో నిది గమనీయము.

---

౫

రాజ్యాంగపరిణామదృష్ట్యాసారాంశములు. పూర్వోద్ధరణకాలమునకు పరమండలిదియు ౧౮ వ శతాబ్దపు ఆఖరు భాగమున బయలుదేరిన విప్లవకాలమునకు సన్నిహితపూర్వమండలిదియు, నైన యీచరిత్ర ముగించుటకు ముందు, రాజ్యాంగదృష్ట్యా కొన్ని సారాంశములను తెలుపవలసి యున్నది. పై అంశములవలన మనకు గోచరించునదేమి ? యూరప్ ఖండములో నించుమించు చాల దేశములో నిరంకుశ రాజప్రభుత్వములు యథేచ్ఛగా రాజ్యము చేయుచుండెను. ఈ నిరంకుశత్వములను గూర్చి అధిక దేశములలోని ప్రజలలో బహిరంగమైన అసంతృప్తియే యింకను కలుగలేదు. కలిగినచోట్లకూడ "రాజు" పనికిరాడు; "మతపీఠమే" (Church) అక్కరలేదు అని సంస్థలపైన తిరుగుబాటుగాక, నదగు రాజప్రభుత్వములోను, మతపీఠములోను గల దోషములను, అనగా వ్యక్తిగతముగా వీరు భోగలాలసులై, అందులకు అపరిమితముగ ప్రజాద్రవ్యము వెచ్చించుట, విదేశముల తోడ, వీరు వైరములకల్పించుకొని అందులకై, ప్రజాసామాన్యముయొక్క ధనప్రాణముల వెచ్చించుట, ప్రజలను పన్నుల భారమున ముంచుట, ప్రజల మొఱలను విన నిరాకరించుట, వీరిలో ధర్మభావములు నశించుట, మతముపేరుతో మతగురు దాస్యమును విధించుట, మతబోధకులే మతమునకు

వ్యతిరేకముగా సంచరించుట [1] మున్నగువానిని సంస్కరించుటకే, ఉద్దేశింపబడినది గాని ఆసంస్థను "సమయించి" నూతన సంస్థను స్థాపించ సంకల్పించినవికావు [2] ఈకాలపు ఉద్యమాలుం పైగా ఆకాలములో మెకీవిల్లీయను ఇటాలియన్ పండితుఁడు వ్రాసిన రాజస్వామ్యస్తోత్రపరమైనట్టియు, రాష్ట్రము కొఱకు పెట్టిపనులు చేసినను తప్పులేదనునట్టిదియు మన శుక్ర నీతివంటి గ్రంథము ప్రజల మానసికజగత్తును వెల్లడిచేయుచున్నది. లూథరువంటి జిజ్ఞాసువు, విప్లవకారుడును, రాజాశ్రయమువలననే తన ప్రొటెస్టెంటు మతప్రచారమునకు బూనుకొనెను. పైగా తాను చేసిన నిజమైన నవీనక్రైస్తవ బోధ, ప్రాచీనక్రైస్తవమత మను పేరుతోనే బోధనచేసెను. "నవీనమైన జౌగాళి' అను సాహసమాతనికి లేదు. చార్లెసు రాజును యురిదీసిన తాత్కాలిక బ్రిటిషు ప్రజాస్వామ్యము తన స్వామ్యమును స్థిరపఱచుకొనజాలక క్రాంవెల్ యొక్క నిరంకుశత్వమునకు లోబడి రాజవిరహమునకు పరితపించి తిరిగి

---

1. రైనాల్డుకవియొక్క "ఫాస్టు" అనే నవలలో కొంతయుత్ప్రేక్షయున్నను అందు రోమునగర "పోపు"లలో కొందరి అపవిత్రచరిత్ర చిత్రింపబడినది.

2. నూతనసంస్థ స్థాపనకు ప్రారంభమని పాశ్చాత్యపండితులు తెలుపుచున్న ఫ్రెంచి ప్రజావిప్లవముకూడ, అది వచ్చిన పరిస్థితులను బట్టి యోచించిన ప్రజలలో భావసంస్కారమువలన అది వచ్చినది. కాదని ఋజువుకాగలదని ఒకపూర్వపక్షము కలదు.

రాజప్రభుత్వమును సరించినది. జేమ్సురాజు పారిపోవుటవలన గల్గిన రెండవ అవకాశముకూడ ఇంగ్లండులో తిరిగి రాజస్వామ్యమునే తెచ్చినది. ఇటలీలో జరిగిన నగరస్వామ్యముల గూర్చిన పరిశోధనలు ప్రాచీనగ్రీకు ప్రజాస్వామ్యములందు గౌరవభావమును బట్టి చేసిరి, కాని (తుదకవి నిలుపలేని) లేని యుద్ధల చేసెడివారుకారు. డచ్చిప్రజలు విప్లవావస్థలోకూడ ఫిలిప్ రాజును ఆహ్వానించుచునే యుండిరి. ఇంగ్లండులోకూడ యీ మాత్రమైనను విప్లవము వచ్చుటకు—అచ్చటి ప్రజలు మొదటినుండియు, రాజులతో సంఘర్షించుట పరిపాటియై నందువలననే. అది ప్రత్యేకము జనసామాన్యములో బయలు దేరిన నూతనసంస్కార ఫలితముకాదు. ఈ విధముగ యీ యుగమునాటి యూరపుఖండమంతయు—అనగా ౧౩ మొదలు ౧౮ వ శతాబ్దమువఱకును—రాజస్వామ్యము దాని నిరంకుశత్వములోను యూరప్ ఖండముండుటయు, జిజ్ఞాసువులున్నా, అప్పటి ప్రజల ఉద్యమాలున్న పురాణమైనదంతయు—మతములో గాని, రాజ్యాంగములో గాని సారస్వతములో గాని[1]—

1. ఈ కాలములోని యూరపుఖండసారస్వతమంతయు పూర్వ గ్రంథముల తర్జుమా యాయెను. వాని ననుసరించి నూతనగ్రంథములు వ్రాయుటయే తప్ప వేరొకటి కాదు. భారతదేశములో కూడ యీ కాలపు—మత వేదాంత, సారస్వత అర్థిక—గ్రంథములు స్వతంత్రభావములతో కూడియున్నను ప్రాచీన ప్రామాణ్యము నొప్పిరయే యున్నవి. "రసగంగాధరం" వంటి

పవిత్రమైనవని నమ్ముచు ప్రస్తుతసంస్థలను వానివలె పునరుద్ధారణ చేయుటయే ప్రధానోద్దేశములుగా గల్గియుండిరి. అవసరమైనచో ప్రాతపద్ధతులను, వానిభావసంస్కారములను త్రోసిపుచ్చెదమని చెప్పగల యుగము యింకను కొంచెముగా భవిష్యత్తులో నుండెను. మిల్లుపండితుండు చెప్పినట్లు పాలకవర్గముయొక్కయు, పాలితులయొక్కయు దృక్పథములు, క్షేమములు అప్పుడు భిన్నములు. ప్రజాక్షేమమునకు విరోధమైన యీ ప్రభుత్వసంస్థయొక్క అధికారమును, ప్రజలకుగల స్వాభావికపు హక్కులను అంగీకరింపజేయుట మూలముగా (Magna Charta, Petition of Rights మొదలైనవి) నిరోధించుటయే అప్పటి లక్ష్యము. ప్రభుత్వదృక్పథమే ప్రజల దృక్పథము; ప్రభుత్వక్షేమమే ప్రజలక్షేమమను రాచకీయాద్వైతస్థితికై—అనగా ప్రజలే ప్రభుత్వమును ఆక్రమించుట అను స్థితికై—ఉద్యమించేదశ పిమ్మటియుగము పాలబడెను. ఎంత సంస్కరించి నిలువబెట్టినను ప్రాతపద్ధతులు పూర్ణముగా పరివర్తనపొందిన నవీనయుగమునకు పనికిరావని ప్రజలు తెలుసుకొనుటకు మరికొంతకాలము పట్టినది. అప్పటికి

---

నవీనసాహిత్యమతమును ప్రతిపాదించు అలంకారగ్రంథము "కళాపూర్ణోదయం" వంటి తెలుఁగుకావ్యము భావములోను, పోకడలోను "నవీనతములు"గా నున్నవి. ఇంతమాత్రమున ఆనాడు భారతదేశమున "ప్రాత"ను తలతన్నెడు ఉద్యమములు కలవని మదాశయముకాదు.

౧౭ వ శతాబ్దపు అఖరుపాదమున్ను ౧౮ వ శతాబ్దమున్ను వచ్చినవి. అనగా వీనికంటె పూర్వయుగము, అప్పటి పూర్వ సంస్కారముల మఱచి స్వతంత్రముగ ప్రతివిషయమును తర్కించుయుగముకాదు.

అది ౧౮ వ శతాబ్దముయొక్క సొమ్ము. ఆశతాబ్దం నాటి రాచకీయ, ఆర్థిక, సారస్వత మున్నగు మానవుని యీ వజ్జీవితమునకు సంబంధించిన ఉద్యమము లన్నియు, పూర్వ పద్ధతులను, కట్టుబాట్లను త్రెంపుకొని నూతనముగా విస్తరించినవే. కవులు, తత్వవేత్తలు, రాజ్యాంగపండితులు పూర్వము మఱచి తాజాగా జిజ్ఞాసలు చేయుట మొదలుపెట్టిన యుగము.

ప్రస్తుతకాలములోనే ఆరంభించి ౧౮ వ శతాబ్దములో రాచకీయముగా ప్రజాసామాన్యములో మహత్తరమైన ఆందోళనాశక్తిని విప్లవ ఝంఝూమారుతమును జనింపచేసిన యూరపు ఖండీయుల ఆర్థికాదిజీవితమునకు చెందిన మఱికొన్ని ముఖ్యాంశములు యిక్కడ మనము గమనించవలసి యున్నది.

అచ్చుయంత్రము వచ్చి ప్రజలలో అద్భుతమైన గ్రంథ వ్యాప్తిచేసి, తద్వారా నిద్రించియున్న జనసామాన్యముయొక్క మనోముకుళాలను భావసంచలనములో వడవైచినది.

తుపాకీమందు కనిపెట్టబడినది. వెంటనే పూర్వయుద్ధములరీతి, వ్యూహముల పద్ధతి మారిపోయి యుద్ధశాస్త్రములో నూతనయుగము యేర్పడినది. అందుచే యుద్ధభటుఁడు శరీర బలముకంటె, అధికముగా బుద్ధిబలము, శాస్త్రజ్ఞానము, శాస్త్ర పద్ధతిని తరిఫీదు పొందుట అవసరమైనది. తుపాకీమందే వ్యూఢలుఁ ప్రభువులు, ఒకరికొకరు త్వరితముగా నాశనము చేసికొనుటకై సహాయపడినదనెదరు.

ఆవిరియంత్రము కనిపెట్టబడినది. పూర్వము గృహములలో చేయబడుచున్న చిన్న పరిశ్రమలు, యంత్రశక్తిపై అధికము పెట్టుబడితో, నూతనశాస్త్రపద్ధతులను నిర్మింపబడినవి.

పై మూడు కారణములవలనను, దేశముయొక్క, ఆర్థిక, రాచకీయసభ్యతలో పాటకపుజనులకు ప్రాముఖ్యత వచ్చినది. వెంటనే వారిలో విద్యాప్రచారము, అందువలన అచ్చుయంత్రములపై బయలుదేరిన గ్రంథప్రచారము వారిలో వ్యాపించుట, జరిగినది. వ్యవసాయములో కూడ చిన్నచిన్న కమతములు, శాస్త్రసిద్ధమైన పద్ధతి వ్యవసాయము చేయుటకై పెద్ద భూఖండములుగా మారుట అవసరమయ్యెను. అవి అనేక కారణములవలన పెద్ద భూస్వాముల నశమగుటవలన। కూడ యీ చిన్నచిన్న భూస్వాముల గణము నగరములకు ప్రాకి కార్మి

కలుగా మారవలసి వచ్చినది. వెంటనే వీరి నివుడ్చుకొను టకు నగరయాత్ర పరిశ్రమలు కాచుకొని యుండెను. నూతన భూగోళశాస్త్రము కనిపెట్టబడినది. ఇండియా, అమెరికా మున్నగు దేశములను కొలంబసు, వాస్కోడిగామా మున్నగు ప్రసిద్ధ యూరోపియన్ యాత్రికులు కనిపెట్టిరి. "వర్తకము", "వలస"—రీత్యా యీనవీనప్రపంచముయొక్క ఐశ్వర్యమును యూరోపియను లాకర్షింప మొదలిడిరి. నవీనశాస్త్రపద్ధతిని తరిఫీదు చేయబడి, మందుగుండు గలిగిన సేనలతో గూడిన యీ పాశ్చాత్యరాష్ట్ర ప్రభుత్వములు (ప్రాచ్యఖండపు రాష్ట్ర ములు ఐశ్వర్యమును చూరగొనుటకు వర్తకదృష్టితో సన్నా హము లగుచుండినవి. జిజ్ఞాసువులు కూడ ప్రపంచపరమైన భావవైశాల్యమునే అన్వేషించుచుండిరి. యూరప్ ఖండము నుంచి అమెరికా మున్నగు అనాగరిక, ఆదిమనివాసుల ఫల వంతములైన దేశముల నాక్రమించి సుఖజీవనమును చేయుటకై కుటుంబములు వలసపోవుట ప్రారంభమయ్యెను. విప్లవయుగ ప్రారంభమును చేయు ౧౫ వ శతాబ్దావసానమునకున్నూ, పూర్వము తెలుపబడిన ప్రాచీనపద్ధతులను తిరిగి నెలకొల్పవలె నను రినాస్సెన్సు కాలమునకును యిది మధ్యదశ. జిజ్ఞాసువుల భావవైశాల్యమునకును, యూరప్ రాష్ట్రముల సామ్రాజ్య వైశాల్యమునకును కూడ యీకాలము ఉపచరించినది.[1]

1. యూరోపియను జాతులవారు అధినివేశవ్యాప్తికిఁ (Colonial expansion) గడంగిన పరిస్థితులు. యంత్రములపై భారీపరి

భారతవర్షమును దాటిన నాగరికత లేదను ధర్మరాజునాటి నమ్మికనే (ఆనాఁడు ధర్మరాజు దానిని ప్రత్యక్షప్రమాణము వలన నమ్మిన వీరు ఆ పరిస్థితులు మారి భారతవర్షము వెలుపలి ప్రపంచము అత్యద్భుతముగా అభివృద్ధిపొందుచు ఉను

---

శ్రమల స్థాపన యూరప్‌లో ప్రారంభమయ్యెను. ఇందులకు ముడిసరకులు వలెనుగా సప్లయిచేసే దేశములు కావలెను. ఈ సరకులతో నిర్మింపబడే పరిశ్రమల కొనే దేశాలు—తప్పకుండగ ప్రత్యేకముగ తమయొద్దనే కొనేవి—కావలెను. అట్టి దేశములలో ప్రజలకు పారిశ్రామికపు సరకుల నుపయోగించుటకు అభిరుచి కలిగి యుండవలెను. వారికొనుగోలు సమర్థత (Buying power) వృద్ధిచేయవలెను. ఇట్టి దేశాలు వారికి కావలసి వచ్చినది.

ఇందులకై యిప్పటికి బాగుగా సంపాదించిన అయిశ్వర్యములనుండి ప్రాచ్యఖండీయములైన, చైనా, యిండియాలకున్నూ, దక్షిణ అమెరికాకున్ను పెట్టుబళ్లు యూరపియన్‌దేశములవారు పెట్టుచుండిరి. వెంటనే తమ పెట్టుబడి భద్రతకొఱకు—అనగా "వడ్డిహక్కు" (Interest Right) రక్షించుకొనుటకు—అట్టి దేశముల వ్యవహారములలో పెట్టుబడిదారులైన యూరపుఖండీయులు పెత్తనము చేయుట, పైలాభములు వారివలన పొందుటకై—వారిని కాపాడుటకును, వారు తమ అర్థికాధిపత్యము ను తిరస్కరింపకుండుటకును, సేనలను, యిట్టి ఋణగ్రస్థ దేశములలో నుండుట తటస్థించినది. ఇదియే డచ్చి, ఇంగ్లండు, ఫ్రాన్సువారు తొలుత ను, జర్మనీవారు పిమ్మటను రాజ్యవిస్తీర్ణతావిధానముల నవలంబించుటలో ముఖ్యోద్దేశములు ఈవిధమైన ఋణము పెట్టుబడిసంబంధమైన దాస్యతకు గురియైన దేశము

మీదకు జొచ్చుకొని వచ్చుచున్నను కనిపెట్టజాలక పూర్వపురాణములనే నమ్ముకొనియుండిరి.) నాఁడును గలిగి ప్రపంచపు పరిస్థితులవైపు కన్నుల తెరువజాలక అన్యోన్య స్థానికకలహములలో నిమగ్నులైన, భారతీయ రాచకీయవేత్తలకు యీ కాలములో ప్రపంచదృష్టి మందగించెను.

---

---

చైనా. ప్రపంచవ్యాపారమునకును ఆయువుపట్టువంటి పశ్చిమమున "సూయజు కెనాలు" తూర్పున "సింగపూరు" మొదలయినవాటి ఆక్రమణ; సంపాదించిన వర్తకప్రాముఖ్యత, రాజ్యముయొక్క సంరక్షణార్థము ఆంగ్లేయుల కవసరమయ్యెను.

## అధ్యాయము—౪౫.

---

౧

అమెరికను ఉద్యమము. రాజులేకుండా ప్రజాప్రతినిధులే రాజ్యచక్రమును నడిపెడు విధానము ప్రపంచములో ప్రధమతః ఉత్తరఅమెరికాలో మూర్తీభవించినది. ఈ అమెరికా రాష్ట్ర ప్రజలు గ్రేటుబ్రిటనునుండి అధికముగాను, ఇతర యూరపు ఖండ దేశములనుండియు వలసవచ్చిన యూరపుఖండీయులును వారి సంతతివారలును అయి యుండిరి. యూరపు ఖండములో ౧౭—౧౮ శతాబ్దములో బయలుదేరిన తీవ్రమతకక్షలు, పోరాటములు; జనసంఖ్య హెచ్చుచున్న యూరపుఖండమునుండి బయటపడి అనుకూల శీతోష్ణస్థితిగల్గి సారవంతమైన భూములతో ఒప్పుచున్న అమెరికాలో ఆర్థిక, పారిశ్రామికముగా సుఖజీవనము చేయవలెనను ఇచ్ఛయు; యిూ వలసపోవుటకు వీరిని పైకిపిలచుకొని పోయినవి. అమెరికాకువచ్చిన యిూఆది యూరోపియనులు—ముఖ్యముగా బ్రిటిషువారు—తమలో కూడ తల్లిదేశములోని ప్రజారాజ్య సాంప్రదాయమును విత్తు కట్టుకొనివచ్చిరి. అందుచే యిూ అమెరికాలోని శ్వేతప్రజల విప్లవమునకు పూర్వమె అమెరికా ఖండములకు వలసవచ్చిన జాతులవారు అమెరికా దేశమును రాష్ట్రములుగా విభజించుకొని స్థానిక స్వపరిపాలనమున చాలవఱకు ప్రజలే భాగస్వా

ములుగానుండిరి. క్రీ. పి. ౧౭౭౦ సం. రమున ఉత్తరఅమెరి కాలోని అప్పటి ౧౩ రాష్ట్రముల ప్రజలు తమ తల్లిదేశమైన బ్రిటన్ దేశముపై తిరుగుబాటునుచేసిరి. ఈతిరుగుబాటునకు కారణము—ఆంగ్ల దేశపు రాజైన మూడవ జార్జి తన అధికార మును అమెరికన్ ప్రజలపై—ఆప్రజల యిచ్ఛకును, క్షేమము నకును వ్యతిరేకముగా—నిలువబెట్టుకొనవలెనను తలంపు. అమెరికన్ వర్తకక్షేమమును, బ్రిటిష్‌వర్తక క్షేమమునకు బలియిచ్చుట, అమెరికాప్రజలపై బ్రిటిషుపార్లమెంటే పన్ను విధించు అధికారము చలాయించవలెననుట[1], అను యీ మూడు అక్రమములు. కాని యీయక్రమముల నివారణకై బయలువెడలిన యీ యుద్యమము ౧౯ వ శతాబ్దములోని యూరపుఖండ రాచకీయ యుద్యమములు, ఉన్నసంస్థల అధి కారము, ప్రజాపీడనకరముగా నున్నప్పుడు దానిని హద్దులో నుంచుటయే పరమ ప్రయోజనముగ నిడుకొని అంతమొంది నట్లుగాక, కేవల సంపూర్ణ ప్రజాస్వామ్యముగా పరిణమించి నది. థామస్ "పైనీ" (౧౭౩౭. జన్మము) అను అమెరికా జిజ్ఞాసకుడును, ఈయుగపు ప్రజాస్వామ్యా యశములకు వ్యాస పీఠమువంటి "రూసో" అను రాచకీయ వేదాంతియొక్క

1. Taxation without representation is a tyranny. "ప్రాతినిధ్యము లేకుండగనే పన్నువిధించు (ప్రభుత్వ) విధా నము దౌష్ట్యయుతమైనది" అను సూత్రము అమెరికను విప్లవ ములో బయలుదేరినదే.

ప్రాతలును, యీ యుద్యమమునకు సిద్ధాంత సంపదను చేకూర్చినవి. ఆంగ్లేయుల అక్రమముల గూర్చి అమెరికనులు పరితపించుచుండుటచే, అదనులోనున్న యీప్రజల మనస్సులలో ఈ జిజ్ఞాసువుల ఆశయములు తెన్నుగా వ్యాపించినవి. వెల్సు పండితుఁడు తెలిపినట్లుగా యింతకు పూర్వము ప్రజాసంఘములకు ప్రభుత్వాధికారమునకు విధేయత కనుపర్చుటయే ప్రధానలక్షణము (Community of obedience). లక్షణమే కాదు; ధర్మముకూడ. ఇంతటినుంచి విధేయతను ప్రకటించుట మాత్రమే ప్రధానలక్షణముగాగల యీపూర్వపురీతి ప్రజాసంఘముయొక్క స్థానే "తనయిచ్ఛను వ్యక్తపఱచుట కవకాశముగల నూతనరీతి ప్రజాసంఘమును (Community of will) అమెరికారాష్ట్ర ప్రజలు తమ సమాఖ్య ప్రజాస్వామ్యమువలన లోకమునకు ప్రదర్శించిరి. ఇంతకు పూర్వమే, అనగా ౧౮౪౮ సం॥ రములో స్విజర్లండు రాష్ట్రము సమాఖ్యవిధానమును నిర్మించుకొని తానుచిన్నరాజ్య మగుటకుతోడు శాంతి సమరస భావములను, విదేశరాజ్యాంగ నీతిగా నిడికొని రాచకీయాకాశములో శాంతికి, యుద్ధ విరామమునకును చిహ్నమైన చుక్కలాగున వెలుఁగుచుండెను. పూర్వము తెలుపబడిన డచ్చి విప్లవమునకు పిమ్మట కొంతకాలమునకు అనగా ౧౬౦౯ లో. డచ్చి ప్రజాస్వామ్యము స్థాపింపబడినది. అయినను యీ యుద్యమముల ప్రేరణ కర్తృత్వమును గూర్చి యోచించునప్పుడు తేలునది ప్రజాస్వామ్య ప్రేరితమైన ఉద్యమ

ఫలితముగా ప్రజాస్వామ్యము స్థాపించిన ప్రథమ దేశము అమె
రికా సంయుక్తరాష్ట్రములే (క్రీ.శ. ౧౭౭౬ సం. ౪౦) అమెరికా
రాష్ట్రీయులు బ్రిటిష్ అధికారమును తిరస్కరించి బ్రిటిష్
సేనలను జయప్రదముగా యెదిరించియు బ్రిటిష్ వస్తువులను
జయప్రదముగా బహిష్కరించియు, తమ న్యాయబలము
ఉద్యమ ప్రాబల్యమువలన బ్రిటిష్ పార్లమెంటులోని మహోప
న్యాసకులైన "బర్కు" "బ్రైటు" వంటివారల సానుభూతిని
కూడ పొంది బ్రిటిష్ దాస్యమునుండి బయట పడగలిగిరి.

కాని "స్వయం నిర్ణయ" మునకై దిగినప్పుడు తమ
ప్రజాస్వామ్య విధాన నిర్మాణములో రాష్ట్రములకు ఐక
మత్యము కుదురక చాలచిక్కు తటస్థించినవి. అంతకు
పూర్వమే యీ యమెరికా ఖండములోని ప్రతిరాష్ట్రము
లోను యేదోవిధమైన ప్రభుత్వముండి స్థానిక రాష్ట్రాభిమా
నము వృద్ధిలోనుండెను. ఈరాష్ట్రములన్నియు యేదోయొక
విధానముక్రింద ఐక్యమై కేంద్ర ప్రభుత్వముక్రిందకు రానియె
డల యెప్పటికైనను అమెరికాకు పరదేశీయులవలన ముప్పు
తప్పదని భయ మొకమూలను, యిట్టి విధానముక్రిందకు వచ్చి
నచో రాష్ట్రము లిదివర కనుభవించుచున్న స్వేచ్ఛపోవు
ననియు ప్రబలసీమల ప్రతినిధులు, చిన్నసీమల నణగద్రొక్కెద
రను భయ మొకమూలను, అమెరికా రాష్ట్రీయులను యిటు
నటు నూపుచుండెను. ఇంకనుగూర్చి అనగా అమెరికా
దేశీయ ప్రభుత్వవిధానమును గూర్చియు, అందు రాష్ట్రముల

స్థానమును గూర్చియు వాదోపవాదములు బయలుదేరెను. ఈవాదము నాలుగైదు సంవత్సరములు నడచెను. నాలుగైదు రాష్ట్రప్రతినిధుల సభలు (Constituent Assemblies) జరిగెను. ఒకప్పుడు అమెరికా ప్రజాస్వామ్యము "సిద్ధించదేమో" నను నిరాశగూడ నాయకులకు కలుగుచుండెను. తుదకు ౧౭౮౭ లో ఫిలడల్ఫియాలోని ఆయారాష్ట్రీయ ప్రతినిధుల మహాసభలో యీరాష్ట్రములు తమ స్థానిక ప్రభుత్వాధికారము నిలుపుకొను పద్ధతిని యూవత్తు అమెరికా రాష్ట్రముల సమాఖ్య విధానముకై (American Federal Republic) అంగీకరింపబడెను. వెంటనే యింతకుపూర్వము రాష్ట్రాభిమానమునకు లోబడిన "వర్జీనియా" ప్రజలను "రోడ్డులంక" ప్రజలను అనురాష్ట్ర నామములతో వ్యవహరించుకొనుచున్న యీరాష్ట్రప్రజలు "అమెరికన్ జాతీయులము" అను నూతన జాతీయతను వీక్షించిరి. ౧౭౮౯ సం॥లో యీ సమాఖ్య రాజ్యాంగ విధానము రాష్ట్రముల వారీగా అంగీకరింపబడెను. ఈఉద్యమ సైనికనాయకుడైన "జార్జి వాషింగ్టన్" యీ సమాఖ్యవిధానపు అమెరికా ప్రజాస్వామ్యపు ప్రథమ అధ్యక్షుడయ్యెను. ఆయనపేరనే ప్రభుత్వ రాజధాని నగరము "వాషింగ్టన్" అని ఆయన అమృత యశస్సుకు చిహ్నముగా బరగుచున్నది. ఈనూతన అమెరికా సమాఖ్య విధాననిర్మాతలలో ప్రముఖులు బెంజామిన్ ఫ్రాన్లిక్లన్, పాట్రిక్ హెన్రీ, జావరుసన్, ఆడమ్సుసోదరులు, మాడి

సన్, అలెగ్జాండరు హామిల్టన్‌గార్లు. "వీరు పండితులు కాక పోవచ్చును; విశాలదృక్పథముగలవారు కాకపోవచ్చును. వీరికి తమ సంఘీయులపట్లగల సేవాభావము స్వచ్ఛమైనది." అని వెల్సు పండితుడు వ్రాసెను.

ఈఅమెరికనునమూఖ్య విధానము మాంటెస్క్యూ యొక్క శాఖావిభజన సిద్ధాంతము(Seperation of powers) పై నిర్మింపబడినది. అందుచే ప్రజాస్వామ్య విధానములలో ఇదియొక ప్రత్యేక తరహాకుచెందినది. దాని సిద్ధాంత చర్చ రెండు మూడు దీపికలలో జరుగును.

కొంతకాలమునకు యీ అమెరికాలో ఆదిమనివాసు లైన, నీగ్రో యెఱ్ఱ యిండియన్ జాతులను ఏథెన్సు ప్రజాస్వామ్యములోవలె "బానిసలు" గా ఆ ప్రజాస్వామ్య వాదులైన ౧౭ వ శతాబ్దపు అమెరికాదొరలు నిబంధించుటయు, వారికి పౌరస్వత్వపు హక్కుల నిరాకరించుటయు జరిగి అందుండి "మనము పోరాడి ముక్తినిచెంది, కల్పించి, స్థాపించి ప్రేమించి నడుపుచున్న ప్రజాస్వామ్య పద్ధతికి ఈవైఖరి అనుచితము కాదా?" యను జిజ్ఞాసలు బయలుదేరినవి. వ్యవసాయిక భాగములకు చెందిన దక్షిణప్రాంతపు ప్రజలు తమవృత్తికి, యీబానిస లవసరము గనుక యీపద్ధతిని మార్చరాదనిరి. ఉత్తరభాగమునకు సంబంధించిన యంత్ర పరిశ్రమలపై జీవించే అమెరికన్‌లు, స్వతంత్రులైన కార్మికులు తమ కవసరముగాన నీగ్రో బానిసత్వము రద్దుకావలయుననిరి. ఇటుల వీరిలో అభి

ప్రాయభేదములు జనించెను. ౧౭౭౬ వ సం॥ రంలో జాతికి మిక్కిలి లాభకరముగానున్న ఈబానిసల వర్తకము నిరాఘాటముగా సాగవలెనని "డారుమౌత్తు" ప్రభువురిపోర్టు వ్రాసెను. జాఫరుసన్, వాషింగ్టను ప్రముఖులు దీనిని ఖండించినను తమ యింటిపనికిగాను బానిసలను ఖరీదుచేయుచుండిరి. ఈయుద్యమమునకు పక్షవ్యతిరేకముగా దేశములో హోరాహోరీని పోరాటములు బయలుదేరెను. అప్పుడే క్రొత్తగా దేశములో నాటబడిన అమెరికా సంయుక్తరాష్ట్ర ప్రభుత్వము యీ సమస్యపై చీలికలై పోవునాయను భయము దేశనాయకులకుగల్గెను. కాని తుదకు ధర్మమునకు కొంతజయము గల్గెను. అది శాసనరూపముగా నీగ్రోలను యెవరును బానిసలుగా చేయరాదనియే (౧౮౬౦ సం॥ ఆప్రాంతమున). కాని క్రియలో నాగరికతలో అగ్రజులమని చెప్పుకొనుచున్న ఈ అమెరికన్ లదేశములో నీగ్రోలను బానిసత్వములో నుంచుట, దారుణముగా హింసించుటయు నేడుకూడ నేదో యొక మూల జరుగుచునే యున్నది. కాని యీ నీగ్రోవిమోచన ఉద్యమములో ప్రముఖుడైన ఆబ్రహాములింకను మఱువదగిన వాడుకాడు.

---

ఫ్రెంచివిప్లవము. ౧౭౮౯ సం॥ లోని ఫ్రెంచి ప్రజా విప్లవము యింతకంటెను ఘనమైనది. అమెరికాలోవలె దూరముననున్న సముద్రమధ్యమందు గాక, ఫ్రాన్సు దేశము, సామ్రాట్టులు రాజులు, మతగురువులు, జనసామాన్యమును తమ కాలి బొటనవ్రేలిక్రింద నొక్కియుంచిన సరిహద్దు దేశముల మధ్యనుండియు, ఒక్కపెట్టున యీ రాజదాస్యమును త్రెంపివేసి చుట్టుపట్లనుండిన నిరంకుశ రాజ్యరమామంగళసూత్రములనుకూడ వణకించివేసెను. తాను ప్రజాస్వామ్యమును ప్రకటించుటతోడనే తృప్తిపడక నెపోలియన్‌నాయకత్వమున మొదటిలోనే, యీ ఫ్రెంచిప్రజలు సరిహద్దుదేశములలోనికి దాడి వెడలి, ఆదేశములలోని రాజులను పారద్రోలి ప్రజాస్వామ్యములను స్థాపించుచుండిరి.

ఈవిప్లవము, మొదటిరోజులో రాజు "స్టేట్సుజనరల్" అను పూర్వకాలమునుండి యీ ఫ్రాన్సుదేశములోనుండి యిటీవల రాజులు నిరంకుశత్వముగా నణచివేసిన, ప్రజాప్రతినిధి సభామోదముతో పరిపాలన జరుపవలెనని నిబంధించుటకై బయలుదేరినది. క్రమశః ఇది సంపూర్ణప్రజాస్వామ్యమునకైన విప్లవముక్రింద పరిణమించెను. ఈ విప్లవము అమెరికా విప్లవమువలె కేవల రాచకీయస్వాతంత్ర్యమునకే సంబంధించినది కాదు. ఇదివరలో తెలిపినట్లు "హాబ్సు", "లాక్" జిజ్ఞాసు

వులవలన "ఇంగ్లండు"లోను "మాంటెస్క్యూ" జిజ్ఞాసువు (౧౬౮౯-౧౭౫౫) ఫ్రాన్సులోను "జెసూయిట్సు" అనుమతసంస్కారములోని యువకులున్నగు వారును ఏరి రాజకీయజిజ్ఞాసల ఫలితముగాను యూరపుఖండమందంతటను రాజులమొద గల మూఢభక్తిని శిథిలపరచిరి. రాజుల అధికారము ప్రజల యొక్క క్షేమమునుబట్టి హద్దు పద్దులలో నుండవలెనను భావములు ప్రజలలో నేర్పడినవి. కాని "రూసో" తత్త్వవేత్తయొక్క ౧౭౬౨ సం॥లోని "సామాజికుల ఒడంబడిక" "(Social contract) లోని తత్త్వము ప్రజాస్వామ్యోద్యమములకు అత్యంతోద్దీపకమయ్యెను. ఈ ఫ్రెంచి ఉద్యమములోను అంతకు పూర్వపు అమెరికాప్రజల ఉద్యమములోను "రూసో" యొక్క సిద్ధాంతములకు స్థిరమయిన జాడలు కనుపించుచున్నవి.

ఆదిని మానవులందఱును యొడంబడికవలన సమాజావస్థకు వచ్చిరను యీాయన సిద్ధాంతము యెంతవఱకు సభ్యము, యెంతవరకు అసభ్యము అనుప్రశ్న వేరు. మన భారతసాంప్రదాయములో ఒకవ్రతమునకు ఒకఋషి, ఒకగోత్రము, ఒకఛందస్సు, ఒక వినియోగము ప్రత్యేకముగనున్నట్లు యీా ప్రజాయుద్యమవ్రతమునకు రూసో ఒక మహాఋషిగా[1] ఆనాఁడు భాసించెను.

1. ఈయన వ్యక్తిప్రవర్తన మంచిదికాదనెదరు. గ్రంథములతోనే గాని కరలతో ప్రసక్తిలేదు.

-ఈయన సిద్ధాంతములు:—ఆదిని మానవులందఱును వ్యక్తులుగా నుండి పూర్ణస్వేచ్ఛ ననుభవించుచుండిరి. కాలక్రమేణ కాచ కీయముగా సామాజికజీవనము యొక్క ఆవశ్యకత వ్యక్తులకు కలిగినది. అందులకై వ్యక్తులు తమరు వేరు వేరుగా నుండిన ప్రాకృతావస్థలో పూర్ణముగా అనుభవించిన స్వేచ్ఛలోని కొన్నిహక్కులను ఇదా సామాజిక అవస్థలో వదలుకొనవలసి వచ్చినది, అందులకు ప్రతిఫలముగా (సమాజపరముగా) తాము వదలుకొనని హక్కులను (వ్యక్తులకు తమఆస్థి, ప్రాణ, మానముల కాపాడుకొను హక్కులును, అభిప్రాయప్రకటన, శాంత కృషిచేసుకొనుట మున్నగు అవకాశములను నిలువబెట్టుట) సంఘము కాపాడుటకు పూనుకొనినది. యిది యంతయు మానవులు వ్యక్తులుగా నివసించు దశనుండి (State of nature) సమాజముగా నిబంధించుకొను (State of Society) దశలో కుదుర్చుకొనిన ఒడంబడిక (Social contract). ఇటుల యీయన సమాజజీవితముయొక్క ఆదిని గూర్చిఊహ (Fiction ) చేసెను. "అందుచే రాజ్యాధికారము ప్రజలది. ప్రజలనుండియే ప్రజల అధికారమునకు లోబడి నడుచుకొనవలసిన ప్రభుత్వముయొక్క అధికారము ఈ ప్రజాసమాజము వారిచే ప్రభుత్వమునం దుంచబడినది. రాజ్యాధికారము సంపూర్ణము (Absolute) అవిభాజ్యమై (Indivisible) ప్రజలయందే యెల్లప్పుడును నిష్టమై యుండుటయే కాదు. ప్రజలే రాజ్యాధికారమును, సిద్ధాంతములలోను, వాస్తవములోను

క్రియలోను చలాయించుటయే ప్రజాస్వామ్యలక్షణము." ఈ "రూసో" సిద్ధాంతము, రాజ్యాధికారము సంపూర్ణముగను అవిభాజ్యముగను అదిని ప్రజల చేతులలో నున్నదని నవ్వా డును ; జరిగినది, ఒడంబడిక యనినప్పుడును (ఏపరిమధ్య జరిగి నను) "హాబ్సు" సిద్ధాంతభాగమునకును ; కలయికకు (అది ఒడంబడికరూపము గానిండు, సన్నికర్షరూపము గానిండు) పార్టీలు సంఘవ్యక్తులుగాని సంఘమును ప్రభుత్వము కాదను నప్పుడు "లాక్" మతమునకును ; దగ్గఱగా నుండుటయే గాక ప్రభుత్వాధికారమును గూర్చి ప్రజలు ఆమోద, అనామోద ములను తెలుపువారు మాత్రమేగాక ప్రజలే రాజ్యాధికార మును క్రియలోకూడ చెలాయించవలయునని మఱింతపైకి పోయెను. ఈయన "లాక్" కంటెను స్పష్టముగా తనసిద్ధాం తమును ప్రతిపాదించెను. అందుచే "రూసో" మతములో ప్రాతప్రభుత్వమును సంపూర్ణముగ రద్దుచేసి దానిస్థానే ప్రజలే ప్రత్యక్షముగా ప్రభుత్వాధికారమును (Primary Democracy) వహించవలయునని తెలుపుటవలన పూర్వపు "గ్రీసు" నగరప్రజాస్వామ్యములు లక్ష్యముగా నున్నట్లును అప్పుడుగాని ప్రజలకు నిజమైన భద్రత చేకూరదనియు తేలుచున్నది. [1] ఇం గ్లండు దేశములో రెండవజేమ్సు రాజును పార్లమెంటువారు

1. ఈయన "జనీవా" నివాసస్థుడు. స్విస్సు ప్రజల ప్రత్యక్ష ప్రజాస్వామ్యములు కూడ యీయన సిద్ధాంతములకు తోడ్పడిన వని తెలుపబడుచున్నది.

పదభ్రష్టునిగా జేసినవాడు (౧౬౮౯ సం॥పు కన్వెన్షనులో) చేయబడిన తీర్మానము యొక్క భావ

"(That the king having endeavoured to subvert the constitution of the kingdom by breaking the original contract between king and people, has abdicated the Government and the throne is thereby vacant.")

౧౭౭౬ సం॥లోని అమెరికా సంయుక్తరాష్ట్రములవారి స్వతంత్ర్యప్రకటనలోని భావ:

(" That all men are created equal; that they are endowed by their creator with certain inalienable rights........... that to secure these rights, Governments are instituted among men, deriving their just powers from the consent of the Governed; that whenever any form of Government becomes destructive of these ends it is the right of the people to alter or abolish it, and to institue a new Government laying its foundation on such principles and organising its powers in such form, as to them shall seem most likely to effect their safety and happiness.)

1789 సం॥ లో ఫ్రెంచి విప్లవములోనిజాతీయ సభ వారు చేసిన హక్కుల ప్రకటనములోని భావ:

౧. Men are born free:and equal in rights.

౨. The aim of every Political Association is the preservation of the political and imprescriptible rights of man.

3. These rights are liberty, property, security and resistance to oppression..

౪. Liberty consists in the power to do any thing that does not injure others; accordingly the exercise of the natural rights of each man has for its only limits, those that secure to the other members of society, the enjoyments of these same rights. These limits can be determined by law......

౫. Law is the expression of the General will".

చూచినప్పుడు ఆ కాలములో "రూసో" యొక్క సిద్ధాంతములకు ప్రజలలో ఘనమైన వ్యాప్తి, వ్యాప్తికాదు, నమ్మికయుండుట వాస్తవమే. కాని యీ సిద్ధాంతములు సత్యదూరములని నవీనులగు "విల్సన్" మొదలగువారి మతము. మానవజాతియొక్క ప్రారంభదశలో అనగా ప్రభుత్వమనేది లేనప్పుడు ప్రజలకు సంపూర్ణ స్వేచ్ఛాభావమున్నదా? స్వేచ్ఛానుభవసంబంధమైన జ్ఞానము వారికి కలదా! నిజముగా మొదట కులములోను, పిమ్మట జాతిలోను తదనంతరము దేశములలోను గల బలవంతులు, బలహీనులను, బుద్ధిమంతులు బుద్ధిహీనులను వశపఱచుకొనుటవలననే రాజ్యములు, సామ్రాజ్యములు, నిరంకుశపరిపాలనము యేర్పడినట్లు పాశ్చాత్యచరిత్రలో కనబడుచుండగా ప్రజలలో ప్రజలు ఒడంబడిక చేసుకొనుటగాని ప్రభుత్వమునకు తమకుండిన స్వతంత్రములలో, కొన్నిటిని, మిగతవాటిని కాపాడేపద్ధతిపైన అప్పగించుట అనునదిగాని యెన్నడును జరిగియుండదనియు, అందులో మానవజాతి అనాగరకా

వస్థలో యున్న ప్రాచీనకాలమున అసలే జరిగియుండదనియు, అది మిథ్యయనియు, యీ పూర్వపక్షీయుల మతము. ఇంక యిట్టి (రూసోయొక్క) యూహకు యెట్టిఆధారములేదు. సరి కదా, యిందువలన ఋణములను యెగబెట్టుట, ప్రజలు యథేచ్ఛాకాముకులయి ప్రవర్తించుట, మున్నగు ఫలితములు జరుగ వచ్చునుగాన ప్రమాదకరమని మఱియొక—ప్రజాస్వామ్యవాదులలోనే—పూర్వపక్షము (చూ. బ్లంచ్లీపండితుని "రాష్ట్రి సిద్ధాంతము.")

రూసో–భారతసాంప్రదాయము. కాని భారతసాంప్రదాయములోని అనగా భారతశాంతిపర్వములోని "విను తొల్లి కృతయుగంబున, మనుజుల కెడ దండనీతి మంతుండై రాజన నొకండు గలిగి యురయుట, మనుజేశ్వర లేక ధర్మమతమంత్రు దగఁ" "ఒండొరులకు రక్షకులై యుండుదు రట్లుండ, దైన్యమొదవినలోభం, బొండొండ పెరిగి, ధర్మము ఖండితమై మొదలుకొని రకార్యములకున్". ఆ. ౨. అప్పుడు మునులును, ఇంద్రాది దేవతలును బ్రహ్మవద్దకుపోయి తెలుపుకొనగా "దండనీతిశాస్త్రము" (statecraft) ను ఆయన లోకమున కిచ్చెననియు, దానిని బట్టియే ప్రభుత్వములు (రాజస్వామికములు లేక ప్రజాస్వామికములు) బయలుదేరినట్లు కనుపించుచున్నది. మఱియొక స్థలములో "జనులొక్కతఱి, తొల్లినయయుంబుదములోన, జేసిక్రూరతయు ముచ్చిమియు, రంకు సైపక యట్టి దుర్జను నందఱును గూడి, శాసించువారుగా జాలి, తమకు నధి

వతియుగ ‘నౌరునాసవడశ యుండి’’నట్లును, పిమ్మట ప్రజల నడవడి చిక్కుపడుటయు, ప్రజలు బ్రహ్మయొద్దకుపోయి “మాకు రక్షకుడుగ మహిపుడొకడు వలయు రూపింపు’’మనుటయు బ్రహ్మ మనువును ప్రజలకు రాజుగానుండ పొమ్మనుటయు, అందుపై మనువు “నరు లసత్యచరితులు’’ గాన పోననుటయు, అందుపై “అజ్ఞనములు, మహాత్మా నీకు వుయిలోడనేల’’ అని తమ ధాన్యాదులలో దశమభాగము పన్నుగా నిచ్చుట, పశువులు పసిండిలో ఏబదివంతు నిచ్చుట దుష్టనిగ్రహ, శిష్టపరిపాలనముచేయుట, మొదలైన షరతులతో, నతనిని రాజత్వమున కొడంబఱచిరి. ఈస్థితి మొదట తెలిపిన కేవల సాత్వికసమాజస్థితికి కొంచెము తక్కువస్థితి. మొదట తెలుపబడిన కృతయుగసంఘములో దుర్మార్గులే లేరు. అందరును ధర్మమతులే. కామరాగములు ప్రజామనంబుల చొరని కాలము. రెండవదశలో దుర్మార్గతకొంత సంఘములో ప్రవేశించినను, దానిని “సైపక, అట్టి దుర్జను నందఱును గూడి శాసించుచుండుటచేత,’’ సార్థకమయిన ప్రభుత్వమునకింకను అవసరము కలుగలేదు. ఈరెండుదశలును, ప్రాకృతావస్థకు పరమండలివియు, రాజ్యాధికారము ప్రభుత్వాయత్తముచేసిన అవస్థకు పూర్వమండలివియు. ఈరెండిటిలో రెండవదశకంటె, మొదటిదశ ప్రభుత్వము అనేది మానవులకు కావలెనను కోరికపుట్టిన కాలమునకు కూడ చాల ప్రాచీనము, అనగా “నియామకము’’ అనునదే ప్రజలు మెరుగరు; సంఘము

వానంతట అదియే సామరస్యముగా నడిచినకాలము. దీనిని ధర్మముతమనిరి. రెండవదశలోకూడ, ప్రభుత్వమనేది యింకను యేర్పడలేదు. కాని ఒకవిధమైన శాసకత్వము వచ్చినది. మూడవదశలో ప్రజలు ప్రభుత్వరూపమయిన రాజు అనే వానిని బ్రహ్మచేత చేయించుకొని తెచ్చుకొనిరి. సామాజికుల సన్నికర్ష (Compact)ఒడంబడిక (Contract) సిద్ధాంతములు భారత దేశమునకు "లాక్," "రూసో"ల కంటెను ప్రాచీన మైనవేగాక, నవీనకాలమునాటి "లాక్" రూసో సిద్ధాంతములకు, యీ ప్రాచీనభారతవాఙ్మయములో ఆధారము దొరుకుచున్నది: మఱియు ప్రాకృతావస్థకున్నూ (State of nature) ప్రభుత్వావస్థకున్నూ (State of government) మధ్య సమాజావస్థ యున్నటుల, ఈసాక్ష్యములు తెలుపు చున్నందున యివి "హాబ్సు"ను పూర్వపక్షము చేయుచు లాక్, రూసోలను సిద్ధాంతీకరించుచున్నవి. అయితే సమాజావస్థ సన్నికర్షవలన యేర్పడినదా? ఒడంబడికవలన ఏర్పడినదా? అను లాక్, రూసోలకు మధ్యగల ప్రశ్నకు యిక్కడ స్పష్టమయిన సమాధానము గానరాదు.

ఇ౹౹౪ <u>బౌద్ధసాంప్రదాయము లో</u> ధర్మమత సంఘముసుగూర్చి భారతవర్ణన ఒప్పబడినది. ఇంతేగాక ప్రజలు "మనోమయులు," "స్వయంప్రభ" గలవారుగాను కూడ నుండిరట. వీరిలో పతనము ప్రారంభించుటవలన వర్ణములు,

స్త్రీపురుషభేదములు, కుటుంబ, స్వామ్యసంఘు, వ్యవస్థ మున్నగునవి ఒడంబడికలు మూలముగా నవసరములయ్యెను. ఇఁక రాజు యెటులవచ్చెను? సంఘములో దొంగతనము ప్రవేశించిన దనుసరికి, ప్రజలందరు సమావేశమై యిట్టివారిని శిక్షింపజాలినట్టియు, శిష్టులను రక్షింపజాలినట్టియు, వాని నొకనిని రాజుగా నెన్నుకొనుట కంగీకరించిరి. అతనికి ధాన్యములో ఒక వాటా యిచ్చుటకు సమ్మతించిరి. ఆప్రకారము తమలో సౌందర్యవంతుఁడును, ఉదారవంతుఁడు, శక్తివంతుఁడు నయినవానిని రాజుగా నియమించుకొని పై షరతులప్రకారము అతనితో ఒడంబడిక నేర్పరచుకొనుట మూలముగా అతనే "మహాజనసమ్మతుఁడు" అని పేరు బడసెను. అతఁడు పొలములకు పతిగాన "ఖత్తియుఁడు" యని పిలువబడెను. (ఖేత్తానాం పతేతిఖత్తియో) ఇక్కడ "రూసో" యొక్క సాంఘికులమధ్య ఒడంబడికకు ప్రథమ ప్రసక్తియు, సంఘము వారు ప్రభుత్వముతో చేసికొనిన "హాబ్సు" సిద్ధాంతమునకు దగ్గఱగాయున్న ప్రభుత్వనిబంధనకు పిమ్మట ప్రసక్తియు, కను పించుచున్నది. మఱియు ఇచ్చట మహాభారతములోవలె గాక దైవసంబంధమేమియు లేక అంతయు మనుష్యకృతము గానే కాన్పించుచున్నది. (చూ. దీర్ఘనికాయ. Vol. 3. P. 84–6. మహావస్తు Vol. I. P. 347–48. ల Senates Edition నుండి "ఘోషాలు" గారు చేసిన అనువాదముపై ఆధారపడి పైచర్చ చేయబడినది.)

ఇంక, చైనాసాంప్రదాయము లో కూడ యీ ఒడంబడిక సిద్ధాంతము కనుపించుటకు చైనీయులకు గల బుద్ధమత పరిచయము కొంత కారణమేమో. ఈ అంశము పరిశోధకులకు వదలెదము. చైనామతములో మోట్జు యీ సిద్ధాంతమును స్పష్టముగా విశదీకరించుచున్నాడు. ఈయన ప్రకారము అదిని ప్రభుత్వమనేది లేదు. ఒక్కొక్క మనుష్యుడు, ఒక్కొక్క ప్రత్యేకరీతి, లేక పద్ధతి (Standard) ని కలిగియుండెను. అందువలన అనేకరీతులు యేర్పడి యెవరి రీతినిబట్టి వారే ప్రత్యేకతను కోరుటవలన సంఘర్షణకు కారణమయ్యెను. ఈసంఘర్షణలవలన సంపద నిరుపయోగములోపడి యుండుటకయినా ప్రజలు అంగీకరించిరిగాని పంపకానికి ఒప్పలేదు. మనుష్యులు పశువులవలె సంచరింపజొచ్చిరి. అందుచే యీ భిన్నపద్ధతులు, రీతులనన్నిటిని సమన్వయము చేసే నాయకుడుండవలెనని ప్రజలకు గోచరించినది. అందుచే వివేకము, సూక్ష్మబుద్ధి, దూరదృష్టిగల వ్యక్తి చక్రవర్తిగా చేయబడెను. ఈసిద్ధాంతము సంఘవ్యవస్థయు, ప్రభుత్వమున్నూ కూడ యేకకాలమందే యేర్పడిన "హాబ్సు" మతమునకు దగ్గఱగా యున్నది. (చూ. Ch. P. T. P. P. 106.)

"రూసో" ఒడంబడిక నిజముగ జరిగినను, జరుగక పోయినను గౌతమసూత్రములలోని "తద్రక్షణధర్మిత్వాత్" అను సూత్రమున్ను పై భారతశాంతిపర్వాద్యంశములున్ను ప్రభుత్వములు, రాజులు, తమధర్మములను నిర్వ

ర్తించనపుడు, వారిని తొలగించి వారిస్థానే యితరులను స్థాపించుట యుక్తమనుటలోను అతి ప్రాచీనకాలములోని అనగా తనకు సుమారు సం॥ ౧౦౦౦ పైకాలమునాటి సాంప్రదాయముల సహాయమును రూసో పొందుచున్నాడు.

ఈవిషయ మిక్కడ యింతటితో నిలిపెదము. ఇంకను లోతుగా ఇందునుగూర్చి సిద్ధాంతదీపికలో చర్చించెదము.

ఈ ఫ్రెంచివిప్లవము ఆ కాలపు మానసికదాస్యమును నలుముఖముల సడలింపజేసినది. వెంటనే జిజ్ఞాసువులు, అంతకు పూర్వపుకాలపు వారివలెనే కొన్ని ప్రాక్తన సంస్కారములకు లోబడి ఆలోచనచేయుటతో కాలముగడపక కేవల స్వతంత్ర తర్కజిజ్ఞాసలు—క్రొత్తగా ఆనాడే తాము భూలోకములోనికి దిగినామనుకొని—చేయజొచ్చిరి. రాజును అంగీకరించవలెనా? లేక, ప్రజలే రాజ్యమును చేసికొనవలెనా? అను జిజ్ఞాస రాజకీయరంగములో యెట్లు బయలుదేరెనో, మతములో భగవంతుని అంగీకరించవలయునా? లేదా అను జిజ్ఞాసబయలుదేరినవి. ఇప్పటికే ఓవను, సైమన్సు, ఫ్రౌఢను, మున్నగువారి నాయకత్వమున సమిష్టివాదము గలదు. ఇటులే సారస్వతము, శిల్పము, భౌతికశాస్త్రములోను, స్వతంత్రపరిశోధనాసక్తిని, నవ్యభావములను ఉద్దీపనచేసి వాని సంపదను వృద్ధిచేసినదీ విప్లవము. ఈ విప్లవనాయకుడైన "రోబనుబెర్రి" భగవంతుని తిరస్కరించు అహంభావము, ధనమదాంధుల లక్షణముకావున నిరీశ్వరత్వమును నిరసించెను. ఈ విప్లవములో రాజుపక్షమున

"దేశద్రోహులు"గా పనిచేసినవారితో పాటు నిరీశ్వరులను, సాంఘికవాదులను గూడ, మొత్తము నాలుగువేలమందిని యీవిప్లవనాయకుఁడుయురిదీయించెను. ఇది నాటిప్రజాస్వామ్య వాదుల నైతికతత్వమును తెలియజేయుచున్నది. అనగా వారి మనస్సులోని స్వేచ్ఛాభావము యేకముఖమై రాచకీయములో మాత్రము రేకెత్తిన ముకుళముగాని పుష్పముకాదు.

అమెరికా విప్లవము తమదేశమునకును, ప్రజలక్షేమమునకును అనుకూలమైన ప్రజాస్వామ్యముగా నేర్పడునిర్మాణ భావములు గలదగుటవలన పరప్రభుత్వమునుండి విడబడిన పిమ్మట, స్వప్రభుత్వమును గూడ స్థాపించుకొని నిర్మూలప్రతిభతోపాటు, తననిర్మాణ ప్రతిభనుకూడ ప్రదర్శించినది. ఈ అమెరికన్లు చాలమంది చిరకాలమునుండి ప్రజాస్వామ్యసంస్థల కలవాటుపడిన ఆంగ్లదేశీయసంతతివారగుట కూడ యింపులకు కొంతకారణము. అందులకే అమెరికాలోని ప్రజలు, ఆ రోజులలో "బ్రిటనులో మేము వసించినప్పుడు మా కుండిన పౌరస్వత్వము, రాజ్యాధికారము, స్వేచ్ఛ యిక్కడకు వచ్చినతోడనే మాకు పోయినదని బ్రిటిషు పార్లమెంటు యెందుకు తలచవలెను," అని అడిగిరి.

ఫ్రెంచి ప్రజలవిప్లవము ఫ్రాన్సుదేశములోను, తదితర దేశములలోను, ప్రాతపునాదులను త్రవ్వివేయుటకే సంకల్ప సమర్థతలుకలదై యున్నది. కాని ఫ్రాన్సుదేశము అనాదినుండియు నిరంకుశకేంద్రాధికారమునకు అలవాటుపడి యుండుట

చేతను, ఆంగ్లప్రజలవలె ప్రజాస్వామ్యసంస్థలలో మెలగినది కానందుననను, మరియు యీ ఫ్రెంచి విప్లవనాయకులు, కేవల సిద్ధాంతములను వదలి, తాము దేశములో స్థాపింపదలచిన ప్రజాస్వామ్యవిధానమును గూర్చి స్పష్టమైనభావములు కలిగి యుండనందుననను ౧౭౯౧ లో వీరు—అనగా జాకోబినుపక్షము—స్థాపించిన తత్కాలిక ప్రజాస్వామ్యము (Convention) మూడునాళ్లముచ్చటయై, యది మూడుసంవత్సరములు మాత్రమే నిలచెను. దీనిస్థానే ౫ గురితో "డైరక్టర్లసంఘము" కార్య నిర్వాహకత్వమునకు స్థాపించబడెను. (౧౭౯౫). ౧౭౯౯ సం॥ర విధానప్రకారం ఈ డైరెక్టర్లసంఘమే నిరంకుశాధికారవర్గముగా మారి, నెపోలియనును మొదటి "కాన్సలు"గా నెన్నుకొనెను. ఇది క్రమేణ "నెపోలియన్" విజేతయొక్క నిరంకుశత్వము; పిమ్మట చక్రవర్తిత్వము క్రిందకు యించుమించు ప్రజలయిష్టములోనే పోయినది. పిమ్మట మరియొక ప్రజాస్వామ్యము (రెండవరిపబ్లిక్కు) ౧౮౪౮ సం॥లో యేర్పడినది. అది పడిపోయి తిరిగి ౧౮౫౨ సం॥లో రెండవ రాజస్వామ్యమున్నూ అది పతనమైనపిమ్మట (ఈ మూడవ ప్రజాస్వామ్యోద్యమ సందర్భముననే ప్యారిస్ కమ్యూనుపక్షమువారు మాసము రోజులు ప్యారిస్నగరమున సామ్యవాదమును స్థాపించి నడపిరి) ౧౮౭౧ సం॥లో మూడవ ప్రజాస్వామ్యమున్నూ యేర్పడి స్థిరపడినది. అప్పటివిధానము ననుసరించియే, నేడు ఆయా కాల

ములలో సంస్కరింపబడుచు (అనగా విప్లవానంతరము యించుమించు ఒక శతాబ్దమునకుగాని ఫ్రాన్సు ప్రజాస్వామ్యమును స్థాపించుకొనలేదు) ప్రజాస్వామ్యప్రభుత్వము నడుచుచున్నది. కాని ప్రజాస్వామ్య భావోద్దీపితమై నాటి యూరపుఖండమును అమితముగా సంచలింపజేసిన ఫ్రాన్సు దేశ ప్రభుత్వవిధానము నందు యిప్పటికిని రాజ్యాధికారము కేంద్రప్రభుత్వమందు గర్భితమై యుండుటయు, స్థానికస్వపరిపాలనలో ప్రజాభిప్రాయమునకు స్థానము తక్కువగా నుండుటయు స్త్రీలకు వోటింగు హక్కు యిచ్చుటకు యీ ప్రజాస్వామ్యవిధానము యింకను అంగీకరించకుండుటయు తలక్రిందుగా నున్నవి. దానికి దేశముయొక్క మానసికప్రవృత్తియే కారణము.

---

3

ఈ ఫ్రెంచి విప్లవఫలితముగా అప్పటిలో ఫ్రాన్సుదేశము ప్రజాస్వామ్యమును స్థాపించజాలకపోయినను, ప్రపంచములో గల దేశములలో నిరంకుశ రాజవర్గములపై వ్యతిరేకోద్యమములను, అన్యరాష్ట్రనిరంకుశ ప్రభుత్వములచే అణచివేయబడిన జాతీయతలు, ప్రభుత్వవిధానములు, ఉద్ధరింపబడుటకై తిరుగుబాటులనున్నూ, పురికొల్పినది. మరియు జాతీయతను మఱచిపోయినట్టియు, లేక జాతీయభావములు బింకముగా లేనట్టియు రాష్ట్రములలో కూడ అది సత్వరవికాసమునకు సహాయపడెను.

<u>జాతీయతావికాసము.</u> ఈ జాతీయతయొక్క ఉత్పత్తిని గూర్చి యిదివరలో సంగ్రహముగా తెలిపియుంటిని. ౧౯ వ శతాబ్దములో అంకురించిన యీ జాతీయత యెటుల వికసించినది? పెద్దజాతులలో యిది అన్యజాతిని సహించని, అన్యజాతిని వశపఱచుకొనజూచు, క్రూరస్వభావము (Aggressive Patriotism) గలదిగా యేర్పడుటకూడ తటస్థించినది. అట్టి వికాసమునకు దారితీసిన పరిస్థితుల కొన్నిటిని తెలిపెదము. జాతీయత అనునది ఒకజాతి మరియొకజాతిని వశపఱచుకొనునపుడు, విజేతృజాతిలోని అహంభావ ప్రకోపపూర్వకముగాను, పరాధీనజాతిలోని ఆత్మరక్షణపూర్వకమైన పౌరుషోద్దీపనమూలముగాను, ఉభయములలోను నివసించి వర్ధిల్లుచున్నది. భూగోళశా

ప్రరీత్యా యింగ్లండు దేశము సముద్రమధ్యమం దుండుటవల
నను, ఇటలీ దేశము పర్వతముల మధ్యనుండుటవల్లనను, భారత
దేశము, సముద్రమున్ను, అత్యున్నతమైన పర్వతములే యెల్లలు
గాఁగల్గి అవతలి ప్రపంచముతో సంబంధరహితముగా నుండు
టవలనను, యివి వాని జాతీయోత్పత్తికిని దాని క్రమవికాస
మునకును, సహకారులే. 1 ఏకమైన శీతోష్ణస్థితి, ఏకభాష
(లేక యేకభాషనుండి వచ్చిన భిన్నభాషలు) యేకభావవ్యాప్తి
కరములు. ఇటులనే కొండొక కాలమున జగద్విజ్ఞానమునకు
భారతదేశము కైలాసగిరిగా నుండెనని తెలుసుకొనినప్పుడు ఆ
జాతీయభావము మరింత తరంగాయమాన మగుచుండును. ఇం
తేగాక ౧౮ వ శతాబ్దము పూర్తియగుసరికి ప్రతిదేశములోను
అప్పటి ప్రభుత్వముయొక్క నిరంకుశత్వము పట్లగాని, జిజ్ఞాసక
దృష్టితో ప్రభుత్వవిధానము పట్లగాని, యేదోవిధమైన అసం
తృప్తి దేశములలో యుండెను. ఫ్రెంచి ప్రజావిప్లవమునకు
పూర్వము యీయసంతృప్తి ప్రభుత్వములు యిచ్చుచుండిన

---

1 చూ. రాధా కుముదముఖర్జీ మున్నగువారి వ్రాతలున్నూ ప్రాచీనభార
తవాఙ్మయము, ఇతరపరిశోధనలును భారతదేశమున పూర్వమున
జాతీయత లేదను వాదమును నేడు నిస్సారముగా చేయుచున్నది.
ముఖ్యముగా కుమారసంభవములోని "అస్త్యుత్తరస్యాం దిశి దేవ
తాత్మాహిమాలయో నామ నగాధిరాజః। పూర్వాపరౌవారి
నిధీవిగాహ్యస్థితః పృథివ్యాఇవ, మానదండః। అనే శ్లోకమును
కాళిదాసు జాతీయత తనలో తాండవమాడకుండగనే కూర్చి
నాడా!

కొద్దిపాటి రాచకీయసంస్కారములలో తిరిగి అడుగునకు పోవుచుండెను. నాటి ప్రజాందోళనకు అంతకంటె అధికమైన భావబలము, అనగా ఆదర్శబలము అప్పుడులేదు. దీనినే స్థూలరూపములో చెప్పవలసిన యెడల ఫ్రెంచివిప్లవమునకు పూర్వము "ప్రభుత్వముల అధికారమును హద్దులలో నుంచుట మూలముగనే ప్రాతపద్ధతులను కొంతకాలము సాగించిరనియు" పరమందు "ప్రాతపద్ధతి యెన్నిఅతుకులతో సాగించినను, నవీనపరిస్థితులకు కుదరవని తెలిసికొని ప్రజలే ప్రభువులైరని" చెప్పవలసివచ్చును. అందుచే ఫ్రెంచివిప్లవము ప్రజాందోళనకు నూతనాదర్శబలమును జతపర్చి పుష్టినిచ్చినది. మరియు ఒకదేశప్రజలు అందఱును సమానముగ పడుబాధలు, సమానముగా కోరెడు బాధానివారణము, సమానముగా సమానప్రభుత్వములులేక వ్యక్తిపైనచేయు తిరస్కారములు, యీ భావములకు భౌతికజగత్తులో జాతీయతకు దోహదము నిచ్చినవి. నెపోలియన్ యొక్క దండయాత్రలు, విజయములుకూడ అతనిరాజ్యచక్రములో బంధింపబడిన దేశములకు (Confederation of the Rhine) జాతీయోద్దీపనముచేసినవి. ఇదివరలో వలె, ఉన్న ప్రభుత్వముయొక్క సంస్కారము (Reform) మాత్రమే ఆదర్శముగా గాక ప్రజలందరియొక్కయు రాజ్యాధికారస్వరూపమైన నూతనప్రజాస్వామ్యస్థాపన చేయవలయుననునది బయలుదేరినది. అంతకుపూర్వము సంఘములో అట్టడుగున పడియున్న సామాన్యవ్యక్తికికూడ ప్రాముఖ్యతను కల్పించు, యేమాత్రము

జ్ఞానముకలవానిలో నైనను తన సంఘపరిపాలనలో, తాను పాలకుడను కాబోవుచున్నాననియు, అందులకై నిర్మాణభావ, కుసుమఫలాలను మోటికవలె నుండిన—అదివరలో తనప్రసక్తి లేకపోవుటవలన—తన భావజగత్తులోనుంచి పుట్టించగల యీ ప్రజాస్వామ్యమనే ఆదర్శము పైన తెలుపబడిన జాతీయతపరముగా యీ యుగములో ఒక్కసారి విజృంభించెను.

ఆర్థికపరిస్థితులు. ఇంగ్లండులోను తదితర యూరోపియన్ దేశములలోను గృహములలోని వస్త్రపరిశ్రమలస్థానే నగరములలోని యంత్రపరిశ్రమలు కోట్లకొలది పెట్టుబడిపై బయలుదేరెను. ఇవి వృద్ధినొందవలెనన్న పెట్టుబడిదారులకు సరకులు విడుదలకావలెను. అందులకు జాతీయపరిశ్రమయును "జాతి" భావము అవసరము. తొలుదొల్త అనగా యీ పరిశ్రమల బాల్యావస్థలో సరకుయొక్క నాణ్యము తక్కువగా నుండి ధరలు హెచ్చుగా నుండుటచే, జాతీయాభిమానము లేనిదే, యీ పరిశ్రమ బాల్యస్థితినిదాటదు. ఇట్టి చెడ్డరకపు సరుకు దేశప్రజలు కొనుటకును, యిందులో యింతకంటె మంచిది, చౌకదిఅయిన విదేశపుసరుకును ప్రజలు బహిష్కరించుటకును, జాతీయాభిమానమే ప్రోద్బలకరము. ఇట్టి జాతీయాభిమానబలముచేత నే బ్రిటిషు పార్లమెంటు వారు. యీ శతాబ్దములో తమ యంత్రములలో తయారైన మల్లుల కంటెను అప్పటిభారతదేశపు డక్కా "మజిలీలు" పట్టువస్త్రములు

అతిమృదువు, చౌక, నాణ్యముగా నుండుటచేతను, యింగ్లండు దేశమంతయు వానిపయమై, వారి బాహ్యపరిశ్రమలకు భంగము వాటిల్లుటచేతను, నూటికి యెనుబదిరూపాయల చొప్పున వానిపై దిగుమతిపన్ను విధించుట, చివరకు వాటినిధరించి లండను వీధులలో కనుపించుటయే నేరముగా నెంచుట మున్నగు చర్యలను జరిగించవలసి వచ్చినది. [1] ఈ జాతీయాభిమానమును (యీ పారిశ్రామికయుగములో పూర్వపు జమీందారుల స్థానే అధికారవర్గములోనికి వచ్చిన) పెట్టుబడిదారులు తమ స్వలాభము కొఱకున్న తమ గృహపరిశ్రమలను కొంత వఱకు స్వబుద్ధివలనను, కొంతవఱకు పరిస్థితులవలనను వదలుకొని కోట్లకొలదిగా యీ నగరపరిశ్రముల నాశ్రయించిన కూలీలు తమ కూలిడబ్బులు కొఱకును, ప్రోత్సహించుటకూడ అవసరమైయుండెను. కార్మికుఁడు,—యజమాని, రైతు, భూస్వామి, వీరుభయులతేషముమున్న, అన్యోన్యాశ్రయములని ఆ రోజులలోని నమ్మికయగుటచే యజమాని లాభములలోనే తమ బ్రతుకు కలదని అభిప్రాయములో నుండినవారై, యజమాని సరకులను జాతీయభావముతో ప్రజలు కొనవలెనని కార్మికులు కోరుచుండిరి. ముందు తెలుపబోవు కారల్ మార్క్సు మతములోని ప్రధానసూత్రమైన ఆర్థికప్రజాస్వామ్య సిద్ధాంతములు, వీరిలో వ్యాపించుటకు యింకను సమయము రాలేదు.

---

1. చూ. మద్విరచితమైన భారతవస్త్రపరిశ్రమల చరిత్ర (౧౫౨-౨౧)

ఈవిధముగా భౌతికపరిస్థితులు, స్వాతంత్ర్య భావో ద్దీపనము, దేశభాష, నాగరికతాజనిత ఆత్మగౌరవము, జాతిలో పుట్టిన వీరపురుష ఉపాసనము, ఆర్థికపారిశ్రామికపరిస్థితులు, వీనిలో కొన్నిగాని, అన్నిగాని ప్రతిదేశములోను యుండి జాతీయభావమును ఉత్పత్తి చేసినవి. చాల దేశములలో ప్రజలు ఈ జాతీయభావము యొక్క "హిమాలయపవిత్రతను" మఱచి రాజసికదృష్టిలో గ్రహించుచుండిరి. ప్రభుత్వతిరస్కారము లున్నూ, ప్రజాఉద్యమవిజయములును కూడ, జాతీయత మూల పీఠము గాగలిగి బయలు వేరినవే. ఇక దేశీయ ఆర్థికపారిశ్రామిక పద్ధతికూడ ఈ రాజసికజాతీయభావమును పోషించునదే. కావుననే నాటినుండి నేటివఱకు మానవజాతి దానినుండి బయలుపడలేదు. ఇంతేకాక జాతీయత వ్యక్తికృతముగా కూడ కాన్పించుచున్నది. జర్మనీదేశములో బిస్మార్కు మంత్రి ఆ దేశపు రాష్ట్రములను ఏకజాతీయతక్రింద ప్రధానముగా తన బుద్ధి ప్రతిభవలన నిబంధించి వారిలో జర్మను సామ్రాజ్యవ్యాప్తి భావమును ప్రబోధించెను. ఇటులే యాంగ్లేయులు తమ పరా. ధీనములో నున్న భారతీయులచే గురువులుగా చూడబడినప్పుడు వారి జాతీయతకు మఱింత ప్రోద్బలము కలిగినది. సాత్వికా దర్శవాదియైనను, మాజనీమహాశయుడున్నూ పిమ్మట కేవరు మంత్రిన్నీ, ఇటలీ జాతీయత నుద్దీపన చేసిరి.

ఆర్థికదృష్టిలో యీజాతీయత యెంత అవసరమయ్యెనో రాజకీయములో కూడ అంత అవసరమే. రాజ్యవిస్తీర్ణము

చేసికొను సామ్రాజ్య ప్రభుత్వములకు తమ సామాన్యజనులు యుద్ధములలో బలియగుటకు నిరంతరము నీజాతీయభావ 'నిషా'లో నుంచుట వర్తమానయుగలక్షణము. ఏలననగా వ్యక్తికి యీ శతాబ్దములలో భౌతికశాస్త్రాభివృద్ధివలన నేమి, మతపీఠస్థుల దుర్నీతివలన నేమి, మతము కార్యప్రవృత్తికరము (Incentive to action) కాదు. అటులే పూర్వయుగము నాటి రాజభక్తి అసలే ఉద్దీపకము కాదు. ఇక దేశభక్తి యొక్క ఆధునికపరిణామమైన "జాతీయభక్తి" యిందులకు ఉద్దీపకసాధనముగా రాజ్యాంగవేత్తలు నిర్ణయించిరి. గ్లాడ్స్టను (Gladstone) క్యాంపుబెలుబానర్మన్ (Campbell Bannerman) మున్నగు ప్రముఖులు నాఁరోజులలో యింగ్లండులోని జాతీయతామంత్రమునకు ఉపదేశకులుగా నుండి అఖండవ్యాప్తి జేసిరి.

---

ఇట్టి జాతీయతాప్రేరితములైన ప్రజాస్వామ్యోద్యమములు.

ఫ్రెంచివిప్లవమునకు పిమ్మట కొలది కాలములోనే "మాజినీ" మహాశయుని నాయకత్వముక్రింద (౧౮౦౫-౧౮౭౨) యిటలీలో ప్రశంసనీయమైన ప్రజాస్వామ్యవిప్లవము జరిగెను. దాని నాయకుఁడైన "మాజినీ" యొక్క ఉదారములును ఉద్దీపకములును నగు ప్రజాస్వామ్యాశయములును "గ్యారిబాల్డీ" సేనానియొక్క మహదాశయప్రేరకములైన త్యాగసాహసము

లును, "కేవరు" మంత్రి ప్రతిభయున్ను నవీన యిటలీకి వన్నె తెచ్చెను. ఇటాలియన్ ప్రజలు స్వాతంత్ర్యమును కొంతకాలము వఱకును పొందజాలకపోయిరి. "మాజినీ" స్వతంత్ర "ఇటలీని" చూడకమునుపే పరమపదించెను. కాని యీకాలపు ఇటలీ చరిత్ర ప్రపంచములోని స్వాతంత్ర్యోద్యమములకును పరాధీన జాతులకును—ముఖ్యముగా మాజినీ ప్రోక్తములైన ఉన్నతాదర్శములు—యెంతయు "సంజీవనౌషధములు"గా నున్నది. ఈవిధముగనే ౧౮౬౦–౧౮౭౦ లో హంగేరియన్ ప్రజలు "ఫ్రాన్సిస్ డీక్" నాయకత్వమున తమజాతీయరాజ్యాంగవిధానమును, స్వేచ్ఛను, అణచివేసిన ఆస్ట్రియన్ ప్రభుత్వముపై తిరుగుబాటుచేసి ఆస్ట్రియన్ వస్తుబహిష్కారాది ఉద్యమముల వలన స్వయంనిర్ణయసూత్రసిద్ధిని పొందిరి. ౧౮౮౧ ప్రాంతములో ఈజిప్టులోని ప్రజలు తమ వ్యవహారములలో విదేశీయులు జోక్యము కలుగచేసుకొనరాదను ఉద్యమము బయలుదేరదీసిరి. ఏషియాఖండములోని "కొరియా" జాతీయప్రభుత్వమును తన వశములో నుంచుకొనవలెనని జపాన్ జరిగించిన నిరంకుశత్వముపై కొరియా జాతీయులు ౧౮౮౪ లో తిరుగుబాటును జేసిరి.

ఐరిష్ ప్రజల జాతీయోద్యమము, తిరుగుబాటు యింతకు పూర్వమే ప్రారంభించినది. ఇటులే భారత దేశముకంటెను పెద్దదైన చైనాజాతి, జాతీయతామంత్రోపదేశమును పొంది తమ

దేశములో నిరంకుశముగా రాజ్యమును చేయుచున్న "మంచూ" రాజ్యాధిపత్యముపై ధ్వజమెత్తినది. తన దేశముయొక్క ఐశ్వర్యమును క్రమక్రమముగా కబళించుటకే దేశములో ప్రవేశించుచున్న పాశ్చాత్యజాతులను, ఆవిధముగనే దేశములో జొరబడుచున్న జపానును, గాంచి జాతీయభావోద్రేకితులై తీవ్రజాతీయ ప్రజాస్వామ్యోద్యమమును ౧౮౯౮ సం॥ ఆప్రాంతములో ప్రారంభించిరి. ఈ పై దేశములలో సదరు ప్రజాస్వామ్య ఉద్యమ కార్యక్రమములో, మన భారతదేశపు కాంగ్రెస్ ఉద్యమములోవలె బహిష్కారము, అసహాయోద్యమము కూడ చేర్చబడెను.

జాతీయత మూలవీరముగా గల్గిన ప్రజాస్వామ్యపు ఆందోళన విప్లవములవలన ౧౮౫౦–౭౦ సం॥ మధ్యకాలములో ఏడు రాష్ట్రములుగా చీలియుండిన ఇటలీ దేశము యేకజాతీయతను స్వీకరించిన రాష్ట్రముగ స్థాపించబడినది. ౧౮౬౪ సం॥లో డెన్మార్కులో పార్లమెంటరీ ప్రజాస్వామ్య పద్ధతిని, రాజు పరిపాలనముచేయునట్లు నిబంధన యేర్పడినది. ౧౮౬౭ సం॥లో ఆస్ట్రియా హంగేరిలో ప్రజాస్వామ్యపరమైననూ తనరాజ్యాంగవిధానము నిర్మింపబడినది. ౧౮౭౧ సం॥లో బిస్మార్కుమంత్రి ప్రతిభవలన జర్మనుసామ్రాజ్యమును, దాని క్రిందనే సమాఖ్య రాజ్యాంగవిధానము నిర్మింపబడినది. ౧౮౭౫ సం॥లో ఫ్రాన్సులో నేటికిని అమలులోనున్న మూడవ ప్రజాస్వామ్యవిధానము (Third republic) యేర్పడినది.

౧౮౭౮ సం॥లో రష్యాకును, టర్కీకిని జరిగిన యుద్ధానంతరవు బెర్లినుకాంగ్రెసు యేర్పాటు ప్రకారము, టర్కీ నిరంకుశత్వమునుంచి బయటపడి, సర్వియా, మాంటినీగ్రో, రొమేనియా రాష్ట్రములు జాతీయప్రభుత్వవిధానమును స్థాపించుకొనగలిగినవి. ౧౮౩౨ సం॥లోనే గ్రీసుదేశము టర్కీనుండి బయటపడి ప్రత్యేక రాజ్యాంగవిధానమును నిర్మించుకొనినది. ౧౮౭౬ సం॥లో నిరంకుశముగాను, ఎట్టి విధాన బద్ధము కాకుండగను పాలించుచుండిన టర్కీ సుల్తాను రాజ్యాంగ విధానమును ప్రకటించవలసి వచ్చెను. కాని ౧౯౦౮ సం॥లో టర్కీయువజనోద్యమఫలితముగా తిరిగి అది ఉద్ధరింపబడుపటకును అనుగుననే పడియుండెను. ౧౯౦౮ సం॥లోని టర్కీలోని అంతఃకలహముల నవకాశము తీసికొని బల్గేరియా రాష్ట్రము తనస్వాతంత్ర్యమును ప్రకటించినది. ఈబాల్కను రాష్ట్రముల జాతీయత స్థిరపఱచుకొనుటకే ౧౯౧౨ సం॥లో బాల్కను యుద్ధము వచ్చినది. ౧౯౦౭ వ సం॥లో నిరంకుశ పర్షియా రాజప్రభుత్వముకూడ ప్రజల యొత్తిడిపైని నిబంధనాయుత (Constitutional) మయ్యెను. ౨ సంవత్సరములకాలము. పనిచేయు ఒక ప్రజాప్రతినిధి సభ (మాజ్లిసు) వారిచే నియమితమైన మంత్రివర్గమునకు లోబడి రాజు పాలించుట; ఈ విధానములోని ముఖ్యభాగములు. ౧౮౮౯ వ సం॥లో జపానురాజు—అచ్చటి రాజ్యాంగసిద్ధాంతము ప్రకారము—తనవశములోనున్న రాజ్యాధికారమును, నిబంధనాబద్ధముచేసి,

ప్రతినిధి సభమూలముగా పరిపాలన సాగించుట కంగీకరించి రాజ్యాంగనిబంధన (Constitution) నేర్పఱచెను.

ఇక బ్రిటిషు సామ్రాజ్యముయొక్క రాజ్యాధిపత్యములోనుండి, ఏదో విధమగు స్థానికస్వపరిపాలనమును అనుభవించుచున్న అధినివేశములలోను, కేవలము సంపూర్ణ బ్రిటిషు సామ్రాజ్యవిధాన దాస్యమున మ్రగ్గుచున్నట్టి భారతదేశము వంటి దేశములలోగూడ యీ జాతీయప్రజాస్వామ్యాదృశ ఝంఝూమారుతము వీచి వ్యాప్తి చెందినది. ౧౮౬౭ సం॥లో కెనడారాష్ట్రము సమాఖ్యావిధానమును స్థాపించుకొనినది. ఆస్ట్రేలియా ౧౯౦౦ సం॥లో సమాఖ్యవిధానమును స్థాపించుకొనినది. న్యూజిలండు ౧౮౫౩ సం॥లో యేకదేశవిధానమును (Unitary system) స్థాపించుకొనినది. ౧౯౦౯ సం॥లో దక్షిణఆఫ్రికా యేకదేశవిధానమును స్థాపించుకొనినది. ఈ౪ రాష్ట్రములకును అధినివేశము (Dominions) లందురు. వీరికిని బ్రిటిషు పార్లమెంటునకును లేక రాజునకును గల సంబంధమును, వానియొక్క ప్రస్తుతస్థితిని గూర్చి రెండుమూడు భాగములలో తెలుపబడును. ఈనాల్గురాష్ట్రములు తాము ప్రత్యేకస్వపరిపాలన చేసుకొను తలంపులో ఆందోళనచేసెను. అందుపై బ్రిటిషుపార్లమెంటు శాసనరూపకముగా వానికి స్వపరిపాలనను ప్రసాదించి సిద్ధాంతములో గల పెద్దతనమును నిలువబెట్టుకొనెను. ఇటులే అమెరికా సంయుక్త రాష్ట్రముక్రింది ఫిలిప్పైను, మెక్సికో దేశములలోకూడ ఉద్య

ములు బయలుదేరి అచ్చట ఒక విధమైన ప్రజాస్వామ్య ములు స్థాపించబడెను. ఇప్పట్టున మనము మధ్య, దక్షిణ అమెరికాలను మరువరాదు. ప్రస్తుతము అచ్చట యిరువది ప్రజాస్వామ్యములు గలవు. వానిలో ముఖ్యమైనవాటిని తెలుపుట యుక్తము. ౧౮౧౬ సం॥లో ఆర్జన్‌టైన్ (Argentine) రాష్ట్రము, స్పైన్, పోర్చుగల్‌ల దాస్యమును త్రోసిపుచ్చి, అమెరికా ఫెడరల్ విధానమున ప్రజాస్వామ్యమును నిర్మించుకొనెను. "బ్రేజిల్" (Brazil) ౧౮౨౨ సం॥లో, పోర్చుగల్ నుండి విడువబడి సమాఖ్యావిధానస్థాపన చేసికొనెను.

౧౮౮౫ సం॥లో జాతీయ ప్రజాస్వామ్యస్థాపన భావి లక్ష్యము గాగల్గిన భారతజాతీయమహాసభ బయలుదేరినది. బ్రిటిషుదేశముయొక్క పరాధీనదేశముగా నుండిన భారతదేశమునకు గల్గిన, రాచకీయ, ఆర్థికాది ఇబ్బందుల నివారించుటకై యుద్యమించుచు, స్వాతంత్ర్య పిపాసాప్రేరితమై పిమ్మట ౧౯౦౬ సం॥మునాటికి "స్వరాజ్యము జన్మహక్కు"ని దేశము కాంగ్రెసు సభాముఖమున ప్రకటించినది. స్వదేశవస్తుస్వీకారము తీవ్రవ్యాప్తిని గాంచెను. కాని స్వజాతీయుల నివాసస్థలమైనట్టియు, ఆర్థికముగా భారతదేశమంత ప్రయోజనకారి కానట్టి కెనడా మున్నగు అధినివేశములకువలె, బ్రిటిషు దేశము భారతదేశపు స్వారాజ్యాధికారమును అంగీకరించుట—వాంఛనీయమైనను—సంభవము కానటుల ప్రస్తుతము గోచరించుచున్నది.

౧. ఈయుగమున అనగా ముఖ్యముగా ౧౯ వ శతాబ్దమున పైని తెలిపినటుల ప్రపంచములోని అన్నిఖండముల లోను బయలుదేరిన అపూర్వప్రజాసంచలనమువలనగాని, దాని యొక్క వేడితగిలిగాని, ప్రపంచములో యుండిన పూర్వపురీతి రాజప్రభుత్వములు రద్దైనవి. అవి మూడు విధములుగా మార్పుచెందినవి. కేవల రాజస్వామ్యమును త్రోసివేసిన ప్రజాస్వామ్యములు; పూర్వపు నిరంకుశాధికారములను నిబంధనాపూర్వకముగా హద్దుపద్దులలో నుంచి ప్రజాప్రతినిధిసభల సహాయముతో వారు రాజ్యము చేయునట్లు నిబంధింపబడుట; నిరంకుశప్రభువులుకూడ (టర్కీవలె) తమ పరిపాలనకు ఒక నిబంధనయు, పద్ధతియు ప్రకటించుట (Declaration of Constitutional Government); జరిగినది.

౨. పూర్వరాజ్యాభిమానములు, మతాభిమానములు, రాష్ట్రాభిమానములస్థానే, జాతీయాభిమానములు, యేర్పడినవి. మధ్యయుగము నాటినుండియు వచ్చుచున్న యింగ్లండు, ఫ్రాన్సు మున్నగు దేశములలోని, తెగ, మత, లేక నైతిక సిద్ధాంతముల పురస్కరించుకొని బయలుదేరిన కక్షలు ఈకాలమున ఆర్థికములు (వ్యాపారభాగమునకు చెందిన) ప్రధానముగాను, రాచకీయములు కొలదిగాను గలిగినవిగా పరిణమించినవి. దేశములో బయలుదేరిన యీ పార్టీలు కూడ జాతీయాభిమానమునకు లోబడినవియే. అన్నిటికిని

జాతీయతయే పరమావధి. జాతిదాటి అప్పటి రాచకీయ వేత్తల దృష్టి పైకి పోలేదనిన సాహసము కాజాలదు. సమత్వము (Equality) సోదరత్వము (Freternity) స్వేచ్ఛ (Liberty) అని బయలుదేరిన విశ్వతోముఖమైన త్రిమూర్తి రూపమైన యీస్వాతంత్ర్య దేవత పూర్వము తెగలు, మతగురువులు, విజేతలు, రాజులు, భూస్వాముల చెఱనుండి బయట పడి, యిప్పుడు యీ జాతీయతచే బంధింపబడుచుండెను. "స్వాతంత్ర్య" మనే వృక్షరక్షణ—పోషణలకై తొలుదొల్త యేర్పడిన "జాతీయత'' యను కంచె స్వాతంత్ర్యతాభివృద్ధితో పాటు తానును అభివృద్ధి పొందినది. ఇందువలన క్రమేణ అసలు వృక్షమునే ఆవరణ కమ్మివేయుచున్నదను జిజ్ఞాసువుల భయముకూడ నిరాధారము కాదని తోచుచున్నది.

---

శాస్త్రికజిజ్ఞాస. ఈ యుగములో వ్యక్తిప్రవర్తకములైన ఆర్థిక, పారిశ్రామిక ఉద్యమముల విజృంభణయు, దానితోపాటు కార్మికోద్యమమున్ను బయలుదేరినది. నాడు జిజ్ఞాసువుల సిద్ధాంతముల బలముకంటె, పెట్టుబడిదారులను వ్యక్తులు తమలాభమునకై జరిగించవలసినచర్యలే దీనివ్యాప్తికి సహకారులు. కార్మికులను కోట్లకొలది తమజాతీయులను తమస్వలాభమునకై (వారి) కండలను కరగించి పగలు మొదలు, రాత్రివఱకును విశ్రాంతి దినము సామాన్యముగా లేకుండునట్లు పనిచేయించి, వీరిని తమ యంత్రమువంటి అచేతనపదార్థముగనే (Mill hand) చూచుచు, కూలిడబ్బులతో—అవియైనను అదిని వారికడుపునిండుటకు చాలని కూలిడబ్బులతో—పంపుచుండిరి. ఆర్థికముగా ఒకరోజున పనిచేయుని చో ఆరోజున కూలివానికి నిలదొక్కుకుటకు వసతిలేకుండెను. తనచర్మ, రక్త, మాంసములను యజమాని యంత్రమున కర్పించిన కూలివానికి వృద్ధాప్యములో "బోనస్సు"ను లేదు. అటులే కూలిదానికి ప్రసవకాలమున కెట్టి వసతిఏర్పాటున్నూ లేదు. యంత్రప్రమాదమువలన చనిపోయినచో నెట్టియినూ సెన్సులేదు. సాంఘికముగా యీకూలీయు, అతని భార్యయు యంత్రములో పాటుపడుచుండగా శిశువులకు—తల్లి తాళము వేసివచ్చిన గదిలో—"కారుకీరు"మని యేడ్పుచున్నను, అనువులను బాసినను దిక్కులేదు. పైగా

వయసువచ్చిన వీరి బాల, బాలికలు యథేచ్ఛతో వేర్పాటు యులై తిరుగుచుండిరి. పట్టణములలోని అప్పటి యీ కూలీల బసలకంటె, మన మాలపల్లెలు, మిక్కిలి శ్రేష్ఠములు. లక్షల కొలది, కోట్లకొలది జనులతో పనిచేయు యీ యంత్రములలో అప్పటిలో తగువెలుతురును గాలియు ప్రసరింపకుండెను. స్త్రీ పురుషుల దుర్నీతులకు కూడ అవి నిలయములై యుండెను. అనేక సాంక్రామిక వ్యాధులచే వీరు మరణించుచుండిరి. ఇక రాచకీయముగ ఆంగ్లదేశపు ౧౮౩౨ వ సం॥పు పార్లమెంటరీ సంస్కారపు చట్టముప్రకారము యెనుబదిలక్షలమంది వోటర్లు యింగ్లండు దేశములో నున్నను, వీరికి చాలభాగమందు స్థానములేదు. పిమ్మట యీ కార్మికగణమునకు కొంతవరకు వోటింగు అధికారము లభించినను, అది వారి ప్రత్యక్షప్రభువులైన పెట్టుబడిదార్ల లాభము కొఱకే. ఈ విధముగ మధ్యయుగములోని "ఫ్యూడలు" దాస్యము అంతకంటె కొంచెము విద్యావ్యాప్తియు, యిందునుగూర్చి అనుతాపము తెలిపెడు కొద్దిమంది జిజ్ఞాసువుల సానుభూతియు గల్గిన పారిశ్రామిక దాస్యముక్రింద మారినది.

కాని ఫ్యూడల్ దాస్యమువలె ఇది విధివక్షమైన దాస్యముకాదని యొకపూర్వపక్షము. మఱియు ఫ్యూడల్ దాస్యానంతరమును, యీ పరిశ్రామికోద్యమమునకు పూర్వమున్ను, కార్మికుడు స్వేచ్ఛను అనుభవించినమాట వాస్తవమే. అయితే ఆ స్వేచ్ఛ తినుటకును, మాడుటకునుగలదు. "కార్మికునకు

యిష్టములేనియెడల మా యంత్రములో నుండి పోవచ్చునని యజమానుడు చెప్పుమాట చెల్లతగినదికాదు. ఒక దృష్ట్యా పెట్టుబడిపద్ధతికిగాని, యజమానుడును, కార్మికుడు అందు ప్రవేశించుటకుగాని, ఉభయులును స్వతంత్రులుకారు. అది పూర్వయుగముల నాటినుంచియు, యీూరవులో వచ్చుచున్న వ్యక్తి ప్రవర్తకత్వసిద్ధాంతమునకు యీా యంత్రమయయుగములో గల్గిన నూతనపరిణామము. బ్రహ్మాండమైన యంత్రశక్తులు, యుగములనుండి అనుపయోగములో పడియున్న ప్రకృతిలోని ముడిసరకుల పర్వతాలను క్షణికములో మానవజీవితావసరములుగను, రమ్యములైన భోగ్యములుగను మార్చివేయుటకు సిద్ధముగా కాచుకొని యున్నవి. ఇటిస్థితిలో ధనవంతుడై, వ్యవహారదక్షుడైన వ్యక్తి "అయ్యో యీా పదార్థమంతా సంఘమువారిది. వారు లేచి దానిని నిర్వహించుకొనవలెను. మనము జోక్యం పుచ్చుకొనరాదని" ఊరుకొనునా? ఊరుకొన్నను యేమి లాభము? ఆనాడు జనసామాన్యములో విద్యగాని, ప్రవర్తకశక్తిగాని, సమిష్టిభావముగాని నున్న. అందుచే మార్క్సు తెలిపినటుల సంఘస్వామ్యపరముగా నడచుచున్న మానవపరిణామములో పెట్టుబడివిధానము కూడ ఒక అవసరమైనదశ. ఈ విధానములో కూలీలక్రింద సంఘము ప్రవేసించి పొందిన తరిభీతు, నిర్బంధములవలన పొందిన అసంతృప్తి, భావజిజ్ఞాస, సమిష్టిభావము, యివియే వారిని ముందుదశకు అధికారులను

గా చేయగలవు. కాన యీ యంత్రయుగములోని పెట్టుబడి విధానముకూడ మానవుకు స్వతంత్రముగా తెచ్చిపెట్టుకొనినది గాక తప్పని సరిగా ప్రవేశించెనని ఇక్కడిదృక్పథము. కాని మఱియొకదృష్టిలో—యంత్రయాకర్షణమున కూలివాడు పారిశ్రామికోద్యమములో ప్రవేశించి దానికి అలవాటు పడి పోయెను. అంతకంటె వేఱువృత్తి యూరపుఖండములో జనసామాన్యమునకు లేకపోయెను. అందుచే ఈ కార్మికులందఱు ఐక్యభావములో నమ్మకట్టలేరనియు, వీరి "లోకువదౌష్ట్యకి" యజమానికి యిష్టము లేనిచో పొమ్మని యనుచున్నాఁడే కాని వేఱు కాదు. కాన జనసామాన్యమును యిట్టిజీవితమునకు అలవాటుపరచిన పెట్టుబడిదారు వారివృత్తినినిలుపుటకు బాధ్యుఁడు అనుసిద్ధాంతమే ఆమోదింపబడినది. వెంటనే కార్మికోద్యమము బయలువెడలినది. ప్రభుత్వము, వ్యక్తిస్వాతంత్ర్యమును గూర్చి యెట్టినిరోధనకును గడఁగరాదని ప్రతిపాదించిన "బెంథమ్" (Bentham) సిద్ధాంతమును ఆదిలో నమ్మతించిన ఆయన శిష్యుడును, సుప్రసిద్ధఆంగ్లేయ, రాచకీయ, ఆర్థికతత్వవేత్త యగు "మిల్లు" పండితుడుగూడ అప్పటి యంత్రములలో యీ కార్మిక కోట్లు పడు పాటుబాధలు చూచి నప్పుడు తనసిద్ధాంతములను సవరణచేసికొని జాతిక్షేమమును "ప్రమాదించు అత్యావసర పరిస్థితులలో" వ్యక్తి చర్యను, ప్రభుత్వము నిరోధించవలెననియు, కార్మికుల క్షేమమును గూర్చి, ప్రభుత్వము పెట్టుబడిదార్లపై విధి నిషేధములను

ప్రతిపాదించుచు శాసించుట కంగీకరించెను. ఇంగ్లండులో "రాబర్టుఓవెను" అను నాయన కార్మికాందోళనకు మూల పురుషుడని చెప్పవచ్చును. సహకారపరపతి విధానము, ఆంగ్ల సాంఘికవాదమునకును ఈయనయే తండ్రి. ఈ ఆందోళన వలన యింగ్లండు మున్నగు పారిశ్రామిక ప్రాముఖ్యతగల దేశములలో ప్రభుత్వశాసనములద్వారా కార్మికులస్థితి కొంత వఱకు చక్కబడెను. "ట్రేడు యూనియను" ఉద్యమము యింగ్లండులో శాసనామోదమును పొందెను.

అప్పుడే కార్మికునిగూర్చి సదరు కార్మికబాధలగాంచు చున్న జిజ్ఞాసువులలో తర్కము ప్రారంభమైనది. భూస్వాముల క్రింద దాసుఁడైన కృషీవలుఁడుగా నుండినప్పుడు లేని యీయాందోళనాబలము యీ సామాన్యవ్యక్తికి కార్మికుఁడై నప్పుడు గల్గుటకు కారణము కాలపరిస్థితులైన విద్యావ్యాప్తి, ప్రజాస్వామ్యవిధానము, స్వసంఘబలమును కార్మికుడు గుర్తించుటయేకాక అప్పటికంటె యిప్పుడు ఉన్నతరమైన (Higher standard of living) జీవితమును కార్మికుఁడు కాంక్షించుటయు, కొన్ని అట్టి కోరికలు లభించినప్పుడు, యీ లాభము, యీ సౌఖ్యము, ముందు కాంక్షలకు దాహముగా అతని ఆందోళనమును, మఱింతముందుకు తరుముటకూడ అయి యున్నది. అందుచే ఆందోళన చేయుచునట్టి కార్మికగణము, జిజ్ఞాసువుల, మానవసేవకుల ఆందోళనకు ఆలంబనమైన యీ కార్మికగణములో, బయలు

చేరిన ఆందోళన వృద్ధిఅగుటకు కారణము (పూర్వముకంటె కార్మికులస్థితి హీనమైనందున బయలుచేరినది గాక) పూర్వముకంటె విద్యావ్యాప్తియు, ఆర్థికస్థితియు బాగుపడుట, పూర్వము తమకు తెలియని స్వీయప్రాముఖ్యతజ్ఞానము హెచ్చుగుట. అది స్వాభావికముకూడ.

ఇందునుగూర్చి సిద్ధాంతజిజ్ఞాస. కార్మికోద్యమములో బయలుచేరిన నూతన జిజ్ఞాసువులున్ను, సాంఘిక, సమాజవాదు లకు గురుస్థానమున్నూ అయిన కారల్‌మార్క్సు (Karl Marx) అను తత్వవేత్త ౧౮౧౮ సం॥లో జర్మనీదేశము లోని క్రైస్తవమతమును స్వీకరించిన ఒకయూధ (Jews) కుటుం బములో పుట్టెను. కొంతకాలము విశ్వవిద్యాలయములో విద్యాభ్యాసము న్యాయశాస్త్ర అభ్యాసము చేసినపిమ్మట, యీయన తన పాండిత్యప్రకర్షగా ప్రకటించు తీవ్రభావములు, జర్మను అధికారులకు కంటకముగానుండి ౧౮౪౩ వ సం॥లో పేరిస్ నగరమునకు తరిమివేయబడెను. నాటినుండియు అచ్చట ప్రౌథన్, ఏంజలుస్ మున్నగు సమిష్టివాదనాయకులతో యీయన స్వామ్యవాదమును ప్రచారము చేయుచుండెను. ఈయన సంఘస్వామ్యవిధానమును గూర్చి జిజ్ఞాసచేయుట, వ్రాయుట, ప్రచారముచేయుటలో జీవితమును వినియోగించి చివఱకు ఆధర్మములోనే ఇంగ్లండులో (ఫ్రాన్సు ప్రభుత్వము కూడ యీయనకు స్థానమివ్వనందున) ప్రవాసిగా దరిద్ర

జీవనమును చేయుచు పరమపదించెను (౧౦—౩—౧౮౭౨). మాజినీ, కారలుమార్క్సు, సనుయత్ సేను—పిమ్మట నేడు యయన్‌ష్టిన్, మున్నగు ప్రపంచవిఖ్యాతపురుషులను, జిజ్ఞాసువులను, వారి స్వీయ దేశప్రభుత్వములు తరిమివేసినప్పుడు, అతిథ్యమిచ్చిన ఆగ్రేటుబ్రిటను సీమగడ్డ యెంతయు ధన్యతగాంచినది.

సామ్యవాదము అనునది కేవలము మార్క్సు ముఖమునుండి వచ్చిన నూతనభావమని మనము తలపరాదు. ప్రాచీనభారతదేశములో వేదమతము, వ్యక్తి అహంభావరహితమైన "విశ్వమయ" దృష్టిని, జీవనము చేయుటయే ఉత్తమముగా నిడుకొనినది. సుకయోగీంద్రుడు ఆదర్శనీయమైన సామ్యవాది. అప్పటి ఋష్యాశ్రమములు "సర్వభోగ్యములు" (సర్వజనులకు సమానభోగ్యములు). వ్యక్తిస్వాత్వరహితములైనవి. (చూ. మద్విరచితమైన "శాకుంతలము, దాని నూతనసందేశము అను వ్యాసము, ఆంధ్రసంవత్సరాది సంచిక, శ్రీముఖ) అందలి సభ్యులందఱు సంఘస్వామ్యముగనే జీవించుచుండిరి.

ద్రవ్యోత్పత్తి సమిష్టి సహకారపద్ధతిపై నజరిగి సమభుక్తమగుటకూడ గుణకర్మనుబట్టి వచ్చిన వర్ణవిభాగముయొక్క ప్రయోజనముగా కనబడుచున్నది! [1] "ధనమూల మిదం

---

1 చూ:—ఈ భావము R. c. మాజుందారుగారి Corporate life in Ancient India. అను గ్రంథముయొక్క ఉపోద్ఘాతములో బలపఱచబడినది.

జగత్" అని చెప్పబడినది. అనగా ధనమునకు మానవుని ఆత్మోపలబ్ధికిగాని, తదనువలబ్ధికిగాని—దాని నుత్పత్తిచేయు రీతి—ఉపయోగించురీతిని—బట్టి సమర్థతగలదని ప్రాచీన భారత సంఘనిర్మాతలచే కనుగొనబడినది. వ్యక్తిస్వత్వాభిమానులుగా నుండవలసినవారికి సంఘముపై ఆధిపత్యమిచ్చినచో వారికి—ప్రస్తుత అమెరికాదేశపు ధనవంతుల రాచకీయ నాయకత్వమువలె—సాముదాయక క్షేమదృష్టి యుండదనుభయమే బ్రహ్మ, క్షాత్రధర్మముల వారికి సంఘములో మొదటి రెండుస్థానములును అలంకరించుటకు అధికారమిచ్చినది. [1] సప్తసంతానములను పేరుతో సంఘక్షేమమునకై వ్యక్తులు ధనమును వెచ్చించునట్లు ధర్మప్రేరణ చేయుటలో కూడ ఫలితము సముభుక్తమే. రఘుమహారాజు విశ్వజిత్తు యాగమును చేసియు; శ్రీహర్షుడు తులాభారమును

1 చూ:—"నమోరుచాయ బ్రాహ్మయే" అను పురుషసూక్త ప్రయోగము "అహంబ్రహ్మాస్మి" అను మహావాక్యము, గీతలలోని "బ్రాహ్మీస్థితి" యొక్క నిర్వచనము—ఇవి యన్నియు విశ్వమయచిత్తముతో కూడిన జ్ఞానమునకే బ్రహ్మజ్ఞానమనియు "బ్రహ్మజ్ఞానేన బ్రాహ్మణః" అనుటవలన యిట్టి విశేషణ నిష్టమైన విశేష్యమే బ్రాహ్మణత్వమని స్పష్టమగుచున్నది. "రాజా ప్రకృతిరంజనాత్" అనియు "రాజు ప్రజకు శరీరము, రాజు ప్రజకునాత్మ "అను శాంతిపర్వవాక్యము రాష్ట్రమయదృష్టి క్షత్రధర్మముగా విశదీకరించుచున్నది." తాను "అనగా విశ్వమని తట్టుట బ్రాహ్మ్యమానసిక ప్రవృత్తి. తాను అనేశబ్దములో

తూగియు గావించిన అఖండమైన ఆ స్తిపంపకములో యీ భావ ముకూడ లేకపోలేదు. అయితే యీ ౨౦ వ శతాబ్దములోని మనము పంపకమునుగూర్చిన ప్రేరణశక్తులు, పంపకపురీతియు మఱియొక విధముగా నుండవలెనని కోరవచ్చును.

మార్క్సువంటి ప్రసిద్ధ సామ్యవాద ప్రతిపాదకులు ఆముష్మికము, మతము, నీతి—వీనిని పురస్కరించుకొని తమ వాదమును ప్రతిపాదించలేదు. వీరు మానవుని చుట్టును ఆవరించియున్న భౌతికపరిస్థితుల సమ్యక్పరీక్షణము(Materialistic Concept) ను బట్టియే వారి సిద్ధాంతముల నాధారపఱచుకొనిరి. అలౌకికము (అనగా మత, నైతికదృష్టిసహా) స్థానే లౌకికదృష్టిని తమ వాదమునకు ఆధారముగా చేసికొనిరి మార్క్సీయులు. ఇదియే ప్రాచీన సమభుక్తవాదులకును వీరికినిగల భేదము. కాని యిప్పట్ల శంకరాద్వైతముయొక్క మూలతత్వముతో యీనవీన సిద్ధాంత తత్వమునకు వైరుధ్యము కాన్పించుటలేదు. అందునుగూర్చి ముందు పేజీలలో వివరించెదము. మరియు యీ సిద్ధాంతముల ఆచరణమార్గ

---

రాష్ట్రమంతయు గోచరించుట తప్పదు. స్వతంత్రప్రవృత్తి వీరుభయులు నవీన రాచకీయార్థములో జాతీయ, విశ్వజాతీయ భావాలకు ప్రతినిధులు కాకపోవచ్చును కాని అట్టి దృష్టులు రెండును యీ వ్యవస్థలో నుండుటయే కాదు యిప్పటి జాతీయ, అంతర్జాతీయ వాదులకువలె స్పర్ధలేక ఉభయులు అన్యోన్యాశ్రయ భావముతో మెలగుట కనపడుచున్నది.

మునుగూర్చి మాకు యెట్టిసంబంధమును లేదనియు, సిద్ధాంత జిజ్ఞాసనుగూర్చియే మాకిపుడు ప్రసక్తి యనియు స్పష్టపఱచు చున్నాము.

ఉంఛవృత్తి, శిలావృత్తులను జీవికగా గల్గి బ్రహ్మజ్ఞాన నిరతుడైన [1] బ్రాహ్మణుని సంఘాదరమునకు ప్రధమపాత్రు నిగా జేసియు, శస్త్రోపజీవనమునకు (అదికూడ "సఃక్షత్రియః త్రాణసహః సతాంయః" అను సాధురక్షణపూర్వకమైన ధర్మ ప్రేరణపైననే) సంఘములో ఒక్క వర్ణమునకు మాత్రమే అధికారమిచ్చుటవలన హింసను ఒకమూలకు గెంటివేయుట కుద్యమించినట్టియు—ప్రాచీన భారత సంఘవ్యవస్థలోని యీ మార్గదర్శికమైన సూత్రములు నవీనుల బహుమానమును బడయగలవని తోచుచున్నది. అమెరికాలోవలె లాభాల దృష్టి (Profit view) తోకూడిన—సాంఘికక్షేమదృష్టికి బదులు—పెట్టుబడిదారుల నాయకత్వమున చీకాకుపడుచున్న, ప్రబల రాష్ట్రమువారు తమ దేశములోని ఆబాలగోపాలమును "జాతీయత" అనే నిషా యెక్కించి సోదరమానవ మారణ మునకై సైనికులను పేరుతో సన్నద్ధులుగ చేయుచున్న నేటి రోజులలో కూడ యీ సూత్రమును మానవజాతి గమ నించవలసి యున్నదేమో.

---

1. శబ్దపు ఉత్పత్తినిబట్టి చూచిన "బృహత్" అనగా విశ్వమునం తను వ్యాపించిన పదార్థము. తత్ జ్ఞానము బ్రహ్మజ్ఞానము.

సమిష్టివ్యవసాయము సమిష్టిగా పదార్థోత్పత్తిని చేయుటవలన మనుష్యశక్తి పెట్టుబడి, కాలము వీటి యొక్క ఖర్చు ప్రస్తుతవ్యక్తి పెట్టుబడివిధానములోకంటె తక్కువయగుననియు, పదార్థము సమృద్ధిగా తయారగుటయే గాక కర్మకౌశలము హెచ్చగుటయేగాక, కార్మికులకు ఆత్మ వికాసమునకై ఉద్యమించుటకు తీరిక హెచ్చగునని నేడు రష్యాపరిశోధనలలో అమెరికన్ శాస్త్రజ్ఞులు కనిపెట్టిన అంశ ములు సమిష్టికుటుంబములే గ్రామములుగా కూడ మారిన యీ దేశమునకు, సమిష్టి ఉత్పత్తినిమిత్తము వృత్తిసంఘ ములు, శ్రేణులుగా యేర్పడి ఆకాలపు పరిస్థితులనుబట్టి చక్కటి సాంఘిక, ఆర్థిక జీవితమును గడపిన ప్రాచీనభారత వర్ష జనసామాన్యముయొక్క జీవితములో గలవని పరిశోధ నలు సూచించుచున్నవి.

మానవసంఘపు ఆధునిక పరిణామములో "సంఘే శక్తిః కలౌయుగే" అను న్యాయానుసారము సాధనకు రంగము సంఘము. పూర్వము నైష్కర్మ్యముతో కూడిన విశ్వైక్య జ్ఞానచిత్తులైన ఋష్యాదులలోనే నవీన సామ్యవాదులు అపే క్షించుపర్గము లెరుగని (Classless) జీవనము సాధ్యమై యుండెను. ఇప్పటియంత మానవసంఖ్యాభివృద్ధి అప్పుడు లేకుండుట తిండికొఱకు యిప్పటియంత కష్టపడ నవసరము నాడు లేకుండుటయేగాక అప్పుడు వాంఛలు (Desires) అవసరములు బహుతక్కువ. నేటివ్యక్తి పెట్టుబడి విధానము

గాని దానిక్రింద జనసామాన్యమునకు గలుగుచున్న నలుగుడు కాని నాఁడులేకుండెను. ఇవి నాటిసంఘములయొక్క వ్యక్తి సాధనకు కొంతవఱకు తోడ్పడిన పరిస్థితులు. మఱియు భౌతిక బంధనములు నేటివలె నాఁడు యెక్కడికక్కడ మానవుని అలముకొనిపోలేదు. ఇప్పటివలె వ్యక్తినాఁడు యెక్కడికక్కడ సంఘమయపురుషుఁడు కాలేదు. నేటివలె ప్రపంచమంతయు యేక "రహదారి" కాలేదు. అందుచేనాఁడు భౌతికములను వదలివేసిన సాధనసాధ్యమై యుండగా నేఁడు భౌతికములను జయించిన (Mastery over material Condition) సాధన అనుష్ఠేయమయినది. అందులో యీ బంధములు సంఘము నంతను యేకరీతిగా నలముకొనియుండుటవలన వ్యక్తి సంఘత్వేన పడవలెను, లేక సంఘత్వేన లేవవలెను. అందుచే యీ వర్గములు లేని నిర్మమసమాజము అను లక్ష్యము నేఁడు సంఘములోపలిది. కాని వెలుపలిది కాదు. ఇది వర్తమాన యుగమర్యాద. అయితే యీ సామ్యవాదుల "కార్మికుల నిర్మమ సమాజసిద్ధి''కి అనంతరము సాధనతిరిగి వ్యక్తిపరము కావచ్చునేమో''

మహమ్మదీయాది మతములు సామ్యవాదము. మహమ్మదీయమతము సిద్ధాంతములో సామ్యావస్థను ప్రతిపాదించుచున్నది. అవిధముగా తొలిరోజులలో యిద్దరు కలీఫాలు మతసంఘమును నడిపిరి. క్రైస్తవ మతములో సామ్యావస్థ

విస్పష్టముగానే కనుపించుచున్నది. అట్టి జీవనమునకు అల వాటుపడని వ్యక్తికి స్వర్గరాజ్య ప్రవేశమున కధికారములేదు.

చైనాలో మానవసమత్వము రాజ్యముచేసే "మహా సంఘము"ను మూడువేల సంవత్సరములకు పూర్వమే కన్ ఫ్యూసియస్ భావజగత్తులో చూచినాడు. మోట్జు యింకా కొంచెము వాస్తవికముగా దీనిని ప్రతిపాదించినాడు.

ఇటులనే బౌద్ధమతము సామ్యవాదమును అధికముగా గౌరవించినది. జాతకములలో వర్ణింపబడిన భౌద్ధభిక్కుల సంఘ ములే అందులకు నిదర్శనములు. సంఘమునంతను అధిపతి "అశేషేన ధమ్మేనసమేన" పాలించవలెనన్నది బుద్ధసాంప్ర దాయము. అందుచే ప్రపంచగౌరవపాత్రములైన మతము లన్నియు అభేదము, స్వార్జితము [1] సద్వినియోగము, అనునవి వ్యావహారికములోకూడ వ్యక్తి జీవనసూత్రములుగా నొక్కి వక్కాణించుచునే యున్నవి. అయితే యీ ప్రతిపాదనలు లుయీ మతములుకూడ ఆనాటి పరిస్థితులనుబట్టి వచ్చిన కొన్ని హద్దులకు లోబడియే చేయవలసి వచ్చినమాట వాస్తవము. మతములే కాదు, ఆస్తికులును, నాస్తికులును మిల్లువంటి వ్యష్టివాదులు, మార్క్సువంటి సమిష్టివాదులును యీమూడు సూత్రములదగ్గరనే ఒకరితో నొకరు చేతులను కలిపెదరు. ఇవియే విశ్వసామరస్యపు సూత్రాలనండి. బ్రహ్మసూత్రాల

1. స్వార్జితము "గర్హితముకాని విధమున నుండవలెను." చూ: మ. భారతము, శాంతి, అనుశాసనికములు.

నండి. ఇఁక భేదము యెక్కడ వచ్చినది? వీక్షణలో. వీక్షణ సంస్కారబద్ధమైనది. సంస్కారములు పరిస్థితులచే బద్ధములైనవి. పరిస్థితులు యెట్లు యేర్పడినవను అనవస్థాదోషమును తెచ్చిపెట్టే ప్రశ్న పైప్రశ్నలోనికి పోకుండ ఆగుదము. "ఎల్లభసేనిజకర్మోపాత్తమ్, విత్తతేన వినోదయచిత్తమ్" అనుటలో స్వకర్మ (Labour అనే అర్థములో) ఫలితము శ్రేష్ఠమని శంకరుల వివక్షగా యెందుకనరాదు? ఇతరవిషయములలో కోటుల మెలగినను టోపీలుకుట్టి జీవించవలెనను ఔరంగజేబు చక్రవర్తి కాయకష్టాభిలాష గౌరవమైనది కాదా?

అయితే పై మతాలవారి ప్రతిపాదనలు దైవిక, భక్తి, ధర్మదృక్పథములపై ఆధారపడినవి. ఇవి గాలిలో మేడలు కట్టుటవంటివనియు, ఇట్టి దృక్పథాలవలననే లోకములో మనము చూచుచున్న ఆచరణావైరుధ్యము కలుగుచున్నదనియు, వాస్తవికదృక్పథముపై యీ సమత్వవాదమును ప్రతిష్ఠించినచో యిది చరిత్రానుభవసహాయముతో (Historical Process) సుస్థిరమగునని ముఖ్యముగా మార్క్సీయుల ప్రతిపాదనము. దీనినే శాస్త్రసిద్ధసాంఘికవాదము (Scientific Socialism) అనెదరు. వ్యక్తివిధానములోకంటె తక్కువ ఖర్చు, తక్కువ శ్రమతో యెక్కువ అందముగా సమిష్టివిధానములో ఒక పెనసలు చేయుట వీలయితే వ్యక్తివిధానముకంటె సమిష్టివిధానములో సంఘపు ఆయురారోగ్యములు,

విజ్ఞానము వృద్ధిపొందుటకు సాధ్యమైతే అట్టి పరిశోధనాను భవముపైన సామ్యవాదమును స్థాపించక దేవునికి కోపము వచ్చునసనే భయముగాని యెదుట వానిని ప్రేమించకపోవుట దుర్నీతియనిగాని యిత్యాది అప్రస్తుతప్రేరణాశక్తులను మానవులలో పుట్టించి వాని బలమువలన యెందులకు ప్రవర్తింప చేయవలెను? అందువలన వాని సమభావము అనేది భక్తి, భయము, నీతి అనేవి వానిలో నిరంతరము ఉన్నంతకాలమే ఉండును. ఈ భయభక్తులు వ్యక్తిలోనికి యింజక్షను చేయుటకు పైగా మనుష్యులు కొందరు కావలసి యుందురు. వీరు సంఘానికి మతనైతికడాక్టర్లు. శాస్త్రసిద్ధ దృష్టితో వ్యక్తిని కర్మయందు ప్రవర్తింపజేయుట యనునది నశించును. అనగా సంఘము దాస్యమయమగును. ఇది నవీనసాంఘికవాదములోని గూఢార్థము. మఱియు ప్లేటోనాటినుంచి థామస్‌మూర్ వఱకును సామ్యవాదపరమైన వ్రాతలు యూరపుఖండములో యున్నను, అటుపిమ్మట రాబర్టుఓవెన్, (౧౭౭౧–౧౮౫౮) సైంట్‌సైమన్, ఫొరియర్ మొదలగువారి భావాలు కొంచెము యథార్థజీవితమునకు దగ్గరగా వచ్చినను సంఘమును సమిష్టి ఉత్పత్తి, సమభుక్తముపైన సంస్కరించుటకు వీరు చేసిన యోచనలలో కూడ, పూర్వసాంప్రదాయవాసనలు స్ఫురించుచునే యున్నవి. అందుచే యీ శాస్త్రసిద్ధసామ్యవాద ప్రతిపాదనము మార్క్సు, ఆయన పక్షీయులయొక్కయు, ప్రత్యేకతయే అయి యున్నది.

ఆంగ్లజిజ్ఞాస. ఇఁక మార్క్సునాడు ప్రవర్తిల్లిన సంఘజిజ్ఞాసకును,సంఘదుస్థితికిని వచ్చెదము. ఈకాలములో ఆంగ్ల దేశములో అధికసంఖ్యాకులకు అధికసుఖము. (The greatest possible good of the largest number) అను సిద్ధాంతమును "బెంథము (Bentham ౧౭౪౮–౧౮౩౨) పండితుని నాయకత్వమున బయలుదేరెను. వీరు ప్రతివిషయమును సంస్థను, ఈ దృష్టితో పరిశీలించుచుండిరి. వీరు సంఘీయుల ఒడంబడిక వలన రాష్ట్రము వచ్చినదని ఒప్పరు. వీరి మతమున సామాజిక జీవనమనునది మానవునియందు స్వతఃసిద్ధముగా నే యున్నది. రాష్ట్రము క్రమపరిణామమువలన గలిగినది. రూసోమతస్థుల ప్రజేచ్ఛ (General will) గాని, హెగేలీయుల "రాష్ట్ర వ్యక్తి"త్వ (Personality of the state) గాని వీరికి ప్రసక్తి లేదు. ఒక పని చేసిన "యెవరికెంత సుఖము కల్గును" అనునదియే వీరి ఒరిపిడిరాయి. ప్రభుత్వమనునది వ్యక్తికి సంబంధించిన విషయములలో ఎంతమాత్రము జోక్యము కలుగజేసికొనరాదనియు, వారిమధ్య జరుగు సంఘర్షణలు సామరస్యముగా సమసిపోగల శక్తి ప్రకృతిలోనే గలదనియు నమ్ముచుండిరి. డార్విను (౧౮౦౯–౧౮౮౨) జంతుపరిణామసిద్ధాంతి చెప్పిన [1] "సృష్టియంతయు వ్యక్తికిని వ్యక్తికిని మధ్య జీవితమునకై సంఘర్షణామయము (Struggle for existance).

1 Origin of species అను గ్రంథము.

ఈపోటీలలో నిలఁద్రొక్కుకొనుటకు సమర్థమైన వ్యక్తి, అసమర్థమైనదానిని అణచి (Survival of the Fittest) బయటకి వచ్చుట ప్రకృతినిర్మాణము" అను సిద్ధాంతము ఈ వ్యక్తి హక్కువాదమును మఱింత పోషించినది. అయితే వీరు నైతిక వాదులు. (Moralists).

<u>వ్యక్తి అర్థవాదులు.</u> (Individual Economists) వీరు రైకార్డో (Ricardo ౧౭౭౨-౧౮౨౩) అను ఆంగ్ల ప్రతిభాశాలియొక్క మతమువారు. వీరిసిద్ధాంతము కేవల నైతికములపై నాధారపడినదికాక, పారిశ్రామిక యుగోదయమైన ఇంగ్లండు యూరప్‌లోని ఆర్థికజీవితగతి సూచకమగుటచే పై ఆదిభౌతిక సుఖవాదులకంటెను నాఁడువీరు ప్రబలమైన పలుకుబడికలవారు. ఆదిభౌతిక సుఖవాదులును, వీరునుకూడ హాబ్సుమతము ననుసరించి సంఘమనగా "స్వప్రయోజనము నపేక్షించు వ్యక్తుల సమూహము" అని నిర్వచించిరి. కాని, సమిష్టిలేనిదే రాచకీయసంఘమే లేదుగాన, వీరినిర్వచనము రాచకీయముగా సమన్వయము అగుటలేదను మాటను గుర్తించక వారి నిర్వచనము వారి అర్థవాదమునకు సరిపెట్టుకొని తృప్తిపడిరి. ఈఅర్థవాదుల ప్రకారము జీవితమంతయు అర్థమయము. ఈఅర్థము వ్యక్తిప్రయోజన విశిష్టమైనది. ఆర్థిక సూత్రములనుబట్టి వ్యక్తిజీవితగతి (బ్రహ్మమానవ జీవితగతిని గూర్చి లలాటరేఖను ముందుగావ్రాయునని మనవారనుకొను నట్లుగా) నిర్ణీతమై (Economic determinism) యుం

డును. రాచకీయ, సాంఘికాది జీవితములు యీ ఆర్థికము యొక్క ప్రతిబింబములే. ప్రకృతినిర్మాణము ప్రకారము నడచుచున్న మానవుని యీ ఆర్థికజీవిత పరిణామమును పురుష ప్రయత్నమువలన ఆపుట తరము కాదు. అట్లు ఆపుటకై కృషి సల్పుట జాతికి అనర్థకముకూడ. బెంథము మతస్థులవలెనే వీరును డార్విన్ సిద్ధాంతమును తమ ఆర్థికరంగములోనికి దుమికించిరి. వ్యక్తులమధ్య జరుగు వ్యాపారసంబంధమైన పోటీలకు పూర్ణావకాశము యిచ్చుటవలననే అర్హావ్యక్తులకు స్థానము గలిగి సృష్టినవ్యముగా నడుచుచుండును. ఇట్టి స్వేచ్ఛావ్యాపారము ప్రపంచముయొక్క సామరస్యతను నిలుపుచుండును. గాన మనము యేమియు చేయునక్కరలేదని వీరు తృప్తిచెందుచుండిరి.

అందుచేవీరు సుఖాంత పరిణామము (Optimism) తో గూడిన "నైష్కర్మ్యము" (Inaction) బోధించిరి. అందులకే దేశములకు—దేశములకు మధ్య ఎగుమతి దిగుమతులలో వర్తకసుంకములు (Tariffs) ఉండరాదు. స్వేచ్ఛావర్తకము (Free trade) ఉండవలయును. కార్మికులకు యజమానులకును, జరుగు ఒడంబడిక (Freedom of contract) లలో ప్రభుత్వము జోక్యము పుచ్చుకొనరాదు. అని వీరి ప్రచారము. ఆనాటి సంఘములోని అధికభాగము వీరి విశ్వాసములపైననే నడిచెను.

అందులో వ్యక్తిస్వాతంత్ర్యమనేది యెరుగక రాజ నిరంకుశత్వమున నలిగినలిగి క్రొత్తగా సంఘము బైటపడిన రోజులవి. ప్రజాస్వామ్య సిద్ధాంతామృత పానముచే మత్తత గొన్నరోజులవి. అధికారమును, ప్రభుత్వము ఆనాఁడు ఏవగింపు. భౌతిక, ఆర్థికరంగములలో పై పండితులు చేసిన ప్రతిపాదనలు ప్రభుత్వ అధికారావశ్యకతను మఱింత తగ్గించివేసెను. అందుచే ప్రభుత్వ ప్రమేయమనునది ఆనాఁడు ఎంతతగ్గిపోయిన దనగా “నాపైన ప్రభుత్వమనేది ఒకటి—ఉన్నది అనుజ్ఞానము వ్యక్తికి ఎంతతక్కువగా నుండునో అది అంతమంచి ప్రభుత్వము” అని ఆనాటి అభిప్రాయము. “స్పెన్సరు (౧౮౨౦–౧౯౦౩) వంటి జిజ్ఞాసువులుగూడ ఇటులే తలచిరి.[1]

కాని వీరిలో మాల్థసు పండితుని (Malthus ౧౭౬౬–౧౮౩౪) నాటికి కార్మికులు యజమానులక్రింద పడుచున్న దురవస్థ గోచరమయ్యెను. అధికసంఖ్యాకులు కార్మికులు గాను, అల్పసంఖ్యాకులు యజమానులుగాను సంఘమంతయు నీ నవీనపారిశ్రామిక యుగములో రెండువర్గములుగా విభజింపబడుట, నీయన తెలిసికొనలేకపోలేదు. “హెచ్చు

1. “If there is to be any state let it be a mere Police State” “అర్హవ్యక్తికి స్థానము” అనే డార్విన్ సిద్ధాంతమును ఈవ్యష్టివాదములలోనికి బలముగా చొప్పించి నదాయనే. అందుచే నీయన ప్రభుత్వము బీదల కట్టినసహాయమును చేయరాదని నిజముగా నమ్మియే ప్రతిపాదించెను.

తగ్గులపై నిర్మింపబడిన సంఘములో అందరికిని సంపూర్ణ స్వేచ్ఛ యొసంగుట యనునది సాధ్యముకాదని" యీ పక్షమువారు తెలిసికొని నిర్విణ్ణులైరి. కాని, యీఅనుభవము వీరినైష్కర్మ్య సాధనను పురుషకారము వైపునకు త్రిప్పుటకు మారుగా "నిజమే కార్మికుల దుస్థితి శోచనీయమే! కాని, ఆర్థికసూత్రములగతి ఆలాగుననున్నది. మనమేమియు చేయజాలము." అను నిరాశాయుత (Pessimistic) నైష్కర్మ్యవాదముగా మార్చినది. కాని, మాల్థను యింకను వ్యక్తుల ఆర్థిక జీవితములలోని హెచ్చుతగ్గుల సవరణకై పురుషకారమును ఒప్పలేదు.

పిమ్మట మిల్లుపండితు (౧౮౦౬—౧౮౭౩) నిచేతులలో యీ రెండు సిద్ధాంతములును పురుషకార పరముగా మారినవి. బెంథముయొక్క శిష్యుడైనను మిల్లు కార్మికుల దుఃస్థితి నివారించుటకు శాసనావశ్యకతను నిరూపించెను. "ప్రజలు యితర ప్రజలజోలికి పోనంతవరకు ప్రజలజోలికి రాష్ట్రము పోరాదు" అను సంస్కార వాక్యములో బెంథము చెప్పిన "మానవుడు పుట్టుకతోడనే స్వార్థాభిమానిగనుక వాని జాగ్రత వాడేపడును" అను ప్రతిపాదనను సంస్కరించెను. ఈ రెండు ప్రతిపాదనల భేదమే గురుశిష్యుల కాలములోని పరిస్థితులకు గల్గిన భేదము.

వ్యక్తిస్వత్వము ధర్మసమ్మతమని. యీ పక్షమువారు యెట్లు సమర్థించెదరు? వీరు "లాక్" పండితుని మార్గానుసారము దీనిని నిరూపించబూనిరి. "ప్రకృతి పదార్థములో తనపాటును (Labour) కలుపగా వచ్చిన ఫలితమునకు వ్యక్తికి సంపూర్ణ హక్కుగలదు. ఇదియే వ్యక్తిస్వత్వముయొక్క తొలిపుట్టుక. ఇదియే ధర్మసమ్మతమైన స్వార్జితము. ఇటుల కొంతకాలము తమ స్వీయకష్టమువలన ప్రకృతిని ఫలపఱచుకొనుచు తమకు కావలసిన నిత్యావసరముల నన్నిటిని తామే రచించుకొనుచు ఆదిని వ్యక్తులు యుక్తమైన సంఘము (Standard society) గా నుండి పిమ్మట కొంతకాలమునకు ఒక్కొక్కవృత్తిలో ఒక్కొక్కరు నిపుణత్వము పొందునవసరము వచ్చినది. దానివలన కర్మవిభాగము (Division of Labour) యేర్పడినది. వెంటనే ఒకరిపదార్థము నొకరు, మార్చుకొనవలసిన (Exchange) అవసరము కలిగినది, (ఒకరు తయారుచేసిన ఉప్పునిచ్చి మరియొకరు తయారుచేసిన పప్పును తెచ్చుకొనుట మొదలగునవి). కాని యీ రెండవ దశలోని మార్పుదల పద్ధతిపైన జీవించు వ్యక్తుల సంఘములోకూడ ఆర్జన అనేది స్వీయకష్టముపైననే జరిగినది; కాన, ఆస్తి సంపాదనలో హక్కుకు ఆధారభూతమైన పై సనాతన సంఘ ధర్మము (Rule of the Standard Society) చెడిపోలేదు. మొదటి దశలో యెవరెంత కష్టపడిన అంతఫలము దక్కితే

యీ రెండవదశలో కూడ తానితరులవద్ద మార్చి తెచ్చు కొన్న దానివిలువ (Exchange value) కూడ తనకష్ట పరిమాణమును తెలుపునదై యుండెను.

"లాక్" పండితుని యీ సనాతన ధర్మసిద్ధాంతము క్రింద వ్యక్తి పెట్టుబడి విధానములోని సాహుకార్ల లాభాలను కూడ ౧౯ వ శతాబ్దపు అర్థవాదులు సమర్థింపబూనిరి. ఈసిద్ధాంతమును బట్టియే ఆయా పరిశ్రమలలో నైపుణ్యము గల భిన్నదేశములమధ్య సరుకులు స్వేచ్ఛతో (Free Exchange) యిచ్చి పుచ్చుకొనుట వలననే, ఆదిధర్మసంఘములో వలెనె పదార్థము సమభుక్తమగునని ప్రతిపాదించిరి. "ఏడమ్ స్మిత్తు" (Adamsmith) మున్నగు స్వేచ్ఛావర్తక వాదులు (Free traders) యీ కాలపువారే. ఫ్రెడరిక్ లిస్టు మున్నగు పూర్వపక్షీయులు ఆదిమానవ ధర్మసంఘములోవలెనే (లాక్ పండితుని ఊహాప్రకారం) నేడును అన్నిసంఘములును సమాన స్థితిలో నున్నవను భ్రమపై స్మిత్తీయుల సిద్ధాంతము ఆధార పడియున్నదని నిరూపించి, ఖండించి పరిశ్రమలు బాల్యావస్థలో నున్న దేశములవారికి రక్షణ (Protection) యుండవలెనని స్పష్టపరచిరి. భారత పరిశ్రమలు ఉచ్ఛస్థితిలోనుండి సీమదేశములకు రవాణాలగుచున్న రోజులలో రక్షణవిధానము వలన వానిని నిర్బంధించియు, సదరు భారతపరిశ్రమలు పడిపోయిన పిమ్మట స్వేచ్ఛావర్తక వ్యాపారమను పేరుతో ఆంగ్ల పరిశ్ర

మలతో ఈదేశమును ముంచివైచిన అప్పటి ఆంగ్లేయ వర్తక నీతినికూడ లిష్టుపండితుడు విశదీకరించెను.

అన్యకష్ట ఫలితమైన పదార్థము (Commodity) మార్పుటవలన (వినిమయము) నేటి సాహుకారునకు వచ్చిన మార్పుదల కిమ్మతున్నూ (Exchange value) స్వీయకష్టముపైన పదార్థోత్పత్తిని మానవుడు చేసికొనిన కాలమున మార్పుదలవలన వచ్చినకిమ్మతున్నూ ఒకటియేనని యీఅర్థవాదులు సమర్థింపజూచిరి. ఈ రైకార్డీయులు "పదార్థము యొక్క కిమ్మతు, దానినిమిత్తమైపడిన పాటుయొక్క విలువతో సమానమైనది." అనగా పదార్థముయొక్క విలువకు కర్మయే మూల్యము అను యీ కర్మమూల్య సిద్ధాంతము (Labour theory of value) ను వ్యక్తి పెట్టుబడి విధానమునకు ముడిపెట్టగా దానిని గూర్చి పూర్వపక్ష స్థాపనము గావించుట మార్క్సుయొక్క విజయములలో నొకటి.

జర్మనుజిజ్ఞాస:— జర్మనీలో యీ కాలమునాటి తత్వజిజ్ఞాస మఱియొక ఫుంతను పట్టినది. అది హేగెల్ (Hegel ౧౭౭౦-౧౮౩౧) పండితుని రాజ్యాంగ తత్వజిజ్ఞాస. హేగెలు రాష్ట్రమనునది సాధనముగాక, సాధ్యమనియు వ్యక్తి రాష్ట్రము[1] నకు విధేయుడై సేవించుటవలననే తనలోని ఉత్తమ

1. ఈమతములో ఆదిభౌతిక సుఖవాదులు, అర్థవాదులవలె రాష్ట్రమనగా వ్యష్టి ప్రయోజనములుగల సమూహముగాక సమిష్టి ప్రయోజనముగలదని నమ్మెదరు.

ప్రకృతిని వికసింప చేసికొనగలుగునని నమ్మెను. రాష్ట్రమే పురుషరూపమైన, అనిర్వచనీయమైన ఒకశక్తి (A mystic masculine personality) తదుపాసనమే వ్యక్తియొక్క పరమధర్మము అను భౌతికాతీతమైన సిద్ధాంతములోనికి (Idealistic theory) పోయెను. అందుచే రాష్ట్రనిరంకుశత్వము కూడ సహనీయమని యీయన అభిప్రాయము. ఇట్టి సిద్ధాంతమును ప్రజలుపాసించునపుడే సంఘప్రజలకు శ్రేయము కలుగునని దీని వాస్తవార్థము.

ఈయన అఖిలప్రపంచ ఐక్యమునుగాని ప్రపంచ సమ్మేళనమందుగాని నమ్మడు. నిరంతరము రాష్ట్రములమధ్య పోరు ప్రకృతిసిద్ధమని నమ్మెను.[2]

ఈయన బైంధములై కార్డ్గోలవ్యక్తి ఆర్థికవాదములను అంగీకరింపడు. ఈయనదృష్టిలో భావము ప్రధానముగాని ప్రత్యక్షమైన భౌతికమార్పులు, అప్రధానము. రెండు వ్యతిరేకభావముల సంఘర్షణము (Conflict) నుండి ఉత్తమమైన నూతనభావ ముదయించును. ఈయన పరిణామ (Evolution) వాది. కాని ఇది భావపరిణామము దీనికిమూలము భావసంఘర్షణము. సంఘర్షణజనిత ఉత్తమ భావపరిణామములోనే మానవాభివృద్ధి కలదని (ఇదియే గ్రీకులు తెలిపిన Dialectic అనునది) కూడ యీయన నమ్మెను. అనగా సృష్టియంతయు

2. అన్యరాష్ట్ర ప్రతాపమును సహించరాదను రాజనీతియే కొంతకాలము భారతరాజన్యుల దిగ్విజయములకు ప్రేరణ కర్తయైనది.

ప్రాచీన, నవీన భావసంఘర్షణజనిత ఉత్తమభావ పరముగా నడచును. మానవజీవితముయొక్క భౌతికపరిస్థితులు యీ భావమునుబట్టి యేర్పడినవి అని దీని సారాంశము.[1]

జర్మను దేశము రాజప్రభుత్వముక్రిందనే అభివృద్ధిలోనికి వచ్చుటవలనను, జర్మనులు విజేతృ భావసంస్కారులు గావునను అచ్చట ప్రజాస్వామ్య సిద్ధాంతములు అంతగా నాటుకొనలేదు. ఇట్టి రాష్ట్రపరిస్థితులకును, హేగెలు సిద్ధాంతమునకును అన్యోన్య సంబంధముకలదు. హేగెలు సాంఘికుల ఒడంబడిక వలననే రాష్ట్రమేర్పడినదను సిద్ధాంతమునకు నుముఖుడే. అందులకే సంఘేచ్ఛా మూర్తియయిన, సంఘగణరాసి యయిన ఈరాష్ట్రపురుషుని (State personality) అంత తీవ్రతన్మయముతో వ్యక్తిని కొలువుమనును.

<u>మార్క్సియ సిద్ధాంతములు.</u> ఒకమూల ఆంగ్లదేశపు వ్యక్తి, సుఖ, అర్థవాదులు, మఱియొకమూల జర్మనుదేశపు రాష్ట్రస్వామ్యవాదులును, వీరు తమ తమ వాదములను తీవ్రముగా ప్రతిపాదించుచున్న రోజులవి. మఱియొకమూల స్వేచ్ఛా వ్యాపారవాదులును (Free traders) వ్యాపారములో రక్షణలుండవలెనను వారును (Protectionists) డీకొనుచుండిరి. ఇంకొకమూల డార్విన్ హాక్స్లీలమున్నగు జంతు

1. శత్రుమిత్ర సాధనలులేనిది సృష్టియను నాటకము జరుగదను భారత సాంప్రదాయము, ధర్మాధర్మములకు దేవాసురలకు యుద్ధములున్ను ఇట్టివే ?

పరిణామవాదులు సృష్టిస్పర్థపైన ఆధారపడియున్నదా లేక జీవులయొక్క సహకారముపై ఆధారపడియున్నదా అను ప్రశ్నను ప్రత్యక్షపరిశోధనచే తేల్చుటకు పూనుకొనిరి. మఱి కొందరు మానవులు సామాజిక జీవితమునుగూర్చి కేవలము రూసో మున్నగువారు చేసిన ఊహలే ఆధారమా? లేక, ప్లేటో, అరిస్టోటల్ మున్నగు ప్రాచీనగ్రీకు తత్వజ్ఞులు తెల్పిన "మానవుఁడు స్వతస్సిద్ధముగనే సమాజకాంక్షగలవాఁడు" అను వాక్యమునకు ప్రకృతి శాస్త్రరీత్యా నిదర్శనములు గలవా? అని పరిశోధనలు చేయుచున్నారు.

ఫ్యూడల్ విమోచనానంతరము స్వల్పకమతములుగా యేర్పడిన రహితాంగము, శ్రేణీవిధానముపై గృహపరిశ్రమల నడిపించుచున్న నగరములోని ఆర్థికజీవితము, ఈయంత్రమును, పారిశ్రామికయుగములో మారిపోయెను. భూములన్నియు బహారీ పెట్టుబడిదారుల వశమయ్యెను. పరిశ్రమలు మిల్లుయజమానుల వశమయ్యెను. పెట్టుబడివిధానము వచ్చెను. జీవితమునకు కేంద్రము గ్రామమునుండి నగరముగా మారెను. ధనము మెక్కువమంది చేతులలోనుండి కొలఁదిమంది సాహుకారుల వశమయ్యెను. పరిశ్రమలు గృహమునుండి యంత్రమునకు లేచిపోయెను. అందుచే సంఘములో, పూర్వాపువృత్తి సంఘములు, గ్రామజీవనము గృహపరిశ్రమలు వ్యక్తివికాసమునకు అవకాశము—ఇవన్నియు మారిపోయినవి. కొలది మంది సాహుకారులు కోట్లకొలది కార్మికులు అను రెండువర్గ

ములుగా యావత్తుసంఘము మారినది. సంఘదృష్టి సుతరాము పోయి లాభదృష్టి (Profit View) ప్రవేశించినది. యజమానులు లాభదృష్టితో యంత్రములు నిర్మించుటచే కార్మికులక్షేమమునకు యజమానుల హృదయములో స్థానమేలేకు. అట్టిస్థితిలో, కార్మికులబాధలు, తదనుశ్రుతముగా సంఘర్షణలు ప్రారంభమయ్యెను. కాని, అప్పటిసంఘ జిజ్ఞాసువులైన పైన తెలుపబడినవారి నైతికజిజ్ఞాసలు, నైష్కర్మ్యము వ్యక్తిస్వత్వము (Individual rights) నకు పుష్టినిచ్చుటవలన యీ దుస్థితిమఱింత హెచ్చినది. సంఘపరముగా జిజ్ఞాసచేసిన ఓవను సైమను, ఫోరియరులు కూడ చాలవఱకు కలలతో తృప్తి నొందువారుగనే యుండిరి. యూరపుఖండము నూతన పారిశ్రామికయుగములోని యూరపుఖండము—తత్పూర్వమునకు వర్తించు శ్రుతులతో తృప్తిచెందవలెనా? లేక, నూతనశ్రుతి సమయముగాని, శ్రుతిసమన్వయ సమయముగాని కల్గినదా? అను ప్రశ్నకు సమాధానము కావలసివచ్చెను.

వెంటనే మార్క్సుమహాశయా "అథాతోధర్మ జిజ్ఞాసా" అను నూతన జిజ్ఞాస బయలుదేరెను.

జర్మనీదేశీయుడగుటచే మార్క్సు హేగిలుసిద్ధాంతములనే తనసారాంశములకు మూలపీఠముగా అవలంబించెను. హేగెలు తనకు ఉద్దీపకుడని గౌరవించెను.

అనగా హేగెలు వాదమును మార్క్సు తలక్రిందుగా (Turned right side up) తన సిద్ధాంతమునకు సమన్వ

యము చేసెను.[1] సాధ్యములలోను, ఉద్దేశములలోను మార్క్సు, హేగెలులు సంపూర్ణ వ్యతిరేకులు, ఒకరు "భావ" (Idea) వాది. మఱియొకరు "భౌతిక" (Materialist) వాది. హేగెలు వలెనే మార్క్సున్ను వ్యక్తిగాక సంఘమే తన లక్ష్యమని అంగీకరించును. రాష్ట్రాధిక్యస్థాపనము హేగెలుయొక్క లక్ష్యమైనచో వ్యక్తి స్వామ్యరహితమైన అందరి ప్రజలకును సమాన భోగ్యమైన సంఘస్వామ్యము (ఇక్కడ స్వామ్యము ప్రభుత్వ పరముగాదు సమిష్టిజీవనము లేక సంఘత్వసిద్ధి అని వివక్షితము.) మార్క్సీయుల లక్ష్యము.

హేగెలు మతప్రకారము సత్యము (Reality) అనగా రెండు వ్యతిరేక భావములసంఘర్షణ జనితఫలము. ఎప్పటికప్పుడు లోకమునకు "సత్య (లేక ధర్మము) ప్రసాదమును చేయుటకై రెండు వ్యతిరేకభావము లుండుట (opposing ideas) వానిమధ్య సంఘర్షణజరుగుట అవసరము. ఇది లేనినాడు సత్యమేలేదు. మానవజాతి—సృష్టి స్తంభించిపోవును. అందుచే చరిత్రనిరంతరము ఈ ఉత్తమభావపరిణామము పరముగా పోవును. దీనిప్రావ్యము మానవస్వేచ్ఛ. దీనినే (Dialectic method) అనెదరు. ఇకమార్క్సున్ను వ్యతిరేకముల సంఘర్షణయే మానవాభివృద్ధి హేతువని అంగీకరించును. ఈ వ్యతిరేకములు మార్క్సు మతములో "భావములు కావు"

1. మాయోచనలో వ్యాస, శంకరుల అద్వైతప్రతిపాదనలకు, సాంఖ్యమత మిట్లే ఉపచరించినది.

భిన్నరీతుల జీవనములు, లేక, పోకడలు, (Elements or Tendencies) ఒక తరహాసంఘము, జీవితమున్ను తత్పూర్వ సంఘముతో భౌతికజీవితములో సంఘర్షించుచుండును. అందుండి ఉత్తమభౌతికజీవితము యేర్పడుచుండును. మార్క్సు, హేగెలువలె పరిణామవాదియే. చరిత్రాత్మకానుభవమును (Historical Process) మార్క్సున్ను సాధనగా గైకొనెను. హేగెలు భావపరిణామముయొక్క చరిత్ర మానవస్వేచ్ఛవద్దకు తీసికొనిపోయిన, మార్క్సు తరతమములు లేని ఆర్థికాద్యైతసమాజస్థితికి (Classless Society) తన భౌతికపరిణామము తీసికొనిపోవునును. అందులకే మార్క్సీయులు పెట్టుబడి విధానయుత ప్రజాస్వామ్యము (Capitalistic Democracy) ఈ పరిణామములో ఒక దశగా తెలిపిరి. [2] ఈ సూత్రము క్రిందనే రష్యాసమాజవాదులు తమ ప్రస్తుతరాష్ట్రస్వామ్యముతో కూడిన శార్మిక సర్వాధికారవిధానము (Dictatorship of the Proletariate)ను సమాజసిద్ధికి పోవుదారిలో సన్నిహితముగా నున్న ఒక మైలురాయి యని తృప్తిచెందెదరు. ప్రా

---

2. అందుచే పెట్టుబడిదారులు కూడ యీస్థితికి ఉత్తరవాదులు కారనియు యిది సామ్యావస్థాపరమైన మానవపరిణామములో తప్పని సరియయిన దశయనియు తేలుచున్నది. దశయే కాదు "ఈ పెట్టుబడి విధానము తనను నశింపజేసే శక్తిని తానే పుట్టించుకొనును" (Capitalism produces its antithesis)

వ్యము పొందుటకు ముందు మార్క్సు వేసిన బొటప్రకారము ఆయాదశలను తదనుభవములను కార్మికగణము పొందవలె నందురు. వీనిలో ఆఖరుదశ వ్యక్తి పెట్టుబడి యుత ప్రజాస్వామ్యము. మార్క్సుయొక్క పరిణామవాదము ప్రకారము జారుపాలన స్థానే వ్యక్తి పెట్టుబడి యుత ప్రజాస్వామ్యము స్థాపన కావలసినది. కాని రష్యాసమాజవాదులు రాష్ట్రిస్వామ్యవిధానమును స్థాపించిరి. దాని నెట్లు సమర్థించెదరు వారు ? వ్యక్తి సంబంధము లేని రాష్ట్రిపెట్టుబడి విధానమువలన యీదశలో కార్మికులు పొందవలసిన శిక్షణ పొందునటులను, వ్యక్తి పెట్టుబడివిధానములో గల్గు అవగుణముల పొందకుండునటులను యేర్పఱచితిమని రాష్ట్రిస్వామ్యముపైన యేర్పడిన రష్యాకార్మికప్రజాస్వామ్యమును లెనిను సమర్థించెను.

అందుచే భౌతికపరిస్థితులు మానవజీవితమును నడుపుటలో ప్రాధాన్యములనియు, రాచకీయసాంఘికాది సర్వవ్యవస్థలును యీ భౌతికపరిస్థితులలో నుండి వికసించినవే యనియు మార్క్సు హేగెలునకు తల్లక్రిందుగా దృఢప్రతిపాదనము చేయును. ఇది మార్క్సుయొక్క ప్రత్యేకప్రతిపాదనలో ముఖ్యమైనది. దీనినే భౌతికదృష్టి (Materialist concept) అందురు. తన ప్రతిపాదనను చరిత్రనుండి దృష్టాంతపూర్వకముగా ఆయన తెలిపెను.[1]

---

1. "మనుజుని భౌతికాభివృద్ధి కవసరమైన ద్రవ్యములు, వాని సంబంధమయిన జ్ఞానము వృద్ధి అయినకొలదియు రకరకముల ఆర్థిక

“ధనమూల మిదంజగత్” అను నార్యోక్తి ననుసరించి ధనము, దాని యుత్పత్తిని తమ వంశమునం దుంచుకొనిన వ్యక్తులు లేక తరగతులవారల చేతులలోనే, సాంఘికపు కట్టుబాటులు, రాచకీయముగా ప్రభుత్వాధికారము ఉండుననియు, వారి అవసరములు వారి రుచులనుబట్టియే సంఘము, విజ్ఞానము ప్రభుత్వము, ఆయారూపములను పొందుననియు అం

---

సంస్థలు సభ్యతలు సంఘమున కవసరములగును, వీని ఫలితముగా సాంఘిక రాచకీయసంస్థలుకూడ మారుచుండును. పూర్వము కొంతకాలము అధికారము యూరపుఖండములో పెద్దభూస్వాముల చేతులలో నుండెను. పిమ్మట యంత్రపరిశ్రమల యొక్కయు, విదేశీయవర్తకము యొక్కయు కాలమువచ్చినది. ఈ పారిశ్రామికులకును వర్తకులకును, పూర్వపుభూస్వాములతో గల్గిన సంఘర్షణఫలితముగా భూస్వాములు వారికి ప్రభుత్వములో స్థానమిచ్చుట కంగీకరించవలసివచ్చినది. క్రమేణ పారిశ్రామికవర్తకులయిన పెట్టుబడిదారుల ఆధిపత్యమే వర్ధిల్లి భూస్వాములంతరించిరి. వెంటనే ప్రభుత్వములు యీ పారిశ్రామిక వర్తకుల అవసరములకు సుముఖముగా పరివర్తన చెందినవి. మూడవదశలో వ్యక్తిస్వామ్యవాదులైన (వ్యక్తిస్వామ్యవాదమునకు యీ వర్తకుల స్వేచ్ఛాలాభములందే వినియోగము కలదని మార్క్సుతలంపు) ఈ పెట్టుబడిదారులు ఈ పారిశ్రామిక యుగములో భౌతికశాస్త్రజ్ఞులచే మానవోపయోగమునకై కల్పింపబడిన భూతశక్తులతో తాము నిర్మించిన మహాయంత్రము లందు తాము పెట్టిన కోట్లకొలది పెట్టుబడి గిట్టుబాటగుటకుగాను జనసామాన్యమును కార్మికులుగా ఆహ్వానించవలసి వచ్చినది. అందువలన పదార్థోత్పత్తిని చేయుటలో యీ కార్మిక

ముచే మనము రాచకీయములని భ్రమించుచున్న వన్నియు నీ ఆర్థికసభ్యతయొక్క బాహ్యపరిణామములేనని మార్క్సు ప్రతిపాదన కావున మూలమైన సంఘముయొక్క ఆర్థికసభ్యతను మార్చినచో సంఘము సర్వతోముఖసంస్కారమును, వికాసమును దానంతట నదియే పొందునని దీనియొక్క రాచకీయార్థము. ఈ స్థితికి సంఘము వచ్చువఱకును ప్రజాస్వామ్యమనునది యెండమావుల వంటిది. ప్రజాస్వామ్యము ఓటర్ల సంఖ్యను వృద్ధిపఱచుటలో లేదు.

---

లకు కూడ క్రమశిక్షయు, సాంఘికపు కట్టుబాటులును లభించినవి. ఇవి ఈ కార్మికగణములకు వీరిపై—ఈ యజమానులపై—తిరుగుబాటునకు శక్తిని—అవకాశమును యిచ్చినవి. అనగా యిందువలన నవీనకార్మికోద్యమము బయలుదేరినది. పెట్టుబడిదారుల ఆవశ్యకత వారి సూత్రములలోని నిస్సారతను కార్మికోద్యమము వెల్లడించుచుండును. క్రమేణ తిరస్కరించు బలమును పొంది దీనిఫలితముగా—పెట్టుబడిదారుల చేతిక్రింద యుండిన కార్మికులకు సహితము మామూలు ప్రజలకువలెనే కట్టుబాట్లు చేసికొనుట (Organize) అసమ్మతిని తెలుపుటకును అవకాశము తొలగింపబడజాలదుగాన—ఈ సంఘశక్తితో ఈ జనసామాన్యము ఈ వ్యక్తి పెట్టుబడివిధానమును తల్లక్రిందులు చేయును. అనగా యీ ముందురాబోవు నవీనవిధానములో పదార్థము సంపూర్ణోత్పత్తి చేయబడి సమానముగా భుక్తమగుటవలన అటుల వీరుస్వాధీనము చేసికొనుటకు మిక్కిలి తగినవారు. యెక్కువతక్కువలుగాని యెట్టితరగతులుగాని ఒకరిచే పీడింపబడు, మరియొక తరగతి (Exploited class) అనునదిగాని (ఈ దశ

ఆర్థికజీవితము కారణము. రాచకీయము దానికార్యము. ప్రభుత్వమనగా "ప్రజల ఆర్థికజీవితములపై అధికారమును చెలాయించుచున్నవారి అవసరములను అమలుజరిపెడు కార్యవర్గము" అంతేకాని యింతకంటె యితరములైన సిద్ధాంతములపై ఆధారపడిన సంస్థకాదు. ఈదృష్టిలో ప్రభుత్వములోనున్న గణములయొక్క అవసరములనుబట్టి ప్రభుత్వమే మారిపోవలెను. ప్రాత ఆర్థికసభ్యతలనుబట్టి యేర్పడిన పురాతన విధానములో (పూర్వపు పెట్టుబడిదారులైన సాహుకారుల అవసరమునుబట్టి నడుచుచున్న) యీ నూతన సంఘము (సంఘస్వామ్య విధానము) ప్రవేశించి పూర్వపు ప్రభుత్వవిధా

---

లో) అంతరించును. వర్గములులేని సంఘము (Classless society) స్థాపనమగుటతోడనే పీడనముండదు. అందుచే పూర్వమందువలె ఒకతరహా ప్రజలు (పెట్టుబడిదారులు, భూస్వాములు) మఱియొక తరహా ప్రజలపైని (కార్మికులు, కర్షకులు) అధికారముచేయుట అనునదిపోయి దాని స్థానే సంఘద్రవ్యము యావత్తున్ను, అందరిక్షేమము కొఱకు సాంఘికముగా పరిపాలించుట సిద్ధించును." (G. D. H. Cole Political Organization.)

చరిత్రాత్మకదృష్ట్యాభౌతిక పరిస్థితులనుబట్టి భావికాల నిర్ణయమునుసరించి తెలిపిన మార్క్సుయొక్క యీ సూచనలే ఆయనను సామ్యవాదులు ప్రవక్తగా గౌరవించుటకు కారణము. అట్టి పరిణామము నేడు వచ్చుచున్నదని నమ్మకము లోకమునందు హెచ్చయిన కొలదియు మార్క్సుకూడ తదనుయాయుల హృదయములో పెరిగిపోవుచున్నాడందురు.

నమును మార్చకుండగనే దానిని నడుపుటకు వీలులేదు. అందు లకే ప్రాతవిధానములను స్వాధీనపఱచుకొనుట దానిని రద్దు పఱచుట మార్క్సీయ మతముయొక్క మూల సిద్ధాంతము. ఒకరకము మనుష్యుల అవసరమునుబట్టి నడుచుచున్న—ఇదే నిజమైనచో—విధానము తద్భిన్నలక్ష్యములు కలవారిచే యెటుల నడుపబడెను? ఇక్కడనే మార్క్సీయులు రెండు పక్షములుగా చీలిపోయిరి. ఇందులకు మార్క్సుయొక్క ప్రతి పాదనలోని సందిగ్ధమే కారణమని లిండ్సేపండితుని మతము. సమాజవాద ప్రకాశిక (Communist manifesto) లోని మార్క్సుయొక్క విపర్యయపద్ధతి (Revolutionary method) నాకరనుసరించిన "క్యాపిటల్" అను గ్రంథములోని క్రమపరిణామపద్ధతి (Evolutionary method) మఱి యొక్క రనుసరించితిమనెదరు. ఈవిభేదముపైననే ఒకరు కేవల సమాజవాదులుగాను (Communist) మఱియొకరు రాష్ట్రసాంఘికవాదులు, (Statesocialist) గాను మారిరి. పార్లమెంటరీ ప్రజాస్వామ్యమును తాము వశపఱచుకొని దాని ద్వారాగానే సక్రమముగా సంఘస్వామ్య విధానమును సంపూ ర్ణముగా అమలుజరుపుటకు మార్క్సు వ్యతిరేకికాడని వీరనె దరు. అది అసాధ్యమనియు, అది మార్క్సు మతమునకు వ్యతి రేకమనియు కార్మికగణముల సర్వాధికార స్వామ్యమే (Dictatorship of the Proletariat) పూర్ణసమాజసిద్ధికి నన్నిహితమైన చరమావస్థయనియు, యీరెండవపక్షమువార

నెదరు. రష్యా కార్మిక రాజ్యవిధానము వీరినమూనా. ఇంగ్లండు, జర్మనీ ఫ్రాన్సు మున్నగు దేశములలోని సాంఘిక వాదులు మొదటి సంఘమువారు.[1] ఈసమస్యపైననే ౧౯౧౯ లో రెండవ పక్షము వారిచే—రెండవ సమాజవాద, అంతర్జాతీయ సంఘము (Second Communist International) వదలబడి రష్యానాయకత్వమున ప్రపంచ దేశములలో దీని వ్యాప్తికై ౧౯౧౯ సం॥లో మూడవ సమాజవాదుల అంతర్జాతీయ సంఘము స్థాపించబడెను.

మార్క్సు అర్థవాదులు:—జీవితమర్థమయమనుటలోను ఆర్థికజీవితమునుబట్టి మానవునిగతి నిర్ణయింపబడు(Economic Determinism) ననుటలోను మార్క్సు రైకార్డో ననుసరించును. "స్వార్థపరులైన వ్యక్తుల సమూహమే'' సంఘమని మాత్రము అంగీకరించువారి పక్షములోగూడ అస్వార్థములు సర్వానుకూలముగా సమన్వయించుట, వ్యష్టిపద్ధతిలోగాక, సమిష్టి పద్ధతిలోనే సాధ్యముకదా! అనును.

ఇక యితరా అర్థవాదుల నైష్ఠుర్యమును గూర్చి మార్క్సు యిటుల సమాధానమొసగెను. "ఆర్థికసూత్రములు సౌభాగ్యపరిణామమునకు అవియే దారి తీయుచున్నవి. నీవు

1. ఏపక్షమునందు ప్రత్యేకాభిమానములేక కేవల శాస్త్ర పండితుండైన "లాస్కి'' పండితుండు ప్రాతవిధానములో క్రొత్త సూత్రముల నిముడ్చుట కష్టమని శోధనపై తెలుపుచున్నాండు (C. F. Democracy in crisis by H. J. Laski)

మాటలాడక యూరకొ అనియనెదవే, ఓయీ ! రైకార్డో ! యిట్టి అవశపరిణామమును (Fatalism) నేనును ఒప్పెదను. కాని, యీ పరిణామము వ్యక్తిస్వార్థములతో గూడిన సంఘపరముగా గాక, సామ్యవాదపరమైనదని నేను నమ్మెదను. సామ్యవాదమునకు ముందు మంచిరోజులు వాటియంతట యవియే వచ్చుచున్నవి. ఈ రోజులను నేను మఱింత దగ్గరకు తీసికొని వచ్చుటకు ఎందులకు ప్రయత్నించరాదు." అని తాత్పర్యముగా సమాధానమిచ్చును.

ఇఁక సర్వమానవులకును సమానస్వేచ్ఛయు, సమానమైన ఆర్థికజీవితమును యున్న సంఘములో పదార్థములను మార్చుకొనుటకు గల స్వేచ్ఛవలననే ద్రవ్యము సమభుక్తమగునను సిద్ధాంతము ౧౯వ శతాబ్దపు పెట్టుబడిదారులకు అన్వయించదనియు నిజముగ వీరుచేయునది తమస్వీయఫలముయొక్క వినిమయము[1] (Exchange) కాదని మార్క్సుమతము. యీ పారిశ్రామికయుగములో ("లాక్" యొక్క ధర్మసంఘపు రోజులలోవలె) తనపాటును స్వతంత్రముగా, పదార్థరూపముగా రచించుకొనుటకు అవకాశములేక కార్మికుఁడు దానిని అర్థాకలి కూలిడబ్బులకు పెట్టుబడిదారునకు

1. బుద్ధికుశలత, పథకము రచించుట మున్నగు పెట్టుబడిదారుని పనులకు యెట్టివిలువను యివ్వకుండగనే యావత్తుకష్టమున్నూ కార్మికునిదే యని మార్క్సు ప్రతిపాదించుట అసందర్భముగ నున్నదని దీనిపై బూర్వపక్షము.

అమ్మకొనవలసివచ్చెను. గాన పెట్టుబడిదారునకు లభించునది అట్టి కార్మికుల పాటును స్వలాభమునకై వినియోగించి (Exploitation) తయారుచేసిన సరుకులయొక్క మార్పుకల కిమ్మతు. ఒకవ్యక్తి మఱియొక వ్యక్తిని స్వలాభమునకై పాటున కొడబరచు పెట్టుబడి విధానమున్నంతవఱకును యావత్సంఘ క్షేమకరముగా పదార్థముల మార్పుకొనుట కుదరదు. అని తెలిపెను. "ఒక పదార్థముయొక్క మార్పుదలవలన వచ్చిన కిమ్మతు (Exchange value) సదరు పదార్థమును తయారు చేయుటకు అగుపాటు యొక్క ప్రమాణము" అను ప్రమాణసూత్రమును వ్యక్తి పెట్టుబడివిధానమునకు వర్తింపజేయవలసి వచ్చిన యెడల "ఒకవ్యక్తి యితరులకొఱకు పడుపాటు తన కొఱకు పడినట్టుగనే యెంచవలసివచ్చును." "ఇది సత్యము ? అందుచే, పాటుయొక్క పరిమాణమే పదార్థముయొక్క కిమ్మతు (Labour theory of value) అను ప్రమాణసూత్రమును అర్థవాదులు వ్యక్తి పెట్టుబడివిధానమునకు వర్తింపజేయుట చెల్లదని ఖండించెను.

## సామ్యవాదాదర్శోన్మాదులకు (Utopian Socialists)

మార్క్సు మందలింపు. సామ్యవాదసిద్ధిని స్వప్నములలో చూచి పొంగిపోవుచు, అది చేతులు ముడుచుకొని కూర్చుండినను తమ గుమ్మమువద్దకు వచ్చుననుకొను కేవల ఆదర్శోన్మాదులు కొందఱు ఆ కాలములో నుండిరి. వీరును నైష్కర్మ్య

వాదులే! వీరినిగూడ మార్క్సు మందలించెను. "సామ్యవాదమనునది మతనైతిక విశ్వాసములవంటిదిగా నుండరాదు. మానవచరిత్రను మనము చదివి పరిశీలించవలయును. అందలి యనుభవములు యెచటికి దారితీయుచున్నవో కనిపెట్టవలయును. మనవిచారణ చారిత్రకగతి (Historical Process) ననుసరించుచు శాస్త్రసిద్ధముగ (Scientific Method) గా యుండవలయును."

మార్క్సు—అద్వైతము—శంకరులు. ప్రస్తుతము యూరపుఖండములోను, తదితర దేశములలోనుగల జిజ్ఞాసువుల—పూర్వపక్షపు సిద్ధాంతులుభయులదృష్టిని—ఆకర్షించుచున్న యీ మార్క్సుయసిద్ధాంతములను పూర్వము యావత్తుభారత దేశమునను మత వేదాంతరంగములలో విప్లవమును జనింపజేసి ఆకర్షించి, నేటికిని ఆకర్షించుచున్న జగద్గురుఁడని ప్రసిద్ధిగాంచిన శంకరుల అద్వైతముతో కొంచెము పోల్చిచూచుట విషయాతిక్రమణము కాదు. ఉభయుల క్షేత్రములు వేరు కావచ్చును. ఒకరు కేవల భౌతికవాది. మఱియొక్కరు భౌతికాతీత విశ్వమయవాది. అందుచే "మెట్ట వేదాంతము చెప్పెడి శంకరుని కేవల ప్రత్యక్షమునుబట్టి, ఆగతానాగతములను నిర్ణయించి ఆలానడిపించుచున్న మా మార్క్సు ప్రక్కన కూర్చుండబెట్ట తామే మని పాశ్చాత్యు" లనవచ్చును. విశ్వాత్మగా జీవాత్మ సిద్ధిపొందే హిమాలయపథ మెక్కడ? కేవల భూతసంఘాతమునకు చెందిన ఆర్థికసమత్వసిద్ధిని సూచించు మార్క్సు

మతమెక్కడ" నని ప్రాచ్యులనవచ్చును. ఆయావీక్షణమును బట్టి భేదాభిప్రాయములు సిద్ధమైనను, యే వ్యవస్థలో సిద్ధాంతి యైనను అద్వైతదృష్టియొక్క లేశమాత్రమైనను దానియందున్నచో దానివ్యవస్థయొక్క హద్దులకు లోబడియైనను శంకరాద్వైతముతో నది సిద్ధాంతలయము కాకతప్పదు. వీరుభయుల మతములనుగూర్చి విపులచర్చకు యిది స్థలముకాదు. భౌతికజీవితములోఅఖండవిప్లవమును తెచ్చిపెట్టిన ఈపాశ్చాత్యజిజ్ఞాసువు ప్రజల ఆధ్యాత్మిక జీవితమును అఖండముగా తారుమారుచేసిన ప్రాచ్యపరివ్రాట్టుయొక్క చూపులలో యెటుల గోచరించునో తెలిసికొనుట ప్రపంచవరమైన యీ గ్రంథముయొక్క సార్థక్యతకు అవసరముగాన యిందులకు సాహసించడమైనది.

మార్క్సును, శంకరుడును తమసిద్ధాంతసాధనకు క్షేత్రముగా భౌతికజగత్తునే అంగీకరించిరి. [1] సిద్ధికికూడ దీనినిదాటి పైన యేదో కలదని (పరమార్థతః) ఉభయులును అంగీకరించలేదు.

భూలోకమెంత మిథ్యయో దేవలోకము కూడ అంత మిథ్యయే అను అద్వైతదృష్టినుండి ఒకరును మానవమాత్రులు "పదార్థములతో ప్రస్తుతం కనిపించుచున్న ఈ జగత్తును దాని పరిమితత్వమును దాటి మరియెక్కడనో (హేగెలీయుల భావజగత్తు)

1. చూ. "ఇహ చేదవేదీః సత్యమస్తి" అను ఈశావాశ్యోపనిషద్వాక్యముయొక్క శాంకరభాష్యం.

సిద్ధికి రంగముకలదనుట తప్పని” మరియొకరును, ఈభిన్నదిశల నుండి చూపులు కలిపెదరు. “ఆత్మనావిందతే వీర్యం విద్యయామృత మశ్నుతే” అను శ్రుత్యనుసారముగా సంసారముచేత అస్పృష్టుడై “త్వం” గా యున్న జీవాత్మవిశ్వాత్మమయమైన తత్పదార్థముగా తనను తెలిసికొనుటయే శుద్ధశంకరాద్వైత ప్రతిపాదన.[2]

మార్క్సుకూడ మానవుడున్నచోటనే యుండి అర్థశక్తులు సంఘీయులందఱును వశపఱచుకొని సమర్థతకొలది పాటుపడి సమభుక్తము చేసికొనుసమయమే మానవుని ముక్తావస్థకు ప్రారంభముగా చెప్పినాడు. దేశకాలపరిస్థితులను బట్టి ఒకరిసాధన వ్యక్తిపరమైనదైతే మఱియొకరిది సంఘములో కూడికొనినదైనది. కాని కార్మికసర్వాధికారము (Dictatership of the proletariat) తన లక్ష్యమునకు మార్క్సు సాధనగా పెట్టుకొనుటచే ఇక్కడను వ్యక్తిసాధనయొక్కజాడలు

2. “అస్మాల్లోకాత్ప్రేత్య అమృతాభవంతి” అని శ్రుతులలో యెక్కడవచ్చినను శంకరులు “సంసారభావమునుండి బయటపడి విశ్వమంతయు తానుగా తెలిసికొనే అవస్థ” అనే అర్థంగానే భాష్యము వ్రాసిరి. ద్వైతశ్రుతులు గతిశ్రుతులున్ను అనువాదముకొఱకును వ్యవహారముకొఱకు మాత్రమనియు ప్రమాణములు కావనియు వారితలపుగా స్పష్టీకరించబడినది. ఇందును గూర్చి ముఖ్యముగా (చూ. ఈశావాస్యం కేనము. తైత్తిరీయములోని భృగువల్లి వీటిభాష్యం) మరియు కౌఠకం అ. ౨. వల్లి 3. శ్లో. ౨.

లేకపోలేదు. ఉభయులును సిద్ధావస్థకు దగ్గరకు వచ్చునరికి సర్వబంధరహితమైనట్టియు, నిర్మమమైనట్టియు వ్యక్తి స్వేచ్ఛ[1] ద్వారానే దానిని సమీపించగల్గుచున్నారు. కాని మార్క్సుయొక్క మతమునకున్ను, అతని ఊహకును కూడ అక్కడ విశ్రాంతి స్థలమేర్పడినది. అది తరతమములులేని, వ్యక్తి స్వేచ్ఛకు ఉదయరంగమైన కార్మికనిర్మమసమాజము. జీవునకు విశ్వాద్వైతము చెప్పువఱకును శంకరునికి విశ్రాంతి యేర్పడలేదు.

అద్వైతులు కర్మనుబట్టి జీవియొక్క భావినిర్ణయమగునన్నట్లే—అనగా యీకర్మలు తనగతిని నిర్ణయించు దాస్యత పోవువఱకును—మార్క్సున్నూ భౌతికజీవితమును సంఘము వశపఱచుకొను వఱకును సంఘీయులగతి ఆర్థికశక్తుల వశములో నుండుననును.

సంసారకారకమైన అవిద్యను పోగొట్టుకొనుటకు సత్యపదార్థజ్ఞానము సాధనము. అవిద్యను జ్ఞానమువలన వశపఱచుకొనినపుడు, యిదివరలో, అవిద్యావశగుడును, కామకర్మాది దూషితుడును, నైన జీవుడేయిప్పుడు "నిమిత్తశుద్ధ సత్వుండును, తత్పద" వాచ్యుడునునై తనగతిని యితరపదార్థము

---

1. "ప్రతివ్యక్తియొక్క స్వేచ్ఛావికాసమే అందరియొక్క స్వేచ్ఛావికాసము (Free development of each will lead to the free development of all)" మా.మార్క్సుయొక్క సాం. వా. ప్ర")

నిర్ణయించుస్థితినుండి దాటి అది స్వాయత్తముగా నుండు ముక్తావస్థలోనికి వచ్చుచున్నాఁడు.[1] అటులనే పదార్థోత్పత్తిసాధనములు (Means of Production) వ్యక్తుల స్వాధీనములో నుండుటవలన యావత్తుజాతియు ఆర్థికపరిస్థితులకు దాసులై యున్న యీ గత వర్గవిభజనయుగములో సంఘీయులందరును యీ ఆర్థికశక్తులను తమవశమందుంచుకొని ఆధిపత్యము వహించు పరిణామమే మానవస్వేచ్ఛకు ఉదయకాలము.

"నీవు ప్రపంచమును యోగ్యమైన దానినిగా చేయవలెనన్న దానిని నీవు అర్థము చేసికొనవలెను. మనుష్యుని యెదుర్కొను ప్రతితీవ్రసమస్యయు చారిత్రికపరిస్థితులను బట్టి (Historical Conditions) ముందుగానే నిశ్చితమైనదని (Determinate) తెలిసికొనవలయును. దానిని పరిష్కరించవలయునని కేవలము కలలలో తృప్తిపొందు వేదాంతముతో గాని వ్యక్తి అర్థవాదముతో గాని లాభము లేదు.[2] "బయలు దేరిన సమస్యతో పాటు దాని వెనువెంటనే యుండిన ఆసమస్యాపరిష్కారసాధనమైన భౌతికపరిస్థితులను (అనగా యేపరిస్థితులు కలిగిన—ఆ సమస్య పరిష్కరింపబడునో తెలిపెడు జ్ఞానము) కనుగొనవలయును" "మనుష్యులు ఉద్యమించే వన్నియు పరిష్కారమునకు వీలైన సమస్యలే. మనము బాగుగ పరిశీలించినచో ఒక సమస్యాపరిష్కారమునకు అనువైనపరిస్థితులు యెప్పడి సిద్ధముగా నుండినగాని, లేక, అట్టి పరిస్థితు

1. చూ. విద్యారణ్యకృతపంచదశి.

ఏర్పడుచున్న దశవచ్చినగాని, ఆ సమస్య మన మనస్సునకు తట్టనే తట్టదు." (Critique of Political Economy P. 12.) శంకరులవలెనే కేవల జ్ఞానప్రాధాన్యతయు నిరంతరానుభవ "పరీక్షణయు" యిక్కడకూడ వివక్షితములు.

ముక్తావస్థ—దానిసాధనము—నిష్కామకర్మ.

"అవసరము (necessity) "బాహ్యప్రయోజనము." (External purposiveness)—దీనిచేత పాటు, లేక కర్మ అనునది నిర్ణీతమగుచుండు నంతవఱకును మార్క్సుమతములో కూడ "మానవస్వేచ్ఛయొక్క రాజ్యము" (Realm of Freedom) ప్రారంభించదు. పాటునకు అవసర, బాహ్యప్రయోజనములు యెప్పుడు అనపేక్షితములుగా నుండునో, స్వేచ్ఛయొక్క రాజ్యము అప్పుడు ప్రారంభమగును. భౌతిక పదార్థములయొక్క ఉత్పత్తికి వెలుపల అసలు వస్తుతత్వములో (It lies therefore in the nature of things beyond the sphere of purely material production [1]) అది కలదు.

"అనాగరికులవలెనే నాగరికతకు వచ్చిన మనుష్యుడు కూడ తన అవసరములను తృప్తిపఱచుకొనుటకును, తనజీవితమును రక్షించుకొనుటకును, పునరుత్పత్తిచేయుటకును, ప్రకృతితో పోరాడవలయును. ఈ పని అన్నిరూపముల మానవసంఘ

1. చూ. లిండ్సెపండితుని "క్యాపిటల్" అనుమార్క్సు గ్రంథపు ఆంగ్లానువాదము. 3 వ వాల్యూము ౯౫౪ పుట.

ములలోను, అన్నిరకముల పదార్థోత్పత్తియుండును జరుగవలసినదే! మనుష్యజాతివృద్ధి పొందినకొలఁదియు, అవసరములు పెరుగుచుండును. వీనితోపాటు దానికి సాధనభూతమైన మనుష్యుని ఉత్పాదకశక్తులు (Powers of Production) కూడ పెరుగుచునే యుండును."

ఇట్టిసంఘములో స్వేచ్ఛయనేది మానవజాతికి యెంతవఱకుండును? దానికి మార్క్సుయొక్క సమాధానము "ఎంతవఱకు సంఘీయులైన మానవులందఱును సంయుక్తకార్మికులై (Associated Producers) ప్రకృతిదత్తమైన పదార్థమును విజ్ఞానముతో పరిపాలన చేయుచు, అంధశక్తిగా దానిచేత తాము పరిపాలింపబడక, దానిని సంఘముయొక్క మొత్తము వర్దీలోనికి తీసికొనివచ్చెదరో," అటుల సంఘీయుల వర్దీలోనికి వచ్చిన భౌతికపదార్థములను "బహుతక్కువ తగులుబడిలో—ద్రవ్యము, కాలము, మానవశక్తికూడ—మానవప్రకృతికి (ఇచ్చట మానవప్రకృతి అత్యుత్తమవికాసమునకు నిలయమని గ్రహించునది) గౌరవముగాను, తగియుండునట్లును, వృద్ధిచేసెదరో అంతవఱకును ఉండును.[1] (ఈ లక్షణములు యెంతవఱకుండునో అంతవఱకే యీ దశలో మానవసంఘమునకు స్వేచ్ఛయుండును. (ఈ లక్షణములు ఉండి

---

1. ఈ వాక్యమును గీతార్థములో చెప్పవలసినచో "ప్రతికార్మికుఁడును చేయవలసినపాటు అతనిపురుషోత్తమప్రాప్తికి (అనగా అతని ఉత్తమ పరిణామమునకు) భంగముకానిది కావలయును.

పోవుటకూడ యీ దశలో సంభవమనియు, వానితోపాటు లభించిన మానవస్వేచ్ఛకూడ పోవచ్చుననియు ధ్వని). కాని యిట్టి సాత్వికపరిణామమును పొందిన పదార్థపరిపాలనలో కూడ ఇంకను "అవసరము" అనే రజోంశమున్నందున అది రాగముయొక్క రాజ్యమే. దీని వెలుపలనే పరమసాధ్యములైన మనుష్యుశక్తులు (ఈశక్తులు యిక దేనికిని సాధనముకానివి) ఉదయించును అని మార్క్సుతత్వము. ఇదియే నిజమైన స్వేచ్ఛారాజ్యము. అయితే, యీ స్వేచ్ఛ కుసుమమాలను ప్రసవించే వృక్షమూలము ఎక్కడిది? "అవసరము" అనేది (Necessity) మూలముగా గలిగి పుట్టినదే యీ వృక్షము. వృక్షప్రారంభము భూమి నాశ్రయించిన వ్రేళ్లతో మొదలిడినను (భౌతికావసరము కొఱకు పదార్థోత్పత్తి ప్రారంభింపబడినను) పుష్పావస్తకు రంగము నిరాశ్రయమైన స్వేచ్ఛాకాశమే నని వివక్షితము.

అంతవఱకును మానవజాతియొక్క చరిత్ర ప్రారంభమే కాలేదనియు—అనగా పైన తెలిపిన అర్థికశక్తుల వశములో మానవసంఘముండిన (State of economic determinism) "మానవస్వేచ్ఛోదయపు పూర్వకాలమంతయు ప్రాకృతావస్థ (Pre historic Period)" గానే మార్క్సు పరిగణించును.

ఆర్థికాద్వైతమును పురుషోత్తమప్రాప్తి యను పరమార్థమునకు సాధనముగా చేసినాఁడు మార్క్సు. ఇది సరియయి

వదా ? మార్క్సు తనకాలమునాటి యూరపుఖండచారిత్రక పరిస్థితులనుబట్టి ద్రష్టవలె భావిని తిలకించినాఁడు. కార్మిక కోటులు పెరిగిపోవుచుండిరి. ధనమంతయు కొద్దిమంది వ్యక్తుల చేతులలోనికి వచ్చుచుండెను. ఇట్టి యజమానుల లాభములకై నిర్మించబడిన యంత్రములలో యీ కోటులు మానవత్వమును మరిపించుచు, పశుజ్ఞానముతో చేసే జీవనము చూచినప్పుడు, ఈ అర్థోత్పాదకశక్తులు, సంఘపరమైనగాని "మానవునకు స్వేచ్ఛ" అనేది కల్లయని మార్క్సునకు గోచరించెను.

ఈ అర్థోత్పాదకశక్తులు సంఘవశమగుటయె కాదు. సంఘమువానిని వశమందుంచు కొనవలెను. పిమ్మట యేమి చేయవలెను ? తాత్కాలికలాభముల కొఱకును, పోటీలకొఱకును యీ శక్తులు ప్రయోగింపబడి సంఘము పాడుకాకూడదు. ఈ ఆర్థికశక్తుల నుపయోగించుకొనుట (Development of the economic forces) వ్యక్తి అవసరాపేక్షతో జరుగరాదు. "సంఘమున కుపయోగించు కష్టమే (కాయలేక మానసిక) కష్టము." అటులని సంఘముకొఱకు వ్యక్తి బలి కావలెనా ? కాకూడదు. సాధ్యమైనంత తక్కువగనే వ్యక్తియొక్క శక్తి ఖర్చుపఱచవలెను. వ్యక్తియొక్క పురుషోత్తమ ప్రాప్తికి (The attainments of full manhood) ఈ పాటు అడ్డునదిగా నుండరాదు.

ఆర్థికశక్తులు సంఘవశమైన పిమ్మట వానిని వికసించ చేయుటలో నివి సూత్రములు. సరే పైవిధానమువలన స్వే

చ్ఛాద్వారములు అందరికి తెఱచినాము. వ్యష్టి దృష్టిపోయి సంఘమయదృష్టి వచ్చినది. అర్థదాస్యము స్థానే అర్థముపై మనము యజమానులమైనాము. కాని యింకను స్వేచ్ఛా—“ముక్తావస్థ”—ఉదయించ లేదనును మార్క్సు. “అవసరం (Necessity or external purposiveness) అనే కర్తృత్వభోక్తృత్వము ఇంకను యీ కర్మచేయుటలో ప్రోత్సాహజనకముగా నున్నది. అందులకే “శారీరం కేవలం కర్మకుర్వన్నాప్నోతి కిల్బిషం” అనే స్థితియే మానవుని స్వేచ్ఛాప్రారంభమని “మార్క్సున్నూ అంగీకరించినాడు.[1]

---

1. The realm of freedom begins in actuality where labour, determined by necessity and external purposiveness, ceases; it lies therefore in the nature of things beyond the sphere of purely material production. As the savage must struggle with nature to satisfy his needs, to preserve and to produce his life, so must be civilized man, and he must do this in all forms of society and render all possible ways of production. As he develops, this realm of necessity extends, because men's needs extend, but his powers of production which satisfy these needs extend at the same time. There can be freedom in this sphere only to the extent that men in society, the associated producers, govern rationally the material given them by nature, and bring it under their common control instead of being governed by it as by a blind force develop

అనగా నిష్కామకర్మయోగము యిట సూచింపబడినది. అడవిలో నిర్ద్వందముగా కాలక్షేపము చేసే తాపసుఁడును అపేక్షలేకుండా "చెయ్యాలి కనుక చేయడం" (కర్తవ్యం ఇతి యత్కర్మతత్ సాత్వికం అని గీత) అనేదే ప్రేరణగాగల్గి నిర్మమంగా యంత్రములో చక్రము త్రిప్పే కార్మికుఁడును తత్వంలో కలిసిపోయినారు.

శంకరుఁడు "కర్మను" తీవ్రముగా నిరసించుటకు కారణమేమి ? ఆయన కాలపరిస్థితులే. మూర్ఖాచారములు, నరబలి మొదలైనవి, పశువులను ద్రవ్యములుగా స్వర్గాది భోగాభిలాషతో శ్రోత్రియులు యజ్ఞములు చేయుచు, ద్వైతములో పడి యుండుట మున్నగునవి. అట్టిస్థితిలో సంఘమును "గ్రుస" జిజ్ఞాసపరముగా త్రిప్పివేయవలెననిన "జ్ఞానప్రాధాన్యత" అంతతీవ్రముగా ప్రతిపాదించవలెను.

---

it with the least expenditure of energy and under conditions worthy of and adequate to their human nature. But this is still a realm of necessity. Beyond it begins the development of human powers,' which is an end in itself, the true realm of freedom, though that can only come to flower if it is rooted in the realm of necessity' (Karl Marx's Capital Vol. III p. p. 954. Lindsay's translation; and quoted by him in his commentry on the subject called "Karl Marx's Capital" at p. p. 36 published in the "Worlds Manual's series" 1931 Ed.

అటులే మార్క్సున్ను, మానవుని భౌతిక జీవితమనే కేంద్రము పైననే నైతికాదివ్యవస్థలాధారపడి యున్నవి, అను భౌతికపరముగా (Materialistic conception) మానవచరిత్రము అనవగాహనము చేసికొనవలెనని ప్రతిపాదించుట, నాటి పరిస్థితులవలననే కలిగినది. మతగురువులతోను, జీవితానుభవములేని నైతికసిద్ధాంతులతోను అనాటి యూరపుఖండము నిండిపోయెను. మఱియొకమూల జీవితానుభవముతో పరిచయములేని కొందఱు సామ్యవాదము ఒక వేదాంతమని నమ్ముచు ఈఆదర్శము సంఘములో ప్రవేశపెట్టుటనుగూర్చిగాని అట్టి సామ్యవాదసంఘమును ఆచరణయోగ్యముగా నడిపించుటనుగూర్చి గాని యోచించరైరి. ఈపూర్వసామ్యవాదులలో రాబర్టుఓవన్ Robert Owen అను ప్రసిద్ధ అంగ్లసిద్ధాంతి తనఆదర్శసిద్ధికై 1825 సం॥ లో అమెరికాలోని ఇండియానా రాష్ట్రములో "నవ్యసామరస్యము" (New Harmony) అని ఒక సంఘమును స్థాపించి అనుష్ఠాన ప్రదర్శనము చేయ నుద్యమించెను. కాని విఫలు డయ్యెను. కండ్లయెదుట జరుగుచున్న కార్మికదురవస్థలను గూర్చి కేవలము జాలిపొందుట లేక తమజీవితములలో కొంత అనుష్ఠానమును జరుపుటతప్ప వీరెవరును ప్రత్యక్షానుభవసిద్ధమైన విచారణచేయజాలకపోయిరి. కార్మికులలో చైతన్యము పుట్టించు తీవ్రకార్యక్రమ విరహితమైన ప్రచారముపైననే వీరాధారపడిరి. "హెర్బర్టుస్పెన్సరు" (Herbert spencer)

వంటి ప్రశిద్ధ జిజ్ఞాసువుకూడ కార్మికుల కష్టములనుగూర్చి జాలిపొందుచున్నను తన్నివారణకై శాసనముచేయుట వ్యక్తి స్వేచ్ఛాసిద్ధాంతమునకు భంగమని కంపించినరోజులవి. అందులకే మార్క్సు యీప్రత్యక్షభౌతిక వాదమును—నైతిక మతములను త్రోసిపుచ్చిదైనను—ఆరోజులలో అంతగట్టిగా నొక్కి చెప్పవలసివచ్చెను.[1]

వాస్తవములో మంచికర్మలకు శంకరులున్ను "చిత్త శుద్ధిద్వారా స్థానముకలదని" అంగీకరించకపోలేదు. ఆలాగుననే మార్క్సున్నూ నైతికపథమును కేవలము త్యజించెనను ఆక్షేపణకు ఆయనమిత్రుఁడు ఎంజల్సు యిటుల సమాధానమిచ్చెను. "మేముఆర్థిక జీవితమునకు యివ్వవలసినదానికంటె అధికప్రాధాన్యము యిచ్చితిమనుచుందురు. నేనున్ను, మార్క్సున్నూ మాప్రతిపక్షులఖండనకు జవాబుగావారు నిరసించిన అంశముయొక్క ప్రాముఖ్యము తెలుపుటకై దానిని అంత ఊతముతో ప్రతివాదించితిమి." "అదియే (ఆర్థిక జీవితమే) మానవజీవితములో పరమ ప్రాధాన్యముగా మేము చెప్పినట్లు తలఁచువారు, మావాక్యముల నర్థశూన్యములుగా

1. Marx's materialism is not materialistic in the sense that it excludes the action of the mind but only in that it seeks its reality in this world of men and things and not in universe of ideas transending this world and its limitations. G. D. H. Cole in his introduction to Capital Vol. I H. U. Library series.

చేయుచున్నారు"[2]. అందుచే శంకరులు కర్మ్సు, మార్క్సు నైతికములను సహించిందాన్యాయానుసారముగా మాత్రమే ఖండించిరని చెప్పవలసివచ్చుచున్నది.

మార్క్సు—రూసో—శంకరులు. రూసో అమెరికన్ ఫ్రెంచి ప్రజావిప్లవవాది ౧౮ వ శతాబ్దపు ప్రజాస్వామ్యపరమైన విప్లవమునకు ముందువచ్చిన ప్రవక్త. అటులే మార్క్సు తదనంతరపు సామ్యవాద ఉద్యమములకే కాక ౨౦ వ శతాబ్దపు ప్రథమపాదములోని రష్యావిప్లవమునకుకూడ ప్రవక్త. రూసో సంఘములోని ప్రతివ్యక్తియుతన అభిప్రాయమును తెలుపుటకు అవకాశముండునట్టి చిన్నచిన్న రాష్ట్రములుగా నుండి మానవసంఘములు ప్రత్యక్షప్రజాస్వామ్యము (Primary Democracy)ను కల్గియుండినప్పుడే తాను ప్రతిపాదించిన "ప్రజేచ్ఛ" (General will) సంభవము అనెను. మార్క్సుయొక్క సామ్యవాదమునకు కూడ ఒక కుటుంబము వంటి చిన్నసంఘమునె లక్ష్యముగా నిడికొనెనని అందురు. ప్రతివ్యక్తియొక్క అవసరమును గమనించుటకు అవకాశముగల అట్టిసంఘములో ప్రతివ్యక్తియొక్క శక్తి సమిష్టినాయకత్వమున నడుపబడెడు సంఘమే యీాయనయొక్క లక్ష్యమని లిండ్సేపండితుని మతము.

---

2. మార్క్సుయొక్క "కాపిటల్" అను గ్రంథముపై వ్యాఖ్య వ్రాసిన లిండ్సేగారి గ్రంథమునుండి ఉదాహృతము. కాని లాస్కీపండితుడు మార్క్సునుగూర్చి యెంజల్సు చేసిన సమర్దన నొప్పడు. ఇది వీరు పిమ్మట చేకొనినసద్దు బాటనును.

కోట్లకొలది ప్రజలుగల నవీనజాతీయులకును, అఖిలవిశ్వమున కును వీరిరువురును తమసూత్రములను వర్తింపజేయుటకు విధానము సూచించలేదు. అట్టివరిస్థితులు వచ్చినప్పుడు అవియే దారి చూపునని మార్క్సుతలంపు.

భారత దేశ మతరంగములో ౧౨౦౦ సం॥ల క్రితం బయలుదేరిన ద్వైతపరిస్థితులలో శంకరుఁడు ప్రవేసించి జీవబ్రహ్మాద్వైతము స్థాపించెను. రూసో, మార్క్సులవలె గాక శంకరుఁడు తనజీవితకాలములోనే తన ఉద్యమవిజయమును కన్నులార గాంచగల్గెను. విశ్వమునకును వ్యక్తికిని సంబంధము నిర్ణయించి "సోహం" అనే సిద్ధిలో తన్మయుఁడై పోయి శంకరుఁడు క్రిందికి చూడలేకపోయినాఁడు. పైగా ఆ చిదైకరసాస్వాదనపరులకిది వెగటుగా నుండునా! ఇట్టి "సోహం" యొక్క సూర్యకాంతిలో వెలుగవలెనంటే మానవజాతి ఏలా ఉండవలెనో మార్క్సు రూసోలు శాస్త్ర దాని "తేజఃపుంజమును" లోకదృష్టిలో చూపించగలిగినారు. ఒకరు రాచకీయములో అద్వైతముస్థాపిస్తే ఆర్థికములో—ముఖ్యముగా నేఁడు అత్యవసరమైనదిగా తలపబడిన ఆర్థికరంగములో—అద్వైతాన్ని చూపించినాఁరు మరియొకరు.

లోకము నేడు అద్వైతపరముగా తీవ్రగతిని ప్రయాణముచేయుచున్నప్పుడు ద్వైతులకుగాని, శూన్యవాదులకుగాని లేక సంశయాత్మకముగా ప్రతిపాదనచేయు వారికిగాని స్థానము తక్కువ. తన రోజులలో పాలకులువేరు, పాలితులువేరు.

రాజులకు పాలనాధికారము దైవదత్తమను పేరుతో ప్రజలపై సాగించిన నిరంకుశత్వమును రాచకీయములోని ద్వైతమును, రూసో ఖండించి రాజ్యాధికారము అవిభక్తమై త్రికాలాబాధితముగా ప్రజాగణమునం దుండునను రాచకీయా ద్వైతమును స్థాపనచేసెను.

మార్క్సు నాటికి యీాద్వైతము ఆర్థికరంగములో ప్రకోపించెను. అందుచే మార్క్సు అద్వైతస్థాపనకు ఆర్థికరంగము ప్రథమస్థానమున్ను, ప్రధానస్థలమున్ను అని ప్రతిపాదించెను.

మార్క్సు శంకరులకు మఱియొక పోలికకలదు. ఇద్దరును నామరూపాత్మకమైన ఆడంబరమును ఖండించెదరు. భావోద్రేకమువలన ఉద్యమాలను నడిపించ పూనుకొనరు. అసలు పదార్థముయొక్క మూలతత్త్వము (The reality behind the appearance) లేక పదార్థముయొక్క "ప్రత్యక్తత్త్వము" తెలిసికొనవలె నందురు. అటుల తెలిసికొనిన సత్యబలముతో ఉద్యమములు ప్రవర్తిల్లవలె ననెదరు. ఇట్టి ప్రవర్తనకు ముందు ప్రస్తుతమున్న అసత్యసంస్కారములను వ్యక్తి వదలుకొనవలె ననెదరు. ఉభయులును పూర్వమతఖండనమే గాక, వానిని స్వమతముతో సమన్వయము చేయగడగిరి. ఒకరి సంఘరచన, మరియొకరి శృంగేరీ మొదలైన "పీఠనిర్మాణవిధాన"మున్ను గణింపదగినవే.

కాని, "ప్రత్యగాత్మతయా అహమేవ ఇదమ్ సర్వమితి, పరమార్థ సత్యరూపేణ అనృతమిదమ్ సర్వమ్ చరాచర మా చ్ఛాదనీయమ్ స్వేన పరమాత్మనా" (చూ. ఈశావాస్యో పనిషత్తు, శంకరభాష్యము, మం (1) ఆనందాశ్రమ ముద్రాల యమువారిది). అనువిశ్వమునకు అద్వైతము ప్రతిపాదించిన మహనీయుఁడు తనదృష్టిలో వ్యావహారికసంఘము ఏలాయుండ వలెనో ? ఎందుకు తెలిపినాఁడు కాదు ? అనుప్రశ్న కలుగ వచ్చును. ఈ ప్రశ్నకు భిన్నదృక్పథములనుండి సమాధానము నకై యత్నించెదము. ఆదర్శస్థాపనచేయు యుగపురుషులకు వారి వారి కృషికి లక్ష్యమైన క్షేత్రము వారు వచ్చుటకు ముందే కాలము సిద్ధముచేసి యుంచును. యథానిర్దిష్టముగా వారి కార్యమునుచేసి మహాపురుషులు లీనమగుదురు. వారి ఆశయ ములను వారిమార్గమును తదితర వ్యవస్థలకును, కాలములకును అనువగునట్లు ఉపయోగించుకొనవలసిన బాధ్యత మిగతవారిది.

ఇటులనే మార్క్సు, రోసూలు జీవబ్రహ్మ, అద్వైత స్థాపనవలనకును ఏలపోలేదని అనుగుట కూడ అనుపపత్తి వంత మైనది. పైగా శంకరుని గూర్చి పైప్రశ్న జనించుటలో మార్క్సు రూసోలభావసంస్కారము కారణము. క్రీస్తుశకము ౮ వ శతాబ్దములోని భారతదేశపరిస్థితులకును ౧౮ వందల ౧౯ వ శతాబ్దములనాటి యూరపుఖండపరిస్థితులకునూ పోలి కయే లేదు. శంకరుని నాఁడు భారతదేశపు రాజులతో ప్రజ లకు కలహకారణము లేదు. పైగా అప్పుడు రాజ్యాధికారము

కంటె రక్షణనే ప్రజలు ప్రధానముగా కాంక్షించవలసిన రోజులు. దేశము ఫలవంతమైనది. అనుకూల శీతోష్ణములు. జనసమ్మర్దము యిప్పటికంటెను యెన్నిరెట్లో తక్కువ. ఇక మార్క్సు నాటి యూరపుఖండములో వలె అప్పటి భారతదేశములో యంత్రమయ పారిశ్రామిక యుద్యమములుగాని, బహిరీవ్యక్తి పెట్టుబడి విధానముగాని లేదు. అప్పటి ప్రజలకు గల నాగరికత, విజ్ఞానము యిప్పటిరీతివి కావు. వారి విజ్ఞానము ఆముష్మికపరమైనది. అందుచే ఒకవేళ ఐహికపుయిబ్బందులు, ఉన్ననూ వానిని ౧౯ వ శతాబ్దపుకార్మికవిజనసామాన్యము కంటె అధికఓర్పులో భరించగలిగిన చిత్తవృత్తివారిది. పైగా ఆ నాటి భారతదేశములోని విద్యావంతుల (Intellectuals) దృష్టి రాచకీయమున కాదు—ఆర్థికమునకాదు—ప్రసరించినది అది. ఆనాటి ప్రపంచరీతి ననుసరించి మతైక నైతికరంగములపై నున్నది. దేశము వరమద్వైతములో పడిపోయినది. కర్మ అనగా ఆ రోజులలో దారుణజీవహింసలేక ఆత్మహింసావరమైనది. భక్తియనగా ఆ వేశవూరితమైన ఉన్మాదము. అందుచే ౧౭ వ శతాబ్దపు రూసోవలెను, ౧౯ వ శతాబ్దపు మార్క్సువలెను, ౮ వ శతాబ్దపు శంకరుని కార్యరంగముకూడ పూర్వనిర్దిష్టమైనది.

అప్పటి శంకరప్రతిపక్షుల బలములో యిప్పటి గాంధి (అస్పృశ్యతానివారణ సందర్భములోని) వ్యతిరేకపక్షుల బలము సహస్రమైనలేదు. ఇప్పటివలె మోటారులు, ధూమశకట

టాలు, విమానాలు, తంతులు, రేడియోలు అప్పుడులేవు. దేశ ము అరణ్యమయము. ప్రజలలో మౌర్ఖ్యము, క్రూరత్వము, ఇప్పటికంటెను చాల మోటుతనమైనది. అట్టిస్థితిలో అట్టిదేశ ములో ౩౩ సంవత్సరముల వయస్సులో శంకరుఁడు సాధించిన కార్యము ఈ ౨౦ వ శతాబ్దపు మానవునికి కూడ అసాధ్య ముగనే కానిపించుచున్నది.

ఇంకొకదృష్టిలో యీ ప్రశ్నకు సమాధానమునకై వెతుకుదము. విశ్వమేతానుగా సిద్ధిపొంది విశ్వాకాశములో విహంగముగా స్వైరవిహారము చేయువానికి ఈఆర్థిక, సాంఘికవ్యవస్థలు చిన్నగులకరాళ్లవలె దృశ్యాదృశ్యములుగా 'కనుపించునేమో'. శంకరునినాఁడు చిన్నగుట్టలుగాయున్న అద్వైతావరోధకములయిన మానవుని రాచకీయ, ఆర్థిక, సాంఘికాదివ్యవస్థలు శంకరునిపిమ్మట మానవపరిణామముతో పాటు నేఁడు హిమవత్పర్వతమువలె పెరిగి (వివిధరూపములతో) "యీవిశ్వమయ" ఆకాశాన్ని ఆచ్ఛాదనచేసినమాట వాస్త వమే. అందులకే రూసో మార్క్సులు తమ వజ్రాయుధాలతో వానిని ఛేదించి, దాని స్వాభావికవైశాల్యతను స్థాపించుటకై ఉద్యమించవలసి వచ్చినది. నేటి భారతదేశములో, నవీనపరి స్థితులలో శంకరాద్వైతమును యూరపులోని పైవారి అద్వైత తముకంటె జయప్రదముగాను, విశాలముగాను పరిణమింప చేయుటకు అవకాశమున్నది. ౧౨౦౦ వందల సంవత్సరముల నాడు శంకరుఁడు ఆధ్యాత్మములో వేదార్థముగా స్థాపించిన

అద్వైతమే భావిభారత భౌతికరూపరచనకు ఉద్దీపకము కాగలదు.

మార్క్సు పైన పూర్వపక్షములు. ఈ మార్క్సీయ సిద్ధాంతములపై, ప్రబలపూర్వపక్షమున్ను కలదు. మానవాభ్యుదయమునకు యజమానవర్గము సేవకవర్గము అనే జ్ఞానముండుట (Class consciousness) వీరుభయులకు సంఘర్షణ తప్పదనే — వర్గసంఘర్షణభావము (Class war theory) అవసరమా? అర్థప్రయోజనమే సిద్ధిగాగల్గినగాని, మానవుని లోని కర్మ ప్రవృత్తికరమైన శక్తులు (Impulses) పనిచేయ వనుట సత్యమా? నైతికమతములకు సుతరామ్ మానసిక జగత్తులో ప్రవృత్తిలేని మాట వాస్తవమా? మత, నైతిక, రాచకీయోద్యమము లన్నియు ఆయాకాలపు భౌతికజీవితపు రీతులను ననుసరించియే కేవలము నడిచెనా? చారిత్రికానుభవము ఇటులనే యున్నదా? బాల్కనుజాతీయతలకు పై కారణము సుతరామ్ కనుపించుటలేదు. అయిరోపియన్ మహా సంగ్రామమునకు మాత్రము కేవలము భౌతికములే మూలకారణముగా గైకొననగునా? లూథరు మతసంస్కారోద్యమమునకు కేవల భౌతికపరిస్థితులు కారణమనుట పాడియా?

సర్వమానవస్వామ్యావస్థను సిద్ధింపజేయు సమాజవాదమునకై రహస్యసంఘములు, హింసాసాధనలతో ఉద్యమించుట ఆదర్శమును మరపించు తరిఫీదు కాదా? శాస్త్రసిద్ధ మారణసాధనములు విచిత్రముగా పెరిగిపోవుచున్న యీరోజు

లలో హింసామార్గమునకు దిగుట అనగా అపారతక్షయము కాదా ?

కార్మికుల సర్వాధికారము (Dictatorship) కూడ పూర్వనిరంకుశ ప్రభువులవలె వ్యక్తి స్వాతంత్ర్యము నణగ ద్రొక్కి లక్ష్యస్థాలిత్యమును కలుగ జేయుననుటకు సాక్ష్యమేమి?

ఇటులే ఆయన ఆర్థికసిద్ధాంతమును గూర్చి మరి కొన్ని పూర్వపక్షములు. కర్మమూల్య సిద్ధాంతమును గూర్చి, పదార్థముయొక్క మూల్యమనగా దానికై పడేపాటు— అందరిపాటును ఒకేరకముగా నుంచుననుకొనే పాటు— (Undifferenciated labour) యొక్క కిమ్మతేననుట సబబా? అసలు పదార్థమునకు విలువఅనేది ప్రజాఅవసరములను బట్టి (Demand) నిర్ణయమగుచుండునని మార్క్సు మఱచెనా ? పాటుఅనేది కేవల కాలపరిమితినిబట్టి కొలుచుటకు వీలైనదా? ఒకడు అల్పకాలములో రెండవవానికంటె యెక్కువపని చేయ గల్గును. ఒకడు అధికకాలములోనైనను రెండవవాని కౌశల ముతో పనిచేయజాలఁడు. వీరందఱికి గంటలవారిని సమాన జీతము నిర్ణయించుట ధర్మమా ?

ఎంత కార్మికవర్గప్రతిపత్తియైనను తన పరిశ్రమల అభి వృద్ధికై బుద్ధిబలమును, వినియోగించి శ్రద్ధతో పదార్థోత్పత్తి చేయించు సాహుకారు మాత్రము పదార్థోత్పత్తికి కారకుఁడు గాడా? ఇట్టివానిని గూడ కేవలము అమరకమువలన జీవించు జమీందారుని గణములో జేర్చుట పాడియా? అనే కొన్ని

పూర్వపక్షములను—ముఖ్యముగా లాస్కీపండితుని పూర్వపక్షములు—గలవు. వీటియొక్క పూర్ణపరిశీలనకు యిది సమయముకాదు. లిండ్సే పండితుఁడు తెలిపినట్లు నూతనసంఘప్రవర్తకులు, భావియందు నిమగ్నులగుటవలన వివరములలో కొన్ని "జారుపాటుల"ను గావించుచున్నట్లుకనుపించెదరు. కేవల ద్రష్టృత్వశూన్యమైన, పాండిత్యప్రకర్ష గలవారి వ్రాతలలో అట్టి స్ఖాలిత్యములు కనపడకపోవచ్చును. కాని, యెంత సహేతుకముగ వ్రాసినను వారు ఉన్నదానిని గూర్చి వ్యాఖ్యానము చేయగలుగుదురు. కాని భావిని సృష్టించగల రచనాత్మకభావములు అక్కడ మృగ్యము. ఈ సామాన్యసత్యమునకు లోబడి పూర్వపక్ష పరిశీలనయుక్తమనెదరు. ఇఁక మార్క్సునాటినుండి నేటివఱకును భౌతికజీవితమే మానవుని సర్వకోశములందును అలముకొని శక్తివంతముగ పనిచేయుచున్నదని యెల్లరు అంగీకరించుచున్నారు. మార్క్సు మానసికప్రవృత్తికి స్థానము లేదనఁడు. భౌతికజగత్తే—భావజగత్తుగాక—సిద్ధికి రంగము అనే అర్థములో మార్క్సు భౌతికవాది అగుచున్నాఁడని కోల్‌పండితుని సమర్థన. మఱియు కర్మమూల్యసిద్ధాంతము దోషభూయిష్ఠమగుచో యీసిద్ధాంతము రైకార్డో మున్నగు వారి సాంప్రదాయములోనిదే కాన అందుకు మార్క్సును ప్రత్యేకముగా ఆక్షేపించ పనిలేదని ఒక సమర్థన. పదార్థమునకు మూల్యమనేది విమర్శకులు అనుకునే "బజారుధర" అనే అర్థములో మార్క్సు చెప్పలేదనియు, అవసర శేలవసరము

లను బట్టి తగ్గుచు హెచ్చుచు నుండే బజారు కిమ్మతును పరిగణించక ప్రతిపదార్థ రచనకు నియతముగ పాటు అనేది ఒకటి అవసరము గనుక అట్టి నియతమయినదానికే మార్క్సు ప్రాధాన మిచ్చెనని మరియొక సమర్థన. [1] ఇటులే Labour theory of surplus values ను గూర్చికూడ సమర్థనములు కలవు. ఈ సమర్థనను పదునెనిమిదవ అధ్యాయములో పాఠకులు చదువగలరు. ఇందును గూర్చిన ప్రసిద్ధ అనుకూల ప్రతికూల వాదములను పాఠకులకు కొంత చవిచూపించితిమి గాన ఇంతటితో ఈ ప్రసక్తిని వదలెదము.

మార్క్సీయ-వాద ప్రచారము. ౧౮౩౪ వ సం॥ లో జర్మనీనుంచి పారిపోయి వచ్చిన కొందఱు ప్రవాసుల సంఘమని (Exiles league) ఒకటి ప్యారిస్‌లో స్థాపించిరి. ఇది ప్రజాస్వామ్యసిద్ధాంతములపైన యేర్పడిన అంతర్జాతీయ సంఘము. ఇందలి అతివాదులు ౧౮౩౬ వ సం॥లో విడబడి "న్యాయవంతుల సంఘము" (League of the just) అని స్థాపించిరి. ఇందలి సభ్యులు చాలమంది కార్మికపక్షమునకు చెందినవారు. స్వత్వము లేకుండా పదార్థానుభవము వీరి లక్ష్యము. రహస్యప్రచారము విప్లవమార్గములవలన వీరు తమ పనిని సాగింప బూనిరి. అప్పటి వీరి సమత్వవాదము కొన్ని

1 చూ. Capital by Karl Marx, translated by Aden and Adgar Paul. అను గ్రంథములోని D. G. H. Cole గారి ఉపోద్ఘాతము.

నైతికమతఊహలపై నాధారపడినది. వీరి వాదమునకు ప్రత్యక్షశాస్త్రబలముగాని, సిద్ధాంతబలముగాని లేవు. వీరి విధానమునకు ఒక సక్రమప్రణాళిక లేకుండెను. ఈ సంఘము వారే ౧౮౪౭ వ సం॥రం డిశంబరులో తాము జరుపుచున్న రెండవ మహాసభకు మార్క్సును యెంజెల్సును ఆహ్వానించిరి. వీరు పై మహాసభలో తమ నూతనసిద్ధాంతము "అనగా శాస్త్ర సిద్ధసామ్యవాదమును (Scientific Socialism) లెస్సగా ప్రతిపాదించి "సందేహనివారణను" గావించిరి. సామ్యవాద మనేది వెర్రివేదాంతము కాదు. చాటుమాటున కుట్రలతో సాధింపదగినది కాదు. అది ఒక ప్రణాళిక. ఆచరణయోగ్య మైన యొక విధానము దానికి గలదు. ఇంతే కాదు యీ మానవపరిణామమే దినదినమును యీ గమ్యమునకు దగ్గఱకు తీసికొనిపోవుచున్నది. దీనికి మత, నైతికములు (త్రికాలాబాధి తములైన మత, నైతికములు ఇంకను లోకములో పుట్టలేదనే భావములో) ఆధారములు కావు. శాస్త్రదృష్టియే దీని దృష్టి. చరిత్రయే దీనికి ఆధారము, అని ప్రతిపాదించిరి మార్క్సు యెంజల్సులు. ఇట్టి ఆశాపూరితమైన ఒక నూతనచైతన్యమును యీ ఉద్యమములో ప్రవేశపెట్టుటయే మార్క్సు, యెంజలుల యొక్క ప్రత్యేకత యనెదరు; వెంటనే పై సభవారు పూర్వ ము వైటులింగు ప్రతిపాదనలోని "క్రైస్తవసాంఘిక వాద ము"ను క్రిగ్గుయొక్క హెగెల్ సంస్కారబద్ధమైన, యిట్టి వాదనలనుకూడ వదలుకొనిరి. తమ సంఘప్రణాళికగా నుండు

టకు ఈ నూతనపద్ధతిని ఒక సామ్యవాదప్రణాళికను తయారు చేయవలసినదని మార్క్సు, యెంజెలులను కోరిరి. వారికోరిక మీాద తయారుచేయబడి ౧౮౪౮ అప్రాంతములో ప్రచురింపబడిన సామ్యవాదప్రకాశిక (Communist manifesto) యీా మార్క్సుయొ మతమును సూత్రప్రాయముగా ప్రతిపాదించుచున్నది. ఇదియే నేఁడు రష్యాయున్నగు సామ్యవాద దేశములలో వేదముగా పరిగణింపబడుచు అఖిలలోకపరిశీలనకు పాత్రమైనది. కాని, యీా గ్రంథమునాటికి—ఈయనపాండిత్యము అంగీకరింపబడినను—మార్క్సు పేరులేని వాఁడనియే చెప్పవచ్చును. దానికి కారణము అందు తాను సూచించిన పరిస్థితులు అప్పటికి లోకములో యున్నను అవి వక్యముకాలేదు. ఆపరిస్థితులు యేర్పడుచున్న నేఁడు మార్క్సుపండితుల దృష్టిలో ద్రష్టృవలె (Prophet) కానబడుచున్నాఁడు. ఈ ద్రష్టృత్వము మార్క్సునకు గల ప్రత్యక్షానుభవముపైననే ఆధారపడినది.

మార్క్సు. కరుకుమనిషి యనియు, వ్యతిరేకవాదసహనశీలుఁడు కాఁడనియు, ఇందువలననే మాజినీవంటి ఆదర్శవాదిపీరిసంఘమునుండి చీలిపోయెననెదరు. కార్మికగణమునకు అప్పుడు జరుగుచున్న అన్యాయము, తనవాదమునందలి అపరిమిత విశ్వాసము, తానునుభవించు నిర్బంధములు దరిద్రతకూడ కొంతవఱకు యీా కరుకుదనమునకు తోడ్పడినవని కొందఱి మతము.

ఈప్రకాశికకు పిమ్మట తదితరదేశములు స్థానమియ్య నందున ఇంగ్లండు సీమగడ్డపైని ప్రవాసియై వసించి బ్రిటిషు మ్యూజియములోని గ్రంథములు, కార్మికులస్థితిని తెల్పుప్రభుత్వమువారి రిపోర్టులను అధికముగా పరిశీలించి పాండిత్యప్రకర్షగా వ్రాసిన "క్యాపిటల్" (Capital) ౧౮౬౭ లో (౧) వ వాల్యూము) అనుగ్రంథము కార్మికుల వాస్తవికజీవితముల గూర్చియు, పెట్టుబడి విధానపుదోషములు కార్మిక విధానపు లోతుపాతులను శాస్త్ర అనుభవదృష్టితో తెలుపుచున్నదని పండితుల మతము. ఇట్టివే "Critic of political Economy" ఇత్యాద్యి యాయన వ్రాసిన గ్రంథములు.

పైన తెలిపిన న్యాయవంతుల సంఘము అనునది మార్క్సు యెంగెల్సున్ను యిందు ప్రవేశించిన పిమ్మట "సామ్య వాదసంఘము"(Communist League) గా మార్చబడెను. దీనిపక్షమున శాఖోపశాఖలు ఆయా దేశములలో యేర్పడెను. సంఘమునకు ఒక ప్రమాణమును, నిబంధనలును యేర్పడెను. ఈ ఉద్యమమే ౧౮౬౪ వ సంవత్సరములలో అప్పటి యూరపులోని యిట్టి ఉద్యమములన్నియు యేక కేంద్రమునకు కొనిరాబడి ప్రథమ అంతర్జాతీయసంఘముగా పరిణమించెను. (Communist First International) ఈ అంతర్జాతీయ సంఘపుకృషి ఆయా ప్రభుత్వముల దృష్టి నాకర్షించెను. ప్రభుత్వముల నిర్బంధవిధానముల మూలముననూ, బాకోనిన్ అనే రష్యాసామ్యవాద నాయకునికిని మార్క్సునకును గల్గిన వివాద

ములవలనను, హేగ్ లో సమావేశమైన సభలో ఈ సంఘము అంతరించినది. ౧౮౭౨ వ సం॥రమునకు పిమ్మట మార్క్సుతో పాటు యీ సంఘ కార్యవర్గము న్యూయార్కునకు కొనిపోబడి అక్కడ పూర్ణముగా అదృశ్యమయ్యెను. తిరిగి ౧౮౮౯ వ సంవత్సరములో సామ్యవాద ప్రకాసిక సిద్ధాంతము ననుసరించి రెండవ సామ్యవాదుల అంతర్జాతీయసభ అను పేరిట యిదిపునరుద్ధారణ చేయబడి మార్క్సు నాయకత్వమున కృషిసల్పెను. మార్క్సు ౧౮౮౩ లో గతించెను. ౧౯౧౪ వ సం॥లో రాష్ట్రసామ్యవాదుల చేతులలోనికి యిది వచ్చెను. ౧౯ వ శతాబ్దపు సామ్యవాదచరిత్ర యనగా మార్క్సు జీవిత చరిత్రయని లాస్కీపండితుఁ డనుచున్నాఁడు. మార్క్సుద్రష్ట యే కాఁడు. పైన తెలిపినట్లు మానవచరిత్రకు నూతన భాష్య కారుడు; అర్థశాస్త్రములో నూతన ప్రతిపాదకుడు; పూర్వపు వ్యష్టి, అర్థ, రాష్ట్ర, వాదములను స్వసిద్ధాంతానుసారము త్రిప్పి వేసిన సమన్వయ కర్తయని లిండ్సేపండితుని అభిప్రాయము. తనసిద్ధాంతబలమువలన యిదివఱలో చీలిపోయి నిరుత్సాహమైయున్న, భావమాత్ర తృప్తిలోయున్న — ఈ రెండురకముల స్వామ్యవాదోద్యమములకును నూతన "ప్రకాశము" "వికాసము" గలుగచేసెననెదరు. ముఖ్యముగా తన పరిణామవాదమువలన కార్మికసామాన్యములో నూతనచైతన్యమును కలిగించిన ఉద్దీపకుఁడు ; ఇంతేకాక తనసిద్ధాంతముల ఆచరణకై సంఘనిర్మాణమును, విధానమును రచించి నడిపిన కార్యద

త్తుఁడు; సామ్యవాదమనేది పూర్వము సిద్ధాంతము లేకమత ముగా నుండినచో దానిని వాస్తవజీవితములో ఆలంబనీయ మైన పక్షముగా లేవదీసిన ప్రత్యేకఖ్యాతి యీయనదని లాస్కీ పండితుని యభిప్రాయమై యున్నది.

రెండవ అంతర్జాతీయసంఘము నాటినుండియు సంఘ స్వామ్య, సమాజవాదపక్షములు రెండును ముఖ్యముగా యూరపుఖండములోని ఆయా దేశములలో పనిచేయుచుండెను. కాని, వీరికి ప్రభుత్వములలో పలుకుబడి యించుమించు ఆరోజులలో లేదని చెప్పవచ్చును. ఆయాశాసనసభలలో వీరిప్రతినిధులు కొందఱుమాత్రము అక్కడక్కడ కలరు.

కాని సంఘముయొక్క దృష్టి నవీనప్రజాస్వామ్యము నుండి "గ్రుస" యీ సామ్యవాదము వైపునకు (స్వపక్ష పరపక్షుల ఉభయులదృష్టి) తిరుగుట అయిరోపా మహాసం గ్రామానంతరమే. ఆ పరిస్థితులు ముందుచరిత్రతో పాటు తెలుపబడును.

## ప్రకృతిశాస్త్ర ప్రాణశాస్త్రములు—సమిష్టివాదము.

ప్రాణశాస్త్రప్రకృతిశాస్త్ర పరిశోధనలు గూడ వ్యష్టి తత్త్వము కంటె సమిష్టితత్త్వమునే పోషించుచున్నవని డార్వినునకు అనంతరవు పరిశోధనలనుండి యీ పక్షమువారు నిదర్శనము లను చూపజొచ్చిరి. డార్వినుకు పిమ్మట హాక్సిలీ (Hux ly) పంథమునకు పిమ్మటి మిల్లువంటివాఁడు. డార్విను తెలిపిన వ్యక్తి

కినివ్యక్తికిని మధ్యపోరాటము ప్రకృతిధర్మమను సిద్ధాంతము జంతువులకు చెందినదిగాని, [1] సౌష్టవమైన మానవసంఘము యొక్క జీవనసూత్రము కాదనియు, వ్యక్తులు వృద్ధిపొందవలెనన్న వారి మధ్యజరుగు అక్రమములలో సంఘము జోక్యము పుచ్చుకొనుట నాగరికావస్థయేనని తెలిపెను. పిమ్మట బయలుదేరిన ప్రాణశాస్త్రపరిశోధనలో కూడ సృష్టిలో జీవులును జీవాణువులును సహకారభావమువలననే వృద్ధిపొందుదురుగాని, డార్విను తెలిపినటుల స్వార్థభావమే వృద్ధికి సాధనగా ప్రకృతి నిర్దేశించలేదని సిద్ధాంతీకరింపబడినది.

<u>మానశికశాస్త్రము—ప్రభుత్వము.</u> ఈ కాలములోనే మఱికొందరు శాస్త్రజ్ఞులు పై రీతి ఉపమానములయందు తృప్తిలేక సామాజికజీవన మనునది మానసికశాస్త్రరీత్యా యెంతవఱకు సిద్ధమని పరిశోధనను చేయజొచ్చిరి. వ్యక్తి తనలాభనష్టములను హక్కులే హక్కులును యోచించుకొని గాక, (రూసో మతములో వలె) స్వతస్సిద్ధముగనె సామాజికజీవనకాంక్షగలవాడని (Society is an instinct and not a Rational act of man) ఇందువలన కొందరు ఫలితములను తేల్చిరి. ఇదికూడ సమష్టివాదమునకు పుష్టినిచ్చినది.

ఇంతవఱకు మార్క్సీయ సామ్యవాదము, అది పూర్వమతముల నెట్లు ఖండన సమన్వయములు చేసినదియు, భారతీయాద్వైత దృక్పథములో ఇది యెటుల గోచరించునదియు,

1. దీనినే భారతసాంప్రదాయములో మాత్స్యన్యాయము అనెదరు.

చూపుటకు ఉద్యమింపబడినది. ఈ మార్క్సీయ మతముపైన గల పూర్వపక్షములు కూడ సూచింపబడినవి. ఇప్పుడు కేవల మార్క్సీయ మతశాఖలు కాకపోయినను, మార్క్సీయ జిజ్ఞాస అంతర్వాహినిగా గలిగి బయలుదేరి మరికొన్ని రకముల సమిష్టి వాదములను గురించి తేలికగానైన తెలిపినగాని యీ సమిష్టి వాదచరిత్ర పూర్తిగాదు. ఇవికూడ యించుమించు మార్క్సుతో సమకాలీనముగా యూరపుఖండములో బయలుదేరిన వియు, నేడుకూడ భావిమానవ సంఘనిర్మాణములో జిజ్ఞాసువుల పరీక్షయందున్న వియునై యున్నవి.

## మరికొన్ని వాదములు.

అరాజ్యవాదము. (Anarchism) వీరికిని, మార్క్సీయ సామ్యవాదమునకును, సాధ్యావస్థలో (Ends) భేదముతక్కువ. కాని, మార్క్సువలె యీ వాదములో సాధ్యమునకు పోవు సాధన విపులపరచబడలేదు. [1] వీరిలక్ష్యము ప్రభుత్వమనేది అవసరము లేకుండగనే మానవుఁడు స్వేచ్ఛాప్రవృత్తితో సామరస్యముగ జీవించగలఁడను సిద్ధాంతముయొక్క సిద్ధి. "ఇట్టి సంఘములో సామరస్యత అనునది శాసనములకు లొంగియుండుట, అధికారమునకు బద్ధమగుటవలన లభించినదికాదు. దేశ వృత్తి విభాగములను బట్టి యేర్పడినసంఘములు పదార్థో

1. చూ. C. E, M. Joad Modern Political theory

త్పత్తి, దాని అనుభవమునకే కాక, నాగరిక మానవత్వసిద్ధికి అవసరమగు అన్నిరకముల అవసరములు, ఆశయములుపైన యేర్పడిన సంఘములు, తమలో తాము స్వేచ్ఛగా యేర్పఱచుకొనిన కట్టుబాటుల ప్రకారమే "అట్టిసామరస్యత" లోకమునకు సంభవించును."² అనగా వ్యక్తులు లేక సంఘములమధ్య నేఁడు జరిగే వ్యవహారములు భయముపైన గాని, (శాసన భయము) లేక భక్తిపైనగాని (మతలేకనైతికసం.) జరుగుచుండుటవలననే సామరస్యతకు భంగము కలుగుచున్నదని వీరి వాదము. వీరు సంఘముయొక్క వ్యాపారమును సంఘము మొత్తముపైని కేంద్రీకరించువిధానమును (Centralization) ఒప్పరు. ఇక్కడ సమాజవాదులతో వీరు విడిపోయెదరు. కృషి యెక్కడికక్కడ స్థానికముగా జరుగవలెననెదరు. వీరు మార్క్సుయొక్క మానవసంఘక్రమ, ఉన్నతపరిణామవాదమును ఒప్పరు. అందుచే రాజస్వామ్యమైనను, ప్రజాస్వామ్యమైనను "స్వామ్య" మనే దంతయు హెచ్చుతగ్గులు లేక సమానముగా వీరికి హేయము, త్యాజ్యమే. క్రాపాట్కిను (Kropotkin ౧౮౪౨–౧౯౨౧) అను జర్మను జిజ్ఞాసువు దీనికి ముఖ్య ప్రతిపాదకుఁడు.

సమిష్టివాదములో (Collectivism) ఏకదేశములైన మరిరెండు ఉద్యమములు.

---

౨. చూ. సదరు గ్రంథము పుట. ౧౦౧.

## కేవలకార్మిక సంఘపరిపాలనాపద్ధతి (Syndicalism)

కార్మికసంఘపాలన అనగా రాష్ట్రస్వామ్యముఅంతయు పదార్థోత్పత్తికారుఁడైన కార్మికసంఘముల స్వామ్యములో నుండుట. రాష్ట్రస్వామ్యములోను, కేవలసమాజావస్థలోను (Communist state of society)కూడఉత్పత్తికారులు, దాని అనుభోక్తలతో కూడిన(Producer-Consumer state)సర్వసంఘ దృష్టియుండును. ఈ విధానములో అది, కేంద్రమునుండి స్థానికములకు అనగా ఆయాకార్మిక సంఘములకు ప్రసరించును. ఈ మతమువారు సమాజవాదమునకుతలక్రిందు. "ఎవరైతే పదార్థోత్పత్తికారులో వారిదే అధికారము" అనెదరు వీరు. ఉత్పత్తికారునిదృక్పథమేవీరికిప్రధానము.(Palloutier)పల్లౌటీరుఅను ఫ్రెంచికార్మికనాయకుఁడు యీవాదమునుయిటులస్పష్టపఱచెను. "విప్లవముయొక్క ప్రయోజనము మానవసంఘమును'' ఆధిపత్యమునుండి (Authority) విమోచనము చేయుటయే కాదు. పదార్థోత్పత్తి లక్ష్యముగా లేని ప్రతిసంఘము నుండియు కూడ వారిని తప్పించవలయును." ఈ వాదమునకు మార్క్సు సహచరుఁడైన ప్రౌధను (Proudhan ౧౮౦౯-౧౮౬౫) అను ఫ్రెంచివేత్తనుండి భావసంపదకలిగెను. నాటి ఫ్రాన్సు దేశములోనున్న ౧౯-౨౦ వ సం॥మునకు పూర్వపు యిటలీదేశములోను, దీనికి ప్రాముఖ్యపక్షము వారుండిరి.

కేవలము పదార్థోత్పత్తి కారకుల సమితులుగా యావత్సంఘము విడిచిపోవుట దీని లక్ష్యము. ఈపదా

ర్థోత్పత్తి కారకులకె రాజ్యాను భవాధికారములు. ఈయర్ధములో కేంద్ర ప్రభుత్వమును నిరసించుటలో వీరికి అరాష్ట్రులతో పోలికకలదు. స్థానికసిండికేటులపాలన నొప్పుటవలన కొంతవఱకు అధికారము నొప్పినారు. కాని, వీరు సమాజవాదములో ఒప్పబడిన మాత్రమైనను కార్మికేతరులైన బుద్ధిప్రతిభాశాలుర సంపర్కమును ఒప్పరు. కార్మికునకేమి కావలెనో కార్మికునికే తెలియును. అతనికే ఆర్థికసూత్రానుభవము కలదు. అని వీరనెదరు. అందుచే అనుభోక్త (Consumer) లక్షేమము కంటెను కార్మిక క్షేమమే వీరికి ప్రధానము. కావుననే సమ్మె (strike) తత్వమును వీరు బాగుగ నమ్మెదరు. సమ్మె వలన అనుభోక్తలకు కలుగు నష్టము వీరి మతములో లెక్కచేయ నక్కరలేదు. కార్మికసంఘములు తమ స్వశక్తిపై ఆధారపడవలె ననెదరు. యంత్రములను పాడుచేయుట, పనిని సరిగా చేయకపోవుట, పెట్టుబడి విధాన పతనమునకు సాధనగా వీరిలో ఒకపక్షమువారు తెలిపెదరు.

<u>శ్రేణీస్వామ్యము (Guild Socialism)</u> వీరు మధ్యకాలమున యూరపు ఖండములో ప్రవర్తిల్లి యుండిన వృత్తిని బట్టి యేర్పడిన శ్రేణులు (Guilds) ఉద్ధరింపబడి నవీనకాలానుగుణముగా ప్రవర్తింప చేయబడ వలెననెదరు. పెంటీ (A. Z. Penty), విలియం మోరీసు (William Morris) అను ఆంగ్ల వేత్తలు దీనికుద్గాతలు. దీనిముఖ్య సూత్రములు వృత్తి

ప్రాధాన్యతపైన యేర్పడిన పౌరత్వము. బుద్ధి శారీరక బలము వలన పని చేయు కార్మికుల శ్రేణులే (వ్యక్తిగాక శ్రేణియే ఒక వ్యక్తి క్రింద పరిగణింప బడుట) యెన్నిక వర్గమునకు ప్రాతిపదికలు (Units). ఇట్టి యెన్నిక వర్గముచే నిర్మింపబడిన ప్రజాస్వామ్యమును వీరు ప్రస్తుతములో నొప్పెదరు. ఈ శ్రేణుల మూలముగా ఆయా పరిశ్రమల పాలన నడుపవలెను. "సంఘసేవకు వ్యక్తులు చేయు కృషినిబట్టియే వారికి మొత్తము సంఘముపైన బాధ్యత, అధికారము అనునవి యివ్వబడును." ఇట్టి వృత్తి శ్రేణులతో నిండిన దేశములో రాచకీయార్థములో "రాష్ట్రి ముండవలెనా?" అను ప్రశ్నకు ప్రభుత్వములేని మార్క్సు యుసమాజావస్థకు వీరి వాదము దగ్గరగావచ్చినను దానిని గురించి, కాలమునకు వదలుదుమని వీరిజవాబు. ఒక వేళ రాచకీయ ప్రభుత్వమనునది వీరంగీకరించినను అదికూడ పదార్థోత్పత్తి కారులు (Producers) దానిభోక్తల (consumers) యొక్క శ్రేణులు సంఘములలో యుండినట్లే రాచకీయ ప్రభుత్వమనే సంఘము కూడ "అన్నిటిలో నొకటిగా" (One of the many) ఆయావృత్తుల వారి మధ్య సామరస్యముకుదుర్చుటకు గాను ఉండవచ్చును. కాని "అన్నిటికిని మించినది" (One Over the many) గా నిది యుండరాదనెదరు. పదార్థము యొక్క కర్తలు, భోక్తలు వీరిద్దఱకు నుగల వ్యవహారమే సంఘమునకు గల వ్యవహార సర్వస్వమనియు, యీ సిద్ధాంతము యొక్కయు, తదితర సమిష్టి సిద్ధాంతముల యొక్కయు మూల

భావన. ఈ వ్యవహారమునకు పరిష్కారవిధానను అన్వేష ణీయము. ఇది కుదిరిన ప్రత్యేకము "రాచకీయములు" అను విషయములు చాల తక్కువగా నుండును. ఈ శతాబ్దపు రాచకీయములకు పరిష్కారస్థలము యిక్కడనే (అనగా ఆర్థిక రంగమున) అను ఊహపై యీ వాదములు బయలుదేరినవని గమనిక. (శ్రేణులుగా,—బహాలీ, కార్మిక సంఘములుగా గాక—సంఖ్యాధికము లైనను చిన్నిచిన్ని వృత్తి శ్రేణులుగా సంఘమును విభజించుట. (ఇట్టి చిన్న సంఘములలోనే ప్రజేచ్ఛా పాలనలో ప్రతిఫలించుట సంభవమని వీరితలంపు) సుతరాం ప్రభుత్వమునకు వ్యతిరేకులు గాకపోయినను "అది కూడ ఒక సంఘముగా" మాత్రమే పక్షాంతరములో నొప్పు కొనుట, శిండికాలిజములో కంటెదీనికి గల వైలక్ష్యము.

వీరిలో గృహపరిశ్రమల పునరుద్ధారణచేసి గృహపరి శ్రమలపద్ధతినే శ్రేణుల నిర్మాణము కావలెననియు "యంత్ర నిరాకరణము" చేయవలెననియు ఏకదేశ మతముకలదు. ఈ శ్రేణీసామ్యవాదమును వ్యష్టివాదులుగూడ తమవాదము యొక్క పరిణామముగా అంగీకరించినట్లు తోచెడిని. ఈ అంశ మునుగూర్చి యెనిమిదవ అధ్యాయము చివరభాగములో తెలుసుకొననగును.



## అధ్యాయము—ఏడు.

### ౧

### ౨౦ వ శతాబ్దము అయిరోపాయుద్ధమునకు పూర్వం.

ఇప్పటికి ప్రపంచభూభాగ మంతయు పరిశోధకులచే ప్రయాణముచేయబడి, స్థలనిర్దేశము చేయుబడినది. పొగయోడలు, జలాంతర్గాములు, ధూమశకటములు, తంతివార్తల చేతను, పిమ్మట "వైర్లెను" వాయువిమాన, విద్యుచ్ఛక్తి (రేడియో) సాధనములవలనను ప్రపంచములోని సర్వదేశములు అతిదగ్గఱకు తీసికొని రాబడినవి. అందుచే భౌతికముగను, మానసికముగను ప్రపంచదేశములవారు ఒకరి కొకరు యిచ్చి పుచ్చుకొనుటయో, లేక, కేవలము యిచ్చుటయో లేక కేవలము పుచ్చుకొనుటయో తప్పనిసరియైనది. ప్రపంచము తన అందుబాటులోనికి వచ్చినకొలఁదియు పూర్వమువలెనే తనదేశము సరిహద్దులలో అనగా జాతీయతలో యింకను కూర్చుండియుండుట మానవుని స్వభావము కాదు. దేశము యొక్కయు, తదభిమానముయొక్కయు సరిహద్దులు రద్దుకాక పోయినను వైశాల్యతనైన పొందవలసి వచ్చుచున్నది. అందులో వ్యక్తి తన గదిలో కూర్చుండి అఖిలప్రపంచముతోను సంబంధము నడుపగల పరిస్థితులు యేర్పడిన నేడు యేజాతియు కూపస్థమండూకమువలె నుండజాలదు. వెంటనే

పూర్వశతాబ్దములోవలె రాచకీయాది పరివర్తనలకు రంగము యూరపుఖండముగాక అది, ఏషియా, యూరపుఖండములుగా విస్తరిల్లి నేడు యావత్ప్రపంచమే రంగస్థలమైనది. అందుచే పూర్వమువలె తనదేశము, తన మతము లేక తన ఖండము అను యేకదేశపరిస్థితులను బట్టి జాతిప్రవర్తించుటగాక ప్రపంచ పరిస్థితులను బట్టి జాతీయనిర్మాణము చేసికొనవలసివచ్చుట యీ యుగముయొక్క ప్రధాన లక్షణము.

ఇట్టి పరిస్థితులకు పైవిధమైన భౌతికశాస్త్రసహాయమే గాక మరికొన్ని గలవు.[1] ఏషియాఖండములోని జాపాను, యీ శతాబ్దము మొదటి అర్ధపాదమునాటికే ప్రబలరాష్ట్రమై ఆధిక్యగర్వముతో కూడిన ఐరోపియన్ జాతికి సంబంధించిన రష్యాను యుద్ధములో జయించుట; ఐరోపియనులు యేషియా ఖండపుజాతులయొక్క సమానత్వమును అంగీకరించుటకు మొదటి కారణమైనది.

డాక్టరు సన్‌యత్ సేను నాయకత్వమున, ఉన్నతాదర్శప్రేరితమై మంచూరాజ నిరంకుశత్వమునుండి ౧౯౧౨ సం॥లో విముక్తినొంది, సంపూర్ణ ప్రజాస్వామ్యమును స్థాపించిన, చైనా ప్రజాస్వామ్యోద్యమము; యిప్పటికే

1. కీ. శే. దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు అర్థగాంభీర్యముతో, వేరే సందర్భములతో తెలిపినట్లు "శత్రుసాధన" "మిత్రసాధన" అను రెండు శక్తులున్నూ, యీ అంతర్జాతీయ, విశ్వజాతీయాభివృద్ధికి తోడ్పడుచున్నవి.

యనేకమంది పాశ్చాత్యపండితుల శోధనలఫలితముగా వెలుతురులోనికి వచ్చిన, అతిప్రాచీన భారత, చైనాదేశముల విజ్ఞానములు కూడ యిదివరలో ప్రపంచఉద్యమములకు గురుపీఠము తామేననియు తక్కిన ప్రపంచ మంతయు తమవలననే తరించవలయునని నమ్ముచుండిన పాశ్చాత్యఖండీయుల "అహంభావము"ను కొంత ప్రతిహతనము చేసినది. భౌతికశాస్త్రము, కళలలో ప్రపంచప్రఖ్యాతి గన్నవారు ఆసియాఖండములో కూడ బయలుదేరుచుండిరి. ఇటులే ఆఫ్రికాఖండములోని ఆదిమనివాసులైన నీగ్రో మున్నగు జాతీయులు అమెరికా దేశములోని రెడ్డిండియనులు, న్యూజలెండులోని మావురీలు మున్నగు అనాదిజాతులు తమ వ్యక్తిత్వమునకై—దాని నణగద్రొక్కి ఆక్రమించిన పాశ్చాత్యదేశములవారిపై—ఆందోళన సాగించిరి. ఆయా దేశములలోని స్త్రీలు కూడ పురుషులతో సమానహక్కు బాధ్యతలు కావలెనని కోరుచు ఆందోళన సాగించిరి.

జిజ్ఞాసువులు, అంతర్జాతీయ సహకారము, సర్వమానవ ఐక్యతకు అప్పుడే పునాదులు వేయజొచ్చిరి.

---

## ౨

గత శతాబ్దములో తయారగుచుండిన తమ పరిశ్రమలకు అంగడులు కల్పించుటకు గడగిన పాశ్చాత్యఖండములోని యింగ్లండు, ఫ్రాన్సు, జర్మనీ మున్నగువారి రాచకీయ, ఆర్థిక విస్తీర్ణవిధానము యీ శతాబ్దములో పూర్వపురీతిని రాజ్య వశీకరణమూలమున గాక తమకు వీలైనచోట్ల వర్తకపు సంధుల (Trade Treaties) కు దేశముల నొడబఱచుట క్రింద మారినది. ఈకాలమునాటికి యూరపుఖండములోని ప్రధానరాష్ట్రము లన్నియు వ్యవసాయకదశనుండి సంపూర్ణముగ నగరజీవనము గలవిగాను, యంత్రమయములైన పారిశ్రామిక దేశములుగాను మారిపోయినవి. అందుచే ముడిసరకు యేషియా, ఆఫ్రికా మున్నగు ఖండములనుండి తెచ్చుకొనుట, దానిని పరిశ్రమలక్రింద తమ దేశములో మార్చి తిరిగి యీ ఖండములవారిచేతనే వానిని కొనిపించి, జీవనముచేయుట విధియైనది. ముఖ్యముగ, యేషియా, ఆఫ్రికా మున్నగు నవీన పరిస్థితులను బట్టి వెనుకబడియున్న జాతులపై ఆర్థికసామ్రాజ్య స్థాపనమునకై యూరోపియనులు వారిలో వారు పోటీపడుటయు ౧౯౧౪ వ సం॥మున ఐరోపామహాసంగ్రామమునకు అసలు కారణము. రాచకీయముగా కారణము లెన్ని తెలిపినను, తన కున్న సామ్రాజ్యబలసహాయముతో ప్రపంచముపై

ఆర్థికసామ్రాజ్యమును స్థాపించవలెనని బ్రిటిషుదేశమున్ను, తన కున్న నైపుణ్యము, ప్రతిభను ప్రపంచమునకు ప్రదర్శించి ప్రపంచపు ఆర్థికాధిపత్యము వహించవలెనని జర్మనీదేశము కాంక్షించినవి. తదితర రాష్ట్రములవారు యీ ఉభయశక్తులను పట్టుకొమ్మగాగల్గి తమ స్వీయఆర్థిక క్షేమమును పెంపొందించుకొన జూచిరి. ఈ సంగ్రామమునకు కారకు లెవ్వరని మన మిచ్చట ప్రశ్నించుట అప్రస్తుతము. ఈ సంగ్రామములో తాను పోరుటలో ప్రపంచకల్యాణము నిరంకుశత్వమును నాశనముచేయుట తన లక్ష్యములని గ్రేటుబ్రిటను ప్రకటించినది. ఐరిషు జాతీయోద్యమము యుద్ధపురోజులలో కూడ బ్రిటిషు ప్రభుత్వముపై పోరు సలుపుచునే యుండెను. భారతదేశములో జాతీయవాదులు చాలమంది అయిరోపా మహాసంగ్రామములో బ్రిటిషుదేశముపట్ల సహకారభావమునే తెలిపిరి. యుద్ధానంతరము బ్రిటిషుదేశమువలన శ్రేష్టవరములను వీరాసించి యుండవచ్చును. గాంధీమహాత్ముఁడు కూడ "భారతదేశపు స్వాతంత్ర్యయుద్ధము నేడు ఫ్లాండర్సు రంగములో పోరవలె" నని భారతీయులను బ్రిటీషు సహకారమునకై ఉద్బోధించెను. బ్రిటిషువారిపైన తెలుపబడిన ఔదార్యప్రకటనమునకు పిమ్మట అమెరికాఖండము, బ్రిటిషు మిత్రమండలిలో చేరెను. అమెరికా అధ్యక్షుఁడైన ప్రెసిడెంటు విల్సను మహాశయుఁడు లోకమునకు

న్వయం నిర్ణయసూత్రమును ప్రతిపాదించెను. పై సూత్రము ప్రకారం ప్రపంచరాజ్యాంగములు పునర్విభజన కావలెననియు, ముందు యుద్ధములు జరుగకుండునట్లును, జాతులమధ్య వివాదలు పరిష్కరించి లోకశాంతిని కాపాడుటకై ఒక నానాజాతి సమితి (League of Nations) యుద్ధానంతరము నిర్మింపబడవలెననియు సూచించెను. ఈ అయిరోపా మహాసంగ్రామములో ఆయా దేశ రాచకీయవేత్తలు, రాజ్యకాంతులోడను దేశములోని వ్యక్తుల ఆర్థికఐశ్వర్యములకోఅకును ప్రజాసామాన్యమునకు యెక్కించిన "జాతీయనిషా" ఇంతయని చెప్పజాలము. ఇందువలన ప్రమత్తులై యుద్ధమను పేరుతో ఉభయపక్ష ప్రజలును ఒకరినొకరు శాస్త్రసిద్ధమారణములచే విచిత్రముగ నాశనము చేసికొని, గావించిన దశలక్షలరుధిర ప్రవాహములు, నగరముల, దేశముల నాశనము, వేలకోలది కోట్లరూప్యముల వ్యయము,—ఇది యంతయు వర్తమాన యుగమునకు గురుపీఠమున్న, అపూర్వ శాస్త్ర ప్రతిభావంతులును అయిన పాశ్చాత్యదేశీయులే చేయుట—మానవజాతిలో ఒక్కసారిగ గగుర్పాటు, విషాదము, తిరుగుబాటు, వైరాగ్యమును జనింపజేసినది. ఇంతలో ప్రసిడెంటు విల్సను యొక్క లోకశాంతికై ప్రతిపాదింపబడిన ౧౪ ధర్మసూత్రములు—ఇంత "అఖండబలి" ఫలితముగా నైన లోకకల్యా

ణము సిద్ధించిన చాలునను తృప్తితో—చల్లగా చెవులను వడి నవి. ఈ యుద్ధము ౧౯౧౮ సం॥లో ముగిసినది. మిత్రమండలి వారు గెలిచితి మనిపించుకొనిరి.

“నేను సంధిచేసికొనునది జర్మను సామ్రాజ్యకాంక్షితుఁడైన చక్రవర్తితో గాక ప్రజలతో ననునమ్మకము నాకు గలుగనిండు” అని విల్సను అధ్యక్షుడు అప్పటికే రాజీ పడ దలచెను. జర్మను ప్రభుత్వమునకు సందేశ మంపెను. ప్రజల కట్టి యవకాశము కలుగజేయుటకై “కైజరు” చక్రవర్తి సింహాసనమును త్యజించెను. కాని యెట్టి యల్లరి, అశాంతియు లేకయే జర్మను చరిత్రలోని అట్టి ప్రమాదస్థితిలో ప్రజలు వెంటనే ప్రజాస్వామ్యమును స్థాపించిరి. దాని పక్షమునే వీరికిని మిత్రమండలివారికిని జరిగిన “వర్సైలీస్” సంధివలన (౧౯౧౯) యుద్ధము ముగిసినది.

ఈయుద్ధము ముగియక పూర్వమే రష్యాలో చిరకాలమునుంచి “జారు” చక్రవర్తి నిరంకుశ ప్రభుత్వముక్రింద క్రుంగుచుండిన ప్రజల ఆర్థికదుస్థితి, రష్యాసేనలు మిత్రమండలి పక్షముల తూర్పురంగములో పోరాడుచున్న కాలములో మరింత దుర్భరమైనది. ఈయదను గనిపెట్టి సోవియట్టు సంఘములు తిరుగుబాటు చేయుటవలన జారుప్రభుత్వము పతనమయ్యెను. తాత్కాలిక ప్రజాస్వామ్యము పార్లమెంటరీ పద్ధతిని స్థాపించ

బడెను. వెంటనే రష్యాసామ్రాజ్యముక్రింద యుండిన చిన్న రాష్ట్రములుకూడ విడబడెను. పై ప్రజాస్వామ్యమునే (అనగా కెరెన్స్కీ ప్రభుత్వము) రష్యాలోని సాంఘిక వాదులు "లెనెన్" రొక్క నాయకత్వమున త్రోసివుచ్చి, అపూర్వశక్తితో ప్రస్తుతము అమలులోయున్న సోవియట్ సంఘస్వామ్య ప్రజారాజ్యముక్రింద మార్చివేసిరి. రష్యన్ప్రజలు అత్యాతురతతో కోరుచున్న దేశపు ఆర్ధికోద్ధరణకు కెరెన్స్కీయొక్క ప్రజాస్వామ్యము యెంతమాత్రము తోడ్పడజాలక పోవుటయే బోల్షివిక్కులకు దేశము స్వాధీనమగుటకు ముఖ్యకారణము. మఱియు ప్రజాస్వామ్యమనగా నిజముగా భూస్వాముల, ధనవంతులయొక్క రాజ్యముగా ప్రపంచానుభవములో రూఢమగుచున్నదని తెలిసికొని మార్క్స్ సిద్ధాంతానుసారము సాంఘిక స్వామ్యస్థాపనకై విప్లవోద్యమములను అప్పటికే నడుపుచుండిన "లెనెన్" ఆయన యనుచరుఁడు, ట్రాట్స్కీ యున్ను, ఈఉభయ ప్రతిభావంతులును ప్రజాంతఃకరణయొక్క గతిని కనిపెట్టి ఈనామమాత్ర ప్రజాస్వామ్యమును స్వాధీనపఱచుకొని తటాలున దానిస్థానే తమ సోవియట్ కార్మికాధికారయుత ప్రజాస్వామ్యమును ౧౯౧౭ సం॥ అక్టోబరులో స్థాపించిరి. వెంటనేవళ్ళుమరంగమునుండి రషియాసేనల మరలించి జర్మనీతో ప్రత్యేక సంధిగావించుకొని తమ విధానానుసారము

దేశీయపునర్నిర్మాణమునకు వీరు అవకాశమును గలిగించు
కొనిరి.

పిమ్మట వర్సెలీస్ సంధి ఫలితముగా ఆస్ట్రియా, టర్కీ, జర్మనీ సామ్రాజ్యములు తమక్రిందను కలిగియుండిన సామ్రాజ్యములను గోల్పోయినవి. ఇందలి ఫలితముగా ఫిన్లండు, ఇస్థోనియా, లాట్వియా, లూథీయానియా, పోలెండు, జెకోస్లోవేకియా, మున్నగు నూతనప్రజాస్వామ్యములు స్థాపనమైనవి. సర్వియా, జెకోస్లోవియా, రొమేనియా రాష్ట్రములు పై సామ్రాజ్యములలోని కొన్ని భాగములను చేర్చుకొని విశాలములైనవి. ఈవిభజన కేవలము ప్రెసిడెంటు విల్సన్ కృషి ఫలితముగా వెర్సెలీస్ సంధిలో అంగీకరింపబడిన జాతీయతను, స్వయంనిర్ణయ సూత్రమును బట్టి జరిగినదిగాక, జర్మనీ ఆస్ట్రియా, టర్కీ మున్నగు పూర్వసామ్రాజ్యములు ముందు తలలెత్తకుండ వాటిని చీల్చివేయుటకే మిత్రమండలివారు ఇట్లు (Buffer states) నిబంధించిరని యొక మతముకూడ గలదు.

యూరపుఖండములోని యీభాగములుగాక యీజర్మనీవతువు పూర్వసామ్రాజ్యముల వారికి యేషియా, ఆఫ్రికా ఖండములలోనుండిన కాలనీలను, సిరియా, లెబోనీను, పాలెస్టైను, ట్రాన్సుజోర్డీనియా, ఈరాకులనున్న కామిరాన్,

టాగోలాండు, టంగనాయిక, రొండా, ఉరండేలను దక్షిణ—పశ్చిమఆఫ్రికా, పసిఫిక్కు-సముద్రములోని దక్షిణద్వీపములను,[1] మ్యాండేట్లు, ప్రొటక్టరేట్లు అను పేరుతో (అనగా ఈ దేశములు స్వపరిపాలనకు అర్హతను బడయువఱకును నానాజాతిసంఘము వారికి బాధ్యతవహించుచు పరిపాలించు పద్ధతిని నామకః నానాజాతి సంఘమువారికి లోబడుపద్ధతిని బ్రిటిషు, ఫ్రెంచి వారు తాము ప్రపంచములో అన్నివిధముల అభివృద్ధి పొందినవారమని (Advanced Nations) స్వాధీనములో నుంచుకొనిరి.

---

1. ఈమ్యాండేట్లు మూడురకములు. మొదటివి అనగా సిరియా మొదలైనవాని పాలనలో సమితివారు ఏర్పరచిన రాష్ట్రము వారు సలహా సహాయము మాత్రము. (Administrative advice and Assistance) చేయవలెను. రెండవరకము అనగా కామిరాన్ మున్నగు రాష్ట్రములలో జరుగు పాలనకు మ్యాండేటు పొందినవారు సమితికి బాధ్యతవహించవలెను. ఇక మూడవ తరగతి వాటిని మ్యాండేటర్లు తమ స్వంతరాజ్యములో భాగముగా పాలించవచ్చును. ఇవి చాలవరకు పూర్వ జర్మను సామ్రాజ్యములోనివి.

## అధ్యాయము—ఏడవది.



౧

### యుద్ధానంతరపు రాజ్యాంగపరిణామము.

ఇటలీ. ఇంక యిటలీ దేశము యీ యూరోపా మహా సంగ్రామములో మిత్రమండలి వారి స్వలాభాపేక్ష యాతనను ఉపయోగించుకొని నట్లును, యీ యుద్ధములో తాను మిత్రమండలి పక్షమున చేరుటవలన యుద్ధఫలితములైన వ్యయప్రయాసలు తక్క లాభమేమియు కలుగలేదనియు తెలిసికొనినది. ఇదివఱలోనే యీ సంగ్రామములో పాల్గొనవద్దని యిటలీలోని సాంఘికవాదులు చేయుచున్న ఆందోళనకు యిదిబలము నిచ్చినది. సాంఘికవాదులు చెప్పిన జోస్యమునకును, యుద్ధానంతరము యిటలీపట్ల మిత్రమండలి చూపిన నిరాదరణమునకును సరిపోయినది. అందుచే యిటలీ రాజ్యాంగముపై సాంఘికవాదుల నాయకత్వమున తిరుగుబాటు బయలుదేరెను. రష్యాలోవలె సాంఘిక స్వామ్యముస్థాపింపబడునా? యనుస్థితి వచ్చెను. కాని పూర్వరోమను నాగరికత, సామ్రాజ్యవైభవము మున్నగు జాతీయభావోద్దీపితమైన యిటలీప్రజలు రోమకనాగరీకము తమమధ్యగల ప్రజలు (దక్షిణభాగపు కర్షకులు ఈకాథలికు పక్షమువారు) జాతీయతాధ్వంసకర

మైన సామ్యవాదమును యిష్టపూర్వకముగా స్వీకరింపజాలరని ఒక ప్రతిభావంతుఁడు కనిపెట్టెను. ఈయనయే ముసోలినీ. ఈయన ఘనమైన సేనాధిపతి. ఐరోపాసంగ్రామమునకు యిటలీని ప్రోత్సహించిన సంఘస్వామ్యవాది. ప్రాచీన రోము నాగరికతకు, విశ్వఐక్యతాశయములకును వర్తమాన చిహ్నమైన యిటలీదేశమును గూర్చి తలఁచుకొని పులకాంకితుఁడగును. ఇటలీయొక్క భావిఔన్నత్యమునందు ఆయనకు దృఢనమ్మకము. మిత్రమండలీవారు యిటలీనిచేసిన తృణీకారము ఆయనహృదయమున నాటుకొనెను. తనదేశము సామ్యవాదులని కొందరిచే తలుపబడిన సాంఘికవాదుల చేతులలో—తానిదివరలో సాంఘికవాది అయినను—పడుట కాయన కిష్టములేదు. వెంటనే తననైపుణ్యము, పరాక్రమము, ధీరత్వమువలన యిటలీరాజుగారి కోటను ౧౯౨౨ సం॥లో ముట్టడివేసి ప్రభుత్వపుతాళపుచెవుల నడిగెను. సామ్యవాదులచేతులలో పెట్టుటకంటె జాతీయభావోద్దీపితుడై వ్యక్తిస్వామ్యమును కొంతవఱకైన అంగీకరించుచున్న ముసోలినీ చేతులలోనే పెట్టుట శ్రేష్టమని యెంచి రాజు ప్రభుత్వమును ముసోలినీ పరముచేసెను. ఈయన తన బాహుబలమువలన ఒకమూల సాంఘికవాదుల నణచినను దేశములోని ధనవంతులను, సాహుకార్ల ప్రాబల్యమును రాష్ట్రవృద్ధిలో నుంచినగాని దేశమున తన నాయకత్వము నిలుపదని తెలిసికొనెను. అందులకే కార్మికులు, విద్యావంతులు, పెట్టుబడిదారులు, యీ ముగ్గు

రును దేశనిర్మాణమునకు అవసరమేననియు, ఈశక్తులను సమరసభావముతో ప్రభుత్వము తన స్వాధీనములో నుంచుకొని దేశాభివృద్ధికై వినియోగించవలె ననియు, ఒక నూతన రాజ్యాంగపద్ధతిని ప్రవేశపెట్టెను. ఈవిధానముపై నేర్పడిన రాష్ట్రమునకు "కార్పొరేటురాష్ట్రము" అనిపేరు. ఈసిద్ధాంతమును ఫాసిజము అనెదరు. కాని ఫాసిజము ఒక స్వతస్సిద్ధమైన రాజ్యాంగసిద్ధాంతము కాదు. ఇట్టివిధానమును పరిస్థితులనుబట్టి మసోలినీ యేర్పరచిన పిమ్మట, దీనికి "ఫాసిజము" అను పేరుతో సిద్ధాంతసూత్రాలు వ్రాయబడినవి. దీనికి ప్రాచీన చరిత్ర యేదయిన ఉన్న యెడల అది హేగెలుయొక్క రాష్ట్ర స్వామ్యవాదమే.

కార్మికుఁడు—విజ్ఞాని,—పెట్టుబడిదారు—ఈమూఁడుసమానసభ్యతలపై యిటలీ జాతీయక్షేమమునకై బయలుదేరినదీ యుద్యమము. దీనికిప్రస్తుతనియంతకూడ మసోలినీ సర్వాధికారియే. ఈవిధానమునుగూర్చి మూఁడవభాగములో విస్తరముగా తెలుపఁబడును. మసోలినీ క్రింది యిటలీ రాచకీయముగా అప్పటికున్నరీతి ప్రజాస్వామ్యమును ముఖ్యముగా పార్లమెంటరీవిధానమును— గోల్పోయినను ఆర్థికముగా మంచి అభివృద్ధిలో నున్నదనుటకు సందియము లేదు.

<u>టర్కీ</u>. టర్కీజాతీయోద్యమము, యుద్ధానంతరము తీవ్రముగా విజృంభించినది. ప్రాచీనపద్ధతిని నడచిన పూర్వపు

సుల్తానుయొక్క నిరంకుశప్రభుత్వములో నవీనపద్ధతుల ననుసరించి వారి జాతి—ముఖ్యముగా ఆధునికనాగరికతలకు నిలయమైన ఐరోపియన్ రాష్ట్రముల మధ్యనున్న, వారి జాతి—సంస్కారమును పొందలేకపోవుట, వారి పరిపాలన బాధ్యతాయుతమైనది కాకపోవుట, టర్కీ సామ్రాజ్యపతనమునకు కారణమని తెలిసికొనిరి టర్కీ యువకులు. ముస్తఫా కెమల్ పాషా నాయకత్వమున సుల్తాను—కలీఫాను, పదభ్రష్టుని జేసి (౧౯౨౨ సం) ప్రజాస్వామ్యమును స్థాపించిరి. ప్రజాస్వామ్యమును స్థాపించుటయే కాదు. సెవర్సు సంధిప్రకారం గ్రీసు ఆక్రమించనున్న "థ్రేసు" మున్నగు కొన్ని భాగముల తమ పరాక్రమమువలన నిలుపుకొనిరి. ఈ ప్రజాస్వామ్యప్రభుత్వము వారు తమదేశమునకు సంబంధించిన సెవర్సు సంధి షరతులకు కర్త తమ పూర్వపు రాజప్రభుత్వముగాన తాము బాధ్యులము కామని తిరస్కరించిరి. అందుచే చేయునది లేకను వీరి ప్రజాస్వామ్య ఉద్యమమువట్ల అప్పటి రాచకీయ వాతావరణమున ఆధిపత్యమును వహించిన ప్రెసిడెంటు విల్సను సానుభూతి గలవాడగుటవలనను, పిమ్మట లాసానీలో ౧౯౨౩ మిత్రమండలివారు వీరితో ప్రత్యేకసంధిని చేసికొనిరి. ఈనవీన జాతీయప్రభుత్వమువారు చక్కటి జాతీయపునర్నిర్మాణమును చేయుచున్నటుల దినదినము రిపోర్టులు వచ్చుచున్నవి. ఈటర్కీ ప్రభుత్వవిధానము యేకశాసనసభతో కూడినది. దీని అధ్యక్షుడు, శాసనసభలో ప్రజలపక్షనాయకుడు,

ప్రభుత్వప్రధాని—ఈ మూడు హోదాలు ఒక్కనివే. కాని అధ్యక్షునికి కాలపరిమితి గలదు. ఈవిధానము పార్లమెంటరీ విధానమునుండికొన్నియు అధ్యక్షవిధానమునుండి మరికొన్ని అంశముల స్వీకరించినది. కాని ఈరెండు విధానములక్రింద కున్ను ఇది రాదు. ప్రజాస్వామ్యముయొక్క పూర్వసాంప్రదాయమును గౌరవించుచు, దేశపరిస్థితులనుబట్టి రూపరచన చేయబడిన క్రొత్తరకపు విధానమిది. ఇందు అధ్యక్షుడు సర్వాధికారి వంటివాడు.

ఐర్లండు. శతాబ్దములనుండి ఐరిషుజాతి తన స్వాతంత్ర్యముకొఱకై జరుపుచున్న తిరుగుబాటు ౧౯౨౧ సం॥లో ఒక విధముగా సమాప్తిచెందెను. ఈ ఉద్యమనాయకుడైన డీవాలీరా యొక్క సహచరులతో, బ్రిటిషుప్రభుత్వము బ్రిటిషువారి ఆధిపత్యమునకు లోబడి ఆంతరంగిక స్వపరిపాలనమును చేసికొనునట్టి విధానమును, యేర్పఱచుట మూలముగా సంధి చేసికొనెను. కాని ౧౯౩౨ వ సం॥లో డీవాలిరా అయిర్లండు ప్రజాస్వామ్యమునకు అధ్యక్షతవహించి నప్పటినుంచియు, ఐర్లండు పూర్ణస్వరాజ్యమునకై కృషిసల్పుచున్నది.

చైనా. చైనాదేశములో గతశతాబ్దాంతమున జాతీయోద్యమము బయలుదేరెనని యిదివఱకే తెలిపియుంటిమి. చైనాప్రజలు ప్రపంచపరిస్థితులనుపరిశీలించిరి. తమప్రాతసామ్రాజ్యపద్ధతి నవీనపరిస్థితులకు సరిపడదనియు, జాతీయప్రజాస్వా

మ్యస్థాపనమే కర్తవ్యమనియు తెలుసుకొనిరి. ఇందువలననే విరోపియనులును, జపానీయులును తమదేశమును రాచకీయ ఆర్థికలాభములకొఱకు వారి వలుకుబడిలో నుంచుకొనుటకై, జరిపించే ఉద్యమాలు కుట్రలురద్దయి, దేశమునకు శాంతికలుగు ననియు విద్యాధికులు గ్రహించిరి. కాని అశేషజనసామాన్యము కడుదరిద్రులును, విద్యావిహీనులును, పూర్వపద్ధతిని అంధము గా జీవించువారును అయియుండిరి. ఇంతలో దక్షిణచైనాలో డాక్టరు సన్యతుసేను నాయకత్వమున బయలుదేరిన విప్లవము ఉత్తరభాగమునకు వ్యాపించి మంచూసామ్రాట్టును పదభ్రష్టు నిచేసి (౧౯౧౧) పెకింగునగరమున పార్లమెంటరీ విధాన ప్రజా రాజ్యమును స్థాపించెను. తానే యీ స్వామ్య మున కధ్యక్షతవహింప అఖిలదేశముచేతను కోరబ డియు, దానిని తానంగీకరింపక మేధావియు, రాజాశ్రయము వైపు యింకను మొగ్గుస్వభావముగల యూన్షికాయకు అధ్య క్షత నిప్పించుటమూలముగా విప్లవఫలితమయిన యీ ప్రజా రాజ్యమును బలపఱచిన, సనుయత్ సేనుని అడంఖత్యాగము దూరదృష్టియు చరిత్రప్రసిద్ధములు. యూన్షికాయ మేధానం పదకూడ ప్రాచ్యులపరిపాలనా దక్షతను లోకమునకు వెల్లడిం చెను. కాని విదేశీయులు తమబలమును స్థాపించుకొనుటకై చేయు పన్నాగములకును, అంతఃకలహములకును, జనసామా న్యముయొక్క అజ్ఞానమునకును నిలయమైన ఈ చైనాదేశము లో సైనికబలముగల పక్షమునకే నిజమైన రాజ్యాధికారముం

డెను. మరియు ఉత్తరచైనా ప్రజలలో ప్రజాస్వామ్యపరమైన ప్రబోధము తక్కువ. పైగా యూన్షికాయి, సన్‌యతుసేనుని వంటి స్వచ్ఛమైన ప్రజాస్వామ్యవాది కాడు. నిరంకుశత్వ ప్రియుడై సన్యతుసేనుని "నిర్మాణవిధానమును" త్రోసిపుచ్చు చుండెను. అందుచే తిర్గి సంఘర్షణ బైలుదేరును. ఈస్థితిలో అనగా ౧౯౧౬వ సం॥ లో యూన్షికాయి చనిపోయెను. యూన్షికాయి అనంతరమందు తిరిగి దేశము సైన్యాధిపతుల రాజ్యములోనికి వచ్చినది. కాని ౧౯౧౯ సం॥ లో చైనా లోని యువకులు, విద్యార్థులు సనుయతుసేనుని ఉన్నతాశయ ప్రేరితులై నడపిన జాతీయోద్యమము, జపాను వస్తుబహిష్కా రోద్యమమున్ను చరిత్రప్రసిద్ధములు. ౧౯౨౧ సం॥ లో ప్రపంచ రాజ్యములు—జపానునహా—చైనాస్వాతంత్ర్యము నంగీకరించినవి. తొలుదొలుత క్యూమింగుటాంగు మహాసభ సామ్యవాదము నంగీకరింప సనుయతుసేను, ఇష్టపడలేదు. రషియా సహాయము సంప్రతింపుల ఫలితముగా సామ్యవాదమునకు క్యూమింగుటాంగు మహాసభలో ఆదరణకలిగెను. రషియా సహాయమువలన నూతన సైన్యమును రాజ్యవిధానమును వారు నిర్మించుచుండిరి. ఉత్తరభాగముకూడ క్యూమింగు టాంగున చేర్చుకొనుటకై రాయభారమునకు వెడలి సనుయత్తుసేను అచ్చట ౧౯౨౫ లో పరమపదించెను. ఈయన అవసానమునకు పూర్ణసామ్యవాదిగా మారెను. చైనా జాతీయదులువా (క్యూమింగుటాంగు మహాసభ) ౧౯౨౬ లో ప్రకటించిన

ప్రజాస్వామ్య రాజ్యాంగవిధానము ౧౯౩౧ సం॥లో జాతీయ ప్రజాప్రతినిధి సభవారిచే ఆమోదింపబడి నేటికిని అమలులో నున్నది. పిమ్మట యావత్తుదేశము క్వ్యామింగుటాంగు మహా సభ పాలనములోనికి వచ్చినది. కాని ౧౯౩౧ సం॥ తిరిగిచైనా జపాను యుద్ధమువచ్చి చైనాకు కేవల సైనికనాయకత్వము గతియయినది. అందులకే పూర్వము సమాజవారయినను సుముఖముగా నుండియు, ననయతుసేనని జాతీయకార్యక్రమ మును వేదముగా గౌరవించిన క్వ్యామింగుటాంగు మహాసభ విధానము, సదరు ఆశయముల మార్చుకొనవలసి వచ్చినది. నేటి భియాంగుకై షేక్ సేనాని హయాములో చైనజాతీయ ప్రజాస్వామ్యముగా మాత్రమున్నది.

<u>భారతదేశము.</u> ఐరోపా మహాసంగ్రామానంతరము భారతదేశమునకు జరిగిన పంజాబు కిలాపత్ అక్రమములు చరిత్రప్రసిద్ధములు. యుద్ధానంతరమున భారతజాతియొక్క రాచకీయస్వాతంత్ర్యము. అంగీకరింపబడునని తలపబడెను. కాని ౧౯౧౯ వ సం॥లో బ్రిటిషువారు ప్రసాదించిన సంస్కరణ ములు—"క్రమసోపానములపై బాధ్యతాయుత పరిపాలనము" నొసంగబడునని ఒక ప్రకటనయు (౧౯౧౭ సం॥) రాష్ట్రప్రభుత్వములో కొన్ని శాఖలను, ప్రజానిధులైన మంత్రుల పరముచేయుటయు, తప్ప—ఈ శాఖలైనను గవర్నరుగారి సంపూర్ణాధికారమునకులోబడి, మంత్రులు పాలించవలెను—భారతీయుల స్వయం నిర్ణయాధికారమును గుర్తించినవి కావు.

భారత జాతీయ మహాసభ దీనిపై అహింసాయుతమైన అసహాయోద్యమమును గాంధీమహాత్ముని నాయకత్వమున ౧౯౨౦ సం॥లో ప్రారంభించెను. సదరు ఉద్యమము దినదినము నూతనశక్తులను, తనలో నిముడ్చుకొని అనగా రాచకీయ స్వాతంత్ర్యపరముగానే కాక దేశముయొక్క సాంఘిక, ఆర్థిక, వైజ్ఞానిక మొదలైన జాతియొక్క సర్వతో ముఖ స్వాతంత్ర్య, శాంతి, సౌఖ్యపరమైన జాతీయోద్యమముగా అహింసాపద్ధతి మూలపీఠముగా దినదిన ప్రవర్ధమానమైయుండి నేడు యెట్టి ప్రతిరోధములకును లొంగనిప్రఫ్లా దశక్తితో విరాజిల్లుచున్నది. మఱియు ప్రపంచోద్యమముల లోని సర్వోన్నతభావములు, లక్ష్యములును కాంగ్రెసు జాతీయోద్యమములో నే డిమిడియున్నవి. దేశము వెలుపలిదేశములతో సమానత్వమున్ను; దేశము లోపలివ్యక్తుల మధ్య రాచకీయముగనే గాక, సాంఘిక, ఆర్థిక సమానత్వమున్ను కూడ "పూర్ణస్వరాజ్యము" యొక్క తాత్పర్యముగా కరాచీ కాంగ్రెసుమహాసభ నిర్వచించి, ౨౦ వ శతాబ్దపు ప్రపంచము "స్వాతంత్ర్యము" అనగా యేరీతి నర్థముచేసుకొనవలెనో దారి చూపినది. అమెరికను, ఫ్రెంచి స్వాతంత్ర్యోద్యమములు "స్వాతంత్ర్యము" యొక్క బహిర్ముఖమునే వీక్షించగల్గినవి. అంతర్ముఖదృష్టి తన కనుశ్రుతముగా వచ్చుచున్న భారత దేశపు కాంగ్రెసుమహాసభ ఇట్టి అంతర్ముఖదృష్టితో పూర్ణస్వారాజ్యమును నిర్వచించుట ఉచితమే. ఆదినుండియు మానవుఁడు,

సంఘములున్న తమ వ్యక్తిత్వస్థాపనకై యుపయోగించుట కలవాటుపడిన, కోట్లకొలంది సంవత్సరములనుండి అనుశ్రుతముగ వచ్చుచున్న, హింసాసాధనము, దాని సంస్కారముల స్థానే, అహింసను స్థాపనచేయుటకు యత్నించి అట్టి సిద్ధాంతముపై ౧౩ సంవత్సరములు రవి యస్తమింపని బ్రిటిషు సామ్రాజ్యవిధానములో సంఘర్షించిన యీ జాతీయోద్యమము మానవచరిత్రలో అపూర్వమైన దనుటకు సందియములేదు. ఆదిని తనఅఖండవిశ్వఐక్యరూపమైన ఉపనిషత్సందేశమువలన ప్రపంచములో గురుపీఠము నధిష్టించిన భారతవర్షము తన యీ నవీనోద్యమములో, లోకతారణ మార్గమునుకూడ చూపించుటకై ఉద్యమించుట సహజమే. ఇటులనుటవలన దేశములోని అన్ని పక్షములున్న గాంధిగారి సాధనయందు నమ్ముచున్నారని చెప్పుటకు వీలులేదు. ఈగాంధిగారి ఉద్యమముయొక్క భావిపరిణామమును కూడ యిప్పుడు తెలుపజాలము. ప్రస్తుతము బ్రిటిషు వారికిని భారత దేశీయులకును యెట్టి సమాధానము కుదురగలదను సూచనలు గానరావని తెలిపి యిక్కడ యీ యంశమును వదలుదము.

<u>మహమ్మదీయప్రజలు.</u> ఈజాతీయ ప్రజాస్వామ్యోద్యమము యెడారులలోనికికూడ ప్రాకినది. ౧౯౨౫ వ సంవత్సరములో అబ్దుల్ కరీం యొక్క నాయకత్వమున మొరాకోలోను సిరియాలోని డ్రూసులను (Druses) జాతులవారును, ఫ్రెంచి,

ప్రభుత్వముపై ఆత్మస్వాతంత్ర్యమునకు తిరుగుబాటు జేసిరి. ఆఫ్గనుస్థానము అమానుల్లాఖాను (౧౯౨౦——౨౮) రాజ్యములో నూతనజాతిగా మారినది. నవీనపద్ధతుల కనువగు రాజ్యాంగనిబంధన లేర్పడినవి. [1] ఈయన పూర్వపు అనాగరిక, మూఢాచారసమన్వితమైన కేవలము మతో[ద్]రేక ప్రేరితమై యుండిన ఆఫ్ఘను జాతిని రాచకీయ, ఆర్థిక, సాంఘికముగా సంస్కరించి మంచిదారిలో పెట్టెను. ఇందువలన దేశములోని నిరంకుశపు మతగురువులకును, ఆశియాఖండములోనిదైన ఆఫ్ఘను జాతీయాభ్యుదయమును సహింపజాలని పై ప్రభుత్వములకును కంటకముగా నుండెను. అమానుల్లాఖాను మతద్రోహియని దేశములో నొక విప్లవము బయలుదేరినందున దేశక్షేమముకోరి అమానుల్లాఖాను రాజ్యమును వీడవలసి వచ్చెను. తదనంతరము వచ్చిన నాదర్ ఖాన్ ప్రభుత్వముకూడ

1. నేటి ఆఫ్గను ప్రభుత్వము నిబంధనాబద్ధమైన రాజస్వామ్యము. జాతీయప్రతినిధులతో కూడిన ఒక శాసనసభ, యెన్నిక అధ్యక్షునిక్రింద పనిచేయును. ఈ సభాసభ్యులు ఆయా జిల్లాల నుండియు కొండతెగల నుండియు నియమింపబడుదురు (Selected). ఈసభ స్థిరమైనది. మంత్రివర్గము ఒకటి కలదు. దాని అధ్యక్షుఁడు ప్రధానమంత్రి. ఇదిగాక సుమారు ౪ సం॥ల కొకసారి యావత్తు ఆఫ్ఘను ప్రజలకు ప్రాతినిధ్యము వహించునని నమ్మబడు ఒక మహాసభ రాజుగారు సూచించు రాష్ట్రపు రాజనీతికి సంబంధించిన ముఖ్యవిషయముల యోచించుటకై సమావేశమగుచుండును.

అమానుల్లా విధముగనే అమలు జరుపుచున్నది. ఇటీవల నాదర్ ఖాన్ హత్యానంతరము ఆఫ్ఘనిస్థానపు భవిష్యత్తు యెట్లుండునో తెలియదు.

స్పెయిన్. ౧౯౩౧ వ సం॥లో స్పెయిను దేశములో విప్లవము జరిగి రాజస్వామ్యము రద్దుచేయబడి ప్రజాస్వామ్యము స్థాపింపబడినది.

బ్రిటిషు అధినివేశనములు వాస్తవముగా బ్రిటిషు రాజ్యాధిపత్యమునుండి తొలగిన సంపూర్ణబహిరంగ రాజ్యాధికారము గలవి యగుట.

౧౯౩౧ వ సం॥లో బ్రిటిషుసామ్రాజ్యము నూతనపరిణామము నొందినది. ఆధునిక కాలమునకు సామ్రాట్టులు, సామ్రాజ్యములు రుచించవని బ్రిటిషు రాచకీయవేత్తలు తెలిసికొనిరి. అందుచే నిదివరలో బ్రిటిషుసామ్రాజ్యముక్రింది ప్రతి దేశము యొక్క పరిపాలనయును, బ్రిటిషు పార్లమెంటునకు నామమాత్రముగానైన జవాబుదారీ వహించవలసి యుండెను. ఇప్పుడు అనగా రాష్ట్రమునకు వెలుపలి వ్యవహారములలోకూడ తమకు స్వతంత్రత కావలెనని (అట్టి స్వాతంత్ర్యము ఆయాసందర్భములలో తాము యిదివరలో ననుభవించుచున్న దానిని సిద్ధాంతములో నంగీకరించవలెనని) కెనడా, ఆస్ట్రేలియా మున్నగు అధినివేశముల యుద్ధానంతరపు ఆందోళనాఫలితముగా యీ బ్రిటిషుసామ్రాజ్యమను

నామమును తొలగించి "కామన్‌వెల్తు" అను నామమును పెట్టిరి. యిదివఱలో నుండిన కేంద్రాధికారము బ్రిటిషుపార్లమెంటునుండి తొలగించబడెను.[1] ఈకేంద్రాధికారముస్థానే కేంద్రగౌరవస్థానము ఒకటి రచింపబడెను. అదెవరనిన సర్వపక్షములకు అతీతుఁడై సర్వ అధినివేశములవారికిని సమాన మాననీయుఁడైన బ్రిటిషు రాజుగారే. ఈరాజుగారు అధినివేశనములతో వాస్తవములో నెట్టి ప్రసక్తియును పెట్టుకొనరను సాంప్రదాయము పైననే ఈసూత్రము యేర్పడినది. యీ నూతన సిద్ధాంతముపైన సూర్యుఁడు మధ్య గలిఁగి చుట్టును తిరుగు గ్రహసమ్మేళనముపలె సిద్ధాంతములో బ్రిటీషురాజుగారి యందలి భక్తి బంధనమునకు మాత్రము లోబడి; బ్రిటిషు పార్లమెంటుసహా యెవరంతటివారు సమానప్రతిపత్తితో సంపూర్ణ స్వతంత్రరాష్ట్రములుగా నుండే మండలమన్న మాట ఈ కామన్‌వెల్తు. ఈరీతిని కెనడా, న్యూజిలండు, ఆస్ట్రేలియా, దక్షిణ ఆఫ్రికా మున్నగు అధినివేశనములు పార్లమెంటునుండి విడిపోయినవి. దీనినే నేడు అధినివేశన ప్రతిపత్తి (Dominion status) అనెదరు. కాని యీ నవీన

1. ౧౯౨౬—౧౯30 సంవత్సరపు సామ్రాజ్య మహాసభలలో యిందును గూర్చి తీర్మానరూపకముగా అంగీకరించబడెను. పిమ్మట ౧౯౩౧ సం॥ ౧౨వ సెంబరు పార్లమెంటు చట్టముగా నిది అంగీకరించబడెను. దీనిని వెస్టుమినిష్టరు చట్టము (Statute of West minister) అని కూడ పిలచెదరు.

విధానములో కూడ భారతదేశ పరిపాలన పార్లమెంటు బాధ్యతకే లోబడినదై హోదాలోనైనా మెట్టిమార్పును (నానాజాతులసభకు బ్రిటిషు యిండియన్ ప్రభుత్వనియమితుఁడైన ఒక వ్యక్తి భారతప్రతినిధి అను పేరుతో పోవుట వర్తక సంధిపత్రములలో ప్రభుత్వనియమితుడు భారతప్రతినిధిగా సంతకముపెట్టుట తప్ప) గల్గిఉండదు. ఇఁక యిట్టి నిబంధనము కూడ నిర్బంధముఁగా నుండరాదనియు, కామన్‌వెల్తు అనగా "ఇష్టము వచ్చినంతకాలము బ్రిటిషురాజ్యసమ్మేళనములో యుండు (Severance at will) స్వతంత్రరాష్ట్రముల కలయిక" అని నూతన నిర్వచనము చేయవలెననే భారతజాతీయ మహాసభయొక్క ఆశయమున్నూ, ఐర్లండు ప్రభుత్వము డివేలరా నాయకత్వమున బ్రిటిషు రాజ్యమునుండి సంపూర్ణ స్వేచ్ఛకొఱకై చేయుచున్న కృషియొక్క భావమున్ను కొంత వఱకొకటై యున్నవి.

౧౯౩౮ వ సం॥రం మార్చి నెల పత్రికలనుబట్టి దక్షిణాఫ్రికాకూడ "హార్టుజాగ్" ప్రధానత్వముక్రింద యిట్టియుద్యమమును లేవదీయుచున్నటుల తెలియుచున్నది.

ఈ యుద్ధానంతరము పై విధముగా జాతీయప్రచారము, ప్రజాస్వామ్యవిప్లవములు,—వీనివలన రాజస్వామ్యములు, ప్రజాస్వామ్యములుగా మారిపోవుట; నూతనప్రజాస్వామ్యములు నిర్మింపబడుట; యేదోయొక ఖండమునందేగాక ప్రపంచమందంతటను జరిగెను. ఇట్టి ఉద్యమములేని దేశమే నేడులేదు.

ఇటీవల గతశతాబ్దములో ప్రజాస్వామ్యములు స్థాపింపబడిన దేశములలో యుద్ధానంతరము యెన్నికహక్కులు అధికమై కార్యము చేయబడెను. స్త్రీలకుకూడ యెన్నికహక్కులు (శాసనసభలకు అభ్యర్థులుగా నిలువబడుహక్కు) యిచ్చుట పురుషులకు తప్పినదికాదు. ప్రజాస్వామ్యముయొక్క నిజమైనయర్థములో స్త్రీయొక్క సమానస్వాతంత్ర్యమును స్త్రీయుద్యమముల ఆందోళనాఫలితముగాను ధర్మదృష్టిలోను రాచకీయజ్ఞులు అంగీకరించవలసివచ్చినది. కాని ఫ్రాన్సువంటి ప్రజాస్వామ్యములలోను, దక్షిణాఫ్రికావంటి అధినివేశనములలో, యింకను స్త్రీలకు యెన్నికహక్కురాలేదు. ఇంచుమించు యూరపుఖండములోని పూర్వప్రజాస్వామ్యలన్నిటిలోను వయసువచ్చిన పురుషులకు యేమాత్రిమువన్నను ప్రభుత్వమునకు పరోక్షముగా గాని ప్రత్యక్షముగా గాని యిచ్చినను, వోటింగుహక్కు లభించునట్లు యుద్ధానంతరము ప్రతిదేశములోను శాసనములు చేయబడినవి. అందుచే పూర్వముండిన లక్షలనుండి వోటర్ల సంఖ్య కోట్లుగా పెరిగెను.

ఇందువలన కార్మికులకు వోటింగుబలము హెచ్చెను. ఇదివరలోనే ప్రతిదేశములోను మార్క్సుమతమునకు సంబంధించిన రెండుపక్షములు—సంఘస్వామ్యవాదులు, సమాజవాదులు తదితర సమష్టివాదులు, వీరిలో యేదోయొకపక్షము యూరపులోని ప్రతిదేశములోను యుండెను. రష్యాదేశము "సమాజవాదపద్ధతి"ని నూతనజాతిగా బయలుదేరుట కుద్య

మించినంతటనే, తత్పద్ధతిని తహతమ జాతులను పునర్నిర్మాణము చేయవలెనను "సమాజవాద" పక్షములుకూడ ఆయాదేశములలో బయలుదేరెను. అందుచే నేఁడుప్రతి దేశములోను, పూర్వపు కన్సర్వేటివు, లిబరలు, రాయలిస్టు, క్యాథలిక్, రిపబ్లికను పక్షములతో బాటు సంఘస్వామ్యపక్షము సమాజపక్షము (కొన్ని చోట్ల సిండికాలిస్టుపక్షము, శ్రేణీస్వామ్యపక్షముకూడ గలవు) కూడ రాచకీయములలో ప్రాముఖ్యతను గడించినవి. వీరి సహకారములేనిది ప్రభుత్వములు నడుచుటకష్టముగా నుండెను. ఇఁకముందు ముఖ్యముగా యూరపుఖండములోను, అమెరికాలోను, ఐరోపాసంగ్రామ పూర్వపుపక్షములు పోవునట్లు కనుపించుచున్నవి. ఇఁకముందు రాజ్యాధికారమునకై పెనుగులాట "సత్తా" జాతీయతావీతముపై సాంఘికరాష్ట్రస్వామ్యమును (State socialism) స్థాపించదలచిన వారికిని, జాతీయతావివర్జితమైన కేవల "సమాజ" వాదుల (Communists) కు మాత్రమే యుండునట్లు కనుపించుచున్నది.

నానాజాతిసమితి. యుద్ధానంతరము ప్రసిడెంటు విల్సనుగారి సూచనలప్రకార మేర్పడిన నానాజాతిసమితి ప్రపంచ శాంతిని కాపాడుననియు, ప్రపంచదృష్ట్యాఆర్థిక, సాంఘిక, రాచకీయాది సమస్యలను పరిష్కరించగలదనియు మొదటిలో కొందఱు అత్యుత్సాహపడిరి. కాని మొదటినుండియు, యిందులో రష్యాదేశము చేరనేలేదు. జర్మనీ, ఆస్ట్రియాలు పరా

జిత దేశములకుండు తక్కువహోదాలోనే యందు జేర్చుకొన బడెను. ఇఁక ముందుసభ్యులుగా నుండిన ప్రబల రాష్ట్రముల వారైన బ్రిటన్ (అధినివేశములు సహా) ఫ్రాన్సు, అమెరికా, జపానుమున్నగువారు తాము యిప్పటికి సంపాదించిన రాజ్యములు, చెలాయించుచున్న హక్కులు, అనుభవించుచున్న అవకాశములనుగూర్చి యీ సంఘమువారు జోక్యము కలుఁగ జేసికొనని పద్ధతినే సభ్యులుగా నుండిరి. ఈ సంఘముయొక్క వ్యవహారములుకూడ అటులే జరుగుచుండెను. ఈ సంఘముల వారు ముందు యుద్ధములు రాకుండ ప్రపంచశాంతిని కాపాడుటయందే దీక్షితులగుటకు మారుగా వర్సెలీస్ సంధిక్రింద చేయబడిన దేశ, జాతి విభాగముల నిల్పుట, ఆ సంధిప్రకారము పరాజితజాతులపై విధింపబడిన ఆర్థికభారము (Reparation) ను అనుసరించి అమలుదారులుగా నుండి కృషినల్పుట,—కైసరువంటి పండితుఁడు జర్మనీమున్నగు దేశములపై విధింపబడిన విపరీతపు అర్థభారము వలననే ప్రస్తుతఆర్థికదుస్థితి లోకమునకు గల్గెనని తెలుపుచున్నప్పుడు—హర్షింపబడుట లేదు. ఇతరరాష్ట్రములు సంధిషరతులప్రకార మివ్వ వలసిన ఋణములను, పరిహారములనుగూర్చి రొక్కించుచున్న ఫ్రాన్సు, ఇంగ్లండువంటి దేశములు తాము అమెరికాకు యివ్వ వలసిన ఋణములనుగూర్చి చాటువేయుటకై యత్నించుచుం

డిరి.[1] కొన్ని దేశములు ఆయుధములను చేయకుండునట్లును. సేనలను తయారుచేయకుండునట్లును, కావలాలుకాయుచున్న మఱికొన్ని రాష్ట్రములవారు తమకృషిని మాత్రము మానలేదు. ఈవిధముగా నానాజాతి సంఘసభ్యులలోగల ధర్మభావము పోయెను. ౧౯౩౨ సం॥ లో చైనాకును, జపానుకునుగల తగా

---

1. తాము యుద్ధములో యింగ్లండు, ఫ్రాన్సుమున్నగువారికి పెట్టిన ఋణములు తమకు చేరనేరవను నిరుత్సాహములో యున్న అమెరికను ప్రజలకు బెర్నార్డుషా ఒక విధముగా చక్కని ప్రతిఫలపూర్వకమైన మనఃశాంతిని బోధించినాడు. దాని సారాంశమిది. "అమెరికనులు స్వార్థపరులుకారు. వారిదృష్టి లోకమంత వైశాల్యమైనది. నేడు మీరు మిత్రమండలికి పెట్టిన కోట్లకొలది పౌనుల పెట్టుబడి తిరిగి నగదు రూపకముగా మీకు చేరకపోవచ్చును. కాని దానికి ప్రతిఫలము, మీకున్ను, ప్రపంచమునకున్ను ముట్టనే ముట్టినది. మీ ధనంతో చేసినయుద్ధము వలన అనేకరాజస్వామ్యములు ప్రజాస్వామ్యములక్రింద మారినవి. కేవల సామ్రాజ్యకాంక్షగలిగి ప్రపంచశాంతికి భంగకరమైన జర్మని, రష్యాసామ్రాజ్యపతనముతో లోకమునకున్నూ, మీకున్నూ గుండె గూటపడినది. రష్యాలో నూతనపద్ధతిని సంఘనిర్మాణం లోకమున కాశ్చర్యము గల్గునటుల జరుగుచున్నవి. మీడబ్బుతో జరిగినయుద్ధములో రష్యాసామ్రాజ్యము పతనమైనది. మీ యింజనీరుల సహాయమువలన రష్యాసంఘస్వామ్యము, దానిక్రింద పంచవర్ష విధానం (Five year Plan) అమలుజరిగినది. యింతకంటె మీకుసంతృప్తికరమైన ప్రతిఫలం దేమి కలదు!"(చూ. (Political Mad House in America and nearer home by G. B. S. 1933 E. om)

దానుగూర్చి తాము యోచించెదమనియు, చైనాపై దాడి వెడలవలదనియు నానాజాతి సమితివారు చేసినతీర్మానమును తిరస్కరించి జపాను చైనాపైకి యుద్ధమునకు పోయినపుడు చివరకు జపాను తన సభ్యత్వమునకుకూడ రాజీనామా నిచ్చి నపుడు నానాజాతియొక్క అసమర్థత పూర్తిగా వెల్లడయ్యెను. ఇటీవల జర్మనీదేశముకూడ తన సభ్యత్వమును చాలించు కొనెను. ఇటలీదేశము తనచేతులలో నానాజాతి సంఘపతనమును చేయరాదను సానుభూతితో మాత్రమే తన సభ్యతను వదలలేదనియు, యీసమితి క్రమముగా కొలఁదికాలములో అంతరించకతప్పదనియు తెలిపెను. ఇట్లనుటవలన యీరాష్ట్రములు ప్రపంచశాంతిని యెంతమాత్రమును కోరుటలేదని మనము తలఁపరాదు. తమ స్వాధికారములను ప్రపంచశాంతికై మూల్యముగా నర్పించగల దారుఢ్యము, తమ దేశమును తలఁచుకొన్నప్పుడు వచ్చు ఆవేశము, యీసమితి రక్షణకై యించుకయు యీ రాష్ట్రములందు కలుగకపోవుటయే దీనికి కారణము.

కాని యీనానాజాతి సంఘస్థాపన మానవుని రాచకీయ పరిణామములో అత్యున్నతదశను సూచించుచున్నది. ఆదిని కుటుంబయజమాని పాలకవర్గమను ఇరుకుగదిలో సామాజిక జీవనమును ప్రారంభించిన మానవుఁడు నేఁడు విశ్వసమాజవు సంఘముక్రింద పౌరుఁడు కాబోవుననే భావం—సంకుచిత మమత్వమును హిమాలయ పథానికి లేవనెత్తిన ఆవిశ్వ

మమకారభావము—నానాజాతిసంఘమును తలుచుకుంటే గలుగును. ఇది యెంత భ్రష్టమైనను, దాని నిరంతరస్మరణ విశ్వమానవుల కలయికకు సహకారి. అయితేవ్యక్తిని యెక్కడికక్కడ సంఘాలక్రిందను, నిబంధనాబద్ధునిగను చేయుటవలననే ఈ అస్వాభావికపు స్థితినుండి తప్పించుకొనుటకు ప్రకృతిచేయు కృషిఫలితముగా శాంతికిబదులు సంఘర్షణలే అధికమగుచున్నవని ఇంగ్లండులో రైకార్డో నాటినుండియు నేడు భారతదేశంలో జిడ్డు కృష్ణమూర్తి వఱకును ఈ ప్రపంచసమితి ఉద్యమమునకు పూర్వపక్షీయులు గలరు.

<u>అంతర్జాతీయ కార్మికసమితి</u>:—౧౯౧౯ వ సంవత్సరము వెర్సైలీసు సంధియొక్క ౧౩ వ భాగములోని నిబంధనక్రింద "లోకన్యాయమును, శాంతికొఱకు" అంతర్జాతీయ కార్మికసమితి యేర్పడెను. "పాటు "అనునది కేవలము డబ్బుతోకొనెడు వర్తకపుసరుకువంటిదిగా చూడబడరాదను ఉదారసూత్రము నీసమితి అంగీకరించినమాట వాస్తవమే. దీనియందలి స్థానములు ప్రతిరాష్ట్రములోను ప్రభుత్వ నియామకముల వలన సగమున్ను, సదరురాష్ట్రములోని కార్మిక, వర్తకసంఘముల వలన సగమున్ను పూర్తిచేయబడును. నానాజాతిసమితి సభ్యులకు అప్రయత్నముగానే ఇందుస్థానముగలదు. కాని నానాజాతిసమితిలో సభ్యతలేని రాష్ట్రములవారినికూడ చేర్చుకొనుటకు వారి కధికారముగలదు. నానాజాతిసమితిలోవలె జాతుల రాచ

కీయ ప్రాధాన్యతనుబట్టిగాక, దేశముయొక్క పారిశ్రామిక ప్రాధాన్యతనుబట్టియే ఇచ్చట స్థానములు ఏర్పాటుచేయ బడును. ఈ సంఘము వారికిన్ని, జాతిసమితికిని నిబంధనాబద్ధ మైన సంబంధము (Constitutional relationship) కలదు. వీరును నానాజాతిసమితివలెనే క్రియలో చేయగల్గిన దేమియు లేనప్పటికి అంతర్జాతీయముగ కొన్ని సమానాశ యముల వ్యాప్తి చేయగలిగిరి.

వారి యాజమాన్యమున వాషింగ్టన్‌లో జరిగిన సభలో (౧౯౧౯) కార్మికులకు ౪౮ గంటల వారము నేర్పాటుచేయు టకు అచ్చట వర్తక, కార్మిక ప్రతినిధు లంగీకరించిరి. దానిని పారిశ్రామికముగా అంత ప్రాముఖ్యతనొందని ౫ చిన్నరాష్ట్ర ములు తప్ప తదితరములు మన్నించలేదు. (Ratifications). ఆయుధము తగ్గింపు సమస్యవలెనే "ఒకరు చేసిన మేమున్న చేసెదమని" ఇక్కడను చెప్పుదురు. ముందుగా ఒక పారిశ్రామిక దేశము గంటల తగ్గించినచో తగ్గించని దేశములవారు ఈ అవ కాశమును పుచ్చుకొని తమ సరకులను తగ్గించిన వారికంటె చౌకగా అమ్మి లాభమును పొంది తమకు నష్టమును కలుగ జేయుదురని వీరి భయము. అన్యోన్యపోటీపైన ఆధారపడిన ప్రస్తుత పారిశ్రామికవిధానము మారుట అవసరము.

కాని ఈ అంతర్జాతీయ సమితి కార్మికోద్యమమును ప్రచారము చేయుటకు కొంత ఉపకరించినది.

ఆర్థికదుస్థితి:—యుద్ధానంతరము యుద్ధములో పాల్గొనిన దేశములు ఆర్థికముగ చాలదెబ్బలు తినినవి. జాతీయ ఋణములు విపరీతముగ పెరిగిపోయినవి. పరాజిత దేశములపై మిత్రమండలివారు విధించిన మహాభారవంతములైన అపరాధములు (Reparations) ఉభయ దేశముల ఆర్థిక జీవితమును దుస్థితిలోనికి తెచ్చినది [1] పరిశ్రమలు నశించినవి. అందుచే ప్రతిదేశము తన అర్థ్వాస్థానమునకై తిరిగి పారిశ్రామికోద్యమము ప్రారంభించెను సోవియట్ రష్యాయొక్క పంచవర్ష విధానముక్రింద పంటలు, పరిశ్రమలు అధికముగా తయారు చేయబడినవి. తదితర దేశములలో యీవిధానము వ్యక్తుల పెట్టుబడిపై జరుగుటచేతను యేక కాలమున యుద్ధపుప్రోత్సాహములో పడిపోయిన దేశములన్నియు, యేక కాలముననే తిరిగి పారిశ్రామికోద్యమమును ప్రారంభించుట వలనను, సరకు ప్రియమగుటవలననే సాహుకారుల లాభములు హెచ్చుట అనేది ప్రస్తుతము పెట్టుబడి విధానపుమూలసూత్ర మగుటవలనను, యుద్ధమునకు పూర్వము పాశ్చాత్య రాష్ట్రముల పరిశ్రమల

1. ఇందలి వివరములు తెలుసుకొనదలచినవారు కైన్సుపండితుని Economic Consequences of the peace అను గ్రంథమునున్ను, జనసామాన్యమునకు తెల్లముగానుండునట్టు తెలిపిన బెర్నార్డుషాగారి Political Mad house in America and nearer home 1933 అను ఉపన్యాసము చూడతగినది.

నుపయోగించు దేశములు తమదేశములలోనే యట్టి పరిశ్రమ
లను కొంతవఱకు స్థాపించుకొనుటవలనను, మొత్తముమీాద
ప్రపంచములోని ప్రస్తుత ఆర్థికదుస్థితివలన ప్రజలకు పదార్థ
ముల కొనుగోలు శక్తి తగ్గిపోయినందునను, పరిశ్రమల విక్ర
యమే ప్రధానోపాదిగాగల దేశములకు "అధికోత్పత్తిదో
షము" (Over production) పట్టినది. నిజముగా జనసామా
న్యదృష్టిలోనిది అధికోత్పత్తికాదు. ఈ పరిశ్రమలకు యజమా
నులైన సాహుకార్ల లాభములు తగ్గిపోవుట, వీరిలోవీరికి ఒకరి
కంటె నొకరు చౌకగా నమ్మవలెనను పోటీ; పూర్వమువలె
విదేశపు అంగడులలో ఈసరకులు అమ్మకము కాకపోవుట,
యేకకాలమున ఒకేరకపు సరకులను ఒకరాష్ట్రములోని పెట్టు
బడీదారులు—జపానువలె—అత్యధికముగా, అతిచౌకధరలకు
తయారుచేయుట, అను ఆయారాష్ట్రములలోని జాతీయాచ్ఛా
దనము క్రింద కృషిసలుపుచున్న వ్యక్తి పెట్టుబడిదారులైన
పారిశ్రామిక యజమానుల దృష్టిలోనే యిది అధికోత్పత్తి
యగుచున్నది. ఈ దోషనివారణకై వీరు ప్రపంచ ఆర్థికసమా
వేశములను పెద్దపేరుతో అనేకసభలను (ఇక్కడ కూడ యీ
పేరుతో యేరాష్ట్రమువారు, ఆరాష్ట్రపు పారిశ్రామికులకు
లాభము కలుగ జేయవలయుననియే) చేయుచున్నను యీ
సమస్యగాని, యీధరలు పడిపోవుట, ప్రస్తుత ఆర్థికమాంద్య
ము (Slump) యెంతమాత్రము అనుకూల మార్పులను పొం
దలేదు. తమ లాభములు తగ్గినవను కారణమున యీపెట్టు

బడిదారులు పందకొలఁది సంవత్సరములనుండి యీయంత్ర ముల నాశ్రయించుకొని యంత్రమయ జీవనులైన కోట్లకొలది కార్మికులను పనినుండి తగ్గించియు, జీతములు తగ్గించియు నికృష్టులను చేయుచున్నారు. ఇందువలన మూఁడువంతులు కార్మికులతో కూడినయీనవీన ప్రజాస్వామ్యములలో అధిక సంక్షోభము కలుఁగుచున్నది. ఈస్థితినుండి కోలుకొనుటకై ప్రభుత్వములు కొంతకృషి సలుపుచున్నను, వాని జయమునుగూర్చి యిప్పుడు యెట్టియూహను చేయజాలము. దేశపు ఆర్థిక సభ్యతమారవలెననియు, వ్యక్తిపెట్టుబడి పద్ధతిలో దేశముయొక్క యావత్తు ఆర్థికజీవితము కొందఱి చేతులలో నుండునుగాన యీవిధానము యేదోవిధముగా వైకల్యము నొందవలెననియు, అంతవఱకున్ను జనసామాన్యమైన కార్మికుల ప్రస్తుత దుస్థితి తొలఁగదనియు సాంఘిక రాష్ట్రస్వామ్యవాదులేగాక తద్వ్యతిరేకపక్షము వారుకూడ నేఁడు నమ్ముచున్నారు. అమెరికాలోని "నేషనల్ రికవరీ" ఉద్యమము యిందులకే నేఁడు కృషిసలుపుచు—ఇందువలన అధ్యక్షునికి రాజ్యాంగ విధాన మొప్పని కొన్ని అవకాశములు అమెరికా యివ్వక తప్పినది

1. ఒక్క యూరపుఖండములోనే ౧౯౨౮ సం॥లో వృత్తిపోయిన జనులు 33 లక్షలనుండి ౧౯33 వ సంవత్సరములో ౧ కోటి 3౬ లక్షలకు పెరిగిరి.

కాదు.[1] అందులకై ప్రస్తుత ప్రజాస్వామ్య విధానములను కూడ రాష్ట్రము ఆర్థికాభివృద్ధికరములగు కార్యములందు, ప్రవేసించునట్లు మారవలెనను చున్నారు. ప్రభుత్వము పూర్వము వలె దూరమునుండి విధినిషేధ పూర్వకమైన శాసనములు చేయుటతో మాత్రము తృప్తిపడరాదు. తానే స్వయముగా కొంతవఱకు జాతీయక్షేమమునకై ప్రవర్తిల్లునట్టి నూతన విధానముగా నేడు—వందలకొలఁది సంవత్సరములనుండి క్రమ పరిణామమును పొందుచు, పార్టీసాంప్రదాయముపై ప్రధానముగా నాధారపడిన బ్రిటిషు పార్లమెంటు విధానమునే—మార్చ నుద్యమించబడుచున్నప్పుడు తదితర ప్రజాస్వామ్యముల మాట చెప్పనవసరములేదు.

1. సర్ ఆస్వాల్డు మాస్లేవంటి విఖ్యాతనాయకుఁడు ఫాసిష్టుపద్ధతిని పార్లమెంటును మార్చవలెననుచున్నాఁడు. స్టాఫర్డుగ్రిప్సు (Sir Stafford Grips) అను నాయన పార్లమెంటుసభ కేవల వాగ్వాదములతో గడుపు సభగా నుండుట, యావత్తు రాజ్యాధికారము మంత్రులు క్రియలో చెలాయించుట, ఇఁక కుదరదనియు దేశముయొక్క ఆర్థికాభివృద్ధికై ప్రభుత్వము తన శక్తినంతయు కేంద్రీకరించవలెననియు, అప్పుడు త్వరితముగా ప్రభుత్వము ఉత్తరువులనిచ్చుట, అమలుజరుపుట అవసరమగుననియు, యీపక్షములో మంత్రులు నిజముగా శాఖల అనుభవముగల వ్యవహర్తలు (Directors) కావలెననియు అప్పుడు వీరికి వారి వారి శాఖాపరిపాలనలో యిప్పటికంటెను హెచ్చు అధికారము నివ్వవలెననియు, యీ అధికారము దుర్వినియోగము కాకుండునట్లు చూచుటకై ప్రజాప్రతినిధులైన పార్ల

ఈవిధముగా సామ్య వాదనకు, అనుకూల ప్రతికూల దేశములందుకూడ, ధర్మక్షేత్రము రాచకీయము నుండి

---

మెంటుసభ్యులు ఒక్కొక్క శాఖకు ఒకొక్క కమిటీచొప్పున విభాగమై, కేవలము శాసనకర్తలుగానే కాక కార్యనిర్వాహకులుగా కూడ పనిచేయవలెనని సూచించెను. ప్రస్తుతము పార్లమెంటులో ముఖ్యనాయకులు కొందఱు పాలుపుచ్చుకొనుటయు, మిగతా చాలమంది సభ్యులు తమ ఆహ్వాన విసర్జనలేక వెనుకబెంచీలలో నిద్రించుటయు జరుగుచున్నది. వారి ప్రాతినిధ్యము సద్వినియోగము కాకపోవుటయు వారిశక్తి సమర్థతలకు యెట్టి అవకాశము లేకపోవుటయు కూడ తటస్థించినది. ఇట్టిదోషముకూడ యిందువలన నివారించును. ఈ సూచనలు తీవ్రముగా యోచింపదగినవని మామతము (Sir Stafford Grip's article in the Spectator reproduced by the Indian Express dated ౧౬-౧౨-౧౯౩౩) ఇక సుప్రసిద్ధ కన్సర్వేటివు నాయకుఁడైన చర్చిలుగారు కూడ పైఅంశములను అనగా ప్రస్తుతపద్ధతి మారవలెనని నంగీకరించియే యున్నారు. (చూ. ది ౨౨-౮-౩౮ గల యిండియన్ యక్స్‌ప్రెస్సులోని చర్చిలుగారి వ్యాసమున కనువాదము) ఇటులే మిల్లునాటి వ్యక్తి వాదనలను, నవీనపరిస్థితుల కెటుల వర్తింపచేయవలెనో, తెలుపుటకుగాను వ్యక్తివాదులైన, గ్రాహమువాలా, నార్మనుయేంజల్సుగార్లున్నూ, సిడ్నీవెబ్బుగారున్నూ కూడ పార్లమెంటరీ విధానపు సంస్కారమును సూచించియున్నారు. ఈవిధముగా ప్రస్తుతపార్లమెంటరీ విధానము లోపభూయిష్టమైనదని దానికి పుట్టినిల్లైన ఇంగ్లండులోనే భిన్నపక్షములే కాక భిన్నతత్వముల వారుకూడ అంగీకరింపుచున్నారు. (అనగా వ్యష్టివాదులు సమిష్టివాదులు.)

"ఆర్థికమునకు" మారినది. ప్రజాసామాన్యముయొక్క ఆర్థికోద్ధరణమూలముగా నేఁడు లోకమున ధర్మసంస్థాపన కావలసియున్నది. అందుచే ఆర్థికపరిస్థితితో రాచకీయమును సమన్వయించవలసిన కాలముగాని పూర్వమువలె "రాచకీయ"మున "ప్రజాకేంద్రము" నేఁడు లేదు (Centre of gravity). వెంటనే ప్రాతరాజ్యాంగములు క్రొత్త పరిస్థితులకు కుదురక, మథనము ప్రారంభమైనది. ఇదియే నేఁడు ప్రతి దేశములోని "రాజ్యాంగము"న్నూ భూకంపముకంటె అధిక తీవ్రముగా కంపించుటకు కారణము. కొన్ని దేశములలో ప్రాతవి మారిపోవుట, సర్వాధికారములు, సమాజవాద పరరాష్ట్రములు (Communist states) యేర్పడుట, అమెరికాకు ఆర్థిక పరిశోధనలు జరుగుట,[1]

1. నేటి పారిశ్రామిక యుగములో ముఖ్యముగా యూరపు అమెరికాలోని అధికసంఖ్యాకులైన పౌరులు కార్మికులు. పొలములో గానిండు, యంత్రములో గానిండు, యిందలి పరిశ్రమలకు యజమానులు వ్యక్తులు. కార్మికులైన తమ సోదరదేశీయులకు వీరు ఒక చేతితో ఇచ్చు కూలిడబ్బులను, వారి పాటుతోనే తయారైన, వారి జీవితావసరములకు యీ షాహుకారులే క్రయకర్తలు గావున మరియొక చేతితో లాగుకొనుచున్నారు. ఈవ్యక్తి పెట్టుబడి విధానయుత పారిశ్రామికోద్యమము పెరుగుచున్నకొలదియు, జాతీయైశ్వర్యమంతయు షాహుకారువద్ద అత్యధికముగా పేరుకొనుచుండును. ఈదశలో రాష్ట్రము షాహుకారు స్థానమును ఆక్రమించక (State Capitalism) తప్పనిసరి యగు

ఫ్రాన్సువలె రోజు, రోజు ప్రభుత్వములు తారుమారగుట

చున్నది. అందుచే వ్యక్తి పెట్టుబడి విధానము రాష్ట్రి స్వామ్యముక్రింద పరిణమించక తప్పదు.

రెండవసిద్ధాంతము. శాస్త్రజ్ఞానము. పారిశ్రామిక సంస్థల పరిపాలనానుభవము కర్మకౌశలము (Skilled labour) వృద్ధియయిన అమెరికావంటి దేశములో పదార్థము మొదటినుండి చివరవరకు కార్మికుని పాటువలననే నేడు తయారై విడుదల కూడ అగుచున్నది. ధనము అంత ప్రియమైనది కాదు. ప్రాముఖ్యమైనదియు కాదు నేడు. అందుచే మార్క్సు రోజులలో ఆయన ప్రతిపాదించిన కర్మమూల్యసిద్ధాంతమున్ను, సరకు యొక్క కిట్టుబాటునకు పైనవచ్చే లాభాల స్వభావము (Labour theory of Surplus Value) ను గూర్చి ఆయనచేసిన సిద్ధాంతమున్నూ వింతగా కన్పట్టినను నేడు యీ క్రింది కారణములవలన ఆసిద్ధాంతము అంత విడ్డూర్యమైనది కాదు, అని మఱియొక పక్షమువారి సమర్ధన. నేడు పెట్టుబడి ధనమనేది పూర్వమంతప్రియమైనది కాదు. నేడు పెట్టుబడి అనగా చక్రము త్రిప్పేవాడు మొదలు మానేజరు వఱకుగల—కార్మికుల ? సనిష్టిపాటు.

అని అర్థము చెప్పుకొనవలెను. పూర్వమువలె పెట్టుబడి దారునిబుద్ధి ప్రతిభ సహాయం కర్మాగారముకు అవసరము లేకుండగనే సరుకు ఉత్పత్తి మొదలు దాని విడుదలవరకును కర్మాగార వర్గమువారే అతినైపుణ్యము, శాస్త్రజ్ఞానము తోచేయగలుచున్నారు. అందుచే పైన తెలుపబడిన షాహుకారు పెట్టుబడికి పైబడిన సరుకుయొక్క మూల్యంలో (Surplus value) చాలభాగము కార్మికులకు చెందదగిన్ని, చెందకుండా ఉన్నదని మార్పు కోరేవారి వాదము. కనుక యీ కాస్త పెట్టుబడి రాష్ట్రి మీపెట్టే, సంఘీయుల పాటువలన లభించిన ఈ అమ్మకం

తటస్థించుచున్నది. సాంప్రదాయములనిన అచంచలభక్తి

---

ధరలో తగులుబడిమూల్యంపోను మిగిలినది (Surplus Values) రాష్ట్రీయ సంఘీయుల క్షేమమునకై యేల వినియోగింపరాదు? అను ప్రశ్నాబలము మీద ఆధారపడెదరు! రాష్ట్రిస్వామ్యవాదులు.

పైవిధముగా బుద్ధివికాసమును పొందిన కార్మికుడు, రాచకీయముగా హోదాను పొందిన కార్మికుడు, ఇకను పూర్వశతాబ్దములోవలె వ్యక్తి నిబంధనలకు లోబడి పనిచేయుటకంటె రాష్ట్రిపాలనక్రింద కర్మాగారములో జీవనమునే కోరుచుండును. ఇక్కడ అతనికి వ్యక్తి దాస్యముండదు. రాష్ట్రాధిపత్యము అతనిపై నున్నను రాష్ట్రనిర్మాతలలో నొకడైన పౌరుడే యితడు గాన రాష్ట్రియాజమాన్యమును సేవగించుకొనడు.

ఇక యీవిధముగనే పరిశ్రమలు రాష్ట్రిస్వాధీనములోనికి వచ్చినప్పుడు వాని పాలనలోని మూలసూత్రములు మారును. రాష్ట్రిదృష్టి వేరు. వ్యక్తిదృష్టి వేరు. రాష్ట్రము, రాష్ట్రములోని కార్మికుల యొక్కయు సరుకుల నుపయోగించు ప్రజల యొక్కయు క్షేమదృష్ట్యాపరిపాలనకు గడంగును. రాష్ట్రిజనులే ఫ్యాక్టరీకి వాటాదార్లు, వ్యక్తి నిధానములో కార్మికుల నుంచుట, తగ్గించుట, కార్మికులు చేయవలసినపని నిర్ణయించుట అనేవి వారి క్షేమముతో నిమిత్తం లేకుండా కేవలయజమాని లాభదృష్టిలో నిర్ణయించును.

పై అనుభవ, శాస్త్రసిద్ధ సత్యములను దృష్టియందుంచుకొనియే అమెరికాలోని N. R. A. విధానముక్రింద జరిగిన పనిని గూర్చి విచారించి రిపోర్టు పంపుటకు ప్రభుత్వము పంపిన

గల బ్రిటనులో ప్రస్తుత ప్రభుత్వవిధానమువల్ల తీవ్ర చర్చలు జరుగుచుండుట కూడ యిందువలననే.

---

---

సంఘమువారు వ్యక్తి పెట్టుబడివిధానమునకు లోబడి అమెరికా పొందదగినంత అభివృద్ధిని యిదివరలోనే పొందెననియు ఇంక యీ విధానముక్రింద దేశమునకు ఒక అంగుళమైనా ముందు పోవుటకు వీలు లేదనియు, ప్రస్తుత కార్మికుల వృత్తి నాశనము, దేశపు దుస్థితి తొలగవలెనన్న రాష్ట్రము, వ్యక్తులస్థానే ఆర్థికాధిపత్యము వహించుటయే కర్తవ్యమని సూచించినట్లు కనబడుచున్నది. కూలీల వేతనములు, సౌకర్యములలో నితరవ్యక్తి పెట్టుబడి విధానయుతదేశములకు మార్గదర్శికగా నుండిన అమెరికా దేశములోని పెట్టుబడి విధానమునకు ముందు తావు లేదనిన—ప్రకృతిపరిణామములో అట్టి విధానము ఒక హద్దు మీరి పోజాలని దశ వచ్చినదను సత్యము గోచరించుచున్నది.

<u>సింహావలోకనము.</u> ప్రపంచమే అస్థిరము. అస్థిరమైన ప్రపంచములోని సంస్థలు, కట్టుబాట్లు విధానములు అస్థిరములో నస్థిరములు. పూర్వపద్ధతులు పరమందు వచ్చినవానికి లొంగిపోవును. అనగా అపూర్వపద్ధతిని తెచ్చి ప్రవర్తింపజేసిన కారణములకు స్థితిపరపద్ధతి వచ్చునప్పటికి లేదని యర్థము.

అస్థిరత్వము కూడ మానవాభ్యుదయమునకు అవసరమే. అస్థిరత్వము లేనిచో సంఘర్షణ లేదు. సంఘర్షణ లేనిచో నూతననిర్మాణము లేదు. ప్రాతక్రొత్తయొక్క మార్పుదలకును, ప్రాతది పోయి క్రొత్తది వచ్చుటకును పరిస్థితులు కారణమైనను, జిజ్ఞాసువులమూలమున వీనియొక్క పోకడ, రాకడలను గూర్చి మనకు తెలియును. వారు అపూర్వప్రతిభావంతులును, స్వార్థరహితమైన, విశ్వమయమైన దృష్టిగలవారగుటచే, తామున్న కాలపు ప్రజాభిప్రాయమును లెస్సగా చిత్రించి ప్రతిబింబింపజేయుటయే గాక—భావిని గూర్చి అరుణోదయరేఖలను, ఉన్నతపర్వతశిఖరములు, మున్ముందుగాంచుచున్నట్లు—తిలకించి సూచించెదరు. మానవుడు తాను వర్తమానకాలచక్రములో ప్రయాణముచేయుచు భావిజ్ఞానము లేకుండును. జిజ్ఞాసువులు సూచించిన పరిస్థితులవఱకును, తాను ప్రయాణముచేసి పోయినప్పుడుగాని జిజ్ఞాసువు తనకంటె

యెంతయో ముందుగా చేసిన సూచన యీసామాన్యమానవుని అనుభవములోనికి రాదు. మహాజిజ్ఞాసువులయొక్క వ్రాతలకు కొన్ని స్థలములలో చాలకాలమునకు గాని గౌరవము కలుగకుండుట, సమకాలీనులకు అందు ఒకప్పుడు విరుద్ధములు కనబడుటకును ఇదియే కారణము. అనగా దీర్ఘదర్శిత్వము విమర్శకులకు లేకుండుట. ఇట్టి జిజ్ఞాసువుల—వారి జీవితములోనే అర్థముచేసికొని—గౌరవించెడు సంఘము, కాలమున్నయోగ్యమైనది. సోక్రెటీసు, క్రీస్తు, మొదలు, కారల్ మార్క్సువఱకును గల పాశ్చాత్యజిజ్ఞాసువులలో చాలమంది మూర్తులను, జీవితకాలములో ప్రజలు పూజింపలేకపోయిరి. పిమ్మటనే ప్రజలు వీరి అస్తికలకై తడుముకొనుచున్నారు. మహాఋషులు, బుద్ధుడు, శంకరుడు మొదలు, మోహనదాసు, గాంధివఱకును గల భారతజిజ్ఞాసువులు యీ దేశములో త్రికాలపూజ్యతనొందగల్గుట మన అదృష్టము. సంఘమునకు మార్గమును రచియించునది పరిస్థితులయితే, దానిని సూచించువారు ఆయా కాలసంధులందు ఉద్భవించు జిజ్ఞాసువులే. ఇట్టి జిజ్ఞాసువుల జననమునకును, వృద్ధికిని అనుకూలమైన వాతావరణములు గల దేశములే సర్వవిధముల ఆధిక్యత గలవి. ప్రజాస్వామ్యములలో ప్రధానాంశముగా మనము గుర్తించియున్న "ప్రజాభిప్రాయము"నకు కర్తయు, వివర్ధకుడును కూడ యీ జిజ్ఞాసువే. అందులకే ప్రాచీన భారతసభ్యతలో యీ జిజ్ఞాసువులు ప్రభుత్వముల వాతావరణమునకు కూడ పైబడియే

జీవించుచుండిరి. ఇదియే "నైమిశారణ్య" తత్వము. దేశము సంఘముయొక్క కల్యాణమునకై నిరంతరముజిజ్ఞాసచేయుచు నిరపేక్షితులైయుండు ఋషిగణమే సంఘమునకు, ప్రభుత్వము నకును మార్గము చూపగలరు. రష్యాలోని ప్రభుత్వసంస్థకు పైబడి యుండిన కమ్యూనిస్టుపార్టీ నాయకులనుండి ప్రభుత్వము మార్గదర్శిత్వమును అపేక్షించుట కూడ దీనితో కొంతవఱకు పోలియున్నది.

ఐరోపా మహాసంగ్రామానంతరము వెనుక తెలుపఁబడిన ప్రపంచవ్యాప్తమైన ఉద్యమములు, పరిస్థితులు అపూర్వ సరళిని జిజ్ఞాసువులదృష్టి నాకర్షించినవి. వెంటనే బయలుదేరిన జిజ్ఞాసను ఇట తెలుపుట ముఖ్యముగా భావిరాజ్యాంగనిర్మాణోద్యమములు మొలకలెత్తిన భారతదేశములోని ఆంధ్ర పాఠకుల కత్యవసరము.

సృష్ట్యాదిని నాగరికతయొక్క తొలిరేఖలు భారత దేశములో పొడమినవనియు, అచ్చటి నుండియే అవి ప్రాచీన యీజిప్టు, అస్సీరియా, బాబిలోనియా మున్నగు దేశములకు వ్యాపించెననియు దాని వికాసము ఆయా దేశముల పరిస్థితులను బట్టి జరిగినదనియు నవీనపరిశోధనలు కొన్ని సూచించుచున్నవి. మధ్య యేషియాగాని యేషియామైనరు గాని నాగరికతయొక్క స్వతంత్రోత్పత్తి నిలయములను వాదనకు చరిత్ర ప్రమాణము తగ్గిపోవుచున్నది.

ఆదిని కుటుంబయజమాని, కులపెద్ద సంఘపు అధిపతి. వేదకాలములో యెన్నికవలన యేర్పడిన రాజులు గణాధిపతుల రాజ్యములు, అటుపిమ్మట క్రీస్తుశకము మొదటి శతాబ్దమువఱకును దేశ లేశ గణనామములను బట్టి యేర్పడిన గణరాష్ట్రముల ప్రజాస్వామ్యములు, ఇటులనే గ్రీసు దేశములోని తెగనుబట్టి పౌరస్వత్వముగలిగిన నగరప్రజాస్వామ్యరాష్ట్రములు అతి ప్రాచీనకాలమున రాజస్వామ్యములతో పాటు ప్రపంచములో నుండినవి. భారతదేశములో క్రీస్తుశకము నాటినుండియు బయలువెడలిన మగధ, ఆంధ్ర, గుప్తాదిసామ్రాజ్యములలో క్రమముగా నీ ప్రజాస్వామ్యములు లీనమైనవి. కాని యీ రాజస్వామ్యములలో కూడ రాజు యేదో విధమైన ప్రజాభిప్రాయమును కనుగొని పాలించు విధానములు అప్పటప్పట బయలుదేరుచునే యుండెను. పిమ్మట మహమ్మదీయస్వామ్యము అటుపిమ్మట బ్రిటిషుస్వామ్యమునకు లోబడిన భారతదేశమునకు ౧౮౮౫ సం॥లో పుట్టిన జాతీయోద్యమమున ద్విజత్వమును పొందువఱకును రాజ్యాంగజిజ్ఞాసకే ప్రసక్తి లేదు.[1]

ప్రాచీననాగరికతలో భారతదేశముతో పోల్చదగిన యేషియాఖండములోని రెండవజాతియైన చైనాదేశమునకూడ

1. ఈమధ్యకాలములో పరాశర, మాధవీయాది ధర్మశాస్త్రభాష్యములు రాజ్యాంగచర్చను కేవలము వదలలేదు. కాని భాష్యకారులు దీనియందు నిష్ఠా చేయలేదు.

ఆదిని ప్రజాస్వామ్య భావపరంపరలను కురిపించిరి జిజ్ఞాసువులు. పిమ్మట అది సామ్రాజ్యాధిపతుల వశమయ్యెను.

అందుచే మధ్యకాలమునుండి పదునెనిమిదవ శతాబ్దము వఱకును గల రాజ్యాంగ పరిణామమునకు మూలరంగము యూరపుఖండముగానే ప్రస్తుతచరిత్రలను బట్టి అంగీకరించవలసి యున్నది.

కుటుంబాధిపతి, కులాధిపతి, గణయజమానియొక్క రాజ్యాధికారములో నుండిన వ్యక్తి గ్రీకుప్రజాస్వామ్యములో పౌరప్రజాసభవారి క్రిందకు వచ్చెను. కాని నగరములోని మూడులక్షలమందికి లేనట్టియు, యిరువదియైదువేల మందికి మాత్రము గలిగినట్టియు పౌరస్వత్వమిది. పిమ్మట రోమనుసభ్యత వచ్చినది. రోమను సభ్యతలో కొలదికాలము మాత్రమే ఒక విధమైన ప్రజాస్వామ్యము నిలచినది. కాని వ్యక్తిహక్కులను న్యాయశాస్త్రబద్ధము చేయించినదీ సభ్యత. పిమ్మట నదియు నశించినది. పిమ్మట యీ వ్యక్తి, మతగురువులయొక్కయు, ఫ్యూడల్ విధానముక్రింద జమీందారుల రాచకీయాధిపత్యముక్రిందకు వచ్చెను. రోమను సామ్రాజ్యములో నుండి ట్యూటను సభ్యతయొక్క అధిపత్యముక్రిందకు వ్యక్తివచ్చుట కొంచెము ప్రజాస్వామ్యపరమైన మార్పే. తన బహిరంగజీవితములో వ్యక్తి యెంతదాస్యము ననుభవించినను స్థానికప్రజాపాలనలో అభ్యాసము చేసుకొన్నదీ ఫ్యూడలువిధానములోనే. పిమ్మట యీ ఫ్యూడలువ్యక్తి దాస్యము అప్పటికి

రాష్ట్రీములవారీగా విడబడి రాష్ట్రాధిపతియైన రాజదాస్యము లోనికి వ్యక్తిని కొనివచ్చెను. ఇదియే జాతీయరాజ్యాధిపత్యమునకు (National State) ప్రారంభము. ఈజాతీయరాజ్యాధిపత్యమునుండి వ్యక్తి ౧౭, ౧౮ వ శతాబ్దముల ఆఖరునకు జాతీయప్రజాస్వామ్యపు (National Democratic State) రాచకీయాధిపత్యమునకు సిద్ధాంతములో—వచ్చెనని తెలుపబడినది. [1]

1. ఫ్యూడలువిధానము నాటినుంచి జాతీయరాజస్వామ్యము పూర్ణముగా వికసించువఱకును వ్యక్తులేగాక ప్రభువులు, రాజులుకూడ తలయొగ్గిన మరియొకశక్తి—అంధముగా తలయొగ్గవలసిన మరియొకశక్తి—మతపీఠము. మతములో రోముపీఠ దాస్యమునుండి యూరపుదేశములు విడబడి జాతీయ మతపీఠముల (State Church) స్థాపించుకొనుట; సదరు మతపీఠములను రాజులవర్దిలో నుండి తప్పించి స్వతంత్రపాలనగలవిగా చేయుట—ప్రొటెస్టెండు, ఆస్పృశ్యర్చర్చి ఉద్యమములవలె—ఈ మతస్వపరిపాలనలో సోపానములు. మతమును, దేవుని తలుపని దే కక్షిదారులుభయులు తమపని ప్రారంభించుట యొరుగరుఆరోజులలో. మొదటి రిచ్చర్డురాజు "భగవంతుని ఆశీర్వాదము నాపైన గలదని నమ్ముచున్నాను" అను దైవమత విశ్వాసముపైననే తన (నిరంకుశత్వమును) చర్యలను సమర్థించెను. సేనలను క్రాముడెలుపైన పురికొల్పెను. ఈ రిచ్చర్డురాజుపైన బయలుదేరిన తిరుగుబాటునకు నాయకుడైన క్రామ్వెల్ కూడ మతోద్దీపనము (ఉద్యమము రాచకీయమైనను) వలననే తన పక్షబలమును నిలుపుకొనగలిగెను. ఇట్టి నిదర్శనములను బట్టి ఆ కాలమున మతసంఘములకుగల ప్రబలశక్తి గోచరించును. అంను

ఈ ప్రజాస్వామ్యమునకు యీ కాలములో రెండు దోషములు పట్టినవి. సంఘుత్వేన తను ప్రజాస్వామ్యము జాతీయతయను సరిహద్దులలో బంధింపబడుట. వ్యక్తిత్వేన వాస్తవములో యీ ప్రజాస్వామ్యములోని ప్రజలు అధికముగా పారిశ్రామికులైన పెట్టుబడిదార్ల క్రింద కార్మికులుగా గాని, వారితో రేదో

---

లకే యీ మతదాస్యము, మూఢమతావేశము ప్రజలలో నుండి తొలగినపిమ్మటనే అనగా ప్రజలు మతమునువిడిచిన స్వతంత్రమైన భావజిజ్ఞాసకు అలవడిన పిమ్మటనే రాజకీయస్వాతంత్ర్యము యూరపుఖండములో రేకెత్తగలిగినది. ౧౮ వ శతాబ్దాంతమునకూడ "ఆధ్యాత్మికముగ ప్రజాధిపతియైన రోమక మతపీఠమే సకలక్రైస్తవ లోకానికి అధికారి. ప్రజల భౌతికాలపై ప్రభువులైన రాజులు, వారి ప్రజలుకూడ మతగురువునకే విధేయత కనపర్చవలెను. ప్రజలకు రాజుపై తిరుగుబాటు చేయవలసివచ్చినచో మతగురువులే అట్టి తిరుగుబాటునకు అనుజ్ఞ యివ్వవచ్చును." అను సిద్ధాంతాలతో ప్రసిద్ధ ఫ్రెంచిజిజ్ఞాసువైన డీమైస్త్రీ ఫ్రెంచి ప్రజల నింకను ఆకర్షింపగలెను. ఈ వాదమునకు బిస్మార్కు మంత్రి పూర్వపక్షము చెప్పెను. రాజ్యపీఠాధిపత్యమూ, మతపీఠాధిపత్యమును తల తన్నునని ప్రతిపాదించెను. కాని బిస్మార్కు దైవభక్తిలో డీమైస్త్రీకి తీసిపోవువాడు కాడు. ఒకరు మతసామ్రాజ్యము అండక్రింద రాజ్యపీఠము వర్ధిల్లవలెనని కోరితే, మరియొకరు, రాజ్యపీఠాధిపత్యము క్రిందనే మతపీఠములు వర్ధిల్లవలెనని ప్రతిపాదించిరి. ఈ విధముగా ౧౮ వ శతాబ్దములోని ఇంగ్లండు, ఫ్రాన్సు, జర్మనీలోని మతరాజకీయములకు గల సంబంధము తెలుపబడినది,

విధముగా సంబంధముగల తదితరవ్యక్తులుగాగాని యుండుటవలన యిది కేవలము, ప్రజలందరి రాజ్యముగాక కొందఱివ్యక్తుల క్షేమము, ఉద్దేశములకు ప్రాధాన్యముగల రాజ్యముగా నేయుండుట. అందుచే వ్యక్తి—కుల, మత భూస్వామి రాజదాస్యమును వదలి ఘనమైన యీ ఆధునికయుగమున నెచ్చటనున్నాఁడు ? సమత్వము, సోదరత్వము, స్వాతంత్ర్యము అను త్రిమూర్త్యాత్మకమైన ఫ్రెంచివిప్లవమునాటి స్వేచ్ఛామంత్రోపాసన యెంత సిద్ధించినది ? అని ప్రశ్న వచ్చినప్పుడు మానవుఁడు దినదినము పెరిగిపోవుచున్న జాతీయవాతావరణములోని పెట్టుబడిదారుల యాజమాన్యమున బంధింపబడియున్నాఁడు. పై మంత్రసిద్ధి యింకను దూరమున నేయున్నది. అని జవాబువచ్చుచున్నది. దీనిని విశదపఱచుటకు నేటి ప్రజాస్వామ్యరాజ్యములను, విమర్శనాజ్యోతిక్రింద పరిశీలింపవలసియున్నది.

---

3

## ప్రజాస్వామ్యములు అవియెటుల పనిచేయుచున్నవి?

"ప్రజలచే, ప్రజలకొఱకు నిర్మించబడిన ప్రజలప్రభుత్వము" (Government of the people, for the people by the people) ఈ ౧౯ వ శతాబ్దములో ఐరోపాసంగ్రామానంతరము వఱకును, పురుషులు, స్త్రీలు, పెద్దలు, పిన్నలు నిరంతరము యీ మంత్రమును జపింపజొచ్చిరి. వ్యక్తిస్వాతంత్ర్యము, జాతీయత యీ రెండును ఈప్రజాస్వామ్యమునకుఆలంబనములని కూడ అప్పటిఅభిప్రాయము. "అవి" యే "ఇది" గా కూడ కొందఱు భ్రమించిరని కూడ తలపవచ్చును. పైగ యీవ్యక్తిస్వాతంత్ర్యము, జాతీయతయే, యూరపుఖండీయులు మహాత్యాగముచేసి చిరకాలమునుంచి ఆర్జించి లోకమున కిచ్చిన ప్రసాదమనికూడ అప్పటి వారిమతము. ఫ్రెంచివిప్లవములో గడించిన "వ్యక్తిస్వేచ్ఛ" యొక్క పూర్ణవికాసముగా వ్యక్తి పెట్టుబడి విధానమును సమర్థించిరి. పై చెప్పిన యీ వ్యక్తిస్వాతంత్ర్యము జాతీయతయు మూలపీఠము గాగల సవిశేషణ (qualified) ప్రజాస్వామ్యసిద్ధాంతములలో గ్రీసునగరస్వామ్యము నాటినుంచియు మానవజాతి చేయుచున్న పరిశోధనలకును రాజ్యాంగము పొందుచున్న పరిణామములకును శాంతివన్నము [illegible]కినదని భ్రమించిరి; దానిపారము కనిపెట్టబడినదనిరి; ఇంక విధానముయొక్క వివరములలో విశాసమే కాని సిద్ధాంతములు

త్రికాలాబాధితములని తలంపజొచ్చిరి. అమెరికా ఇంగ్లండు, ఫ్రాన్సుమున్నగు ప్రజాస్వామ్యములే యావత్ప్రపంచములోని రాజ్యాంగశాస్త్ర విద్యార్థులకును, తాము పఠింపించిన లక్షణమునకు లక్ష్యసమన్వయము గానిడుకొనిరి పండితులు. కాని యిదివఱలోనే యీ ప్రజాస్వామ్యసిద్ధాంతములను యాధునిక విధానములను గూర్చిన పరిశోధన బయలువెడలినను, ప్రజాస్వామ్యము లనుకొనినవారే పూర్వపు రాజులనిరంకుశత్వములో కంటెను ఐరోపాసంగ్రామసమయముగా ప్రదర్శించిన క్రూరత్వము, ఘోరత్వము చూచినప్పుడు జిజ్ఞాసమఱింత తీవ్రమైనది.

ప్రజలచే. ఈ సిద్ధాంతములోని పదార్థములను విడదీసి విమర్శించెదము. ప్రజలచే—అనగా ముందు ప్రజలనగా నెవరు ? అమెరికావలె నీగ్రోలు, రెడ్డిండియనులు, యేసియా నుండివచ్చిన భారతీయాది, అమెరికన్ నివాసులు—వీరు ప్రజలుకారా ? వీరికి పౌరస్వత్వము అచటనేల లేదు? (వాషింగ్టన్ వంటి ప్రజాస్వామ్యనాయకునకు నీగ్రోలను బానిసలుగా తన యింటిలో నుంచుకొనుట మనస్సునకు బాధాకరము గాలేదనిన అప్పటి ప్రజాస్వామ్యభావములపరిమితి గోచరించును) లేక ప్రజలనగా ౧౭౮౯ వ సం॥మునకు పూర్వము యింగ్లండులో వలెను ఫ్రాన్సుమున్నగు కొన్ని ప్రజాస్వామ్యములలోవలెను స్త్రీలు మినహాయించగా మిగిలినవారా ? ఇఁక ప్రెసిడెంటు విల్సన్ [illegible]ంచినట్టియు, మిత్రమండలి వారంగీకరించినట్టియు,

స్వయం నిర్ణయసూత్రము ప్రజాస్వామ్యవాదులైన దేశముల వారు తమక్రింద కానిసత్వములో నుంచుకొన్న ప్రజలకు వర్తింపజేయకపోవుట యుక్తమా!

ఇక ఒక దేశములోని ప్రజలు వోటింగుహక్కు గలిగిన, వారైనను, అచ్చటి ప్రజాస్వామ్యశాసనసభలు యేర్పడుటకు నిజముగా, బుద్ధిపూర్వకముగా (Conciously) కర్తలా? ప్రతి వ్యక్తియు తన స్వపోషణకు, తనకష్టసుఖములను తీర్చుకొనిన పిమ్మటనే దేశమునుగూర్చి యోచించుటకవకాశముండును గదా అట్టి అవకాశము జనసామాన్యములో కొద్దిమందికే లభించును గదా! లభించినవారుకూడ క్లిష్టమైనట్టియు, దురవగాహమైనట్టియు ప్రస్తుత రాజ్యాంగపద్ధతిని అర్థము చేసుకొనగలరా? ప్రతివోటరు తాను ప్రతినిధిగా యెన్నుకొనే అభ్యర్థినిగూర్చి తెలుసుకొని స్వతంత్రముగా నిర్ణయించుకొనగలండా? ఒకే ముహూర్తమున—అమెరికాలో వలె—యెన్నుకొన వలసిన రాష్ట్రశాసన సభ్యుండు, సమాఖ్యశాసనసభ్యుండు, అధ్యక్షు యెన్నికకు ప్రతినిధి, రాష్ట్రన్యాయాధిపతి మొదలైన స్థానములకు వందలకొలంది అభ్యర్థులలో నుండి యీ వోటరు ప్రజాస్వామ్యమునకు మూలమైన నిజమైన "స్వం" యొక్క ఇచ్ఛ (స్వం + ఇచ్ఛ=స్వేచ్ఛ) నుపయోగించి యేరుకొనగలండా? అభ్యర్థికిని, తనకును మధ్యవ్యక్తిసంబంధములుండవా? అటులకానిచో ఇంగ్లండు, అమెరికాలలోవలె వోటర్లులంచములు, మొగమాటములకును యెందుకు లోనగు

చుందురు ? కేవలము పార్టీమానేజరు చెప్పినప్రకారము ఓటర్లు గ్రుడ్డిగా యెందుకు మార్కుపెట్టిపోవుచున్నారు ? ఇంగ్లండులో "నియోజకవర్గమును సేవించుట "(Nursing the Constituency) అను గుప్తపదమునకు అర్థము వ్యక్తికి కాకపోయినను వర్గమువారుకోరినపనికి అభ్యర్థిసామ్మిచ్చుట,లంచమిచ్చుట కాదా ? అమెరికాలో ఉత్తమపురుషులు అభ్యర్థులుగా యెందుకు నిలువబడుటలేదు ? ఫ్రాన్సుదేశములో ప్రజాసభాసభ్యుడు (Deputy) తనవోటరునకు గొడుగునుకూడ ప్యారిస్‌నగరమునుండి తెచ్చిపెట్టుట, వానియల్లునకు ఉద్యోగము చూచిపెట్టవలసివచ్చుట యెందుకు తటస్థించుచున్నది? [1] ఈ దేశములలోని శాసనసభ్యులు తమ అంతఃకరణాదేశానుసారము గాక వెనుకనుండి నడపించుపక్షము, దానినాయకుని లేక నాయకుల (Party Caucus) కనుసొజ్ఞలో యెందుకు మెలగవలసివచ్చినది ? "పార్టీ ఫండ్"నకును, లంచమునకు తేడాఎంత ?

ప్రజలకొఱకు ప్రజలయొక్క ప్రభుత్వము. ఇక శాసనసభలో నీ సభ్యులు యెట్లు ప్రవర్తించుచున్నారు. అమెరికాదేశములో గత నీగ్రోవిప్లవములో సైన్యములో పని జేసినారను నెపమున ౧౮౬౫–౯౯ ౧౮ సం॥లో తమవోటర్ల మెహనతుకై శాసనసభ్యులు ౧౨ వేలకోట్ల రూపాయల ప్రజలడబ్బును (అచ్చట అప్పటి కాంగ్రెసు సభావిధానము ప్రకారము ప్రతి బిల్లున్ను యెట్టిపరిశోధనయూ లేకుండగనే శాసనసభలో తక్షు

1. జైనివుపండితుని నవీనప్రజాస్వామ్యములు Vol. II:

ణమే ఆమోదింపబడుటకు గల అవకాశమును గైకొని) యేల దుర్వినియోగము చేయుబడెను? శాసనసభలలో వ్యక్తికి తన అభిప్రాయమును ప్రకటించుటకు సంపూర్ణ స్వేచ్ఛగలదను సూత్రముయొక్క అండక్రింద (గమోలిటిన్ పద్ధతిలేనపుడు) అమెరికా శాసనసభలో ఒకపక్షమువారి తీర్మానము నెగ్గకుండ రెండవపక్షమువారు నిరంతరోపన్యాసముల మూలముగా కాలయాపనముచేయుట (దీనినే "Filbustering" అందురు.) దుర్నీతికాదా? ఇంగ్లండులోవలె ఆఱువందలమంది శాసనసభ్యులలోను యేపదిమందియో పార్టీనాయకులు సభలో మాట్లాడుట, వ్యవహరించుటయు, జరిగి, మిగిలిన అధికప్రతినిధులు వెనుక బెంచీలలో ప్రాముఖ్యత లేకయుండినచో అట్టి సభావ్యవహారములు ప్రజలందఱుచేసిన వగునా? అధికదేశములలో శాసనసభ్యులు విషయపరిజ్ఞానములేకను, దూరదృష్టిలేనివారుగను ఉండుటయే గాక (ముఖ్యముగా న్యూజిలెండువలె) శాసనసభలలోని వీరిప్రవర్తనముకూడ పెద్దమనిషి తరహాకు లోటుగా కూడ యేలయున్నది? ఎంతప్రాజ్ఞుడైనను వోటర్లను, పార్టీనితప్పుడు మార్గములవలన వశపరచుకొనజాలని అభ్యర్థికి ప్రజా ప్రాతినిధ్యమేల లభించుటలేదు? [1]

బ్రయన్‌వంటి ప్రజాస్వామ్యపండితుడు "దేశములోని చంటిపిల్లల సందఱిని నట్టికి వేయవలెనని" శాసనసభలో అధిక

---

1. ఇట్టిగతి భారతదేశమునకు కూడ పట్టకుండును గాక.

సంఖ్యాకులు తీర్మానించుటకూడ యీ ప్రజాస్వామ్యములలో ఒకప్పుడు ఆశ్చర్యముకాదని ఒప్పుకొనవలసివచ్చినది. ఈ ప్రజా స్వామ్యములలోని యెన్నికపద్ధతియే దోషభూయిష్ఠమగుట వలన అధికమైనవోట్లు పొందినను ఒకపక్షమునకు అల్పసంఖ్య గల స్థానములు లభించుచుండుటకలదు. [2]

ఇంక వోటరు దుర్నీతివలన నిజమైన ప్రజాభిప్రాయము మఱింతకల్మషమగును. పార్టీపద్ధతిపై నిర్మింపబడిన అమెరికన్ బ్రిటిషుశాసనసభలలో ప్రబలపక్షము దానికి వ్యతిరేకపక్షము అను రెండుపక్షములకే స్థానముండుటవలన, దేశములో గల తదితరఅభిప్రాయములకసలే స్థానములేదు. మఱియు శాసన సభలో గల సభ్యులందఱు సామాన్యముగా హాజరుకారు. అందుచే ఒకప్పుడు శాసనసభలో అధికసంఖ్యాకులు తీర్మానించి రనగా అసలు శాసనసభ్యుల సంఖ్యలో అల్పసంఖ్యాకులనిగాని, దేశములోని రెండుపక్షములవారు మాత్రము చర్చించినతీర్మానమనిగాని, లేక వోటింగు, నియోజకవర్గముల రచనలోగల్గిన పొరబాటులను అవకాశముగా గైకొని అధికసంఖ్యాకులైన (Chance Majority) పక్షముచే తీర్మానింపబడినదని గాని, ఫలితము తేలుటలేదా ? ఇందు రూసో తెలిపిన ప్రజాసామా

2. ఏకప్రతినిధివర్గములు (Single member constituencies) న్ను మెజారిటీవోటు పద్ధతియునుగల యింగ్లండులోవలె (Vide Professor Strong's Modern Political constitutions P. P. 173, 174:)

న్యముయొక్క యిచ్ఛ (General will) అనునది ఉన్నదా? ఉన్నచో యెట్టి ఆటంకములు లేని ప్రజాసామాన్యముయొక్క వివిధాభిప్రాయములకు ప్రాతినిధ్యము కల్గి సమస్యలు చర్చింపబడుచున్నవా? రాజ నిరంకుశత్వములో కూడ ఇట్టి ప్రతినిధులే పక్షాది అభిమానములు లేక చేయు సమ్యగ్విమర్శనమునకును, నేటి ఈప్రజాస్వామ్య సభావిమర్శలకున్ను అధిక భేదములేదు కదా?

మంత్రివర్గములు.—ప్రజాభిప్రాయమును బట్టి గాక పైన తెలుపబడినట్లు "అదృష్టము" వలన అధిక స్థానములను (Chance majorities) సంపాదించిన పక్షము వారు, మంత్రిత్వములోనికి వచ్చుట యనగా ఒకవిధముగా పూర్వగ్రీకు ప్రజాస్వామ్యములు చీట్లు వేసి ఉద్యోగస్థుల నేర్పఱచుటవలె (వాస్తవములో) నుండలేదా? ఈ మెజారిటీ పక్షములోనుంచి యేదో కారణమునకొందఱుశాసనసభ్యులు రెండవ పార్టీకిపోయి యది మైనార్టీ పార్టీ అయినంతమాత్రమున (ముఖ్యముగా నేటి యింగ్లండు, ఫ్రాన్సులలోవలె సంయుక్తపక్ష (Coalition) మెజారిటీలలోనిది జరుగుచుండును) మంత్రులు చేసే, చేసే ఉద్యోగములు, నిర్మించే—నిర్మించే అనేక స్కీములు వదలి వేసి లేచిపోవుటయేనా? పిమ్మట వచ్చిన నూతన మంత్రివర్గమువారు వీటిసన్నిటిని రద్దుచేసి రెడ్డొచ్చె మొదలాడు మనునట్లు, క్రొత్తవిధానమును, క్రొత్తరాజనీతులను (Policy) అవలంబించుచుండుటవలన యెంతఅపారనష్టము? వ్యక్తిప్రతిభకు

యెంత అనవకాశము? ఇంగ్లండులోవలె రాజ్యాధికారము ఆదిని రాజుచేతిలోనుండి జాన్ రాజుకాలమున జమీందారు చేతుల లోనికిని, పిమ్మట పార్లమెంటుసభలలోనికిని, అటుపిమ్మట కేవలము కామన్సుసభలోనికిని యీశతాబ్దారంభమున వీరి నుండి కేవలము మంత్రివర్గములోనికిని ప్రస్తుతము యీమంత్రి వర్గము సంఖ్యకూడ పెరిగి వీరికికూడ తెలియకుండ వ్యవహార ములను నడపుటవలన, ఈరాజ్యాధికారము తదంతర్గతులైన (Inner Council of the Cabinet) యేనలుగురు చేతుల లోనో ఘనీభవించలేదా? నాలుగుకోట్ల జనాభాగలిగిన దేశ ములో ప్రతిదోజును అద్దమును చూచుకొని తామే రాజ్యాధి కారులమని సంతసించు మూడుకోట్ల యింగ్లీషువోటర్లు, ఆరువందలమంది కామన్సుసభ్యులు, మంత్రివర్గములోని పద హారుగురు మంత్రులున్నా, ఈనలుగురు వ్యక్తుల పైనను విధానరచనకు, శాసనముల మూసాయిదాకున్న, తరుణోపా యమునకై ఆధారపడి చూచుచుండుట యనగా పూర్వపు రాజస్వామ్యమంత్రివర్గ నిరంకుశత్వమునకును, దీనికిని("రాజ్యాధి కారము ప్రజాయత్తము"ను దృష్టిలో) నిజముగా తేడాయున్నదా? అందులకే బ్రయిస్ పండితుడు "ప్రజాస్వామ్య మంత్రివర్గమనగా పూర్వ నిరంకుశ ప్రభుత్వముయొక్క చక్రము కొంచెము వైశాల్యమగుట మాత్రమే" నని అంగీకరించవలసి వచ్చినది. ఇక ప్రజాస్వామ్యమువచ్చి నూరు సంవత్సరములైనను యీ ప్రభుత్వ విధానము వలన జనసామాన్యమైన కార్మిక, కర్షకు

లకును, సాహుకారు జమీందారులకును గల సంఘర్షణలు తద్వారా అశాంతి, అసంతృప్తియు హెచ్చుచుండెను గాని తగ్గుటలేదు. "ఐశ్వర్యమత్తులు" జనసామాన్యమును మామూలు ప్రకారమే భావదాస్యములో నుంచుకొనుటలో (వీరికి వారు ఓటునిచ్చుట, స్తోత్రముచేయుట మున్నగునవి) అధిక మార్పులేదు. [1] ఇంతేకాక కార్మికనాయకులుగా ప్రారంభించి కార్మికబలముతో పార్లమెంటుసభలోనికి పోయిన కొందఱు కార్మికపక్షసభ్యులు ప్రభుబిరుదాంకితమును కూడ పొందుచున్నారు. ఇందువలన కార్మికునికి "పెట్టుబడిదారుగా తానుకూడ పరిణమించవలెను" ననులక్ష్యవాంఛ అబ్బుటలేదా? ఇటీవల వచ్చిన దుర్భర ఆర్థికపరిస్థితులలో జనసామాన్యమును గూర్చి యీ మంత్రివర్గమువారు కొంచెము శ్రద్ధవహించుచున్నారుగాని తత్పూర్వము వీరికాలము యెంతసేపు విదేశరాజ్యాంగనీతి, తమ రాజ్యములలోని సాహుకార్ల లాభమునకై అవసరమగు చర్యలతోనే మునిగియుండెను. ఇక జనసామాన్యస్థితిని చక్కబఱచుటకై ఆర్థిక విధానములను యేర్పఱచవలెనని తీవ్రముగా వాంఛింపబడుచున్నను ప్రస్తుత ప్రజాస్వామ్యవిధానములు అందులకు కొఱతపడుచున్నవి. ఈశాసనసభలలో గ్రంథము జరుపుటకు దీర్ఘకాలము పట్టును. విధా

---

1. కార్మికయజమానుల సంఘర్షణమును గూర్చి గత పత్రములో కొన్ని వివరములు తెలుపబడినవి గాన తిరిగి విస్తరింపదలచలేదు.

నము అమలు జరుపుటలో పైనుంచిక్రిందికి ఒకఉత్తరువు వచ్చు సరికి అగు కాలయాపనము, దేశములోని ఆర్థికమైన విషయ ములందు అనుభవజ్ఞులకును ప్రభుత్వవిధానమునకును సంబంధ ములేకపోవుట; ఇట్టికొఱతలు తీరవలెనన్న ప్రస్తుతవిధానము మారవలెను. ఆర్థికజీవితములో ప్రభుత్వము లధికప్రమేయములు పెట్టుకొనవలసిన నేడు పై చూడు దోషములు నివారింపబడ వలెను. అందులకే ప్రజాస్వామ్య విధానములలో కూడ జర్మనీ లోను, ఐర్లండులోను ఆర్థికసభలని (Economic Councils) చట్టబద్ధములై ఆర్థికవిషయములపై అధికారము గల్గిన సభల ఏర్పఱచిరి. ఇటలీలో శ్రేణీసంఘములకు కొన్ని శాసనాధి కారములు కూడ యివ్వబడినవి. అమెరికాలో National Recovery Act క్రింద అధ్యక్షునకు ఇదివరకు ఎఱుగని అధికారములు వశపరచబడి విధానము కొంతమారినది. ఆస్ట్రే లియాలో నూతన రక్షణ (New protection) విధానమున భూములను జమీందారులవద్ద రాష్ట్రము పుచ్చుకొని వానిని తగుకమతములుగా విభజించి వ్యవసాయిక పెట్టుబడితో రయి తులకిచ్చిన విధానముకొంత జనసామాన్యస్థితిని చక్కబరచ యత్నించినది.

కాని రాజుల పాలనములోకంటె మాప్రజా పాలనము లోపన్నులు తగ్గినవా? అధికారభేషజములు, కార్యాలయ ఆడంబరములు, తగ్గినవా? ఒక్క స్విడ్జర్లండు దేశములో తప్ప యీ విషయములో యెట్టి మార్పున్నులేదు. పైగా యీ

ప్రజాపరిపాలనములో ప్రజాసామాన్యమును బలియిచ్చే యుద్ధ శాంతులు హెచ్చుట, మారణసాధనములు వృద్ధియగుట, జనసామాన్యపు ధనముతో నౌకాదళములు, సైన్యములు, విమానములు అపరిమితముగా పెరుగుట జరుగుచునే యున్నది. గత ఐరోపా సంగ్రామములో ప్రజాస్వామ్యపక్షమున పోరిన సిపాయికిని, రాజస్వామ్యపక్షమున పోరిన సిపాయికిని క్రూర త్వములో నెట్టిభేదమును కల్పించదు. గత ఐరోపా సంగ్రామము నిజముగా ఆయా దేశపు ప్రజలు, దేశలాభము కొఱకు చేసినది కాదు. అటుడజను, యిటుడజను వర్తకులు అధికముగా తమ స్వలాభముకొఱకు పన్నినదియే ఇది.

ఇంక బెంధము, మిల్లుమున్నగు జిజ్ఞాసువులు బోధించిన ప్రజాస్వామ్యముయొక్క నాగరికతా లక్షణమైన వ్యక్తిస్వాతంత్ర్యము యెట్లు పరిణమించినది? అజ్ఞానులపై, దరిద్రులపై బుద్ధిమంతులు, ధనవంతులు నిరంకుశత్వమును వహించుటకును భావదాస్యమును కలిగించుటకును, నవీన పరిస్థితులలో యీ వ్యక్తిస్వాతంత్ర్యము మఱింత సహాయపడినది. వ్యక్తిస్వాతంత్ర్యమనగా వ్యక్తికి తన ఆస్తియందు సంపూర్ణాధికారము, తన స్వలాభములకై పరనష్టమును గణింపని భావస్వాతంత్ర్యముఅను నవిగా భాసించుచున్నవి. "ఆస్థి" (Property), "స్వార్జితము" (Self acquisition) అనువాని నిర్వచనములు ఇప్పటికంటె పూర్వమే ధర్మసమ్మతముగాను, సంఘక్షేమకరముగా నున్నవి. పూర్వము భూమియంతయు వ్యవసాయకునిదే. ఇప్పుడు వ్యవ

సాపేతరుఁడు కూడ ఒకవృత్తి గలవాఁడని—జమీందారు మొఖాసాదారు—ఈనాందారు—శాసన మంగీకరించుచు న్నది. ఇప్పటి "స్వార్జితము" మూలద్రవ్యోత్పత్తికి పెట్టి సం బంధము ఉండనక్కరలేనిది. ఇట్టి స్వార్జకుని ఉపవృత్తిని అంగీక రించినయెడల సంఘక్షేమదృష్టిలోను, నైతికముగను, ఆర్థిక ముగను, రాచకీయముగను నష్టము కలుగునను భావము యీ ప్రభుత్వ విధానాలకు లేదు. అందుచే ఒకమూల కష్టించు కార్మిక కృషీవలులు, బుద్ధిబలసమన్వితులు, శాస్త్రపండితులకును; ప్రజావివాదములపై జీవించువారుగా మారిపోయిన నేటి న్యాయవాదులు, ఆర్థికజూదముపై జీవించు స్పెక్యులేటర్లు (Speculators) కున్నూ, పెట్టుబడిదారులకున్నూ; కల్లు, సారా యిజారాదార్లకున్ను, నేటి ప్రజాస్వామ్యధర్మశాస్త్ర దృష్టిలో పెట్టి తేడాయున్ను లేదు. పూర్వపుయుగములో, బుద్ధిమంతులకును, ధనవంతులకును, దేశపు ఐశ్వర్యమును చూరగొనుటకును, దాని అభివృద్ధికై కోట్లకొలఁది పెట్టుబడిపై నిర్మాణములను చేయుటకును అవకాశములు లేనందున వారి భావదాస్యము కొన్ని వంటలకే పరిమితమై యుండెను. ప్రస్తుత ఆర్థిక పారిశ్రామికయుగములో యీవ్యక్తిస్వాతంత్ర్యము కోట్ల కొలఁది జనులను దాసులనుగా చేసుకొని బెంథము సూత్రములను అండగాదీసికొని ప్రజాస్వామ్యమనుపేరుతో జనసామాన్యముపై ఆర్థిక, రాచకీయ, సాంఘికముగా యథేచ్ఛావిహారము చేయు చున్నది. అందులకే "నేఁడుమాకుగలిగిన వోటింగుహక్కు అండ

క్రింద వ్యక్తి పెట్టుబడివిధానమును తొలఁగించి రాష్ట్రస్వామ్యము నేర్పఱచి వారివలెనే మా ఆర్థికస్థితిని గూడ యెందుకు చక్కఁబఱచుకొనరాదు ? " అని ఆయా దేశములలో ఓటరులైన కార్మికకోటు లనుచున్నారు.

పూర్వము సమిష్టిభావమునకు ప్రోత్సాహ ముండెను. వ్యక్తి హక్కులకు యింత ప్రకోపము లేకుండెను. వ్యక్తివాంఛల కిట్టి అపరిమితత్వము లేకుండెను. క్రమేణ వచ్చిన భోగలాలసత్వమువలన వ్యష్టిభావము హెచ్చినది. దానివలన యీ వ్యక్తి స్వాతంత్ర్యము, సంఘక్షేమవిరుద్ధమై, తద్వారా వ్యక్తి వినాశనమునకు దారి తీయుచు, వ్యక్తి అహంభావమునకు ప్రేరకముగా నున్నది.

జాతీయత. ఈ ప్రజాస్వామ్యముయొక్క రెండవ నాగరికధర్మమైన జాతీయత యెటు లున్నది ? ప్రపంచఐక్యదృష్టిలో కూడ, అవయవియైన ప్రపంచ ప్రజాస్వామ్యసిద్ధికి అవయవములైన రాష్ట్రములు, యేకపక్కని, వేరు, వేరుగా ప్రజాస్వామ్యసంస్కారము నందుట అవసరమే! కాని యవయవములు తాము ప్రపంచమను అవయవియొక్క అంగములను మాట క్రమముగా వృద్ధియైన యీ రాజసిక జాతీయతలో మఱచిపోయి తమలో తాము పోటీపడజొచ్చెను. దీనివలన తాత్కాలికముగా కొన్ని యవయవములకు, లాభము కలిగినను, చివఱకు అవయవియొక్క వినాశనములో వీని నాశనము కూడ

నిమిడియున్నదని—అనేక అనుభవపరంపరల మధ్యనుండియు—యీ జాతీయాభిమానము గుర్తించుటలేదు. అందులకే ప్రాచీన భారతవర్షములో ప్రపంచకల్యాణమును మఱచిపోయిన దేశ క్షేమము ఉద్దీపన చేయబడలేదు. ఇట్టి రాజసిక జాతీయాభిమానము మనలో లేకపోవుట నిన్నటివఱకును పై జాతీయత కలవాటుపడిన కొందఱు పాశ్చాత్య ప్రజాస్వామ్యపండితులు అనాగరికచిహ్నముగా భావించిరి. కాని నేడు వీరున్ను దీనిని గుర్తించవలసి వచ్చుచున్నది [1]

ప్రస్తుత ప్రజాస్వామ్యవిధానములలోని దోషములను తెలుపుట గౌరవహాని కాదు. పూర్వముకంటె నేడు మానవజాతిలో ప్రజాస్వామ్యవిధానములక్రింద కొన్ని అంశములలో వృద్ధికలిగినమాట వాస్తవమే. కాని నూతనపరిణామములో నెప్పటికప్పుడు మానవజాతి నెదుర్కొనుచున్న పరిస్థితులనుబట్టి సంస్థలు, విధానములు, సంస్కృతములు కానియెడల యీ వృద్ధిగా మనకు కనుపించునది తత్క్షణమే క్షయముగా మారును. రాజస్వామ్యముక్రింద రాజుగారు, ఏర్పఱచిన, ప్రజల ప్రమేయములేని మంత్రులస్థానే, నేను ప్రజాప్రతినిధులుగా పోయిన వారిలో నుండి యిప్పుడు మంత్రులు యేర్పడిరి.

1. వ్యష్టివాదులైనను నార్మనుయేంజలు(Norman Angel 1914) గ్రాహంవాలాసు (Graham Wallas) అనుపండితులు జాతీయతకు స్వతఃస్సిద్ధమైన స్థితి లేదని, అంతర్జాతీయ సహకారావశ్యకతను నిరూపించిరి.

ఇది అభివృద్ధి కాదా? వీరుమన మనుష్యులు కారా? అని మనము సంతసించిన లాభమేమి? రాజుగారి మంత్రులైనను, మంత్రి యైనవాఁడు "మనమనిషి" యైనను, మనుష్యునకు స్వార్థపరత్వము స్వతస్సిద్ధమని మనము గుర్తించవలెను. ఇదివరలో రాజుగారి మంత్రులు మనతో చెప్పి, మన అభిప్రాయానుసారము చేయలేదని మనము విచారపడితిమి. కాని యీ "మన మంత్రుల"నుకొనిన వారిని మన "నిజేచ్ఛతో" (General will) కేర్పఱచుకొనినామా? పూర్వము రాజుగారి మంత్రులను కాపలాకాయుటకు మన కధికారము లేదని వగచితిమి. కాని యిప్పుడు యీ "మన మంత్రుల"ను మాత్రము మనలో గాని, మన ప్రతినిధులలో గాని యెందరు కాపలా కాయుచున్నారు? పైగా అప్పుడు మంత్రులపై యజమాని ఒక్కడయితే, ఇప్పుడు యజమానులు బహుమంది యగుటవలన "అనేకమంది రాజ్యము యెవరిది కాదు" అనే సామెతగా మంత్రులకు స్వైరవిహారమునకు అవకాశము హెచ్చు. అనుభవము తెలిపిన యీ నూతనదోషములను నవరణ చేసికొననియెడల, ప్రజాస్వామ్యమునకును రాజస్వామ్యమునకును భేదమే లేదు.

<u>Checks & Balances.</u> అందులకే రాజ్యాంగవేత్తలు అధికారదుర్వినియోగము జరుగకుండునట్టియు, ప్రజాక్షేమము ప్రమాదించకుండునట్టియు కొన్ని యేర్పాటులనుచేసిరి. అనగా ప్రజాప్రతినిధుల సభలపైన మఱియొక "శిష్ట" సభ

(Senate) ను—క్రింది సభ వారిచర్యనుకొంతవఱకు నిరోధించుటకు పైసభ వారికి అవకాశముండునట్లు—వీరి యుభయులపైనను ప్రజాస్వామ్యాపు అధ్యక్షునిలేక రాజునకు "వీటో" అధికారమును, ఫెడరల్ విధానములో శాసనసభలవారి చర్యను న్యాయదృష్ట్యావిమర్శించుటకై న్యాయస్థానములకు అధికారమున్ను, మున్నగు యేర్పాటులు గావించిరి. వీనినే రాచకీయ పరిభాషలో "చెక్సు" (Checks) అండ్ "బ్యాలెన్సెస్" (Balances) అనెదరు.

స్విడ్జర్లండు రాజ్యాంగములో వలె అవసరమువచ్చినప్పుడు ఫలానిశాసనము చేయవలెనని, వోటర్లే శాసనసభలకాజ్ఞయిచ్చుట (Initiative) శాసనసభలలో చర్చలోనున్న అంశములు తమ ఆమోదమునకై, నివేదించవలెనని, శాసనసభ్యులకు ఆజ్ఞనిచ్చుటకు అధికారమున్ను (Referendum) పరిమితికాలములోనే ప్రజావిశ్వాసమును గోల్పోయిన శాసనసభ్యులసభ్యత్వము వోటర్లురద్దుచేయుఅధికారమున్ను (Recall) ఇట్టివే ! [1] వీటన్నిటిపైనను ప్రభుత్వచర్యలను నిరంతరము పరి

1. ఆదర్శనీయమైన ప్రజాస్వామ్యమునకు, రాష్ట్రము అధిక వైశాల్యముగా నుండిన సమన్వయము కుదురదని స్విడ్జర్లండు బుజావు చేయుచున్నది. పైచెప్పిన ప్రజలే స్వతంత్రముగా ప్రవర్తించుట 30 లక్షలజనముతో కూడిన స్విడ్జర్లండున మాత్రమే చాలకాలము సాధన జరిగిన పిమ్మట బాగుగ జరుగుచున్నది. బ్రైసు తెలిపినట్లు "నిరంతరప్రజాభిప్రాయపు కాపలాపైననే ప్రజాస్వామ్యము

శీలించి ప్రజాక్షేమదృష్ట్యావిమర్శించుట మూలముగా—నాలుగుసంవత్సరములకొకసారి ఒకరోజున "రాజ్యాధికారులండీ తమరు" అని అభ్యర్థిచేయు స్తోత్రఫలితముగా మైమఱచి గర్వించుచు అభ్యర్థులచే ఉబ్బవేయబడి" పోలింగులకు పోయి తిరిగి గాఢసుషుప్తిలో పడియుండు, ప్రజాసామాన్యమనే ఈ "రాజుకోటుల"ను—నిరంతరము "బహూవరాక్" అని మేలుకొల్పుచు వారిపక్షమున అశరీరవాణివై శంఖధ్వనితో

---

ఆధారపడు''నను మాట వాస్తవమైనచో అది చిన్నరాష్ట్రములకే చెల్లును. పూర్వ ప్రాచీనభారతదేశములో గ్రామములో ధర్మపరిపాలన బాగుండుటకు కారణము ప్రతిగ్రామము లేక గ్రామసముదాయము ఒకస్థానిక స్వపరిపాలన సంఘముగా (Self Government) సర్వవిషయములలో నుండుటయే. విశాలదేశములలో యేకదేశవిధానము పనికిరాదని బ్రైసు తెలుపుటకు కూడ కారణమిదియే. ఇటీవల ఫ్రాన్సుదేశములో కూడ దేశము రాష్ట్రములు వారీగా విభజింపబడి, రాష్ట్రీయస్వపరిపాలనను స్థాపించుట మూలముగా (Regionalism అని ఫ్రాన్సులో పిలిచెదరు.) ప్రభుత్వము ప్రజలదృష్టికి దగ్గఱలో నుంచబడుచున్నది. ఇది యేకదేశవిధానములలోని నూతనపరిణామము (Organization of the individual into groups and Pluralism in administration.) ప్రాచీనభారతవిధానములు రాజ్యాంగశాస్త్రమునకు యిచ్చిన కానుకగా ఇది కనుపించుచున్నది (చూ. రా. కు. ముఖర్జీగారి ప్రాచీనభారత స్వపరిపాలనకూడ) నవీనరష్యా, యిటలీవిధానములుకూడ యీరీతినే అనుసరించుచున్నవి.

నత్యమునుగర్జించుచు వరిపూర్ణ స్వాతంత్ర్యముతో విరాజిల్లుపత్రికలు, వేదికలుమున్నగునవి నేటి యీ ప్రజాస్వామ్యవిధానములలో కనుగొనబడిన దోషములకు విరుగుడుగా పండితులచే రచింపబడెను. ఇందులో ద్వితీయసభా (Second chamber) నిర్మాణము మున్నగునవి ప్రజాస్వామ్యమూలసిద్ధాంతములకు కొంత అవరోధము లే. కాని సంఘపు "యిచ్ఛ" కంటె క్షేమము ప్రధానముగా రాజ్యాంగపండితులు నేఁడు దీనిని ప్రవేశపెట్టక తప్పినదికాదు. [1]

ఎన్నిచేసినను యివి యన్నియు బాహ్యనిరోధములగుటవలన నవీన ఆర్థికసభ్యత, నాగరికతయొక్క ముఖ్యదోషమైన వ్యక్తి అహంభావము, భౌతికభోగప్రాధాన్యతల నివి తగ్గించజాలక పోయినవి. ఇంతేకాక ప్రభుత్వవిధానములలో ప్రవేశపెట్టబడిన యీ నూతన "తంతు" వలన అనఁకొనని యింకొక దోషము గల్గినది. "సాధ్యములు" (Ends) మరుగునబడి "సాధనము" (Means) లకు ప్రాధాన్యతకలిగెను. శాసనసభల వ్యవహారములు (స్టాండింగు ఆర్డర్లు, ప్రొసీజర్లు, కన్వెనుషనులు) బాహుళ్యములోను, కాలములోను దీర్ఘములగుట, అధికవ్యయప్రయాసలు, ఆడంబరములు హెచ్చగుట (న్యాయశాస్త్రం, క్లిష్టత్వము హెచ్చినకొలఁదియు కోర్టులు, వానిపని పెరిగిపోవుట, చివరకు క్రియాశూన్యమగుటవలె) జరిగి

1. ద్వితీయసభా వశ్యకతను లాస్కీవంటి వర్తమాన ప్రసిద్ధప్రమాణ రాజ్యాంగవేత్తలు కొందరు నిరసించుచున్నారు.

సది. "పార్లమెంటేరియన్" అనగా నీదశలో స్టాండింగుఆర్డర్లు బాగుగా వల్లెవేసి వ్యాఖ్యానముచేయుట శాసనములకు పూర్వాపరములను చెప్పుట, చరిత్రపాఠములను అంకెలతో శాసనసభలో రోజులకొలది తడుముకొనకుండగ వప్పజెప్పుట; అను అర్థములోనికి సంఘనాయకులు దిగిరి. ఈ చెక్సు, బ్యాలెన్సులవలన యేర్పడిన దోషములలో ఇది యొకటి. అంతేకాని పార్లమెంటేరియన్ అనగా ప్రజాక్షేమముకొఱకు ప్రజాప్రతినిధిగా శాసనసభలో ప్రవేశించి అందులకై కొన్ని నిర్మాణ భావములుగల మనిషి. అని అర్థముచేసుకొనువారు యిప్పుడు కూడ అరుదు.

అందులకే 1920 సం॥ నుంచియు ప్రపంచములోని నూతనపరిస్థితులను—తద్దృష్ట్యా ఆయాదేశములలో నేర్పడిన నవీనపరిస్థితులను, ఐరోపా మహాసంగ్రామానంతరపు ప్రజాస్వామ్యవిధానములను గూర్చియు, అపరిమితజిజ్ఞాస బయలుదేరినది. ఈ జిజ్ఞాస "సాధనములకు" సంబంధించిన పైన తెలుపబడిన Checks and Balances పైనకాక సాధ్యమునకు సంబంధించిన సంఘముయొక్క మూలసభ్యతలోనికి దిగినది. ౨౦ వ శతాబ్దపు యుద్ధపు పూర్వకాలమునకును, పరకాలమునకును గల భావజిజ్ఞాసలో యిదియొక ముఖ్యభేదము. ప్రజాస్వామ్యజీవితములో పుట్టిపెరిగిన జిజ్ఞాసువు బెర్నార్డుషావంటివాడు ప్రజాస్వామ్యమనగా "ప్ర" అను అక్షరపూర్వకమైన శబ్దమాత్రమేనని నిరసించెను. ప్రజాస్వామ్యపు పార్లమెంటరీ

విధానములో పుట్టిపెరిగిన యిటలీ నియంతయైన ముస్సోలినీ "పార్లమెంటరీ, ప్రజాస్వామ్యము కుళ్లిపోవుచున్న శవ"మని అనవ్యాపడెను. లాస్కీ, కోలువంటి రాజ్యాంగపండితులు, వెల్సువంటి యూహావైభవసంపన్నుఁడు, రస్సెలువంటి విజ్ఞానియుకూడ నూతన "శ్రుతిసమయము"ను (దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి ముద్దులొలికె శబ్దం) సూచించుచున్నారు. పైన తెలుపబడిన ప్రజాస్వామ్యములలోని దోషములు చాలభాగము సదరు విధానమును వాడివడబోసిన అనుభవజ్ఞులను ఆధారముగా జేసికొని ప్రసిద్ధపండితుడైన బ్రైసు తెలిపినవే.

అందుచే ప్రస్తుతమున్నరీతి ప్రజాస్వామ్య విధానమను యీ పటమును అతుకులతోను, కుట్లతోను, వాడుటకుదురదని ఋజువగుచున్నది. నవీనపరిస్థితులనుబట్టి అవసరమైన నూతన సభ్యతను బట్టి సంఘాభిప్రాయముల ప్రతిబింబించుచు సంఘమునకు లక్ష్యమార్గమును ప్రదర్శించునటుల ఆధునిక ప్రభుత్వ విధానములుమారవలెనని తేలుచున్నది. రష్యాలోసంఘము, సభ్యత, ప్రభుత్వమూలసూత్రములు, విధానముకూడ చాలవరకు సమాజవాదముపై నిర్మించి యీ సమస్య ఆవిధముగా పరిష్కరించుకొనిరి. ఇటలీలో యీ సమస్యయే కార్మికులు, పెట్టుబడిదారులు, వైజ్ఞానికులు అను మూఁడు సభ్యతలకు సమాన ఉపవత్తినిచ్చి, ఒకరుపై నొకరు అధికారము చెలాయించకుండునట్లు, మూఁడుశక్తులను రాష్ట్రస్వాధీనములో నుంచుకొని యీ మూఁడు సభ్యతలనుబట్టి ప్రభుత్వవిధానమును పునర్నిర్మాణము

చేసిరి. పైకి యీ విధానము పార్లమెంటరీ ప్రభుత్వమువలె కాన్పించుచున్నను, ఇది ఫాసిస్టు విధానముక్రింద యేర్పడిన సర్వాధికార రాజ్యముగ క్రియలో నడుచుచున్నది.

జర్మనీలో జాతీయ సాంఘిక విధానము పేరున (Nazism) ఇటీవలనే హిట్లరు సర్వాధిపత్యమున (మామూలు ప్రజాస్వామ్యవిధానము క్రిందనే) పాలనము నడుచుచున్నది. ఆస్ట్రియాలో కూడ డోల్ఫస్ సర్వాధికారమున యిటులే నడచినది. ఇక్కడి ఫాసిజమునందు మతప్రాధాన్యత హెచ్చు కలదు. కానిడోల్ఫసు హత్యానంతరము ఆస్ట్రియా పాసిస్టులు సంఘసామ్యవాదులు పెనుగులాటలో పడిరి. ఇదివఱలో తెలిపినట్లు అమెరికాదేశములో N. R. A. విధానముకూడ ముందుపెట్టి సర్వాధికారముగా పరిణమించునో తెలియుదు. కాని యీ N. R. A. విధానమువలన కేంద్రశాసన సభాపరముగా యిదివఱకు ప్రవహించుచున్న "రాజ్యాధికారము" యొక్క గతి ప్రక్కదారినిబట్టి "అధ్యక్షు" పరముగా ప్రవహించుచున్నది. చిరకాలమునుండి పార్లమెంటరీ సాంప్రదాయమునకు గురుపీఠముగానుండిన మన బ్రిటిషుపార్లమెంటే స్థలాంతరమున తెలిపినటుల మారవలెనని, ఆందోళన జరుగుచున్నది. రష్యా ప్రజకు ఆదినుండియు దేశములో "తనద" నునదిలేదు. జాతీయమైన ప్రాచీన నాగరికతాలేదు. ఇక రష్యా నిరంకుశ ప్రభుత్వ విధానములో, వ్యక్తికి స్వదేశాభిమానమే గలుగలేదు. అచ్చట స్వదేశాభిమాన మనగా

స్వదేశ జారుచక్రవర్తి ప్రజలను బంధించి యుంచిన శృంఖలాలస్మృతియే. అందుచేతనే ప్రాతప్రభుత్వము ప్రాతనభ్యతను లినెనీయులు తీవ్రముగా నాశనముచేసినను జనసామాన్యము మనస్సునొచ్చలేదు. ఏల ? జారురాష్ట్రము, స్థానే సోవియటురాష్ట్రము, పూర్వపు జమీందారుల ఫ్యాక్టరిపాలన, మిరాశీసంఘయాజమాన్యము స్థానే సోవియట్ ఫ్యాక్టరీ సోవియటు గ్రామపాలన వచ్చినవి. ఈవిధముగా కేంద్రాధికారమునకు లొంగియుండుట కలవాటుపడిన—రష్యా ప్రజామానసిక తత్వమునకు నూతనసంస్థలు అతుకుకొనినవి. రషియాలో వ్యక్తిస్వేచ్ఛ ఇంకముందునుండియే ఉదయించవలెను. ఇంక యిటలీలో పరిస్థితులకు వ్యతిరేకమైన పార్లమెంటరీ విధానము యించుమించు రద్దగుటకు పౌరుఁడొప్పుకొన్నను "రోమునగర" పూర్వపు ఖ్యాతికి వారసునని నమ్మి యిటలీ పౌరుఁడు, జాతీయతా విధ్వంసకమైన సమాజవాదమునకంతగా చొరబడజాలఁడు. అందులకే అది ఫాసిజముగామారినది. ఇంక యింగ్లండుపరిస్థితి యీ రెంటికంటెను విలక్షణమైన నూతనశక్తిని ఉన్నది. ఇంగ్లండుదేశీయునకు ప్రాచీన నాగరికతాగర్వము, ఇటలీ, భారత పౌరులకుండునంత యుండదనుట సత్యమే. కాని అచ్చట పౌరుఁడు ప్రాచీనకాలమునుండియు "వ్యక్తిస్వేచ్ఛకు" బాగుగా అలవాటుపడినాఁడు. అతని ప్రభుత్వము అతని ఆందోళనకు లొంగునను విశ్వాస మతనియందు అంకురింపజేసినది. పైగా రష్యా యిటలీ పౌరునికంటె ఆంగ్లపౌరుని ఆర్థి

కస్థితిమంచిది. పైగా కార్మికపక్షమువారు ఎన్ని ధర్మపన్న ములు చెప్పినను తమదేశమునకు లోకములోనున్న "గొప్ప ఆస్థి"—సామ్రాజ్యము, వ్యాపారస్థానములు—వదలుకొనరు. అందుచే పరిస్థితులనుబట్టి పార్లమెంటరీ విధానము మార వలసివచ్చినను అది యింగ్లండులో; రషియాలోవలెగాని, యిటలీ నమోనాగా గాని లేక రాష్ట్రమును పురుషశక్తిరూపక ముగా ఉపాసించుటకు అలవాటుపడిన సంస్కారముపై నాధార పడిన నవీన జర్మను విధానం ప్రకారముగాని మారుట కవ కాశము లేదు. ఆయాసిద్ధాంతములకు ఆయాదేశముల మాన సిక ప్రవృత్తి పరిస్థితులనుబట్టియే అనుకూల్యత గల్గుచుండున నుటకీ నాల్గుదేశములు తార్కాణములు.

ఈ నూతన విధానములలోని లక్షణములు మూడు. (1) జాతీయక్షేమము ప్రధానమగుట (౨) అందుకులోబడి దేశ ములోగల భూస్వాములు, సాహుకార్లు వ్యక్తిసభ్యత నాధార ముచేసికొని కార్మికులు కర్షకులపై నములు జరుపుచున్న పెట్టుబడి విధానమును హద్దుపద్దులలోనుంచి జనసామాన్యము యొక్క ఆర్థికాభివృద్ధికై అనగా ప్రతివారికిని వృత్తికల్పించుట దేశపు నిర్మాణశక్తిని వృద్ధిపఱచుట (౩) సిద్ధాంతములో యేదోయొక రాజ్యాంగవిధానమున్నను క్రియలో ప్రభుత్వాధి కారము ఒకసర్వాధికారి చేతులలో నుండుట. పార్టీలు, ఆస్థిని గూర్చి తగాదాలుపడి కోర్టుకెక్కినప్పుడు, కోర్టువివాద తేలే వఱకు ఆస్థికి రిసీవరు నేర్పాటుచేసినట్లు, ప్రాతవిధానములకు

క్రొత్తపరిస్థితులకుగల్గిన యీసంఘర్షలోనుండి స్థిరవిధానము యేర్పడువఱకును కాలపురుషుఁడు యీ సర్వాధికారులనే వారిని ఆయాదేశములకు—ముఖ్యముగా జర్మనీ, ఇటలీ మున్నగు ఫాసిష్టుపరమైన దేశములకు—రి సీ వ రు లు గా యేర్పాటు చేసినట్లున్నది.

ఇది బహు ఆశ్చర్యకరముగ తోపవచ్చును. ఆదినుండి గణ, మత భూస్వామి రాజుమున్నగు యేకవ్యక్తి నిరంకుశత్వ మునుండి, యెంతోబలి సమర్పణచేసి, రెండు వేల సంవత్సరము లు తపస్సుచేసి చివఱకు తత్ఫలితముగా స్వేచ్ఛాస్వరూపమైన నాగరికతాశిఖరమైన, ప్రజాసామ్యమును పొందిన యూరపు ఖండము తిరిగి వ్యక్తి నిరంకుశత్వములోనికి—అందులో నూటికి నూరు విద్యావంతులైన, ఆ దేశములలో (గత జర్మనీ యెన్నికలును నేటి ప్లెబిసైటున్ను తెలిపినటుల) నూటికి తొంబైముగ్గురు స్త్రీపురుషుల అంగీకారముతో యీవ్యక్తి సర్వాధికారులు ప్రభుత్వములోనికివచ్చి రనగా ప్రస్తుత ప్రజా స్వామ్యవిధానాలను (సిద్ధాంతములపట్లకాదు) గూర్చి ప్రజల లో అసహ్యము కాకపోయినను అగౌరవమైనను కలిగినదని అంగీకరించక తప్పదు. "రామరాజ్య"పురోజులకు యీప్రజా స్వామ్యయుగములో కూడ స్థానమున్నదని స్పష్టము. ప్రజా స్వామ్యవిధానమను బ్రహ్మాండమైన యంత్రమువంటి కల్పనలో యీప్రజాప్రతినిధులను వారు ప్రవేశించి యీయంత్రభారము క్రింద నొక్కుకొనిపోయి యుండుట; అశేషజనము అన్నమో

రామచంద్రాయని యేద్చుచుండుట, దేశములోని వ్యక్తుల నిరంకుశత్వము యథేచ్ఛగా సాగుచుండుటకంటె, జాతియొక్క నూతనభావములను బట్టి ప్రపంచ దృష్ట్యాసమ్మేళనచేసి అశేష జాతియొక్క—ముఖ్యముగాజనసామాన్యముయొక్క—అభ్యుదయమునకై ప్రధానముగా ఆర్థికముగా సమగ్ర నిర్మాణ కార్య క్రమమును రచించి (Planned Economy) అందు జాతిని ప్రవర్తింపజేయుటకై జాతిలోనుండివచ్చిన సర్వోత్తమ పురుషుడు ఒక్కడైనను, అతని సర్వాధికారిత్వమే శ్రేష్టమని ప్రజలు తెలుసుకొనిరి. ఇది ముఖ్యముగా ఫాసిష్టుదృష్టి. రాష్ట్రమునకు రాసిమీదదృష్టి (Tolalitarian state) కావలెననెదరు వీరు. అందులకే ఇటలీదేశమంతయు ఒక్కటే నిరోమా జనవర్గము. రాష్ట్రములోగల భిన్నసభ్యతలను ఈ రాసిదృష్టితో నిలుపవచ్చుననెదరువీరు. కానిసామ్యవాదులుకోరునది "సమత్వ రాష్ట్రము" (Equalitarian society) భిన్నసభ్యతలకు పొందు కుదరదనెదరు వీరు. ఉండవలసినది ఒక్కటే సభ్యతం అది కార్మికులది. ఇది వీరి సమతి. అందులకే ప్రస్తుత రష్యాసాంఘిక స్వామ్యము, యీనూతన సర్వాధికారములు లోకములోని ప్రజాస్వామ్య విధానములను— ముఖ్యముగా పార్లమెంటరీ పద్ధతియొక్క పునాదులను— కదల్చివైచుచున్నవి. ఇందుండి ముందు యెట్టి పరిణామమువచ్చునో చెప్ప జాలము గాని ప్రస్తుతపార్లమెంటరీ ప్రజాస్వామ్యము మాత్రము ప్రజాదృష్టిలో వెనుకబడుచున్నది.

మన భారత సాంప్రదాయభాషలో యీ పరిస్థితులను తెలుపవలసివచ్చినచో యూరపుఖండచరిత్రలో ఆదిని వ్యక్తి గతముగానుండిన బ్రాహ్మణధర్మము, మతము, ధర్మశాస్త్ర జిజ్ఞాస, లూథరుసంస్కారానంతరము సంఘపరమైనది. రాజ ప్రభుత్వ విరామముతో క్షాత్రధర్మమైన రాజ్యాధికారము సంఘపరమైనది. భూస్వాములు, పెట్టుబడిదార్లయొక్క ఆధి పత్యమున నలుగుచున్న జనసామాన్యము నేడు వైశ్య, శూద్ర ధర్మములను సంఘపరముచేయుమని సంఘర్షించు చున్నది. కావుననే వర్తమాన సభ్యత ఆర్థికమును ప్రధాన ముగా పురస్కరించుకొని బయలుదేరుటకు కారణము. జాతి యొక్క ఆర్థికసభ్యత తత్ప్రతినిధియైన ప్రభుత్వమందు ప్రధా నముగా ప్రతిఫలింపవలసి యున్నది. జాతియొక్క ఐశ్వర్యమును జాతీయులచే ఉత్పత్తిచేయించి సర్వజనులకును సద్వినియోగము చేయుటవలన—రాష్ట్రములోని నిరుద్యోగమును దారిద్ర్యమును పోగొట్టవలసిన కర్తవ్యము పూర్వములోవలె ప్రభుత్వముయిక ముందు వ్యక్తులకు వదలక తనదిగానే ప్రవర్తించవలసి యున్నది. నేడు జనసామాన్యమునకు కావలసినది హేబియస్ కార్పసుచట్టం (Habeas Corpus Act) కాదు. రోము మతాధిపతి దాస్యవిముక్తి కాదు. బైబిలును దేశభాషలో చదువుకొను హక్కుకాదు. రాజుల నిరంకుశత్వమునుండి విముక్తి కాదు. రాజ్యాధికారమును ప్రభుత్వ సంస్థలమధ్య యుక్తముగా పంపకముచేయుట కాదు. శాఖావిభాగమున్న

(Division of powers) కాదు. ఇవి నేడు పురుషధర్మము నకు అవరోధములుగాలేవు. వ్యక్తికి స్వవృత్తి, నవీన ఆర్థిక శాస్త్రము సమర్థించినసహకారభావముతో నిర్మాణము అతుల తయారైన పదార్థము సాధ్యమైనంతవఱకు సమభుక్త మగుట, మూలముగా నేడు వ్యక్తి పురుషార్థసిద్ధిని పొందవలసి వచ్చినది. ఇక్కడ నేడు ధర్మసంస్థాపనకు క్షేత్రము నేటి ఆర్థికదాస్యము ఆతని ఉన్నతవికాసమున కవరోధముగా నున్నది.[1] అందులకై నిర్మాణవిధానములను రచించుటకును అవసరమును బట్టి వెంట వెంటనే సవరణచేసికొనుటకు అవ కాశముండవలెను. అనగా ప్రభుత్వము అనుభవజ్ఞులైన శాఖా ధిపతుల రాజ్యముగా మారవలెను. ఇందు పక్షభేదములుండిన పనిసాగదు. కాలయాపనమునకు సిద్ధాంత రాద్ధాంతములకు నిట స్థానము లేదు. తంతులకు, హోదాలకు ప్రజలవన్ను ఖర్చువడు

---

1. ఇదియే నేడు రషియా ఉద్దీపన క్రింద ప్రతిరాష్ట్రము నిర్మాణ విధానముల రచించుటలోని ఆశయము. (Object of planned Economy is the "Fullest scope to the utmost self expression and self realisation for every individual" Planned economy is "Rational production an equitable distribution" K. T. shaw's Articles in Bombay Chronicle D. 26 th 27 th 28th December 1934. విధానయుత ఆర్థికనిర్మాణము (Planned economy) అనగా ముందుగా సంకల్పము చెప్పుకొని అప్రకా రము సమాప్తిచేయుటకై వహించు వ్రత, యజ్ఞ, యాగ, ఉపా సనాది దీక్షవంటిది. సంకల్పము (plan) లేనిది శక్తి భిన్నమార్గ

రోజులు పోయినవి. అనగా ప్రజామోదముపై నేర్పడిన, ప్రజల విజ్ఞాన, ఆర్థిక, సాంఘిక రాచకీయజీవితమును, ఆధునికపరిస్థితుల నుబట్టి ప్రపంచఐక్యమును దృక్పథమునుండి జాతీయక ప్రవర్తింపజేయు "ప్రవర్తకుల" (Directors) సంఘముగా ప్రభుత్వములు మార్పుచెందవలసిన దశ రాజ్యాంగముయొక్క ఆధునిక పరిణామములో—ముఖ్యముగా అమెరికావంటి దేశాలలో—వచ్చినదని పండితులమతము.

## పరిస్థితులను బట్టి సిద్ధాంతములోని నవ్యపరిణామము.

అందులకే ఫ్రెంచివిప్లవము నాటిరాజ్యాంగ సిద్ధాంతములకు నూతనపరిణామ దశవచ్చినదని నవ్యమతము. నేడు ప్రజాస్వామ్యమనగా ఒక రాష్ట్రములోని వయస్సువచ్చిన స్త్రీపురుషులెల్లరును ఓటరుజాబితాలలో పడుటకాదు. లేక వీరందరును పోలింగులకుపోయి ఓటుహక్కును చెలాయించుటతో మాత్రమే సరిపోయేస్థితియుకాదు. రాజ్యాంగసిద్ధాంతులు నవీనపరిస్థితుల అనుభవములో ప్రజాస్వామ్యముయొక్క విశాలార్థమును గమనించుచున్నారు. "ఏరాష్ట్రములో హెచ్చుమంది ప్రజలు సంఘశ్రేయమునకై అవసరమగు కార్యములలో ప్రవ

---

ములు త్రొక్క గమ్యములేనిదగును. దీక్ష (time limit estimate, output, and Methodology) లేనిది గమ్యము పొందుటకు ఉద్దీపనయుండదు. ఈసంకల్ప దీక్షలతో గూడిన పూర్వమీమాంసవైపు నేడు ప్రపంచదృష్టి తిరుగవలసి వచ్చినది.

త్రించెదరో ఆరాష్ట్రములో ప్రజాస్వామ్యవిధానము అధిక వ్యాప్తిలోనుండు" ననే నూతన నిర్వచనములోనికి యీప్రజాస్వామ్యసిద్ధాంతము వికసించుచున్నది.

అందుచే యీ దశలో ప్రజాస్వామ్యమనేది మూడు విభాగములుగా కనబడుచున్నది. ఇవి వ్యక్తి ప్రజాస్వామ్యము (Individualistic democracy) వృత్తి ప్రజాస్వామ్యము (functional democracy) సమూహ ప్రజాస్వామ్యము (corporative democracy) అనునవి. ఎట్టిబాధ్యతలుగాని విశేషణములుగాని మోపబడక కేవలవ్యక్తి మాత్రుడైన పౌరుడు మూల కందము గాగలదియే నిజమైన ప్రజాస్వామ్యముఅనియు, అదియే నిజమైన స్వేచ్ఛారాజ్యమనియు, ఆఘాత ప్రతిఘాత (Action and Reatcion) న్యాయము ననుసరించి శాసన బద్ధమైన బాధ్యత వ్యక్తిపై మోపుటతోడనే స్వేచ్ఛావిహారమునకు అవరోధము కల్గుననియు, రాజ్యాధికారులైన ప్రజలపైన అర్హతలు నిరూపించుట యనునది ప్రజాస్వామ్యసూత్రమునకు అననుకూలము అనియు వ్యక్తి ప్రజాస్వామ్యవాదుల ఆక్షేపణలు. అందులకే కేవల వ్యక్తి మాత్రుడైన పౌరుడు మూల కందము గాగలదియే నిజమైన ప్రజాస్వామ్యమనియు తదితరములైన వన్నియు ఒకవిధమైన నిరంకుశత్వములే ననియు వ్యక్తి స్వామ్యవాదులనెదరు. ఇది యొకమతము. ఈమతమే యుద్ధానంతరమువరకు ప్రబలియుండినది.

ప్రజాస్వామ్యమనేది "తోకల లెక్కలను బట్టి నిర్ణయించుకొను మందలరాజ్యము కాదు." ప్రాచీనప్రజాస్వామ్యవాదులుకూడ యిటుల తలచియుండలేదు[1]. ప్రజాస్వామ్య మనగా రాష్ట్రములో యుండే యావత్తుమనుష్యుల స్వామ్యము కాదు. కొన్ని బాధ్యతలుగల పౌరులరాజ్యము. అందులో నవీనార్థికపరిస్థితులలో సంఘమంతయు కార్మికయజమానుల క్రింద విభాగమైన నేడు యీ అర్హత అనేది వృత్తిపరముగా నిర్ణయించవలసిన ఆవశ్యకత కలిగినది. వెంటనే వృత్తులనుబట్టి ప్రాతినిధ్యము ఏర్పడునట్లు ప్రజాస్వామ్యవిధానాలు మారవలెను అనివృత్తిప్రజాస్వామ్యపరమైన(FunctionalDemocracy) రెండవమతము. సామ్యవాదము ఫాసిస్టులు శ్రేణీస్వామ్యవాదులు—యీ ముగ్గురకు ఈ సిద్ధాంతము ఆలంబనమైనను "వృత్తి"యను నిర్వచనముపట్ల వీరిలో మహాభేదములుగలవు. ఫాసిస్టు మతప్రకారము పెట్టుబడిదారు, విజ్ఞాని, కార్మికుడు

---

1. " When John Milton or any of the theorists of the British common wealth spoke of the "people" he certainly did not mean this. For Milton "The people" was essentially a qualitative conception. "The people" that had a right to sovereignty consisted not of all the individuals within the state but only of as many of them as could be adjudged worthy of a share in power on account of their personal quality" (Guide to modern politics by G. D. H. Cole P. P. 402 )

యీముగ్గురును వృత్తి పౌరులక్రింద వచ్చెదరు. కాని సామ్యవాదము వృత్తి అనుశబ్దము క్రింద ప్రధానముగా కార్మికునికి (కొంతవరకు విజ్ఞానికి)తప్ప పెట్టుబడిదారునికి స్థానమే యివ్వదు.

ఈ వృత్తులనేవి మధ్యకాలపు యూరపుఖండములోవలె "సమూహ" మయములైనవి. అందుచేత యీ సమూహములు ప్రాతిపదికగా రాజ్యాంగములు నిర్మింపబడవలెననియే మూడవశాఖవారిమతము వృత్తిసమూహముల మాట అటుంచి వ్యక్తియే నేడు యెక్కడికక్కడ "సమూహ" వర్తియై, (corporate life) జీవించవలసిన స్థితిలో నున్నాడు. కాన మానవపరిణామములో వచ్చిన ఈ స్వాభావికపరిస్థితినిగూడ రాజ్యాంగము గమనించక వీలులేదనెదరు వీరు. వృత్తిచేయు పౌరుని రాజ్యాంగమునకు మూలముగా నిడికొనుట నవీనకాలానుగుణమే. కాని యీ కార్మికపౌరుని దృష్టి తానువిడిగా నున్నప్పటికంటె సమూహవర్తియై యున్నపుడు అధికసామ్యావస్థలో నుండుననికూడ యిక్కడివాదము. వ్యక్తి వేరు. ఆవ్యక్తియే సమూహవర్తియైనపుడు అతని భౌతికమానసికదృష్టి వేరు. అని సమూహ ప్రజాస్వామ్యవాదము (Corporative Democracy).

వ్యక్తియనే పదార్థములోనే యివన్నియు కలవనియు నిర్విశేషమైనవ్యక్తి ప్రజాస్వామ్యమే నిజమైన లక్ష్యమని మొదటిశాఖ. సంఘము కార్మికమయమైపోయిన నేడు ప్రజాస్వామ్యము తత్పరము కావలెనని రెండవశాఖ. సాంఘికదృష్టిపై

ప్రభుత్వము నడుపవలసిన ఆవశ్యకత అధికముగా గలిగిన నేమ సమూహవర్తియైన పౌరుల ప్రజాస్వామ్యము వాంఛనీయమను వారు మూడవశాఖవారు. అందులకే వ్యక్తిపరముగా, వృత్తి పరముగా, సమూహపరముగా, యీ రీతిగా యుద్ధానంతరపు ౨౦వ శతాబ్ద ద్వితీయపాదములో ప్రజాస్వామ్యమనేది మూడుపాయలైనది. దీనిపైగల తదితర ప్రసిద్ధపూర్వవస్తు సిద్ధాంతముల సిద్ధాంతదీపికలో మీమాంసచేసెదము.

కృషి గౌరవప్రధానమైన ఈనూతనసంఘరచనలో మాంటెస్క్యూనాటి శాఖావిభజన సిద్ధాంతము (Separation of Powers) నకు ప్రసక్తి తగ్గిపోవుచున్నది. ఇందులకు తార్కాణము శాఖావిభజనసిద్ధాంతము నేమాత్రము జారనీయక రచింపబడిన అమెరికా రాజ్యాంగములో నేటి అధ్యక్షుడు ప్రస్తుత N. R. A. విధానంక్రింద శాసన, కార్యనిర్వాహక, న్యాయనిర్ణయ సంబంధమైన కార్యత్రయమును తనయందు లీనముచేసికొనుటకు ఉద్యమించుటయే. ఇక యూరపుఖండ దేశప్రభుత్వములు కూడ, ఈకార్యత్రయమును యేకసంస్థయందులీనము చేయుట పరముగానే నడచుచున్నటుల పూర్వము తెలుపబడినది.

ఈ నవీనపరిణామములో రాష్ట్రముయొక్క ఏకస్వామ్యము (state absolutism)నకు కొన్నిస్థలములలో విచ్ఛిత్తి గలుగగలదు. రాష్ట్రమనేది అన్నిటికి మించిన సంస్థయా (one over the many) లేక సంఘములో గల అన్నిసంస్థల్లోను—దండనాధికారము మాత్రము విశేషలక్షణముగా

గల్గిన–ఒకటి యా? (one of the many) లేక యూని యనులు సహకారసంఘములువంటిదే కాదా రాష్ట్రముకూడ? అయిర్లండు, జర్మనీలవంటి ప్రజాస్వామ్యములలోని శాసన సిద్ధములైన ఆర్థికసభలుకూడ రాష్ట్రము యొక్క అద్వితీయాధికారమును తగ్గించునవే. రష్యా, యిటలీ మొదలగు రాష్ట్రాధిపత్యవిధానములలో గూడస్థానికసంఘములు కొన్ని అంశములలో శాసనాధికారమును చెలాయించుట క్రొత్త పోకడ (New Varient). రాజ్యాధిపత్యము అద్వితీయమా (Monistic theory of Sovereignty)! లేక అనద్వితీయమా (Pluralistic theory of Sovereignty) అను ప్రశ్నకు పూర్వముకంటె నేడే అధికప్రసక్తి గల్గుటవిశేషము.

వెంటనే రాష్ట్రముయొక్క మూలము ప్రయోజనమును గూర్చి ప్రబలియుండిన సిద్ధాంతములే మారగలవు. రాష్ట్రము ప్రత్యక్షముగా ప్రజాభివృద్ధికర కార్యాలను చేయుట కేర్పడ లేదు, దండనీతి ప్రధానమైనది, అని నేటివరకు తలువబడి నది. సంఘములో సమిష్టి కృషి గౌరవము, వృద్ధిచెందుచున్న కొలదియు స్వార్థము, దుర్నీతి, తగ్గుచుండును. దండనీతికి స్వార్థ ప్రకోపముగల సంఘములోనే ప్రసక్తి. యింతేకాక నవీన రాష్ట్రము తన దండనీతిని— భారతసిద్ధాంతము లెటులున్ననూ— సంఘములోని ధనబలవంతుల ఆధిపత్యమునకే వినియోగించుట సహజమని కొందరి ఆక్షేపణ. మరియు ప్రజాక్షేమపర మైన కార్యాలను (Social service functions) వ్యక్తు

లకు వదలుట సంఘమును ఆవ్యక్తుల దాస్యమునకు పాలుచే యుట. ఇంతేకాక ప్రజలలో విజ్ఞానాభివృద్ధిగలిగినకొలదియు వారిలో స్థానికసంస్థలనిర్మాణము, సంస్థల పరిపాలనా దక్షత హెచ్చైనకొలదియు పాలకవర్గము, పాలితవర్గమనే భేదము తగ్గుచుండును. ఇట్టిదశలో పూర్వము వ్యక్తులు జరిగించే ప్రజాక్షేమకార్యాలు ఆవ్యక్తులు ఆక్రమించిన ప్రభుత్వము పేరుతో చేయుటకూడ సహజమే. అందులకే రాష్ట్రమ నేది దండనీతి ప్రధానమైనదిగా గాక ప్రత్యక్షముగా ప్రజాసేవను చేయుసంస్థ అనే నూతననిర్వచనమునకు కూడ సిద్ధాంతులు దారిచూపుచున్నారు. (from the coercive state to the sociol service state.)

ఈ సిద్ధాంతములు యెట్టి ప్రజాస్వామ్యవిధానములో అమర్చగలరో పరిశోధనలే ముందు తెలుపగలవు. కాని ప్రజా స్వామ్యములో ఒక తరగతిదైన పార్లమెంటరీ పద్ధతిమాత్రము అనుభవమువలన నవీనపరిస్థితులలో—ముఖ్యముగా యింగ్లండేతర దేశములలో—పనికిరాదని విదితమగుచున్నది.

ప్రస్తుత ఈ దేశ పరిస్థితులలో, కుల, మతపక్షముల మధ్య నిరంతరము మెజారిటీలు మారుట కవకాశము గల్గినట్టి నేడు, దేశముయొక్క ఆర్థికపునర్నిర్మాణము ప్రధమావశ్య కతగా గల్గిన భారతదేశమునకు ఒకప్రభుత్వము ఐదుసంవత్స రములైనను నుండునను నమ్మకములేనప్పుడు యేమియును లాభములేదు.

పైన తెలుపబడిన రాష్ట్రసంస్కారమనగా పూర్వము భారతదేశములో ప్రభుత్వములే వర్ణాశ్రమధర్మాలను ప్రవర్తింపజేసిన పద్ధతివంటిదిగా కనుపించుచున్నది. ఇది సాధనమా ? సాధ్యమా ? ఇది సాధనయే. ఎలనన ? వ్యక్తి సుఖ, వ్యక్తిస్వత్వ, వ్యక్తి అర్థనాడులైన బెంథము, స్పెన్సరు, రైకార్డో, మిల్లుపండితులును, సమిష్టివాదమునకు చెందిన—కార్మిక స్వామ్యవాదులు, సమాజవాదులు, అరాష్ట్రులు—ప్రౌథన్, మార్క్సు, క్రాపోట్కిన్ జిజ్ఞాసువులున్ను; యీ ఉభవాదులును లక్ష్యములో—ప్రభుత్వరహితమైన ముక్తావస్థనే రాచకీయసంఘపు పరమప్రాప్యముగా అంగీకరించిరి. అందుచే ప్రభుత్వముమాట అటుంచి అసలు సంఘవ్యవస్థయే పైసాధ్యమునకు, సాధనగా అంగీకరింపవలసిన దగుచున్నది. అనగా రాష్ట్రవిధానాలన్నియు మానవస్వేచ్ఛ అనే సాధ్యమునకు సాధనములేయని స్పష్టము. "రాష్ట్రస్వామ్యమునకు స్థిరత్వము నిచ్చిన ఒక్క హేగెల్ మతము తప్ప—హేగెల్ మతములో కూడ మానవస్వేచ్ఛయే లక్ష్యముగా నున్నను, ఆ స్వేచ్ఛ ప్రభుత్వవిరహితమైన దశలోనో, సహితమైన దశలోనో చెప్పుటకు వీలుగా కున్నది—ఇతర పాశ్చాత్య పక్షములన్నియు పై రాచకీయలక్ష్యములో యేకాభిప్రాయము లగుట చూడవారి భేదములు ప్రధానముగా సాధనకు సంబంధించినవని గోచరించును. వ్యష్టివాదులనిపించుకొనిన హెర్బర్టు స్పెన్సరు, మిల్లు పండితుల జిజ్ఞాసలు సామ్యవాదపరముగా దారితీయుటను వారి

వ్రాతలలో చూచినప్పుడు యీ సిద్ధాంతము మఱింతదృఢ పడును.

భారత దేశపు వేదాంతపడ్దర్శనముల వారికిని బౌద్ధులకును సాధనములో యున్న సామరస్యము—శమదమాదులు అహింస, సంసారనిరాసము, నిధిధ్యాసమనసములు బౌద్ధులు సహా అందఱును సాధనగా నొప్పిరి—పాశ్చాత్య రాచకీయ దర్శనముల వారికి సాధనములలో కనుపించుచున్నది.

అందులకే వ్యక్తివాదమునకు కూడ నేడు సుతరామ్ స్థానముపోలేదు. బెంథము నాటివ్యక్తి వాదముకూడ నేడు తన స్వసంస్కారములకు లోబడి లక్ష్యపరముగా విశాలమగుచునే యున్నది. జాతీయతస్థానే అంతర్జాతీయసహకారమును, కేంద్ర పార్లమెంటు చేతులలో యిప్పటివలె రాజ్యాధికారము నుంచుటకుమారుగా భూభాగములనుబట్టిగాని,వృత్తినిబట్టిగాని యేర్పడినసంఘముల మధ్య రాజ్యాధికారము విభక్తముకావలెను.[1]

---

1. ఇక్కడ ఉద్దేశ్యమేమన యీ వ్యష్టి పెట్టుబడి విధానపు నలుగుడిలో వ్యక్తి ఒంటరిగా నిలువబడిన పడిపోవును. అందుచే అతని భద్రతయు అతనివ్యక్తి వికాసమున కవకాశమును (Opportunity for the development the real personality, of the individual)తనవృత్తి సంఘము ఆంధ్రక్రింద నే కలవు. మఱియు రూసో చెప్పినట్లును; మిల్లుపండితుఁడు ప్రేమించునట్టియు; ప్రజేచ్ఛ, వ్యక్తి స్వేచ్ఛ అనేవి చిన్నవర్గములలో నే సంపూర్ణముగా వర్ధిల్లును అధికసంఖ్యాకుల దౌష్ట్య)

ప్రజాస్వామ్యములని నేఁడు పిలువబడుచున్న “అధికసంఖ్యాకుల నిరంకుశత్వము (Tyranny of the majority) నుండి వ్యక్తిని కాపాడుటకును భూభాగములబట్టి యేర్పడిన క్రిందిశాసనసభపైన వృత్తి సంఘప్రతినిధులతో కూడిన రెండవశాసన సభానిర్మాణముకావలెను. ఇట్టి సంస్కారములతో వ్యక్తివాదముకూడ నేఁడును అనుశ్రుతముగానే ప్రయాణము చేయుచున్నది. [1]

కాని యేపక్షమువారి సంస్కారములైనను ఆర్థికసభ్యతకు విలువనిచ్చుచున్నవి. వ్యక్తివాదులుకూడ “వ్యక్తిఅనగా తనవృత్తి సంఘములో సభ్యుడైనవ్యక్తి (Group life)”—మొత్తము రాష్ట్రసంఘమునకు అవయవమైన వ్యక్తియని మాత్రము (సమిష్టివాదులవలె) వీరంగీకరించరని తెలిసికొనవలెను—అని తమవ్యక్తిత్వనిర్వచనమును విశాలపఱచుటకు టంగీకరించిరి. అనగా సభ్యతకు మూలపీఠము అర్థమనియు,

---

మునకు యిక్కడ స్థానము తక్కువ. అందుచే చిన్నచిన్నవిగా యేర్పడిన వృత్తిసంఘములే యెన్నికవిధానమునకు ప్రాతిపదికలుగా నుండవలెను.

1. చూ. గ్రాహంవాలాగారి Great Society, అనుగ్రంథము యిటులే జాతీయభావనిరసనమును బోధించును. Great Illusion అను Norman Angels గారి గ్రంథముకూడ వ్యష్టివాదములో నవీన పరిణామమును సూచించుచున్నది. ఇఁక సిడ్నీ వెబ్ గారి పార్లమెంటరీ సంస్కారసూచనలు (చూ. Governance of England) కూడ వ్యక్తివాదపక్షముగా కనబడుచున్నవి.

సభ్యత వ్యక్తియందుగాక సంఘభూయిష్ట మగుచున్న దనియు, కొంతవఱకు యిక్కడను (సమిష్టివాదములోవలె) అంగీకరింపబడుచున్నది. అందుచే వాది ప్రతివాదుల మతములలో లక్ష్యమునకే గాక తత్సాధకమైన విధానపు మూలసూత్రముల లోని ముఖ్యాంశములయందు కూడ యేకాభిప్రాయత కొంత వఱకు గలదని నిర్మత్సరులకు గోచరింపకపోదు. వైకార్ల్ వేత్తయేమి, భారతాద్వైతజగద్గురుడైన శంకరుఁడేమి కట్టు బొట్లు హెచ్చగుటవలన, తాను నిరంతరము సంఘములోను, సంసారములోను కట్టుబడియున్నాననను స్మృతిని వృద్ధిచేయుట చేత, ముక్తావస్థకు, వ్యక్తి దూరమగుచుండునని తలఁచిరి. అయి నను నవీనభౌతిక పరిస్థితులవలన వచ్చిన ఆర్థికదాస్యతలో వ్యక్తికి అద్వైతజ్ఞానా (ఇదియే పాశ్చాత్యుల "వ్యక్తిస్వేచ్ఛ") వకాశము తగ్గిపోయినది. ఈఆర్థికదాస్యపటలమునుండి బయ టపడగల సంఘమే తిరిగి "వ్యక్తిస్వేచ్ఛ"కు సిద్ధిరంగమగుచు న్నది. ఇదియే సమిష్టివాదులు కోరే "స్వేచ్ఛారాజ్యము (Realm of Freedom)". "సంఘేశక్తిః కలౌయుగే" అను న్యాయానుసారము ఆర్థికదాస్యపటలము వ్యక్తి సాధనవలన గాక సమిష్టిసాధనలవలననే భేదింపబడవలెనని పరిస్థితులు ఋజువుచేయుచున్నవి. న్యాయ, సాంఖ్య, మీమాంస, వైశే షిక, యోగదర్శనములే గాక బౌద్ధాది మతములు కూడ సాధ నలో వైరాగ్యమును అంగీకరించుటవలన, సాధ్యములో వీరికి విరోధియని తలఁపబడుచున్న అద్వైతసాధనకు మెట్టుల సోపా

నపరంపరయూ ఉపచరించుచున్నవో[1] అటులే తత్త్వములో వ్యక్తి స్వేచ్ఛావాదులుకూడ ప్రభుత్వములయొక్క యీనూతనపరిణామములలో అవసరమైన సంఘప్రవర్తక పరిణామమును (State directing the life of the individual in society) అంగీకరించవచ్చును.

ఉభయుల పక్షములకు గలభేదము వాస్తవములోనిది గాక సమస్యా "వీక్షణ" (ఇదికూడ దేశకాలపరిస్థితులను బట్టి యేర్పడినది. అందుచే ౧౮ వ శతాబ్దములోని బెంథము యొక్క వీక్షణకును, ౨౦ వ శతాబ్దములోని గ్రాహం వాలాను యొక్క వీక్షణకును, ఒకమతములోని వారైనను తేడా కనిపించుచున్నది) మునుబట్టి వచ్చినప్పుడు యిట్టి కలయికకు మఱింత అవకాశము గలదు. ఈ విధముగా స్థూలదృష్ట్యా, ఉత్తర, దక్షిణ ధృవములుగా భాసించిన వ్యష్టి, సమిష్టివాదుల భేదములు సూక్ష్మములో వీక్షణామాత్రభేదములై పోయినవి. వ్యష్టివాది "స్వాత్మలో, విశ్వాత్మను" చూస్తే సమిష్టివాది "విశ్వాత్మలో, స్వాత్మను" లీనముచేయును. ఆది చైనా జిజ్ఞాసువులైన కన్‌ఫ్యూసియస్, మోట్జులకు కూడ కొంతవఱకు యిట్టి భేదవీక్షణమే గలదని తోచుచున్నది. అందుచే తత్త్వములో "యేకతానత్వము" గల వ్యష్టి సమిష్టివాదుల మధ్య గల తీవ్రత్వము యింతటితో శమించుగాక.

---

1. చూ. వ్యాసతాత్పర్యనిర్ణయము, అనుగ్రంథము.

## అధ్యాయము—తొమ్మిది.

---

ప్రపంచమును యేకసమాజముగా మార్చుటకు పని చేయుచున్న ఉద్యమములు, పరిస్థితులు. యూరపుఖండమేమి, తదితరప్రపంచమేమి నేడు అపూర్వవిపర్యయములను పొందు చున్నది. కాలశక్తిఇంకుండి నూతనసంఘమును రచించుటకు గాను లోకముచేత చేయించుచున్న తపస్సేమోయిది. భౌతిక ముగా భూకంపములు, శీతలవాయు ప్రవాహములు, తుపా నులు, అపూర్వరోగములు; ఆర్థికముగా ధరలు పడిపోవుట మారకపురేట్లు తల్లక్రిందులగుట, బంగారు ప్రమాణము (Gold Standard) చాలదేశములలో రద్దగుట, నిరుద్యోగము హెచ్చగుట నూతన ఆర్థికనిర్మాణముల ప్రభుత్వములు రచించి జనసామాన్యమునకు పనికల్పించవలసి వచ్చుట. సంఘనాయ కత్వము దేశములోను, విదేశములలోను పెట్టుబడిపెట్టి తద్వ్య ప్త్యాసమస్యల వీక్షించే బ్యాంకరులవశములో నుండుటచే, దేశ ములో కోట్లకొలది జనులు తిండిలేక మాడిపోవుచున్నను— సాహుకారుని కొట్లోగింజలు, యంత్రములో సరుకులు విడు దలలేనందున—ఆదేశములో అధికోత్పత్తిదోషము గల్గినదని భ్రమించుస్థితి గల్గినది. యీ స్వల్పవ్యక్తుల ఐశ్వర్యమును బట్టి ఆర్థికసూత్రముల నిర్మించే భ్రమలో పండితులుండిరి. రాచకీయ

ముగా వందలకొలంది సంవత్సరములనుండి వచ్చుచున్న రాజ స్వామ్యములు పడిపోవుట మాట అటుంచి నిన్నటివఱకును చెక్కుచెదరని పార్లమెంటరీ ప్రజాస్వామ్యములు గలిగిన అనేక దేశములలో అవి రద్దైనవి. ఉన్నచోట్ల ఉగ్రరూపతలూరు చున్నవి. ఒకమూల జాతీయకాంక్షతో, మానవరక్తపిపాసతో, మారణసాధనములు—పూర్వపు బిరోపాసంగ్రామములలో కంటెను విచిత్రమైనవి—అపరిమితముగా, బీదప్రజల డబ్బుతో నిర్మించుచునే యున్నారు. ఈ అఖండభూగోళములోని యావత్తు మానవజాతియు నేడు యీ తపనముయొక్క వేడిని స్వల్పభేదముతో సమానముగా అనుభవించుచున్నారు. అందులకే మానవజాతియొక్క ఐక్యతకు యీ విపత్పరంపర కూడ సహకారి కాగలదు.

పైకి నిరుత్సాహకరముగాను, అస్థిరముగాను కన్పించుచున్న నేటిపరిస్థితులలో కూడ ప్రపంచఐక్యతను సంధించెడు శక్తులు తీవ్రత్వముతోడనే పనిచేయుచున్నవి. అట్టి ఉద్యమముల కొన్నిటినిగూర్చి తెలుపకుండగనే యీ భాగమును ముగింపజాలము.

నానాజాతిసమితి ఉద్యమమనగా "జాతీయత కదలకుండా ప్రపంచకల్యాణమునకు తోడ్పడుట". పైగా యిందు సభ్యతకూడ జాతీయతనుబట్టి యుండుటవలన యిక్కడ "జాతీయాహం" నిరంతరము స్మృతిపథములోనే యున్నది.

ఇక రెండవయుద్యమము ౧౯౧౯ వ సంవత్సరములో రష్యాసమాజవాదుల నాయకత్వమున స్థాపితమైన: మూడవ సమాజవాద అంతర్జాతీయసంఘము (Communist third International) ప్రపంచమునంతను "ఓపికున్నంతవఱకు అందరును పాటుపడి, వచ్చినది సమముగా ననుభవించుచు హెచ్చుతగ్గులులేని—ఏకమానవసంఘముగా చేయుట వీరి ఆదర్శము. "జాతీయసమాహమ్" యిక్కడ కేవలము నామమాత్రమేగాని నానాజాతిసమితిలో యున్నంత యిక్కడివారు ఒప్పరు. వీరినన్నిహితలక్ష్యము ప్రపంచకార్మిక గణములను యజమానులపై తిరుగుబాటునకు పురిగొల్పుట ; పై ఆదర్శమునకు వీరుపెట్టుకొనిన సాధనము, పెట్టుబడిదారులయందు వీరికిగల "అస్పృశ్యభావము" అనునవి యెంతవఱకు ఉపచరించునో. కాని వాస్తవజగత్తులో మానవులయెదుట గల ఆదర్శములన్నిటికిని యిదికడయే నని అనెదరు. దీనిని మించిన ఆదర్శమేదైనను ఉన్నయెడల అది లోకమంతయు "శుకయోగీంద్రుల" మయమైపోవుట. బహుశః కార్మికుల నిర్స్వమసమాజము యోగీంద్రుల సమాజసిద్ధికి సోపానమేమో! [1] కాని

1. మమత్వనాశనమే నిజమైన హింసానాశనము. "అహింస" అనునది ఒక స్వతంత్రలక్ష్యము కాదు. శుకజీవితాదర్శములో మానవుని "ఊహ" లోనుమతానిరాసము. పోయినంతదూరము మఱియు ఆదర్శములోను పోలేను.

రష్యాయా అనుభవములో ఈ ఆదర్శముయొక్క కష్టసాధ్యతను వెల్లడించు అంశములుకూడ గోచరింపకపోవు.

మూడవది రవీంద్రనాథుని "విశ్వభారతి" ఉద్యమము. "విశ్వభారతి" శబ్దము ఉపనిషతువేదాంతములోని "అహం విశ్వం భువనమభ్యభవామ్" అనువ్యక్తి యొక్క మహాత్తరమైన పరమప్రాప్తిని తెలుపుచున్నది. ఇతరప్రపంచము నిద్రపోవుచుండిన అతిప్రాచీనకాలములోనే—రోమునకు పూర్వమే—యిట్టి అఖండవిశ్వకల్యాణాదర్శమును ప్రపంచమున కిచ్చిన భారతదేశము రవీంద్రోద్గాతద్వారా యిట్టి సందేశము ప్రపంచమునకు నేడందజేయుట ఉచితమే. కాని యీయన సాధన కేవల ప్రపంచవిజ్ఞానముల కలయికవలన "విశ్వాత్మ" సిద్ధి నపేక్షించుచున్నది. అందువలన ప్రత్యక్షరాచకీయ పరముగా దీనిప్రాముఖ్యము తక్కువ. కాని ప్రపంచములోని ప్రఖ్యాతపండితులు, విశ్వవిద్యాలయములు, రవీంద్రుని ఉద్యమమునకు తోడ్పడుట శుభకరము.

నాల్గవది :—ఇది గాంధీగారిది. ఇందు విశ్వైక్యము సన్నిహిత సాధ్యముగాలేదు. సాధనశక్తివలన అదియే విశ్వఐక్యముగా మారిపోగలశక్తి యిందు కలదని తోచుచున్నది. దక్షిణాఫ్రికాలోను, భారతజాతీయ ఉద్యమసందర్భములోను యీయన అహింసాసాధనవాస్తవజగత్తులో ప్రవేశించి "ప్రపంచమోక్షమునకు యిదిమాత్రము ఆచరణసాధ్యమైన సాధన గాదా?" అని జిజ్ఞాసామాత్రమునైన రగుల్కొలుపుచున్నది.

కేవల వేదాంతముగా నుండిన సామ్యవాదము కారల్‌మార్క్సు చేతులలో సిద్ధాంతరూపము నెట్లుదాల్చెనో, మతపీఠముల, వేదాంతుల, ఋషుల, దర్శనముల ఆశ్రమముల దాటి యెరుంగని యీ అహింసాసిద్ధాంతము రాచకీయములో ప్రవేశించుట, సంసారులైన జనసామాన్యమును సమీపించుటయే చాలును—ఇది ప్రపంచసృష్టి నాశరిం చుటకు,—దీని ప్రవర్తకుని తరింపజేయుటకును. యిది నిలచుగాక ! పోవుగాక !

వాస్తవ రాచకీయములలో నేడు ప్రపంచైక్యపరముగా నాల్గుశక్తులు పనిచేయుచున్నవి. జాతీయతతో సమన్వయము చేయజూచు అంతర్జాతీయత. ఉ:—నానాజాతి సమితి వారి ఉద్యమము. రెండు. విశ్వకార్మికుల "సమాజోద్యమము. ఉ :—సమాజవాదుల అంతర్జాతీయసంఘము. మూడు అంతర్జాతీయకార్మికసంఘము, ప్రపంచసహకారసమితి ఉద్యమము. నాల్గు. కేవల జాతీయతప్రధానముగాగల్గి దేశములోపల జనసామాన్యస్థితిని చక్కబఱచుటకు కృషిసల్పుచున్నను—తన జాతీయబలమువలన అన్యజాతీయతలనుకూడ మ్రింగుటకు సంశయించనిశక్తి ఉ :—ఇటలీ, జర్మనీ దేశముల ఫాసిజమ్, నాజీజము, జపాను.

ఈ నాల్గే నేడు రాచకీయములలో పనిచేయుచున్న శక్తులు. నాల్గవది విశ్వైక్యమునకు ప్రత్యక్షములో విరోధము.

విశ్వఐక్యమునకు దారిచూపు మరికొన్ని పరిస్థితులు ; అది మానవచరిత్రను గూర్చి మరికొన్నిపరిశోధనలు ; తెల్ల

వారు, నల్లవారు, ఎఱ్ఱ యిండియనులు, పచ్చమహమ్మదీయులు—వీరందఱు యేకజాతినుండి వచ్చిరనియు, భారతనాగరికతయు, పాశ్చాత్యనాగరికతకు మూలమైన అసీరియా, బాబిలోనియానాగరికతలు మూలములో నొకటే యనియు తేలుచున్న నవీనపరిశోధన ఫలితములున్ను యీ ఉద్యమమునకు పోషణకరములు.

నూతనముగా ప్రపంచమవలంబించుచున్న ప్రకృతివైద్యము, అపక్వాశాక ఫలహారోద్యమము, కొద్దిపాటిలోనైనను విశ్వమానవైక్యమునకును సాత్వికప్రవృత్తికిని సహకారులనుటకు సందియములేదు. ఫలహారపంక్తులు మానవస్వేచ్ఛాసహకారములలో పాఠములను నేర్చుకొనుటకు విద్యాలయములు.

ప్రపంచమానవులను ఉత్పత్తికారుల వర్గములు—అను భోక్తల వర్గములు—అను రెండువర్గములుగా సహకారపద్ధతిని మేళగించి లోకశాంతిని చేకూర్పగలమని నమ్మి పనిచేయు, ప్రపంచ సహకారసమ్మేళనమువారి కృషికూడ ఇక్కడ గమనించదగినది.

నేడు ప్రజాదృష్టియొక్క కేంద్రమే దేశమునుండి ప్రపంచపరముగా మారుచున్నది. అంతర్జాతీయముగా బయలుదేరిన స్త్రీలసభలు, మతసభలు, సాహిత్యసభలు, బంతియాటజట్టులు ప్రపంచమానవులమధ్య సన్నికర్షణను పెంపొందింపజేయుచున్నవి.

వీటియన్నిటికి ముఖ్యకారణము ప్రపంచమును, కాలమును దగ్గిరలోనికి తెచ్చిన విద్యుత్తు, ఆవిరి, రేడియోశక్తులని యిదివరలోనే తెలిపియుంటిమి.

నేడు ప్రపంచవిఖ్యాతపండితులు, చరిత్రకారులు, శాస్త్రజ్ఞులు, కవులు, విశ్వైక్యవాదులగుట మరియొక శుభసూచకము. బెర్నార్డుషా, రోలెండు, గాల్సువర్ది, వెల్సు, రస్సెలు, యయిన్‌స్టీను, జే. సి. బోసు, టాగూరు, గాంధి, అరవిందుడు, గార్కీ, రాధాకృష్ణను, రామను మున్నగువారి విశ్వైక్యపరమైన తపస్సునకును వీరి ఉద్దీపనక్రింద ఆయా శాస్త్ర, కళారాధకులు, విశ్వైక్యమే లక్ష్యముగా వ్రాయుచున్న వ్రాతలు, చిత్తరువులు, గీతలు, పలుకుచున్న వాక్కులు, కనుచున్నకలలు—వీనికి కొంచెమైనను విలువలేకపోవునా ?

ఈ ఉద్యమములు, పరిస్థితులు, శక్తులనుండి యేర్చినగుణరాసితో నూతనవిశ్వసంఘరచనయందు తత్పరులమగుచు—మహాకవి కాళిదాసు—"రూపోచ్చయేన విధి నామనసాకృతాను"—అని ఆనాడు చిలుకలకొల్కి, సర్వలావణ్యరాసి—తనశకుంతలా విగ్రహమును భావబ్రహ్మముచే రచింపించుకొని, గానపరవశుఁడై పోయినట్లు—మనమున్న వాస్తవమున కుపచరించే అట్టి భావరచనలు చేసికొని, చూచుకొని మురిసి,

తన్మయులమగుచు ఋక్కులను గానముచేయుదము.

“కో మోహః కః శోకః సర్వత్రమేకత్వ మనుపశ్యతః”

(ఈశావాస్యం)

ఓం శాంతిః

రాజ్యాంగవివేకమున—మొదటి భాగము

చరిత్ర దీపిక.

సంపూర్ణము.



ఈగ్రంథము వ్రాయుటలో మేముపరిశీలనచేసినట్టియు, ప్రమాణముగా నాధారపడినట్టియు గ్రంథములలో కొన్నిటిపట్టిక నీక్రింద తెలుపుచున్నాము.




1. Political and Historical Orations. 1200–2000, (Everyman's Library.)
2. Mill. J. S. ... Utilitarianism and Representative Government (Everyman's Library.)
3. Do. ... On Liberty.
4. Blunchili ... Theory of State. (1892)
5. Bryce ... Modern Democracies. Vol. I & II. (1926)
6. C. F. Strong ... Modern political constitutions (1932)
7. Sir Sydney Low... British constitution (1928)
8. Herbert Spencer... Man *vs.* State.
9. Anne Besent ... Lectures on Political Science.
10. Wilson ... The State. 1918 Edn.
11. Laski, H. J. ... Studies in Sovereignty (1917)
12. Do. ... Communism (1932)
13. Do. ... Grammar of politics. (1928)
14. Do. ... Democracy in crisis. (1933)
15. Do. ... Introduction to politics.
16. Do. ... Karl Marx. (1925)
17. Cole. G. D. H. ... Political Organization. (1932)
18. Do. ... Europe to-day. (1933)
19. Do. ... Guide to modern politics. (1934)
20. Siva Rao. (Edited by) ... Select constitutions of the World. (1934 Edn.)

21. Fenner Brockway Non-co-operation in other lands (1921)
22. Karl Marx. ... Communist Manifesto. (Edited by Ryzonoff)
23. Do. ... The capital Vol. I & II (1929 Edn.) (Translated by Cader and Edgarpaul). (Everyman's Library)
24. Jawaharlal ... Soviet Russia.
25. Gorky ... Lenin.
26. H. G. Wells ... Outlines of the History of the World (1931)
27. Sir Erric Drummond ... Ten years in World Co-operation.
28. Labour Delegation ... Twelve studies in Soviet Russia (1933)
29. Bernard Shaw ... Intelligent woman's guide to Socialism. (1930)
30. Do. ... Apple cart.
31. Do. ... Political madhouse in America and nearer home. (1933)
32. C. M. Joad ... Modern political theory (World manuals) (1933)
33. Lindsy ... On Karl Marx's capital. (World manuals) (1931)
34. Ghoshal ... Hindu political Theories. (1927)
35. Radha Kumud Mukarjee ... Local self Government in Ancient India.
36. R. C. Majumdar ... Corporate Life in Ancient India. (1918)
37. Jayaswal ... Ancient Hindu Polity.

38. B. K. Sirkar ... Political theories of Ancient Hindus.
39. Do. ... Political philosophies.
40. Liang-chi-choo ... History of Chinese political thought (1930)
41. Giles Herbert, A. ... Chinese civilisation. (Home University Library) (1929)
42. Legacy of Islam ... Oxford University) (1931)
43. Khuda Baksh ... History of Islamic peoples. (1914)
44. Do. ... Essays Indian and Islamic (1912)
45. Sankara ... Some of his Upanishadic Bhashyas.
46. Vidyaranya ... Pancha Dasi.
47. Gouthama ... Dharma Sastras.
48. Chanakya ... Artha Sastra.
49. Sukra ... Neeti Sastra.
50. Vyasa ... Maha Bharata.
51. Vyasa Tatparya Nirnaya

---

ఓం

# శుద్ధపట్టిక

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 1 | 6 | దాస్యత | దాస్యము |
| 7 | 16 | తాలిదొ్త | తొలుదొ్త |
| ,, | 21 | అనునది | అనునవి |
| ,, | 22 | చున్నది | చున్నవి |
| 9 | 16 | తగ్గిపాయె | తగ్గిపోయె |
| 10 | 7 | విస్తృ్రితమైన | విస్తృతమైన |
| 11 | 17 | వాంచంతు | వాంఛంతు |
| 12 | 2 | వరవామహే | వరవామహే. |
| ,, | 8 | ౧-౧-౧౪ | ౧-౧-౧౪. |
| ,, | 24 | రామునకు | రాముని |
| 13 | 4 | రించుట. | రించుట |
| ,, | 5 | సుధార్మికమ్.) | సుధార్మికమ్). |
| 15 | 22 | చున్నవి. | చున్నది. |
| 16 | 22 | ancient | Ancient |
| 21 | 18 | ప్రాముఖ్యత | ప్రాముఖ్యము |
| 22 | 3 | (౧౦) | ౧౦ |
| ,, | 17 | (౮) | ౮ |
| ,, | 20 | శాఖ్యాగారే | శాక్యాగారే |
| ,, | 22 | బా. 1 | భా. 1 |
| 23 | 13 | నూనత్వము | న్యూనత్వము |
| ,, | 19 | వాజ్మ్మయము | వాఙ్మయము |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 24 | 2 | శాసనకర్తలే | శాసనకర్తలుగానే |
| ,, | 3 | ఉద్యోగములలో | ఉద్యోగీయులుగా |
| ,, | 6 | నిర్ణయించుండిరి. | నిర్ణయించుచుండిరి. |
| 28 | 19 | పాలనము | పాలనములు |
| 29 | 8 | లోమధ్య | లో |
| ,, | 20 | (౧౬) | ౧౬ |
| ,, | 21 | దీనాయితి | ధీనాఇతి |
| ,, | 7 | (౧౬) | ౧౬ |
| ,, | 17 | గరపర్యంతము | గపర్యంతము |
| 31 | 5 | (౩౦౦) | ౩౦౦ |
| 32 | 2 | రెండు_చైనా | రెండు, చైనా |
| ,, | 14 | దాస్యత | దాస్యము |
| ,, | 16 | ,, | ,, |
| 33 | 1 | కొద్దియు | కొలదియు |
| ,, | 4 | దొంబడుటకు | చొరబడుటకు |
| 34 | 6 | ఉచ్ఛస్థితి | ఉచ్చస్థితి. |
| ,, | 10 | వాజ్ఞ్త్రి | వాజ్త్ర |
| 35 | 5 | దాస్యత | దాస్యము |
| 37 | 3 | సౌభ్రాతృత్వము | సౌభ్రాత్రము |
| 38 | 4 | అయిక్యత | ఐక్యము |
| ,, | 10 | సామరస్యత | సామరస్యము |
| 39 | 3 | వైశాల్యత | వైశాల్యము |
| 40 | 3 | వారికష్టమయినది | వారికనిష్టమయినది |
| ,, | 11 | చెయుచున్నది. | చేయుచున్నవి |
| 41 | 7 | స్థాయా | స్థాయీ |
| ,, | 14 | వారికిదగ్గర | దగ్గర |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 46 | 1 | ప్రాధాన్యత | ప్రాధాన్యము |
| ,, | 8 | అభివ్యక్తము | అభివ్యక్తము |
| ,, | 11 | సౌభ్రాతృత్వము | సౌభ్రాత్రము |
| ,, | 20 | క్రూరత్వము, | క్రూరత్వ |
| 48 | 6 | కంటే | కంటె |
| 50 | 18 | అపేక్షించెదరు | అపేక్షించెదరు |
| 52 | 1 | సంవత్సరములు | సంవత్సరముల |
| ,, | ,, | వలసినచోపహాస్య | వలసినచో |
| ,, | 2 | దీను, గ్రీసు, | గ్రీసు, |
| ,, | 12 | జేయుటచో | జేయుటలో |
| 53 | 19 | నిఅంతరము | నిరంతరము |
| ,, | 21 | రక్షణకు | రక్షణ |
| 56 | 18 | అదర | అవర |
| ,, | 17 | వనే, | వనే. |
| 57 | 5 | శాసనములును | శాసనములను |
| 58 | 8 | ముసకు | మునకు |
| ,, | 14 | నిర్వహాకుడు | నిర్వాహకుడు |
| ,, | 17 | స్వాతంత్రత | స్వతంత్రత |
| 59 | 12 | ఈవు | "క్షవు" |
| 60 | 3 | రోగ్యుడయిస | రోగ్యుడయిన |
| 61 | 4 | దృష్ట్వయా | దృష్ట్వా |
| ,, | 9 | (Bilateral compact) | Bilateral compact |
| 62 | 12 | మొదట | మొదటి |
| 64 | 11 | విడబడినది | విడబడినది. |
| 66 | 16 | అధికౌరులకు | అధికారులకు |
| 67 | 22 | న్యాసముల | న్యాసములు |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 68 | 13 | శైశవవావస్థలో | శైశవావస్థలో |
| 69 | ,, | అంతరంగిక | ఆంతరంగిక |
| ,, | 14 | Prviate | Private |
| 70 | 3 | వైశాల్యత | వైశాల్యము |
| ,, | 13 | లక్షణములు | లక్షణములిందులకు |
| ,, | 21 | స్ఫష్టార్థము | స్పష్టార్థము |
| 72 | 17 | Blenchili | Blunchili |
| ,, | 18 | వివేకవంతులతోను | వివేకవంతులును |
| ,, | 22 | భిన్న గుణముల | భిన్నగణముల |
| 74 | 6 | ప్రతిపేరునకును | ప్రతిపాదనకును |
| 76 | 10 | (Hegemory) | (Hegemony) |
| 77 | 17 | ముఖ్యలు | ముఖ్యులు |
| 78 | ,, | చాపల్యత | చాపల్యము |
| 79 | 3 | అత్యుత్తమ | అత్యుత్తమ |
| ,, | 15 | బాహు రాజన్యః | బాహూరాజన్యః |
| ,, | 16 | సూద్రోజాయత | శూద్రోఽజాయత |
| ,, | 17 | యిచ్చుచున్నది | యిచ్చుచున్నవి. |
| ,, | 20 | అవయవా అవ | అవయవావ |
| 82 | 14 | స్వాంతంత్ర్య | స్వాతంత్ర్య |
| 84 | 2 | ప్రపంచఅయి | ప్రపంచై |
| ,, | 3 | క్యతను | క్యమును |
| ,, | ,, | అయిక్య | ఐక్య |
| ,, | 9 | శృతులు | శ్రుతులు |
| 87 | 13 | యివ్వడును | యివ్వబడును |
| ,, | 18 | విశ్వాసనమ్మకము | విశ్వాసము |
| 91 | 12 | పథంలో | పథంలోకూడ |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 93 | 8 | అయిక్యమయ్యెను | ఏకమయ్యెను. |
| ,, | 14 | యినవి. | నవి. |
| 94 | 15 | విష్ణువంశ | విష్ణ్వంశ |
| ,, | 17 | బడినట్లు | బడినట్లును |
| ,, | ,, | భాధ్యత | బాధ్యత |
| ,, | 21 | విష్ణువంశా | విష్ణ్వంశ |
| 95 | 1 | విష్ణు | విష్ణ్వం |
| ,, | 2 | వంశా | శ |
| 96 | 20 | రాజాలదనియు | రాజాలడనియు |
| 97 | 5 | పుచ్చుకొను | పుచ్చుకొని |
| ,, | 8 | కమతము | మతము |
| 98 | 7 | దర్శికములు. | దర్శకములు. |
| ,, | 15 | కామంధక, శుకృతే | కామందక, శుక్రశే |
| ,, | 16 | గ్రంథకరు్తృ | గ్రంథకర్తృ |
| ,, | 21 | పరముతాదు. | పరముకాదు. |
| ,, | 24 | తెలపే | తెలిపే |
| 100 | 18 | ఒడంబడిక | ఒడంబడికచే |
| 101 | 14 | భగవదేచ్ఛ | భగవదిచ్ఛ |
| ,, | ,, | వ్యక్తనుగును. | వ్యక్తమగును. |
| ,, | 20 | స్ఫష్టీక | స్పష్టీక |
| 102 | 14 | స్వాతంత్ర్యతా | స్వాతంత్ర్య |
| ,, | 24 | కాలమిదికొ. | కాలమిదియే. |
| 104 | 9 | దాస్యత్వము | దాసత్వము |
| ,, | 12 | భూపలితము | భూఫలితము |
| ,, | 21 | దాస్యత | దాస్యము |
| 105 | 8 | ప్రజామాన్యము. | ప్రజాసామాన్యము |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 106 | 14 | యదార్థము | యథార్థము |
| 109 | 9 | అందోళనా | ఆందోళనా |
| ,, | 19 | పరిశ్రామో | పరిశ్రమో. |
| ,, | 20 | పరిశ్రామికులను | పారిశ్రామికులను |
| | 22 | ,, | ,, |
| 110 | 1 | వలనన, | వలనను, |
| 111 | 5 | దేశీయతాభావ | దేశీయభావ |
| 116 | 10 | గూర్చి | గూర్చియే |
| 117 | 7 | ప్రాతినిధ్యా | ప్రాతినిధ్య |
| ,, | 10 | రోమకమత | రోమకమత |
| ,, | 18 | తమ | మత |
| 118 | 15 | (concilior) | (Concilior |
| 119 | 4 | జాతీయతా | జాతీయత, |
| 120 | 12 | నూతనబోధ | నూతనబోధ. |
| 122 | 1 | చర్చ | చర్చి |
| 123 | 7 | దాస్యత | దాస్యము |
| ,, | 8 | రింపజేయు | లింపజేయు |
| 124 | 12 | ప్రజలను | ప్రజల |
| 126 | 16 | సాంప్రదాయము | సంప్రదాయము |
| 127 | 12 | సత్వాది | స్వత్వాది |
| 129 | 8 | "తిరుగుబాటు | "తిరుగుబాటు" |
| 130 | 4 | గావించుచున్న | గాంచుచున్న |
| ,, | 15 | చుండెను. | చుండినవి. |
| ,, | 16 | ,, | చుండెడివి. |
| ,, | 19 | "మ్రూజన్," | "బ్రూజన్," |
| 135 | 14 | జంఝూ | జంఝా |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 136 | 16 | పదతి | పదగిని, |
| 138 | 22 | సుండుట | సుంచుట |
| ,, | 25 | దాస్యతకు | దాస్యమునకు |
| 141 | 6 | తలంపు. | తలంపు, |
| ,, | 12 | యుద్యమములు | యుద్యమములవలె |
| ,, | 17 | యశముల | శయముల |
| 142 | 22 | నప్పుడు తేలుసది | నప్పుడు |
| 143 | 2 | సం. రం) | సం. రం) నని తెలుసు. |
| ,, | 11 | చాలచిక్కు | చాలచిక్కులు |
| 147 | 13 | రోజులో | రోజులలో |
| 149 | 7 | వచ్చినది, | వచ్చినది. |
| ,, | 21 | ప్రజలే | "ప్రజలే |
| 151 | 9 | స్వతంత్ర్య | స్వాతంత్ర్య |
| 152 | 22 | స్వతంత్రము | స్వాతంత్ర్యము |
| 162 | 11 | యుంటిని | యుంటిమి. |
| 163 | 18 | చేయుచున్నది. | చేయుచున్నవి. |
| 164 | 13 | తిరస్కారములు, యీభావము | తిరస్కారములు, |
| ,, | 14 | లను భౌతిక | భౌతిక |
| 165 | 12 | పరిశ్రమయును | పరిశ్రమయను |
| 166 | 16 | కలదని | కలదను |
| 169 | 7 | నౌషధములు | నౌషధము |
| ,, | 21 | జాతీయతా | జాతీయ |
| 171 | 12 | నవకాశము | నవకాశముగ |
| 178 | 9 | ముడిసరకుల | ముడిసరకులనే |
| 179 | 8 | గాక | గాకతానిందు |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 179 | 4 | యంత్రయాకర్ష | యంత్రాకర్ష |
| 181 | 10 | కైశికమశము | కైశ్రిసవములిము |
| 182 | ,, | సుకయోగీంద్రుడు | శుకయోగీంద్రుడు |
| 183 | 18 | బ్రహ్మిజ్ఞానేన | బ్రహ్మజ్ఞానేన |
| 185 | 4 | ఉంశవృత్తి | ఉంఛవృత్తి |
| ,, | 11 | దర్శికమైన | దర్శకములైన |
| ,, | 5 | ఎల్లధసే | యల్లధసే |
| ,, | ,, | వి త్తతేన | వి త్తంతేన |
| 191 | 3 | సుఖము. | సుఖము |
| ,, | 20 | సంఘర్షణా | సంఘర్షణ |
| 193 | 10 | సామరస్యత | సామరస్యము |
| 194 | 21 | నదాయనే. | నదీయనే. |
| 198 | 10 | మైనది." | మైనది.;" |
| 199 | 17 | పరాణామము | పరిణామము. |
| 200 | 12 | తన్మయము | తన్మయత |
| ,, | 19 | హాక్లీ) | హాక్స్లె |
| 201 | 4 | మానవులు | మానవుల |
| 202 | 13 | శృతులతో | శ్రుతులతో |
| 203 | 16 | పరిణామము | పరిణాము |
| 205 | 18 | భౌతికదృషి | భౌతికదృష్టి |
| 207 | 13 | అవశ్యకత | అనావశ్యకతను, |
| ,, | 17 | చేసికొనుట | చేసికొనుటను |
| ,, | 21 | పూర్ణోత్పతి | పూర్ణోత్పత్తి |
| ,, | 24 | (ఈద, | (ఈదశ |
| 209 | 17 | ద్వారాగానే | ద్వారానే |
| 213 | 20 | తామేమని | తామే"మని |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 213 | 20 | పాశ్చాత్య" | పాశ్చాత్య |
| 215 | 12 | (Dictater | (Dictator |
| 216 | 15 | ఆవిద్యను | అవిద్యను |
| 219 | 12 | వచ్చెదరో," | వచ్చెదరో." |
| 220 | 19 | వాస్థ | వస్థ |
| 221 | 2 | దృష్ట | ద్రష్ట |
| ,, | 7 | అర్థోత్వాదక | అర్థోత్పాదక |
| ,, | 9 | ,, | ,, |
| 223 | 12 | త్రిప్పిలేయు | త్రిప్పివేయు |
| 224 | 2 | వ్యవన్థ | వ్యవస్థ |
| ,, | 4 | అనవగాహనము | నవగాహనము |
| 225 | 15 | ప్రతివాదిం | ప్రతిపాదిం |
| 226 | 19 | వాఖ్య | వ్యాఖ్య |
| 229 | 15 | రోసూ | రూసో |
| 230 | 9 | కార్మికవి | కార్మిక |
| ,, | 13 | ప్రసరించినది అది. | ప్రసరించినది. అది |
| 231 | 8 | వెతుకుదము. | వెదకుదము. |
| 232 | 19 | స్వామ్యావస్థ | సామ్యావస్థ |
| 233 | 10 | (Undifferenciated | (Undifferentiated |
| ,, | 16 | గంటలవారిని | గంటలవారీని |
| 234 | 8 | వాఖ్యానము | వ్యాఖ్యానము |
| 235 | 4 | ప్రాధాన | ప్రాధాన్య |
| 237 | 13 | ద్రష్ట్వి | ద్రష్ట |
| 238 | 10 | ఇతాద్యి | ఇత్యాది |
| 240 | 20 | (Huxly | (Huxley) |
| 241 | 7 | వృద్ధిపొందుచురుగాని, | వృద్ధిపొందునుగాని; |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 241 | 8 | స్వర్ధభావమే | స్వార్ధభావమే |
| 242 | 4 | బయలుదేరి | బయలుదేరిన |
| ,, | 17 | సామరస్యత | సామరస్యము |
| ,, | 8 | సామరస్యత | సామరస్యము |
| 243 | 4 | సామరస్యత | సామరస్యము |
| 244 | 18 | ఫ్రాన్సు | ఫ్రాన్సు |
| ,, | 22 | విడిచిపోవుట | విడిపోవుట |
| 246 | 1 | ప్రాధాన్యత | ప్రాధాన్యము |
| ,, | 9 | రాచకీయార్ధము | రాజకీయార్ధము |
| 247 | 3 | రాచకీయములు | రాజకీయములు |
| ,, | 4 | రాచకీయములకు | రాజకీయములకు |
| ,, | 13 | వైలక్ష్యము | వైలక్షణ్యము |
| 248 | 14 | వైశాల్యత | వైశాల్యము |
| 249 | 1 | రాచకీయాది | రాజకీయాది |
| ,, | 9 | జాపాను | జపాను, |
| ,, | 19 | గోపాలక్రిష్ణయ్య | గోపాలకృష్ణయ్య |
| 250 | 6 | ప్రతిహాతనము | ప్రతిహాతము |
| ,, | ,, | చేసినది. | చేసినవి. |
| 251 | 3 | రాచకీయ | రాజకీయ |
| ,, | 17 | టయు | టయే |
| ,, | 18 | రాచకీయముగా | రాజకీయముగా |
| 252 | 8 | కల్యాణము | కల్యాణమున్ను, |
| ,, | 17 | ఉద్భోధించెను | ఉద్బోధించెను |
| 253 | 7 | రాచకీయ | రాజకీయ |
| 254 | 20 | స్ధాంపించ | స్ధాపించ |
| 255 | 19 | [illegible] | [illegible] |

| పుట. | పం॥క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 256 | 17 | యీజర్మ | జర్మ |
| 257 | 1 | దక్షిణ— | దక్షిణ |
| ,, | 11 | మాత్రము. | మాత్రము |
| ,, | 6 | బ్రిటీషు ఫ్రెంచివారు, | బ్రిటిషువారును ఫ్రెంచివారును |
| ,, | 7 | అన్న విధముల | అన్ని విధముల |
| 259 | 8 | మిత్రమండలీ | మిత్రమండలి |
| ,, | 9 | సూన్యవాదు | శూన్యవాదు |
| 261 | 18 | ౧౯౨౩ | ౧౯౨౩ సం॥ |
| ,, | 22 | ప్రకలపక్ష | ప్రబలపక్ష |
| 264 | 5 | బైలుదేరను | బయలుదేరెను |
| ,, | 21 | చైనా జాతీయములువా | చైనా జాతీయవాదులు |
| 265 | 6 | సమాజవారయినను | సమాజవాదమునకు |
| ,, | 8 | గౌరవించిన | గౌరవించినట్టి |
| ,, | 9 | విధానము, సదరు | సదరు |
| ,, | 10 | ఛీయాంగుకై | ఛియాంగుకై |
| ,, | 15 | స్వాతంత్ర్యము. | స్వాతంత్ర్యము |
| 274 | 2 | ఇంక ముందు. | ఇంక నిందు |
| 275 | 5 | జపానునునుగల | జపానునునుగల్గిన |
| ,, | 25 | E. om.) | Edn.) |
| 278 | 13 | ఆయుధము | ఆయుధముల |
| 279 | 6 | తెచ్చినది. | తెచ్చినవి. |
| 280 | 12 | బడీదారులు | బడిదారులు |
| 282 | 1 | అంశులకై | అంశులకై |
| ,, | 11 | లేమ. | లేను. |
| 285 | 17 | కార్మికల ? | కార్మికుల |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 288 | 4 | అపూర్వపద్ధతిని | అపూర్వపద్ధతిని |
| 291 | 1 | అధిపతి. | అధిపతి' |
| 293 | 20 | సమర్థించెను. | సమర్థించెను ; |
| 297 | 2 | స్వాప్యములే | స్వాప్యములనే |
| 298 | 6 | (conciously) | (consciously) |
| 301 | 8 | వ్యకిరేక | వ్యతిరేక |
| 304 | 8 | బిరుదాంకితములు | బిరుదమును |
| ,, | 15 | మునిగియుండెను | మునిగియుండిరి. |
| 306 | 1 | యుద | యుద్ధ |
| 316 | 1 | చేసిరి. | చేయుటమూలముగా పరిష్కరింపబడినది |
| 322 | 19 | an | and |
| 329 | 11 | Sociol | Social |
| 330 | 19 | చూడవాం | చూడవారి |
| ,, | 20 | గోచరిరి | గోచరం |
| 331 | 3 | షడ్డర్శనముల | షడ్దర్శనముల |
| ,, | 11 | సహకారమును, | సహకారము. |
| ,, | 14 | కావలెను. | అగుటను. |
| 332 | 3 | కాపాడుటకును | కాపాడుటకు |
| ,, | 5 | నిర్మాణముకావలెను | నిర్మాణము, |
| 335 | 10 | అనుభవించుచున్నారు. | అనుభవించుచున్నది. |
| ,, | 11 | ఐక్యతకు | ఐక్యమునకు |

# రు 12000 లకు
# డిక్లరేషన్ ఆఫు ట్రస్టు దస్తావేజు.

——;o:——

ఆ 1931 సం॥ ఏప్రియల్ 9 వ తారీఖున, పశ్చిమ గోదావరిజిల్లా కొవ్వూరు రిజిస్ట్రేషన్ సబుడిస్ట్రక్టు, కొవ్వూరు గ్రామకాపురస్తులు బ్రాహ్మణులు, హైకోర్టు అడ్వకేటున్ను లేటు వల్లూరి వెంకటకృష్ణయ్యగారి కొమారుడున్ను నగు వల్లూరి సూర్యనారాయణరావు వ్రాసిన డిక్లరేషన్ ఆఫు ట్రస్టు దస్తావేజు.

1. నా చిరకాలపు స్నేహితుడును, నిర్మలస్వార్థత్యాగముతో చిన్నతనములోనే తన న్యాయవాదవృత్తిని వదలుకొని, సుమారు 15 సంవత్సరములు కష్టించి తన ధనమును, ఆరోగ్యమును తుదకు తనప్రాణములనుకూడ నర్పించి, కొవ్వూరు గ్రామములో ఏబదివేల రూపాయిాల స్థిరాస్తితో "ఆంధ్ర గీర్వాణ విద్యాపీఠ మను" నొక సంస్థాపనను నిర్మించినవాడగు లేటు తల్లాప్రగడ సూర్యనారాయణరావుగారు ది 6-3-26 తారీఖున శివసాన్నిధ్యమును చేరినారు. ఆయన నామము ఆచంద్రార్కముగ నుండునట్లు తోడ్పడుట నావిధాయక కృత్యమని యెంచి, నాస్వార్జితమగు తూర్పుగోదావరిజిల్లా రామచంద్రపురం తాలూకా ఆలమూరు కోఆపరేటివ్ ల్యాండు

మార్గేజి బాంకులో నున్న నెం 31 టు 42 నెంబర్లుగల పండ్రెండువేల రూపాయీల డిబెంచర్లను యీ క్రింది షరతులతో యీక్రింద వివరింపబోవు విషయములను నెరవేర్చుటకు కోవూరు ఆంధ్రగీర్వాణ విద్యాపీఠ పాలకసంఘమువారిని ట్రస్టీలుగా యేర్పరచి యీ డిక్లరేషన్ ఆఫ్ ట్రస్టు దస్తావేజును వ్రాయుచున్నాను.

2. పైన ఉదహరించిన డిబెంచర్లమీద ప్రతి ఆరు మాసములకు వచ్చు వడ్డీని మాత్రమే కోవూరు విద్యాపీఠ పాలకసంఘము ఖర్చుచేయుచుండవలెను గాని, అసలు మొత్తము శాశ్వత మూలనిధిగా, యెల్లకాలముండవలెను. ఈడిబెంచర్లగడువానంతరముకూడ వీనిమీదవచ్చు వడ్డీ తగ్గినను, హెచ్చినను కోఆపరేటివు ల్యాండుమార్గేజి బ్యాంకులలోనే యీఅసలు మొత్తము వేయుచుండవలెను. గాని భూములు, యిల్లు మొదలగు స్థిరాస్తులను కొనకూడదు.

3. నేనున్ను, నాయిద్దరు కొమాళ్లు కృష్ణమోహన్ M. A. B. L. Advocate మద్రాసున్ను, జగన్మోహన్ L. E. E. Electrical Engineer బొంబాయిన్ని కోవూరు ఆంధ్రగీర్వాణ విద్యాపీఠ పాలకసంఘములో జీవితకాలపు మెంబర్లుగా నుండవలెను. ఈముగ్గురులో యెవరైనను అన్యగ్రామములలో నున్నపుడు సదరు విద్యాపీఠపాలక సంఘకార్యనిర్వాహకసంఘ సమావేశములలో పాల్గొని వోట్లువేయుట

కును, ఉద్యోగీయులుగా నుండుటకును, వారి యిష్టమువచ్చిన వారిని, మరియొక్కొక్కరిని రాజమహేంద్రవరము, కొవ్వూరు గ్రామస్థులలోనుండి మెంబర్లుగా నామినేటుచేసి, పాలక సంఘ సెక్రటరీకిముందుగా తెలియచేసి, తగిన యేర్పాట్లు చేసికొను టకు అధికారము కలిగియుందురు.

4. పైన ఉదహరించిన ట్రస్టుఫండుమీద రాగల వడ్డీ లోనుంచి నెలకు యిరువది (రు 20) రూపాయల చొప్పున కొవ్వూరు ఆంధ్రగీర్వాణ విద్యాపీఠమున కనుబంధముగా నెల కొల్పబడిన శ్రీవాడ్రేవు జోగాయమ్మ బహద్దరు జమీందారు గారి కళాశాలాధ్యక్షుని (Principal) గౌరవ భృతిక్రింద నిచ్చుచుండవలెను. ఒక వేళ యీస్వల్పమొత్తమును తన ఖర్చులకు స్వీకరించుటకు ఆయన యిష్టపడని యెడల సదరు కళాశాలలో పరిశోధనకును (research) అధ్యాపకమునకును (teaching) సమర్థుడగు ఒక పండితుని జీతము క్రింద నీయ వలయును.

5. పై మొత్తము పోగా మిగిలిన వడ్డీని ఆంధ్రభాషలో సులభశైలిని పండిత పామరులకు బోధపడునట్లు చిన్నచిన్న గ్రంథములను యీక్రింద నుదహరించిన విషయములలో విద్యార్థికులచేత కొద్ది పారితోషిక మిచ్చిగాని, ఉచితముగా గాని, వ్రాయించి అచ్చొత్తించి ఆంధ్రదేశములోని ముఖ్యు మైన గ్రంథాలయములకు ఉచితముగ పంచిపెట్టుటకును, వృత్తి

లకు స్వల్పఖరీదుకు విక్రయించుటకును, విద్యాపీఠ పాలకసంఘ మువారు వినియోగించు చుండవలెను.

(ఏ) వేదకాలము నాటినుండి హైందవుల ఆర్యమత ములోని శ్రౌతస్మార్త కర్మకాండల జ్ఞానకాండల పరిణామము, ప్రస్తుతము వారిలోనున్న సాంఘికాచారములు, విశ్వాస ములు, సాంప్రదాయములు, పట్టింపులు, వర్ణములు, వివాహ ములు, స్త్రీల విద్యాస్వాతంత్ర్యములు, జ్యోతిషములు, మంత్ర తంత్రములు, దేవతలు, దయ్యములు, వర్జములు, లగ్నములు, శకునములు, గ్రహణములు, మంచి చెడుదినములు, అశుచి, ప్రాయశ్చిత్త ఆచారకాండలు, తద్దినములు, దృష్టిదోష, పంక్తి దోష, అంటుదోష, వాయుదోషములు, సాముద్రికము, రస వాదము మొదలగువానిని గురించి మూఢవిశ్వాసములను సప్రమాణముగ ఖండించి విమర్శించుట.

(బి) షోడశ కర్మలను గురించి ఆంధ్ర టీకాతాత్పర్య ములతో గ్రంథములను వ్రాయించి అనవసరమని తోచిన కర్మకాండ విభాగములను సంకుచిత పరచి వేదలక్షణ నేర్చు కొని తగు విమర్శన జ్ఞానమును తెలివియుగల పురోహితులను, దేవాలయార్చకులను, అన్నివర్ణములలోను బయలుదేరునట్లు చేయుట, ప్రపంచములో తక్కిన జాతుల మతములు, సాంఘి కాచారములు, నీతి, వీని పరిణామములు, మొదలగునవి తెలి యజేయుట.

(సి) ఆర్యమతమునుండి బయల్వెడలిన బౌద్ధమతము, జైనమతము, బ్రహ్మసమాజ మతము ఆర్యసమాజ మతము మొదలగు వానిలోని సూత్రములను, తెలియజేసి విమర్శించుట, ప్రపంచములో వ్యాపినొందియున్న యితరమతములతో ఆర్యమతమును పోల్చి వానిని గురించి ప్రజలకు బోధించుట.

(డి) మన పూర్వులు రచించిన మానసిక భౌతిక శాస్త్రములు, కళలు, అధునిక పరిశోధనలను బట్టి విమర్శించి, వానిలో అవసరమగు మార్పులనుజేసి మన దేశీయ పారిభాషిక పదములతో ఆంధ్రములో గ్రంథములను వ్రాయించుట.

(ఇ) గాంధిమహాత్ములవారి సత్యాగ్రహ తత్వములు, వానిలో నిమిడియున్న వేదాంతము, నానారాష్ట్రపరిపాలనా విధానములు, ప్రపంచములో యిదివరకు జరిగిన, యిప్పుడు జరుగుచున్న సమస్త సాంఘిక రాజకీయార్థిక విప్లవములు, ఉద్యమములు, గ్రామ పునర్నిర్మాణము, సహకార, అసహకారోద్యమములు, నానావిధ సమిష్టివాదములు, మొదలగు వానిని గురించి గ్రంథములను ప్రచురించుట.

6. పైన వ్రాసిన విషయములను నిర్భయముగను, నిర్మొగమాటముగను, సత్యము తప్పకుండ సప్రమాణముగ సంపూర్ణ మనస్స్వాతంత్ర్యములతో (Free thought) ఆంధ్రు

లయెదుట వారి భావలో పెట్టుచుండవలెను. ఏగ్రంథముగాని రూపాయకంటె హెచ్చు వెలను కలిగియుండకూడదు. నాజీవితకాలములో నే నంగీకరించిన గ్రంథములనే ప్రచురించవలెను. నాజీవితానంతరము విద్యాపీఠ పాలక సంఘమువారు యివ్వా డేర్పరచు పండితబృందము (Academic Council) చే అంగీకరింపబడిన పిమ్మట ఆసంఘమువారి శాశ్వతసభ్యుల మెజారటీవారి యామోదమును బడయనిదే యేగ్రంథముగాని వెలువడకూడదు.

7. నాపై యుద్దేశములను నెరవేర్చుటకు యితరదాతలనేకమంది ట్రస్టుఫండుకు సహాయపడుదురని నేను నమ్ముచున్నాను. అప్పటి దేశకాల పరిస్థితులనుబట్టి పైన నేను తెలియజేసిన విషయములలో దేనికైనను యీనిధిమీద వచ్చు వడ్డీని అంతగాని కొంతగాని వీలుకొలది ప్రజోపయోగమునకు వినియోగించవచ్చును. సాలుకు ఒక చిన్న గ్రంథము వెలువడినను నాయాత్మ తృప్తి నొందగలదు.

8. నేనిదివరకు ది 16–5–1928 తేదీని కొవ్వూరు ఆంధ్రగీర్వాణ విద్యాపీఠమునకు కొవ్వూరులో నాయింటిమీద రిజస్టరుడీడ్డు ద్వారా యేర్పరచిన రు 120 లు వార్షికము యీట్రస్టుడీడ్డు మొత్తములోనే చేరి యున్నందున సదరు చార్జి రద్దు అయినట్లు భావించుకొని యీట్రస్టును ఆంధ్రగీర్వాణ విద్యాపీఠ పాలక సంఘమువారు అంగీకరించవలెను.

9. ఏకారణమువలన నయినను నాపై యుద్దేశములను కొవ్వూరు, ఆంధ్రగీర్వాణ విద్యాపీఠ పరిపాలక సంఘము వారు సరిగా నెరవేర్చజాలని చో ఆంధ్రవిశ్వ విద్యాలయాధికారులు శివిల్ కోర్టుగుండా యీట్రస్టుఫండును స్వాధీనము చేసికొని దీనిలో నుదహరించిన కార్యవర్గములను సక్రమముగ యీ కొవ్వూరు విద్యాపీఠములోనే నెరవేర్చుచుండవలెను.

ఇది నాసమ్మతిని నా స్వదస్తూరీని వ్రాసియిచ్చిన డిక్లరేషన్ ఆఫ్ ట్రస్టు దస్తావేజు.

అడ్వకేటు వల్లూరి సూర్యనారాయణరావు,

సెక్రటరీ

ఆంధ్రగీర్వాణ విద్యాపీఠము

కొవ్వూరు

పశ్చిమ గోదావరిజిల్లా

9-4-31.

APPENDIX II    రెండవ అనుబంధము.

—: వ్రాయతగిన కొన్ని విషయముల పట్టిక :—

1. వర్ణములు. 2. అంతర్వర్ణ, అంతర్జాతీయ వివాహములు 3. వితంతు, రజస్వలానంతర వివాహములు— 3. వాని 4. వివాహచ్ఛేదనము. 5. స్త్రీలవిద్యా స్వాతంత్ర్యములు, 6. ప్రకృతి పరిణామము. 7. మతపరిణామము. 8 నీతి పరిణామము. 9. నీతిమత సంబంధము. 10. విగ్రహారాధనము. 11. పితృపూజ. 12. ఆర్యబ్రాహ్మణ మతములు. 13. పునర్జన్మ. 14. స్వర్గనరకములు. 15. దేవుళ్లు దయ్యములు. 16. దైవప్రార్థనము. 17. పురాణములు. 18. హైందవ ధర్మశాస్త్రకాలనిర్ణయము. 19. దైవస్వరూప పరిణామము. 20. అవతారములు. 21. ఆత్మస్వరూప పరిణామము. 22. మంత్రతంత్రములు. 23 కర్మజ్ఞాన భక్తి మార్గములు. 24. యోగవిద్య. 25. దృష్టిపంక్తి అంటు వాయుదోషములు. 26. మంచిచెడు దినములు. 27. శకునములు, పర్జములు, లగ్నములు. 28. జ్యోతిషము. 29. యజ్ఞములు, యాగములు. 30. శుద్ధాద్వైత జడాద్వైతములు. 31. అహింస, జీవహింస. 32. ఆత్మహత్య. 33. విశ్వాస సంశయవాదాత్మ తత్వములు. 34. దానధర్మములు. 35. అవక్యాశాకాహారము. 36. సమిష్టివాదములు. 37. మహాత్మ గాంధిగారి సత్యాగ్రహ తత్వము. 38. రాజకీయ, సాంఘిక విప్లవములు. 39. భౌతిక శాస్త్రములు. 40. బాలుర విద్యా విధానము.

ఈ క్రింది గ్రంథములు, పశ్చిమగోదావరిజిల్లా కొవ్వూరు
ఆంధ్రగీర్వాణ విద్యాపీఠాధ్యక్షుడు
జటావల్లభుల పురుషోత్తం ఎం. ఎ. గారికి
వ్రాసి తెప్పించుకొనవచ్చును.



(పోస్టేజి గాక)

| | | | |
|---|---|---|---|
| 1. | వర్ణాశ్రమ ధర్మపరిణామము | ... | 0—8—0 |
| 2. | అంతర్జాతీయ ధర్మశాస్త్రము | ... | 0—6—0 |
| 3. | మనస్స్వాతంత్ర్యము, ప్రథమభాగము | | 0—8—0 |
| | డిటో ద్వితీయభాగము | | 0—8—0 |
| | డిటో తృతీయభాగము | | 0—8—0 |
| 4. | రాజ్యాంగవివేకము | ... | 1—0—0 |
| 5. | వేదకాలపు స్త్రీలు | ... | 0—10—0 |
| 6. | స్మృతికాలపు స్త్రీలు | ... | 0—10—0 |

వల్లూరి సూర్యనారాయణరావు
సెక్రటరీ,
ఆంధ్రగీర్వాణవిద్యాపీఠము
కొవ్వూరు,
పశ్చిమ గోదావరిజిల్లా

శ్రీ అద్దేపల్లి లక్ష్మణస్వామినాయఁడుగారిచే
రాజమండ్రి సరస్వతీ పవర్ ప్రెస్ నందు ముద్రింపఁబడియె.

1 st Edition 1000 copies 9256-1935.